# సర్వస్వామ్య సంకలితము

ప్రథమముద్రణము

1000 ప్రతులు

జనరల్ ప్రింటర్సు

గుంటూరు-2

# పండితాభిప్రాయములు

మహోపాధ్యాయ, అభినవతిక్కనేత్యాది బిరుదాంచితులు

## శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు (నెల్లూరు)

మాఘపురాణమును గ్రమముగాఁ గాకున్నను మొత్తముమీఁదఁ గలయఁజూచితిని. ఎట్టి ధారాశుద్ధి! ఎంత కథాకథనవైఖరి! రెండువేలకుఁ బైఁబడిన పద్యము లింత హృద్యముగా వ్రాసిన శ్రీ లక్ష్మీనరసింహకవిగారు "కవిసింహ" ఖ్యాతికిఁ బాత్రులగుట యేమి వింత? ఈ కవిత ప్రాక్కవుల కవిత కెందును దీసిపోక వారి మార్గముననే నడచుచు సహృదయ సమాహ్లాదన సమర్థముగా నున్నది. బంధగర్భకవిత్వాదులు, నశ్వధాట్యాది బహువిధ వృత్తములు, కవిశేఖరున కున్న శబ్దాధికారమును వర్ణనాపరములైన ఘట్టములు వారికున్న భావనాశక్తిని బ్రస్ఫుటము సేయుచున్నవి. వారు దీనిఁ బితృపాదులకు సంకితముసేత గురుభక్తికిఁ దార్కాణము. మూలము నతిక్రమించి భక్తరత్న, విశ్వదాతృ, గాయకసార్వభౌమేత్యాది వర్ణనములతో నాంధ్రప్రశస్తి నగ్గడించుట వారి దేశాభిమానమునకు నిదర్శనము.

---

సాహిత్యవిశారద, విమర్శకశిరోమణీత్యాది బిరుదాంచితులు

## శ్రీ కోన వేంకటరాయశర్మగారు

కవిసృష్టికర్త. ఆకర్తృత్వ మధునాతనజన్మమున మానుషశక్తిసాధ్యము గాదు. అది పురాకృతపుణ్యఫలము. అట్టి కవితాశక్తికి లోకశాస్త్రాద్యవేక్షణమున లభించిన జ్ఞానము తోడైనచో నా కవి కావ్యము సహృదయాహ్లాదకర మగుటకు సందియ మేమి?

"నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర చ దుర్లభా
కవిత్వం దుర్లభం తత్ర శక్తి స్తత్ర చ దుర్లభా"

మీయం దీ కవితాశక్తులు గలవని మీ పురాణము నిరూపించుచున్నది. మీ రొక మహోత్కృష్ట కావ్యమును రచించి యాంధ్ర సారస్వతలోకమునకు విందొనగూర్చితిరి. ఈ రసజగత్తునందు మీవంటి కవితాకళానిధులే యనన్యసామాన్య తేజోవంతులై విరాజిల్లుదురు. భాషాయోషకు భూషణప్రాయములైన మీ తక్కిన గ్రంథములును బ్రకటితములగుఁగాక.

మహోపాధ్యాయ, సాహిత్యరత్న, శతావధాని, కవిశేఖర,
## వళ్లై పూర్ణప్రజ్ఞాచార్యులుగారు (గుంటూరు)

శా॥ శ్రీలక్ష్మీనరసింహ శాస్త్రి! కవితాశ్రీ నిల్చె మీయింట మేల్
మేలిద్దానె మీదు పూర్వపురుషుల్ మీ పుత్త్రులన్ పౌత్త్రులన్
శ్లాఘ్యుల్ కవితాప్రగల్భులగ నై జిత్రించు మీ యింటి వా
సాలుం గవ్యములన్న మీఁటు కృతుల్ సాగింప టబ్బంబొకో!

కం॥ ధీమత! కనుఁగొంటిని మీ
మాఘపురాణంబు కావ్యమంజులఫణితిన్
శ్లాఘాపాత్రంబయి మిము
మాఘ కవీంద్రుండటంచు మహిలోఁ జాటున్.

గీ॥ నీతిబోధకమయి గుణాన్వితము నయి
సాధువృత్తాభిరామమై సౌమ్య! యాంధ్ర
దేశ మహిమంబుఁ జాటుచుఁ దెన్గుబాస
కొక సువర్ణాభరణము మీ యుత్తమ కృతి.

---

విమర్శకాగ్రేసరత్యాది బిరుదాంచితులు
## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (నెల్లూరు)

తమ రచించిన మాఘపురా
ణము శ్రద్ధ మెయిం బఠించినాఁడను రచనా
క్రమమును ధారాశుద్ధియుఁ
బ్రమదమ్మును గూర్చె మధురభావస్ఫూర్తిన్.

ఉ॥ జాతీయతం గను కూరుపు పసందును, మంజులసంస్కృతోక్తి సం
ధానవిశేష చాతురియుఁ దావక కావ్యకళారహస్య వి
జ్ఞానముఁ జాటుచున్నవి నిజంబుగ మీ కృతి, పోతరాజు ల
క్ష్మీనరసింహ! సాధుకవిసింహ! జగన్నుతిపాత్రమయ్యెడున్

ఆ॥ ఆ పురాణము మీ స్వతంత్రానువాద
కలనఁ గొంగ్రొత్త వన్నెచిన్నెలను బొరసి,
లలితతర కావ్యలక్షణ లక్షితమయి
[illegible] మోద మొదవించుచున్నది కవీంద్ర!

కం॥ కవితామాధురిచేతను
భవహరమగు మాఘకథ ప్రభావముచేతన్
భవదుత్తమకృతి సకలో
త్సవకరమై నిలుచు శాశ్వతంబుగ జగతిన్.

---

ప్రతిభారవి, కవితాకళానిధీత్యాది బిరుదాంచితులు

### శ్రీ భువనగిరి విజయరామయ్యగారు (గుంటూరు)

గీ॥ శ్రీయుతులు పోతరాణ్ణారసింహ రచిత
మాఘమాహాత్మ్య మరసితి, మాట తేట
మేలి శైలి రసస్ఫూర్తి మించు సంచు
సమత క్రమత యొసంగెఁ బసందు విందు.

---

సాహిత్యరత్నేత్యాది బిరుదాంచితులు

### శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు (నెల్లూరు)

"మీ మాఘపురాణము పురాణశైలిలో లేదు. కావ్యశక్తిఁగలదు అట్టి చక్కని మీ కృతి ఆంధ్రభాషాయోష కొక నూతనాలంకార మనుటకు సందేహము లేదు. మీ గ్రంథ మాంధ్రదేశమున బహుళప్రచారమునకు రాఁగలదని నా విశ్వాసము.

---

సాహిత్య విద్యాప్రవీణ, విద్వాన్ బిరుదాంచితులు,

### శ్రీ భారతుల వేంకట నృసింహశాస్త్రిగారు (గుంటూరు)

స్వస్తి శ్రీ మతః కవిత్రితయస్య పంథానమనురుంధతా స్వదేశ భాషాప్రియాణాం స్వదేశీయానామభీష్టం సాధయతాచ తత్రభవతా పోతరాజోపనామ్నా లక్ష్మీనృసింహ కవిసింహేనాంధ్రీకృతం స్కాందపురాణాంతర్గతం మాఘపురాణ మహామపరమ్ ।

కవిసింహస్యాస్య ప్రతిభా ప్రగల్భా, సమగ్రావ్యుత్పత్తిః, క్షోదక్షమ శ్చాభ్యాసః

కవిసింహస్యాముష్యైవం విధానేక గ్రంథ గ్రథనాయాయురారోగ్యైశ్వర్యాణి ప్రదోభూయా ద్భగవాన్ నృసింహ ఇత్యాశాసే.

ఉభయభాషాప్రవీణ

## శ్రీ లంకా సీతారామశాస్త్రిగారు (నర్సారావుపేట)

“తాము రచించిన మాఘపురాణాంధ్రీకరణమును నా కీయఁబడినది అక్కడక్కడ విమర్శనాబుద్ధితోఁ జదివితిని. నెఱసు లేమరుపాటుననైన దొరలునేమో యని కొంటిని. కాని, వారికి సహజ కవిత్వమునకుఁ దోడు పాండిత్యమున్నవారి విద్యయెడ నట్టి పొరఁబాటులు పొసఁగ వుండవు. కొన్నితావుల స్వేచ్ఛగా నడచిన మీ యనర్గళ సంతానవాహిని కుంటులేని నడకతో సుమారు రెండువేల పద్యములకుఁ బైగా పయనించినది. వయసుమళ్ళిన మీకెట్లు కవిత్వపుఁ జేవ హెచ్చినదో మీ పౌత్రమునందలి రసపుష్టి ఘటనము లంతయు తెలియ తేటమగును. పురాణముఁ దెనిగించుట యన్న నసాధ్యమైన పని. అందు సంస్కృతానువాదము. వింతేటి ధారాశుద్ధితో వ్రాయుట సరళభాషతోఁ జవులూరించుటనుబట్టి మీరు భారతకర్తృసమర్థులని నా నమ్మిక.”

శ్రీ శేషులకు మీ తాతపాదులకుఁ గృతి నిచ్చుటయు వారి నామముగూడ నామనామాంకముగుట సర్వవిధముల మీకుఁ బోతనసామ్యమును గలిగించిన మీ కృతి విశేషము పూర్వసుకృత శేషము.

---

సాహిత్యవిద్యా ప్రవీణ, భాషాప్రవీణ బిరుదాంచితులు

## శ్రీ తమ్మరసవు వేంకటరంగయ్య పాకయాజిగారు (గుంటూరు)

శ్రీయుత పోతరాజు లక్ష్మీనృసింహ కవిసింహుని యీ గ్రంథము తెల్లఁగు గలిగిన మిగుల సొగసైనదగు రచనమనుటకు సందియము లేదు. కల్పితకథలం గలుగ వ్రాసినవి కాని యమున నిట్టిపురాణగ్రంథ మాంధ్రమున వెలసి నాస్తికులనెల్ల నాస్తికులఁ జేయుననుట సాహసోక్తి గాదు. సంస్కృతము నెఱుఁగని వారికి తెలుఁగు భాషతో చరిత్రముల మార్గదర్శకమౌను వీరి భాషాంతరీకరణము. తాము తెనుఁగున నొప్పచున్నారు. స్తోత్రాదులలో మాత్రము వీరు సంస్కృతభాషా పటిమను జూపిరి. [illegible] మున్నగు తావులం జూడుఁడు శివకేశవుల కభేదముం గూర్చి జీవబ్రహ్మములైక్యమును వెల్లడించిరి. ఇట్టి యభేద విజ్ఞానము రాజిల్లుట క్షేమకరమని వ్యాఖ్యానింపను. వేదప్రామాణ్యము నెలకొల్పఁగల యిట్టి యుద్గ్రంథము రచించి శివ్యాదులకు [illegible] కాశీ గయా ప్రయాగ రామేశ్వరాది పుణ్యక్షేత్రములలోఁ బ్రసిద్ధ గోదానాదు లొసంగియుఁ బితౄణవిముక్తులైన కవిగా [illegible] ధన్యులు



అవధానిభూషణ, కవితాకళానిధి, కవిసింహ
పోతరాజు లక్ష్మీనరసింహ కవి

శ్రీరస్తు.

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః.

# విజ్ఞాపనము

మహాజనులారా !

మా పితృపాదులు శ్రీరామకవిగారు ప్రతి సంవత్సరము నియతముగ మాఘస్నానమొనర్చుచుండువారు. వారొక వత్సరము మాఘారంభమునకు బ్రహ్మశ్రీ చింతలపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని బిలిపించి యింట నుంచికొని స్నానానంతరము వారిచే దినమున కొక యధ్యాయము చొప్పున నా నెలదినములు స్కాందాంతర్గత మాఘపురాణమును జెప్పించి వినిరి. అప్పు డద్దానిని దెనుగున బద్యకావ్యముగ రచించిన లెస్సగ నుండునని రామకవిగారు సంకల్పించిరి. ఇంతలో దైవవశమున దమ దక్షిణపార్శ్వ మవశమైపోవుటచే నా పని చేయ జాలక నన్నాజ్ఞాపించిరి. నేనును బుద్ధిమాంద్యముచే వెంటనే ప్రారంభింపకపోతిని. అంత గొంతకాలమునకు మా తండ్రిగారు కీర్తిశేషులైరి. ఆవల గవితాగురువులైన తండ్రిగారి కోరికి దీర్పలేకపోయితినే యని విచారపడి వారిమీదను, భగవంతునిమీదను భారమిడి గ్రంథము నారంభించి క్రీస్తుశకము 1951 వ సంవత్సరమున బూర్తిగావించితిని. కాని,

మ॥ జనకుం డాజ్ఞయొసంగినప్పుడ కృతి న్సాగించి పూరించి యా
యన కర్ణంబుల కింపుగా వినిచి యావ్యాసోప మాశీస్సులన్
గనగా నోచని నా యభాగ్యతకు దుఃఖంబందుచున్నిందు వాం
ఛను నే గోరెద దల్లిదండ్రుల యభీష్టంబుల్ వడిం దీర్పగన్.

నే నీ గ్రంథమును శ్రీనాథాది కవులు చూపిన త్రోవ ననుసరించియే యాంధ్రీకరించితిని. కొన్నియెడల నౌచిత్యముం బాటించి మార్చితిని, చేర్చితిని. విషయప్రాశస్త్యముంబట్టి పెంచితిని, త్రుంచితిని. రసోల్బణమునకు విస్తరించితిని, గుస్తరించితిని. మూలములో నామ

ములు లేని పాత్రలకుఁ బేరులు పెట్టితిని. మూలముతో సరిచూచుకొనఁ దలంచువారికి వీలుగ నుండునట్లధ్యాయ సంఖ్య నిచ్చితిని. నే నెట్లు రచించితినో "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్."

ఇందు 3 వ ఆ. 107 వ పద్యమున "సను నీ తెచ్చుచెలుంగ కయ్యము వృష శాస్త్రిసాలతో" అని, 156 వ పద్యమున "ప్రాతర్వేళ విమన్న విన్నానిఁగి తారాకింగముకొల్చి" అని యుండవలయు. గ్రంథ మచ్చగునపు డెంత జాగరూకతతో నున్నను దోసఁగులు పొసఁగినవి. వానిని చదువరులే సరిపెట్టుకొనఁ గోరెద.

నే నీ గ్రంథము నొకదానినైన నచ్చొత్తింపఁదలంచి మహాదాతలు సాయపడుట కొక కరపత్రము ప్రకటించితిని. వారు దానిని జూచుటతోడనే మహానందముతోఁ దమ తమ శక్తికొలంది ధన మొసంగి నా కార్యమునకుఁ దోడ్పడిరి. వారందఱకు నా హృదయ పూర్వకాభివందనములు.

గ్రంథముద్రణ సమయమున నే నస్వస్థుఁడనై గ్రామాంతర మున నుండఁ బ్రూఫులు సవరించియు, నే కోరఁగనే "ఆముఖము" వ్రాసియు నిచ్చిన సతీర్థ్యుఁడు, సహచరుఁడు నగు "ఉభయభాషా ప్రవీణ, వేదాంతపారీణ, కవిశేఖర" మిన్నికంటి గురునాథశర్మగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

నా గ్రంథము వీక్షించి తమ యమూల్యాభిప్రాయము లొసం గిన పండితకవులకు నమస్కారములు.

గుంటూరు,<br>
11-11-1954

ఇట్లు,<br>
అవధానిభూషణ, పోతరాజు లక్ష్మీనరసింహారావు.

శ్రీ

# ఆముఖము

మహాజనులకు మనవి. మిత్రాదేశ మనుల్లంఘ్య మగుట మాఘపురాణము మాట యెత్తెదను.

పురాణములు వేదశిరముల నెక్కి పురాతన కాలమునుండియు వెలుఁగు చున్నవి. కనుకనే పురాణములైనవి కాఁబోలు.

“ ఋగ్వేదం భగవోఽధ్యేమి, యజుర్వేదం, సామవేద, మాథర్వణం చతుర్థ, మితిహాస పురాణం పంచమమ్” ఛాం. 7-1-2

అని ఛాందోగ్యోపనిషత్తునఁ బురాణ ప్రశంస కలదు. పురాణములు వేదముల వలె శాసింపవు గాని మిత్రునివలె నుపదేశించును.

“ యచ్ఛాస్త్రప్రవణా త్పురాణవచనాదిష్టం సుహృత్సమ్మితాత్ ” అని విద్యానాథ మహోపాధ్యాయుఁ డనెగదా !

“ పూర్వపురుష చరిత స్తుతినిందా ముఖేన రాగద్వేషా వుత్పాద్య మిత్రవ త్ప్రవృత్తి నివృత్తి హేతుభూతమ్ ”

అని మల్లినాథసూరిసూనుఁడు కుమారస్వామి సోమపీథి పరిష్కరించెను. భట్టుమూర్తియు “సుహృద్విజ్ఞాపనంబుల్ పురాణాది గ్రంథము” లని కావ్యాలంకార సంగ్రహమున ననువదించెను. అందలి విషయమో ?

“ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పంచకమ్”

“పురాణం పంచలక్షణమ్” అని నామలింగానుశాసనము. ఇట్లు సర్గాది పంచ లక్షణములతోఁ గూడిన మహాపురాణములు పదునెనిమిది కలవు.

“ మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయమ్
అ నా ప లిం గ కూ స్కాని పురాణాని పృథక్ పృథక్”

మత్స్య మార్కండేయములు, భవిష్య భాగవతములు, బ్రహ్మ బ్రహ్మాండ బ్రహ్మకైవర్తములు, వాయు వామన విష్ణు వరాహములు, అగ్ని నారద పద్మ లింగ గరుడ కూర్మ స్కాందములు.

అందు స్కాందపురాణమున గ్రంథసంఖ్య వివిధభంగులఁ గనవట్టుచున్నది. ముప్పదిరెండక్షరముల శ్లోకమునకు గ్రంథమని పేరు. అట్టి శ్లోకములు “స్కాందము

నెన్బదియొక్క వే యగున్" అని దేవీ భాగవతము చెప్పెను. "ఏకాశీతి సహస్రకం స్కాందం తథా శతం చైకమ్" అని శ్రీమద్భాగవత మెనిమిదియొక్కవేయిపై నూఱని దేవీభాగవతముకంటె నొకనూఱు నధికముగాఁ జెప్పెను.

"నూఱువే ల్గ్రంథములలోన నుతి వహించి
శ్రీమహాస్కాంద సంహిత శివునిఁ జెప్పు"

అని శివరాత్రి మాహాత్మ్యము లక్ష చెప్పెను.

కం|| బంధురసపాద లక్ష, గ్రంథంబై యైదుపదులు ఖండంబులతో
సంధిల్లుచు స్కాందంబు" భీమేశ్వర-1 ఆ. 25 ప.

అని శివరాత్రి మాహాత్మ్యమున లక్ష చెప్పిన శ్రీనాథ మహాకవి భీమఖండమున లక్షయు నిరువదియైదువేలఁ జెప్పెను. ఏలాకో విచిత్రముగా నున్నది.

మరల నీ కవిసార్వభౌముఁడు,

"ఇమ్మహాస్కాందమ్మునకు నవయవంబు లాఱు సంహితలు. అవి క్రమంబున సనత్కుమార సంహిత పంచపంచాశత్సాహస్రిక (55 వేలు) సూతసంహిత షట్సాహస్రిక (6 వేలు) శాంకర సంహిత త్రింశత్సహస్రిక (30 వేలు) వైష్ణవ సంహిత పంచ సహస్రిక (5 వేలు) బ్రహ్మ సంహిత త్రిసహస్రిక (3 వేలు) సౌర సంహిత యేక సహస్రిక (1 వేయి) కా-1 ఆ. 80 ప.

అని కాశీఖండమున సంహితల సంఖ్యల నిచ్చెను. ఈ సంఖ్యల మొత్తము నూఱు వేలగును. మఱి శ్రీనాథుఁడు కాశీఖండమునకుఁ బూర్వమే వ్రాసిన భీమ ఖండమున "సపాద లక్ష" యని యేల చెప్పెనో? కాశీఖండమున "లక్ష" యేల చెప్పెనో? ఎట్లైనను స్కాందమున నే మహానుభావులో శ్లోకముల రచించి చేర్చు చుండిరనక తీఱదు.

స్కాందమున నీ యాఱు సంహితలందుఁ బంచనాగరఖండంబు, గమలాలయ ఖండంబు, రేవా ఖండంబు, నేకవీర ఖండంబు, మైలార ఖండంబు, గోదావరీ ఖండంబు, నివి యాదిగాఁగల పంచాశత్ఖండంబులు (50) గలవు. ఖండఖండములందు నెన్నేని మాహాత్మ్యములు, కథలు, ధర్మములు మున్నగునవి కలవు. మన మాఘపురాణ మీ స్కాందమునందలిదే.

ఇచట నొక మాట. "నేటి కాలమున నిట్టి పురాణములెందుకు? ఎవరు చదువు దురు? ప్రకాశకవిత్వము వ్రాయరాదా?" అనువా రున్నారు. వారికి మా నమస్కా రములు. ఇంకనీ దేశమున శ్రౌత స్మార్త కర్మములు, సదాచారములు, వ్రతములు

మున్నగు ధర్మములు పూర్తిగాఁ జచ్చిపోలేదు. నగరములలో నెట్లున్నను బల్లెటూళ్ళలోఁ బాదులు కదలలేదు. ధర్మదేవత నాలుగు పాదములగు తపశ్శౌచ దయా సత్యములు కలికమునకును లేకుండఁ గాలిపోలేదు.

పాదాలు విఱిగిన పద్యాలు, నిర్యతిప్రాస పద్యాలే ప్రజాకవిత్వమా? వాక్యమును ముక్కలుచేసి నాలుగు బంతులలో వ్రాసినదే ప్రజాకవిత్వమా? రిక్షాలు, నాగళ్ళు, పాటలు, పలుగులు మున్నగువానిపై వ్రాసినదే ప్రజాకవిత్వమా? వర్తమాన పరిస్థితులపై వ్రాసినదే ప్రజాకవిత్వమా? కర్తృపదము కనుపట్టకుండఁ గారకముపయోగించి భావము బయలుపడకుండ బాధ దీర్ఘ సమాసములు గుప్పించి తలతిరిగిపోవఁ గృత్తద్ధితము లెత్తుకొని చివరకుమాత్రము "చూడాలి - ప్రకటించాలి" అని క్రియ కొక యాలి నంటఁగట్టఁగనే ప్రజాకవిత్వమా?

సత్క్రియలు చెడఁ బదములు విఱుగఁగొట్టి, కర్మములు చెడఁ గరములు బంధించి, వ్యంజనరుచి చెడ నాలుకఁ జెతికి ప్రాణములు స్థానములు గదలఁ బైఁబడి అక్క జాతి చెడ నపరబుద్ధులు గఱపి, శబ్దములు చెడ నాసం గోసి యందము చెడ నలంకారములు త్రెంచి సమస్తము వ్యస్తముచేసి భాషాదేవిని వర్ణభ్రష్టురాలిం గావించి బాధించినఁ బ్రజాకవిత్వమా? అదిగాక యందఱు నొక రకముగనే గ్రంథములు వ్రాయుచున్న వాఙ్మయ మభివృద్ధి నెందునా?

కానిండు. ఎవరి యిష్టము వచ్చినట్లు వారు మెలఁగుటకు స్వాతంత్ర్యమున్నదిగా. మా పిచ్చి మా కానందము. "ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపి సమానధర్మా" అనుకొని తృప్తిపడెదము. జీవము గల గ్రంథమే బ్రదుకును. ఆ కార్యము కాలమే కావించును.

ఇంతకు మాది ప్రజాకవిత్వము కాకపోయినఁగదా మాకు విచారము. మేము ప్రజలలోనివారము. మా గ్రంథము ప్రజలకొఱకు. "విశ్వశ్రేయః కావ్యమ్" అని యుంపలేదా? ప్రజలలోను వివిధరుచుల కాసించువారు గలరు. "లోకోభిన్నరుచిః" గదా. ఐన నేమియందురా? ఓపికతో వినుఁడు. మీకు వలసినవి యిందు లేకపోలేదు. ఈ మాఘపురాణము స్కాందాంతర్గతము. అది స్కాందమున ముప్పది యధ్యాయములలోఁ గలదు. దానిని బది యాశ్వాసములుగా నవధానిభూషణ శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహులు లాంధ్రీకరించిరి. ఇందు దివ్యములు, నదివ్యములు, దివ్యాదివ్యములు నగు కథలేగాక యేకాదశీ, తులసీ, పారిజాతాదుల ప్రభావములు, నైతిక సాంఘికాది విషయములు, సతీ పుత్త్రాది ధర్మములు నెన్నేనియుం గలవు. ఎందుల కీ ధర్మము లందురా?

"శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠన్హి మానవః
ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్"

శ్రుతులు, స్మృతులు చెప్పు ధర్మము నాచరించు మానవుఁ డీ లోకమునఁ గీర్తిని బరలోకమున నుత్తమసుఖము నొందుచున్నాఁడని వైవస్వతమనువు చెప్పుచున్నాఁడు. అట్టి ధర్మాచరణమునందుఁ బ్రవృత్తి నీ గ్రంథము గలిగించును.

"జంతూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతో విప్రతా
తస్మా ద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వ మస్మా త్పరం
స్వాత్మా నాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః
ముక్తి ర్నో శతజన్మకోటి సుకృతైః పుణ్యై ర్వినా లభ్యతే"
వివేక చూడామణి 2.

కృమి కీటకాది జన్మములు దాఁటి మనుష్యజన్మ మెత్తుట దుర్లభము. అది లభించినఁ బురుషుఁడౌట, యటులైన విప్రుఁడగుట, యట్లైన వైదికధర్మాసక్తుఁడవుట దుర్లభము. అట్లయ్యు విద్వాంసుఁడగుట, యటులైన నాత్మానాత్మజ్ఞానము వడయుట దుర్లభము. అది యబ్బిన బ్రహ్మాత్మభావము దుర్లభము. ఎన్ని కోట్ల జన్మముల సుకృతము లేనిది ముక్తి లభించునా ?

కాన మానవుఁడు సత్కర్మముల ననుష్ఠింపఁబూనవలయు. అట్టిదే మాఘస్నానము. దాని మాహాత్మ్యమునే యీ గ్రంథము బోధించును. స్నానమాత్రమున సుకృతము లభించునా ?

"బిసరుహపత్రలోచన ! కృపీటములందు మునింగి యాడవే ?
మొసళులు మీలు కర్కటకముల్ కమఠంబులు వాని కబ్బునే ?
యసదృశమైన తీర్థఫలము" కాశీ - 3 ఆ. 73 ప.

అని యగస్త్యమహర్షి లోపాముద్రతో ననెను అని యందురా ?

వినుఁడు. బాహ్యాసంశుద్ధివలనఁ గ్రమముగా నంతశ్శుద్ధి కలుగును. అంతశ్శుద్ధియే చిత్తశుద్ధి. చిత్తశుద్ధిద్వారమునఁ గ్రమముక్తి యొదవును. మాఘస్నానము ముక్తి నిచ్చును నను టిదే భావము.

"సంధ్యాస్నానం జపో హోమో దేవతానాం చ పూజనం
ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే"
పరాశర స్మృతి - ఆచారకాండ I అ. 39

నిత్య మొనర్పవలసిన కర్మములు:— స్నానము, సంధ్య, జపము, హోమము, దేవపూజ, ఆతిథ్యము, వైశ్వదేవము, మఱియు బ్రహ్మయజ్ఞమును గలవు. వీని యన్నింటికి స్నానము ముఖ్యము.

"అస్నాతో నాచరేత్కర్మ జప హోమాది కించన
స్నాత్వాధికారీ భవతి దైవే పిత్ర్యే చ కర్మణి"

జప హోమాదులను స్నానమొనర్పకయే చేయరాదు. స్నాన మొనర్చినఁ గాని దేవ పితృ కర్మము లొనర్ప నధికారి కాఁడు. ఏల యందురా ?

"అత్యంత మలినః కాయో నవ చ్ఛిద్ర సమన్వితః
స్రవ త్యేవ దివా నక్తం ప్రాతస్స్నానం విశోధనమ్"

తొమ్మిది రంధ్రములతోఁ గూడిన యీ కాయమునుండి యహోరాత్రములు మలికి కాఱుచునే యుండును. కానఁ బరిశుద్ధికై ప్రాతస్స్నానము కర్తవ్యము. అందును మాఘమున విశేషము.

"మాఘమాసే రటంత్యాపః కించి దభ్యుదితే రవౌ
బ్రహ్మఘ్నం వా సురాపం వా కంపతంతం పునీ మహే"

— మాఘమాసమున రవి యుదయింపఁబోవునపుడు స్నానము చేసిన బ్రహ్మఘ్నుని గాని మద్యపాయిని గాని పవిత్రునిఁ జేసెదమని జలము లుద్ఘోషించుచున్నవి. ఆ స్నానము నూఱక నీళ్ళలో మునిఁగి లేచుటగాదు.

"సంకల్ప స్సూక్త పఠనం మార్జనం చాఘమర్షణం
దేవాది తర్పణంచైవ స్నానం పంచాంగ ముత్తమమ్"

స్నానమున సంకల్పము, వరుణసూక్త పఠనము, మార్జనము, అఘమర్షణము, దేవాదితర్పణము నైదుండవలయు. శ్రీకృష్ణుఁ డుద్ధవునితో నిట్లనె.

సీ॥ కడుభక్తి గంగ! గంగా! యంచు స్మరియించి
గంగాభిముఖముగాఁ గదలిపోయి
నాభిమాత్ర జలమ్మున న్నిల్చి సిగ రెండు
వలఁకులందగఁ దల వంచి మూఁడు
మార్లు మునిఁగి యాచమనమొనర్చి శిఖను
ముడివైచి లాగిపోవిడిచి యూరుప్ప
సంకల్పమొనరించి సరిగ హిరణ్యశృం
గమ్మను వరుణసూక్తము జపించి

మార్జనమ్ము నాపోహిష్ఠ మంత్రముల న
మర ఋతంచ యనెడు నఘమర్షణమున
తానముం జేసి దేవాది తర్పణమ్ము
లాచరింపుమా........"

శ్రీమద్గురు భాగవతము 11 స్కం. 29 అ.

ఇట్లు స్నానము చేయవలయు. అందుల కశక్తులైనచో మంత్రములు లేకుండ నైనఁ జేయవచ్చు. తుదకు బుద్ధిపూర్వకముగాఁ గాకున్నఁ బరుల యొత్తిడివలనఁ జేసినను ఫలమున్నది. "బలవంతపు మాఘస్నానము" అను లోకోక్తి యూరక పుట్టినదా? మాఘస్నానములు ముప్పది సవిధిగా నొనర్చినవాని పుణ్యమును బండ్లకెత్తవచ్చును. ఈ విషయమునే యిందలి ప్రథమాశ్వాసమున నేఁబది పద్యములవఱకు నన్వయ వ్యతిరేకముల శివుఁడు పార్వతికి నుపదేశించును.

మకరసంక్రమణము మొదలు కుంభసంక్రమణమువఱకు నని కొందఱు, మాఘశుద్ధ ప్రతిపత్తిథి మొదలుకొని యమావాస్యవఱకు నని కొందఱు మాఘ స్నానములు చేయవలె నందురు. కాఁగా మాఘమున మకరమందు రవి యున్నపు డర్ధోదయకాలమున నదీస్నానము లత్యంత ప్రాశస్త్యములు. తక్కిన కాలమందలి స్నానములును వ్యర్థములు గావుసుమీ.

కర్మములు దృష్టఫలకములు నదృష్టఫలకములు నని రెండు విధములు. అదృష్టఫలకముల నమ్ముటకు శంకింపవచ్చును గాని దృష్టఫలకముల కట్లు శంకింపనేల? అందులకే స్నానఫలమును గాథామాలికముగా దృష్టిపథమున కిందుఁ దేఁబడెను. చూడుఁడు. తొండ కథ (167 పుట), కిరాతాదుల కథ (274 పుట) మున్నగునవి.

ఏమో యీ కృకలాసాది కథలు సత్యములని విశ్వసించు టెట్లందురా? అందులకే సుప్రసిద్ధుల కథలు నిందుఁ గలవు. చూడుఁడు. ఇంద్రుని కథ 174 పుట) విశ్వామిత్రాదుల కథ (156 పుట) మఱియు నా యీ కాలములందలి వేగరథ (39 పుట), సులక్షణ (310 పుట) ప్రముఖ మహారాజుల కథలు నిందుఁ గలవు.

అదియునుగాక యీ మాఘపురాణము నీశ్వరుఁడు పార్వతికిం దెల్పుచున్నది గదా. నమ్మకున్న నేమి సేయుదుము? "యచ్ఛార్థ ప్రవణా త్పురాణ వచనాత్" అని కలదు గాన నర్థవాద బాహుళ్యమున్నను నసలే నమ్మకున్న మన భారతీయ సంస్కృతికే మున్న చుట్టవలసినదే.

"విద్వద్భి స్సేవిత స్సద్భి ర్నిత్య మద్వేషరాగిభిః
హృదయేనా భ్యనుజ్ఞాతో యోధర్మ స్తన్నిబోధత" స్మృతి.

రాగ ద్వేషాదులు లేని మహర్షు లనుష్ఠించి చెప్పిన ధర్మమును విశ్వసింప రాదా? విశ్వసించి మిమ్ము మాఘస్నానము చేయుమనియేకదా చెప్పినది. భగవంతుని పేరుతోఁ దోడివారి కింత పెట్టుమనియేకదా చెప్పినది. తమ క్షేమియుఁ ద్రవ్వి తల కెత్తుమనలేదే? ఇంతమాత్రము పరిశుభ్రముగా మీరుండి పరోపకృతి చేయక, సభా రంగములకెక్కి "మానవసేవయే మాధవసేవ" యని గొంతు చించుకొన్నఁ జాలునా? అట్లయిన మీకుఁ బదివేలు... ...

శ్రీ లక్ష్మీనరసింహకవిగారు "శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబున" శ్రీనాథుండుంబోలె స్కాందమాఘపురాణము నాంధ్రీకరించిరి. కొన్నియెడలఁ బునరుక్తులను దలంగుటకుఁ గొన్నికొన్ని శ్లోకములఁద్యజించిరి. అట్లయ్యు నాంధ్రీకరణమునఁ గొన్ని పునరుక్తులు పడకపోలేదు. అది కావ్యమునకుఁ గాకున్నను బురాణమునకు శోభాహేతువే యనుకొందును. కనుక నేకాఁబోలు శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్య భీమేశ్వర పురాణ కాశీఖండాదులలో నిట్టివి కలవు. మఱి మహిమను బదింబదిగాఁ జెప్పకున్న నొకసారితోఁ జదువరికిఁ జెవి నాటునా?

కొన్నియెడలఁ గవిగురు కవితాకళాదృష్టితోఁ బెంచిరి. "బహుధాప్యథ తన్మాతా పశ్చాత్తాప ముపాగతా, విచార్య గంగాసలిలే నిపత్య మరణం యయౌ" అని యుండ 'విచార్య' అను శబ్దముం గొని 49 మొదలు 57 పద్యములు (8 ఆశ్వాసమున) వ్రాసిరి. రసపోషణమున కిట్లు కవి చేయకున్న నది నీరసకావ్య మగుటకు సందియమేమి? "మాతాపితృ సమోదేవో నచాస్తన్యో జగత్త్రయే" అనుదానికి 33 మొ-40 పద్యములు (10 ఆ.) భావంబుపలక్షించి వ్రాసిరి. కొడుకులఁ గన్న తల్లిదండ్రుల కెల్లర కిట్టి భావము లుండకపోవు.

ఔచిత్యముం బాటించి కొన్నియెడలఁ గ్రొత్తవానిం జేర్చిరి. "దార సంగ్రహణం కృత్వా గార్హస్థ్యం ధర్మ మాచర" అను మూలమునకు 164 మొ-169 ప. (302 పుట) వ్రాసిరి. "త్యజత్వం ప్రాణినాం హింసామ్" అనుటకు 170 మొ-172 ప. (303 పుట) వ్రాసిరి. "తవాఘ మఖిలం విప్ర నిశ్శేషం నిలయం యయౌ" అని యుండ

"చెప్పినరీతిగా వ్రతముఁ జేసితి పూర్తిగ దాన శుద్ధియై
తుప్పలఁ దోమినట్టి యసి తుల్యుఁడ వైతివి" (300 పుట)

అని మూలములో లేని యలంకారముం దెచ్చి యలంకరించిరి.

“ . _వంతం మహామతిం” అని మూలము. అచట వీరు భావం బుపలక్షించి యెంత చక్కఁగా వ్రాసిరో చూడుఁడు. “వీరవ్రతతపోధనుం డాదరంబున విశ్రంఖలు నాలింగనంబొనర్చి తన పర్ణశాలకుం గొనిచని యనసూయ కెనయైన నిజజాయ చేతి వంటకంబు తనతోఁబాటు భుజింపంజేసి కొంతతడవు భుక్తాయాసం బపనయించుకొన్నపిమ్మట” (301 పుట). అన్నదానప్రవణుఁడగు కవి యిట్లు వ్రాయుట యబ్బురము గాదు.

అనౌచిత్యముఁ బరిహరించుట కొకటి. క్రూర కోడలిని బాధించి గదిలోఁ బడద్రైచి తాళమువేసి చంపినది.

“గేహాంతర్గత సంస్థాయా నిర్యయు స్సప్తవాసరాః
ప్రాణా నిర్యయు రాకాశం దేహాదనశనాన్మృతే”

అను శ్లోక భావముం గొని యనౌచిత్యముఁ బరిత్యజించుట కీపట్టునఁ గొంత వదలి కొంత కథ కల్పించి కవిగారు సరసముగా వ్రాసిరి. 29 అధ్యాయమున 5౪ పద్యము మొదలుకొని చూచునది.

“అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్” అను పెద్దల సుద్ది కలదుగా. కవిగారట్లు యథోచితముగాఁ గల్పింపకున్నచో నత్త కోడలిని గదిలో నుంచి యన్నము పెట్టకున్నఁ గొడు కేమిచేయుచుండెను? భార్య ప్రాణములు పోవునపుడు గది తలుపులఁ బగులఁగొట్టి లోనికేగినవాఁ డదివఱ కేల పోయి భార్యను గాపాడుకొనలేదు? ఇది భర్తృధర్మమా? భార్యను జంపుకొన్నఁగాని మాతృభక్తి గాదా? మున్నగు సందియము లెన్నేని మూలమున నంకురించును. అట్టివానినెల్లఁ దెనుఁగు సేఁతలోఁ దొలఁగించిరి.

అభిప్రాయమును గుఱించి చెప్పుట కొకటి. విశ్రంఖలుని తీర్థాటన మతనిది గాదు. (296 పుట) కవిగారి కుటుంబము మా కుటుంబము కలిసి సల్పినది. వీరవ్రతుఁడు మైత్రిం బ్రశంసించు ఘట్టము కవిగారే మిత్రునో మదిలో నుంచుకొని వ్రాసినట్లు కన్పట్టుచున్నది.

ఇఁక భక్తిభావ మెలసినచోటఁ గవి పరవశుఁడై వ్రాసికొనుచుఁ బోవును. “ఉచ్చరన్నుచ్చకై ర్విష్ణో ర్నామాని” అనుటకు నాలుగు పద్యములు (189 పుట) వ్రాసెను. శివుఁడు ప్రసన్నుఁడైన ఘట్టమున మూలమున లేకున్నను నశ్వధాటీ వృత్తముల నైదింటిని వ్రాసెను. (93 పుట) అట్లే విష్ణువుపైని నశ్వధాటీ వృత్తముల రచించెను (125 పుట). పూర్వాంధ్రకవు లీవృత్తము నెత్తుకొనలేదు. విష్ణువుపై నెన్నియో రకముల సీసములు వ్రాసెను. 147, 214, 223, 258, 330 మున్నగు పుటలు తిల

కించునది. స్వదేశాభిమానమునన్ మూలమున లేకున్నను నాంధ్రదేశము (57
నభివర్ణించెను. అందు మా నరసరావుపేట తాలూకాలోని కోటీశ్వరస్వామిని వ
లేదు. నన్నయకూడ నర్జునునిచే గోదావరీస్నానము చేయించెను.

ఇందుఁ బోతనాది పూర్వకవుల పోకడలు నందందుఁ గలవు. "నాకలా
బునుంబోలె దేవవల్లభేంద్రాణికారంభై రావతాంచితంబును" (185 పుట) "హరిక
విననట్టి వ్యక్తికిఁగల చెవుల్ చెవులౌనె రాటంపు జెవులెకాని (194 పుట) "కరి
సంరక్ష కమలాక్ష గోవింద భవహర యనుచెప్పుఁ బలుకువాని (186 పుట) ఇఁ
గేవల సంస్కృత పద్యములు గొన్ని కలవు.

సత్యనివేశాయ శారదాధీశాయ పాపనాశాయ తుభ్యన్నమోస్తు (90
మఱియు 189 పుటలో 66, 67, 68, 69 పద్యములు సాంస్కృతికములు. అట్లే
తెనుఁగు పద్యములు గొన్ని కలవు. 17 పుటలో 101 పద్యము, 94 పు
37 పద్యము మొదలైనవి. కవిగారాశుచిత్రగర్భబంధకవిత్వములలో నిపుణులు. ఇ
చిత్రగర్భబంధకవిత్వములకు మచ్చు చూపిరి.

189 పుటలో నిరోష్ఠ్యకందము కలదు. గర్భకవిత్వమునకు 331 పు
115, 116 పద్యములను, 369 పుటలో 108, 110 పద్యములను జూచునది. బం
త్వమునకు 347 పుటలో నాగబంధ చక్రబంధములు కలవు. ముక్తపదగ్రస్తమ
152 పుటలో 85 ప. చూచునది.

"ప్రాయశో యమకే చిత్రే రసపుష్టి ర్నవిద్యతే" అని కలదు గాన నె
వగా వాని జోలికిఁ బోలేదు. "పోతరాజు" పేరునికింబట్టియో యంత్యప్రాస
మిక్కిలి గౌరవించిరి.

"ఊరు పొమ్మన్నఁ గాదు పేరార యన్న" (62 పుట) ఇట్లందందు
క్తులు గలవు. 357 పుటలోఁ జాలఁ గలవు.

సులక్షణనందనుఁడు తనకుఁ జిన్ననాట మునివరుండు చెప్పిన (325 పు
81, 82, 83) పద్యములతోడనే విష్ణువుం బూజించి (329పు-103, 104, 10
ధ్యానించుట యెంత సమంజసముగా నున్నదో చూడుఁడు. ఆ బాలున కంత
నెక్కడు తెలియదాయె. మఱి యేమి చేయఁగలఁడు? పిదప విష్ణువు ప్రత్య
స్పృశించుటతోడనే చూడుఁడు. జ్ఞానోదయమైనది. వెంటనే మత్తేభ కందగీత
సీసముతోడను, గందగీతగర్భితోత్పలమాలతోడను బొగడినాఁడు. ఇచటఁ గవి
మెంత గంభీరమైనదో పరిశీలించితిరా? ఈపట్టున మనకు ధ్రువుఁడు స్మృతిపథ
బడుచున్నాఁడుగదా.

కీ॥ శే॥ అబ్బరాజు శేషాచలశర్మగారును రచించిరి. మఱియు రాయలసీమవాసి శ్రీ సుబ్బరాజుగారును బద్మపురాణాంతర్గతమునే తెలిఁగించినట్లు తెలియుచున్నది. కాని స్కాందాంతర్గత మాఘమాహాత్మ్యమును దెనిఁగించినవా రిప్పటికి నా చెవిం బడలేదు. అందుచే దీనికి వీరే ప్రథములనుకొందును. వీ రీ గ్రంథమును 22 వందల గద్య పద్యములతో రచించి పితృవాక్యమును బాలించి ధన్యులైరి.

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవ మిత్య వద్యం
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః"

---

## కవి జీవితము

శ్రీ లక్ష్మీనరసింహ కవిగారు గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా ఏల్చూరు గ్రామమున సంజీవమాంబాగర్భమున సర్వధారినామ సం॥ ఆషాఢ శుద్ధ ప్రతిపత్తిథి (క్రీ. 1888) జనించిరి. తండ్రి యగు రామకవిగారివలన నక్షరాభ్యాస సంస్కారము వడసి పోతరాజు బ్రహ్మయ్యగారి కుమారుఁడు రామయ్యపంతులుఁగారి యొద్దఁ బ్రాథమికవిద్య నభ్యసించిరి. పిమ్మట జనకులకడఁ గావ్యములు చదివి కవిత్వము చెప్పసాఁగిరి.

వీరు బొగ్గరపు వేంకటరాయశర్మగారి ద్వితీయపుత్త్రిక మహాలక్ష్మమ్మను బరిణయమైరి. ఆమె గర్భమున రాక్షస సం॥ అధిక వైశాఖ శు ౧౩ నాఁడు పురుషోత్తమశర్మ జనించెను. పిమ్మట నామె కాలధర్మమునొంద మరల ఇక్కుర్తి కోటయ్యగారి రెండవకొమార్తె హనుమాయమ్మను వివాహమైరి. ఆమె గర్భమున రామలక్ష్మి యను కూఁతురు క్షయనామ సం॥ మార్గశిర శు ౬ లం రామకోటీశ్వరరా వను కుమారుఁడు జన్మించిరి. ఆవల నామెయుఁ బరలోకమునకేగఁ గవిగా రొరులమాట విని పునర్దార సంగ్రహణా[illegible]పూర్వక భక్తి జ్ఞాన వైరాగ్యములఁ బెంపొందించుకొనుచు బ్రహ్మశ్రీ పరశురాముని సీతారామశాస్త్రులవారివలన బ్రహ్మవిద్యను బడసి సదాచారసంపన్నులై కాలము గడపసాఁగిరి.

శ్రీ రాపర్ల లక్ష్మయ్యగారు వీరిచే 190[illegible] వ వత్సరమునఁ గీ. శే. బొగ్గరపు శేషరామశాస్త్రిగారు రక్షకులుకాఁగా 'అష్టావధానము' చేయించి సత్కరించిరి. అది మొదలు వీరెన్నెన్నితావులనో యవధానాశుకవితాసభలు జరిపిరి. మఱియు మేమిరుపుర

మును గలిసి 31–7–1916 తేదీ కంభములో శ్రీ కంచి వేంకటసుబ్బారావుగా రగ్ర పీఠి నుండ నవధానాశుకవితా సభలు జరిపితిమి. బనగానపల్లె సంస్థానమున 17-8-1916 నాఁ డష్టావధానము, 18-8-1916 తేదీ ఆశుకవితాసభ జరిపితిమి. ఒకపర్యాయము ముప్పాళ్ళలో లక్ష్మీనరసింహకవిగారు కీ. శే. చింతలపాటి సుబ్రహ్మణ్యశాస్త్రులవా రాధ్యక్ష్యము వహింప నవధానమొనర్చి 'కవిసింహ' బిరుదము వడసిరి. 1941 వ వత్స రమున వీరు నర్సారావుపేటలో నాశుకవిచక్రవర్తీత్యాది బిరుదాంచితులగు కొప్పరపు వేంకటరమణకవి, బుచ్చిరామకవి శతావధాను లగ్రాసనాధిపతులై యుండ నవధాన మొనర్చి తత్సభా పండితకవులవలన "అవధానిభూషణ" బిరుదము పడసిరి. మఱియు నాంధ్ర సారస్వతపరిషత్తు 1954 వీరికిఁ 'గవితాకళానిధి' బిరుదమునిచ్చి సత్కరించెను. వీరు సుమతి చరిత్ర, ఋతుధ్వజ విలాసము నను గ్రంథములు రచించిరి. ఉదారు లెవరైన వాని నచ్చొత్తించి భాషాసేవ సేయఁగోరెద.

సుమతి చరిత్ర యందలి దొక పద్యము

కం॥ దరమా గ్రీవము కాకో-దరమాయా రంగజప్రదరమా మెయి మం
దరమా చనుబింకము కుం-దరమా పరిహాసకర సుదంతకు సఖుఁడా !

ఋతుధ్వజ విలాసమునందలి దొకటి

గీ॥ కష్టపడియైన రసికశేఖరులచెంత
శక్తిఁ జూపించి మెప్పింపఁజనును గాని
బాలికులచెంత నెంతగాఁ బాటుపడిన
నంధకునిముందుఁ బెట్టిన యద్దమెకద.

రామకవిగారు కవులై గ్రంథములు రచించిరి. వారి పుత్రులు లక్ష్మీనరసింహ కవిగారీ మాఘపురాణము రచించిరి. వీరి పెద్దకుమారుఁడు శ్రీ పురుషోత్తమకవి విద్వాన్ పరీక్షలోఁ గృతార్థుఁడై యవధానములు సలిపి గ్రంథములను రచించెను. వారి కొడుకును జిరంజీవి వేంకటలక్ష్మీవరప్రసా దింటర్ చదువుచునే బాల్యమునఁ గొప్పరము, గుంటూరు, బొగ్గరము మున్నగుతావుల "అష్టావధానము లొనర్చెను. ఇట్లే వీరి వంశము కవితాకళకు నెలవై యాచంద్రార్కము వర్ధిల్ల నీశ్వరుని వేఁడెదను.

గుంటూరు,
10-11-1954.

బుధజన విధేయుఁడు,
మిన్నికంటి గురునాథశర్మ.

# శ్రీ లక్ష్మీనరసింహకవిగారు సభలలోఁ బూరించిన కొన్ని సమస్యలు.

ఇందలి నాలవ పాదము సమస్య. అది కుండలీకృతమును.



శా॥ సొమ్ముల్ చీరలు పూలపేరులును రాసుల్ గూర్చి యవ్వానిలో
నెమ్మైనవి కోరి యేరికొనుచున్ గాలమ్ము వెచ్చింప యు
క్తమ్మా జాగునకాగ, నీ సహజ సౌందర్యమ్మె చాల్ మారుపూ
(టమ్మా రమ్మని పట్టె నాత్మరమణీ హస్తాబ్జమున్ గ్రక్కునన్.) 1

కం॥ తరుణీమణి సౌందర్యం । బరసితివే మిత్ర ! వీక్షణావళిచేతన్
విరళమగు నడుము చేఁ దాఁ । (దఱిమె మృగవ్రజము సింహతతి నడవులకున్.) 2

కం॥ సురశాత్రవ! దశకంధర! । నరులు నరాశనుల వెలిచినారని నను ని
ద్దుర లేపితె, నీ దుష్కృతిఁ । (దఱిమె మృగవ్రజము సింహతతి నడవులకున్.) 3

శా॥ అంకాభావ మజస్రభాంచితము నీ యాస్యంబు దీనన్ మఱే
వంకన్ నల్పు ఘటిల్లినా యనుచు భావంబందుఁ గాంక్షించె నే
ణాంకుం డెంతయుఁ దన్నుఁ బోలఁగఁ దదీయాకాంక్ష గుర్తించి నీ
(వింకన్ గస్తురిబొట్టుఁ బెట్టుకుము తన్వీ! ఫాలభాగంబునన్.) 4

కం॥ కవివర్యులు భీమనముఖు । లవితథవాక్కులు తదీయమగు వాక్శక్తిన్
శవములయి ప్రాణులుండుట । (శవములు జీవించియుంట సంభవమయ్యెన్.) 5

శా॥ పంచాస్త్రారిగజ దత్తభూరివర గర్వస్ఫూర్తి ఘోరావళిన్
మించంగోరుటఁ గాలకేయుల నని న్నిర్జించుచోఁ బ్రేమ యే
ముంచంబోక మఱందియే యనక విద్యుజ్జిహ్వుపై దూఁకి వే
(త్రుంచెన్ రామ ! శిరంబు రావణుఁడు సంతోషించిరా నిర్జరుల్.) 6

కం॥ అంతశ్శుద్ధిగఁ దపము ననంతముగాఁ జేయ స్నానమాడుటకున్ హే
మంతోష్ణమ్మునకంటె వ । (సంతోష్ణము బాడబులకు సంతసమరయన్.) 7

కం॥ సంగరరంగమునం గురు । పుంగవ! ధృతరాష్ట్ర! నరకపుత్త్రుఁడు ప్రేశే
షం గొంతిపట్టి మొనరా । (సింగమ్ముల భంగపఱచె సింధురమొకటన్.) 8

కం॥ తలనీ! నీసుత కన్నవ । నెల యంటివి, వినుము నేఁడు నెలపొడుపే ని
క్కలికిం గంటిని గ్రిందటి । (నెలబాలుని జూచి బాల నెలబాలాయెన్) 9

కం॥ మందమతి గానఁ బిల్లల । యందొకటిగ నెంచి పెంచి యామని బలుకం
బొందిక వేఱుగఁదోఁచిన । (విందునఁ బికశిశువు దాది వెడలఁగ నడఁచెన్.) 10

కం॥ వనజాక్షి! మాటిమాటికి । దనుజోపముఁ జైద్యు నిందుఁ దడవకు మేఁ గృ
ష్ణుని బెండ్లాడెదను దదప । (ఘనము ఘనముమించు మించు గావలె నేనున్) 11

కం॥ ముచికుందవరద దర్శన । మచలితమగు భక్తిసలుప నరిగెడు నాకున్
రుచిమద్రస సంపూర్ణలి । (కుచముల రెండింటిఁ గోసి కోమలి! యిమ్మా.) 12

కం॥ ఇప్పుడు నీవిడు సరుకుల । కప్పన మొనరింతు మూల్య మది గొని నిశ తాఁ
జొప్పడె నని యంగడివడిఁ । (గప్పరు సంపంగినూనె కావలె వింటే.) 13

కం॥ స్తుతగుణుఁడగు దుష్యంత । క్షితిపతి కణ్వుం గన నరిగియె గాంధర్వ
స్థితిఁ గైకొని తన్మాని వ । (సతి సతిఁ గవయంగఁ బుత్రసంతతి గలిగెన్.) 14

ఉ॥ హారిసుగంధ మీవలఁదు నప్పుడె నీ ప్రియుఁ డొయ్య నిన్నెదం
జేరిచికొంట వాని గళసీమను వ్రేలెడు హార మచ్చున
ద్దారిచినట్లు నీ యురమున న్వెలుఁగొందెను గాకయున్నచోఁ
(దారము లేని హారము నితంబిని నీ కెవఁ డిచ్చెఁ జెప్పుమా.) 15

ఉ॥ తండ్రి కొమారు లౌదురగదా రవియున్ శమనుండు నెల్ల యి
ల్లాండ్రను మిన్నయైన పృథ యత్యధిపాత్త సుమంత్రశక్తి న
వ్వాండ్రను నిమ్మతోడఁ బిలువన్ వృథసేయఁగ రామి వచ్చి యా
(తండ్రియుఁ బుత్త్రుఁడున్ సుతయుతం బొనరించిన సాధ్వియై తగెన్.) 16

గీ॥ రాహు వెదిరించి రవిని బూర్ణమ్ముగాఁగ
మ్రింగివేయుడుఁ జీఁకటుల్ మెండుకొనియెఁ
బక్షు లఱచుచు గూండ్లకుఁ బాఱఁజొచ్చెఁ
(గానఁబడియెను నక్షత్రగణము పగలె.) 17

కం॥ అతులితనియమ సమన్విత । పతివ్రతాగణమతల్లి బంధుప్రియ భా
మతనూభవ సంగుణఖని త । (పతి పతి గవయంగ ముద్దుపట్టి జనించెన్.) 18

శా॥ కంజాతోద్భవతుల్య ధీబలసమగ్రా! యాత్మవిచ్ఛేఖరా!
పుంజీభూతములైన యేనసుల నిర్మూలమ్ము గావింప ము
క్తిం జేకూర్ప సమర్థమైనదని భక్తిన్ దేశికోక్తంను మే
(లంజేకొన్నది నాదు మానసము వేదాంతమ్ము సాధింపనే.) 19

శా॥ కంజేవ్యంగ విభంగకాంశమున నాకాశప్రభూతానుకం
పం జంద్రానన కంజనాసతికి జన్మంబంది క్షుద్బాధచే
తం జిట్టాడెడు నాంజనేయునకుఁ జూతం బట్లు ప్రాగద్రిపై
(మంజూషంబునఁ దోచెఁ బద్మహితబింబం బెంతయు న్వింతగన్.) 20

ఉ॥ అబ్ధిగభీర! నిన్ను సుకృతాత్ముల మైత్రి నెసంగువాఁడు ప్రా
రబ్ధ వితీర్ణి యార్తజనరక్షణతత్పరుఁ డిద్ధబుద్ధిసం
లబ్ధ దయాగుణుండు మృదుమానసనీరరుహుండు సద్యశో
(లుబ్ధుఁడు దీనమానవుల లోపముఁ బాపును జూచినంతనే.) 21

శా॥ దధ్యన్నం బెపు డారగింపవలె, నిత్యంబై సదా దేవతా
రాధ్యంబౌ సుధ యెందు రాజిలు, దివారాత్రంబులం దెల్పఁగా
విధ్యుక్తంబుగ నెవ్వఁడుండెఁ, గిటిరై విశ్వాత్ముఁ డేమెత్తైనో,
(మధ్యాహ్నంబునఁ జంద్రమండలములో మార్తాండుఁ డుండెన్ భువిన్.) 22

కం॥ కొంకక చూలాలిని ని । ష్పంకస్నానస్నుషను వనికిఁ బంపితె రామా!
లంక శిఖిముఖసురాళి క । (లంకచరిత కాదనుచుఁ దలంచెన్ రా మున్.) 23

ఉ॥ గుంద్రని చన్నుదోయి గల కుబ్జ హలాయుధ కృష్ణమూర్తు లన్
వాంద్రను నన్నదమ్ముల కవంగని యా కవయందుఁ గూశరా
తీంద్ర నడంచునం చలఘుదీప్తి నుషా హృదయాపహర్తకున్
(దంద్రిగదా యటం చతివ తమ్ముని గోరెను మారుకేళికిన్.) 24

కం॥ గోపాలరూప శౌరికి । గోపిక యొక్కర్తు కురులు గోరుల దువ్వన్
గోపాలక గోపికలకు । (వీపునఁ జనులుండె గోళ్లె వెంద్రుకలుండెన్.) 25

శా॥ ప్రుత్స్నారాశిని గల్గు శబ్దతతి నెంతేఁ గాంచి ధీయుక్తిఁ బ్రో
ద్యత్స్నిగ్ధాత్మకు లిచ్చుచుండిన సమస్యల్ చెప్పనాతండుద
న్వత్స్నానం బొనరించినట్టిఁడగుఁ గావన్ వాని కీర్తిన్ సభన్
(కృత్స్న జ్యోత్స్నల వీడి చెప్పఁగదవే హృత్స్నహ మేపారఁగన్.) 26

మ॥ అనుకంపానిధి! పాండురాజమహిషీ! ప్రాణేశుఁడై యేలుకో
ఘను నీ రెండవసూను వేఁడిన ననున్ గాదంచుఁ గారించెనం
చును బాదంబుల వ్రాల గొంతి వెనరుం జూడ్కిన్ హిడింబానుజా
(తను బెండ్లాడుమటంచుఁ గోరెను సుతున్ ధర్మప్రకారంబుగన్.) 27

శా॥ వక్త్రధ్యక్ష! సమస్త భూతచయమున్ వాల్లభ్య సంపత్తితో
శుక్త్రాసంబులఁ బాపి యే జగదధీశుల్ ప్రోతు రా శ్రీ శివా
వాక్త్రాణాధ్యుల కంబికాహరులకుం బద్మప్రియస్వామికిన్
(వక్త్రంబుల్ పది కన్ను లైదు కరముల్ వర్ణింపఁగా వే యగున్.) 28

కం॥ నీ పీటఁ బద్మరాగము । స్థాపింపంబడియె సంజతతి గానఁ దగెన్
దీప మటులద్ది తన్మణి । (దీపముపై నొక్కయీఁగ ధీరత వ్రాలెన్. 29

క॥ ఖ్యాతిం బురుషున కిడునవి । దాతృత లిపి విద్య సూనృతమ్మగుఁ గానీ
చేతికిఁ గజ్జయుఁ గడియము । (మూతికి మీసంబు చుట్టముక్కయె తలఁపన్) 30

ఉ॥ ధూర్తతలోదరీమణుల తోవను బట్టక యెంతయేనియు
న్గీర్తినిఁ జెందఁగాఁ దలఁచు నిర్మలచిత్తకుఁ బువ్వుఁ బెట్టుచో
నార్తి ఘటిల్లకుండఁగ నయాచ సపర్యలు సల్పుచో మనో
(భర్తను బుత్రిగాఁ దలఁప భావ్యము భామకు రెండువేళలన్.) 31

ఉ॥ అంగవికాసహీను లకృతాస్త్రు లధీరులు మత్స్యయంత్రమున్
భంగ మొనర్పఁగాఁగలరె పద్మదళాక్షికి నీకు దీటుగా
నంగజమూర్తి యోగ్యుఁడు సమర్థుఁడు పార్థుఁడు నీకు చిత్తసీ
(మంగళవాఁడె భర్త యగు మానుము దుఃఖము నీవు ద్రౌపదీ!) 32

చ॥ కలఁగక గాధిభూసవముఁ గాచిన దెవ్వరు? రామచంద్రుఁ డే
కలికికిఁ బ్రాణనాయకుఁడు? కవ్వడికిం గవ లేమి కావలెన్?
జలిమలపట్టి ఱేఁ డెవఁడు? శంబరవైరికి భాశ యేమగున్?
(జెలువుగ రామలక్ష్మణులు సీతకుఁ దమ్ములు శంభుఁ డన్నయా.) 33

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః.

# మాఘపురాణము

## విషయసూచిక

## 6 ఆశ్వాసము



## 7 ఆశ్వాసము



## 8 ఆశ్వాసము

## 9 ఆశ్వాసము

సంఖ్య ... పుట



## 10 ఆశ్వాసము

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః.

# మాఘపురాణము

## కృత్యారంభము

ఉ॥ శ్రీనలవాసినిం జిటికసే పెడఁబాయఁగలేక వక్షమం
దే నివసింపఁజేసికొని యెప్డు సుఖస్థితి వెల్గు సామి ప్ర
జ్ఞానిధి యేరుచూరిపుర శైలవరాగ్ర నికేతనుండు ల
క్ష్మీనరసింహమూర్తి దయసేయుత శ్రేయము రామసూరికిన్. 1

మ॥ అసమాక్షుండయికూడ నిస్స్వాలన కర్థాధ్యక్షులం జెన్నఁబో
క సతంబున్ సమదృష్టి సర్వజనులం గాపాడు కారుణ్యమూ
ర్తి సతీసంయుతుఁ డేరుచూర్నిలయుఁడౌ శ్రీ నీలకంఠేశ్వరుం
డొసఁగుంగావుత రామసత్కవికి శ్రేయోలక్ష్మి నిత్యమ్ముగన్. 2

గీ॥ తపము తనుఁగూర్చి సల్పిన స్థైర్యఖనుల
వాంఛలెల్లను దీర్చు వాక్పతికి నస్మ
దీయ మాఘపురాణమ్ము ధీరగణ్య
మమృత రుచిమంతముగఁ జేయ నంజలింతు. 3

మ॥ కవులన్నన్ ఏయు నీకుఁ దక్కువని లోకమ్మెల్ల వాక్రుచ్చు నే
మి విరోధమ్మొనరించిరో కవులు లక్ష్మీ! కోపముం జూపఁ బు
ట్టువుఁ గన్నట్టి గృహమ్ము మీఁద సతి కుండుం బ్రేమ మల్లాట భా
ర్గవవంశాంబుధిఁ బుట్టు నాకును సిరుల్గల్గింపవో భార్గవీ! 4

గీ॥ అమ్మఁ గన్నమ్మ, జనకుని యప్ప, యప్ప,
మనుమలను, నల్లు, ననుజన్మఁ, గనెడి ప్రేమ
భార్గవీ! నన్నుఁ గనుము శ్రీవత్సగోత్ర
భవుఁడ భార్గవుఁడను గాన నవిరతమ్ము. 5

మ॥ అమరస్తోమ సమర్చితాంఘ్రియుగళా! యజ్ఞాధికాంచద్గళా!
సమరక్ష్మాతల ఖండితాసురదళా! సర్వేడ్య సమ్యక్కళా!

భ్రమరాంబా! పరిపాలితాశ్రిత కదంబా! శైలరాణ్ణందనా!
యమృతశ్రీ ఘటియిల్లఁ జేసి నను నిత్యానందునిం జేయుమా! 6

ఉ॥ నాక వనమ్మునం దతిగుణధ్వనివై సుమనోభిరామమై
నాకవనమ్ము మేల్మిలసనమ్ముల రెమ్మకొనంగఁ జేయవే!
ప్రాకటభక్తి నీదు పదపద్మముల న్మది నిల్పి కొల్తు వా
ణీ! కలకంఠవాణి! నవనీరదవేణి! కళాస్వరూపిణీ! 7

క॥ ప్రణతులొనర్తుఁ ద్వదీయ చ
రణమ్ములకుఁ బుస్తకాంతరాయమ్ములఁ బో
నడఁచి కొనసాఁగఁ జేయుము
గణనాథా! దళితభక్తకార్యనిరోధా! 8

మ॥ కరముల్మోడ్చి భవత్పదాంబురుహయుగ్మం బాత్మయందుంచి సు
స్థిరభక్తిన్ భజియింతు మత్కృతిని వాసిం జెందఁగాఁ జేసి దు
స్తరసంసార గభీరనీరనిధి వే దాఁటింపు మక్షాంతకా!
స్ఫురదాలాపసుచారుతా! ఖలపయోముఙ్మారుతా! మారుతా! 9

గీ॥ బడి చదువు నేరిపిన యొజ్జ బ్రహ్మయార్య
సుతుని గారుణ్యమహితుని సుజనహితుని
రామసూరిని నిరతమ్ము నా మనమున
నిలిపికొని కొనియాడి జోతల నొనర్తు. 10

ఉ॥ దోసిలిఁబట్టి నా హృదయతోయజమం దిడి మ్రొక్కి సన్నుతిన్
జేసెదఁ బోతరాజకులసింధు చకోరకబంధు నక్షరా
భ్యాసము మున్నుగాఁ గవనమల్లెడు శక్తి నొసంగి నన్గవిన్
జేసిన యొజ్జఁ దండ్రిఁ గవి నేతృని రామసుధీవిధాతృనిన్. 11

గీ॥ మానితశ్రేయు మొనగూర్చు మంత్రశాస్త్ర
బోధనాచార్యుఁ బరశురామునిఁ గులీను
శాంతిఖనిని సీతారామశాస్త్రిమణిని
స్వాంతమున నిల్పికొని [illegible] భావింతు. 12

ఉ॥ దైవతభాష రామచరితం బొలుతం గవితన్ ఘటించి లో
కావళికెల్ల నాదికవియైన మహాత్ముని బుట్ట పట్టి స
ద్భావుఁ బురాణ భాగవత భారతకర్తను వ్యాసుఁ గొల్చి మే
ధావులఁ గాళిదాసకవితల్లజ ముఖ్యులఁ బ్రస్తుతించెదన్. 13

చ॥ తెనుఁగున భారతాదిక కృతిప్రతతిన్ రచియించి మించి పే
రెనసినవారి సర్వసుకవీడ్యుల నన్నయఁ దిక్కయజ్వ నె
఼్ఱనకవి మూఁడుమూర్తుల తెఱంగునఁ గ్రాలెడువారి నాదు నె
మ్మనమున నిల్పి మ్రొక్కెద సమంచిత దివ్యకవిత్వసిద్ధికై. 14

క॥ మానిత చతుర్విధ కవి
త్వానూనులను భగవత్పదాంబుజ సేవా
ధీన హృషీకులఁ దలఁచెద
మానసమునఁ బోతనాది మతిమన్మణులన్. 15

గీ॥ ఒరులు తన కైతలోఁ జూపు నెరసులెల్ల
దాఁచికొని యొడ్డ కైతలోఁ దప్పు పట్టఁ
బ్రాఁకులాడెడి కుకవికి బ్రహ్మ సాయ
పడినఁ బరిషత్తులోఁ గోర్కి పండఁబోదు. 16

వ॥ ఏతత్ప్రకారంబునఁ బూర్వకవీంద్రాచారంబు నిర్వర్తించి మజ్జన
కుండును గవితాగురుండు నగు రామకవీశ్వరు నానతి స్కాంద
పురాణాంతర్గత మాఘమాహాత్మ్యమ్ము నాంధ్రమ్మునఁ గృతిగా
రచింపఁదలంచియు నిట్టి యుద్గ్రంథ నిర్మాణంబున కసమగ్రంబులగు
మదీయ పాండితీబల కవితాపాటవంబులు సమర్థంబులగునా యని
శంకాకలంకితాంతరంగుండనై యున్న సమయంబున. 17

సీ॥ నా తండ్రికడఁ గవితాతత్త్వమెఱిఁగి గుం
టూరు హైస్కూల్ పండితోత్తముఁడయి
నాతోడఁ గూడి కొన్నాళ్ళుకవితావ
ధాన సభల్ ప్రశ స్తముగఁ జేసి

విశ్వవిద్యాలయాభిజ్ఞు లొసఁగఁ దాల్చి
"యుభయభాషా ప్రవీణో"రు బిరుద
మాంధ్రసారస్వతాహ్వాయ పరిషత్తుచే
తఁ బడసి "కవిశేఖర" బిరుదమ్ము
ప్రౌఢి శ్రీమద్గురు భాగవతము భాగ
వత మహిమాది కావ్యములు వ్రాసి
గీ॥ శృంగగిరి విరూపాక్ష పీఠేశ్వరులు జ
గద్గురువులు మాంతాచార్య ఘనులొసంగ
నెనసి "వేదాంతపారీణ" యనెడు బిరుదుఁ
దనరు మిన్నికంటి గురునాథ కవివరుఁడు. 18

క॥ చుట్టంపు చూపు మేరకు
మెట్టె మదాలయము నాకు మేకొను తలఁపుల్
పట్టె చిఱునగవు కనులన్
దొట్టఁగ నిట్టలపుఁ బెరిమతో నిట్టులనెన్. 19

క॥ "లక్ష్మీనృసింహా సుకవీ!
లక్ష్మీనరసింహ నిస్తులకృపం గవితా
లక్ష్మిం బొందినవాఁడవు
సూక్ష్మమతివి కృతికి వెనుకఁ జూచెదవేలా ?" 20

వ॥ అని యాశువుగా నుడివి తద్విషయిక ప్రసంగంబులం గొంతతడవు గడపి యవ్వల సాయంసమయమ్మున మద్భవనోపరితలప్రదేశంబున వాయుసేవనంబు సలుపుచు ననుజ తనుజ మిత్రచ్ఛాత్రాదులతో సుఖోపవిష్టులమై యుండ సద్గురునాథకవివరుండు పఠనపూర్వకంబుగా లిఖితాక్షరరమ్యంబైన పత్రంబు నాకొసంగె నం దిట్లు కలదు.

క॥ "లక్ష్మీనృసింహా సుకవీ!
లక్ష్మీనరసింహ నిస్తులకృపం గవితా
లక్ష్మిం బొందినవాఁడవు
సూక్ష్మమతివి కృతికి వెనుకఁ జూచెదవేలా ? 22

ెమ్మొలు దిరిగిన కోవిదు శేరూర్ప
సభ నెదిర్చినవారు సంతసింప
కెలఁగి ముప్పాళ్ళలోఁ జింతలపాటి సు
బ్రహ్మణ్యశాస్త్రి సభన్వహింప
ంభమ్మొ సభలోనఁ గంచి వేంకటసుబ్బ
రా వధీశుండయి గ్రాలుచుండ
నగానపల్లె నవాబు దర్బారుదీ
ర్చి సెబాసు శేమంచు శీర్షమూప

॥ నస్ఖలిత ధారణాశక్తి యవిరళాశు
ధార యనుపమశేముషి మీఱుచుండ
సలిపితివి వధానమ్ములు సాటి యెవ్వ
రయ్య నీకు లక్ష్మీనృసింహాకవివర్య! 23

మలరాడ్వేంకట నారసింహనృపుఁ డాత్మన్మెచ్చ నా గోష్ఠియం
ఁలి విద్వత్కవు లాశుధార నవధానంబు న్నిరీక్షించి స
భ్యలు హర్షింప "వధానిభూషణ" పదంబు న్నీకుఁ గై సేయరే
నెలయం గీరితి దిక్కటిన్ వరసరాశ్చేట న్నృసింహాగ్రణీ! 24

ఆశుకవితా సభలలోన నప్పుడప్పు
డేను నొక కోపు పట్టనే యెఱుఁగనే భ
వత్కవిత్వధారను బ్రతిభాబలంబు
వాయఁబూనుము మాఘపురాణ మనఘ! 25

ఇదియునుంగాక మీ పితృపాదులు మిమ్ముం జేరఁజీరి యొకనాఁడు

స్కాందాంతర్గత మాఘసన్మహిమ మాకాంక్షింతు నాంధ్రీకరిం
పం దార్ఢ్యం బసదాట వ్యాధికరుజవ్యాప్తిం బ్రయత్నింప శ
క్తిం దివ్యంబగు కైత నీకొసఁగితిన్ దీనిన్ వెనింగించి యా
నందమ్మొం గలిగింపరా తనయ! యాజ్ఞన్ దాఁటఁగాఁబోకుమా!

అని డగ్గుత్తికతోఁ జలాధరముతో హర్షాశ్రుబృందమ్ముతో
నెనరుం జూడ్కులతో సమంతపులకానేకంబుతోఁ బ్రజ్ఞ నుం

డిన నిన్వామకరాంగుళీదళముల న్మేనొయ్యనం బుణ్కుచున్
వినిచెంగాదె భవద్గురుండు స్వమనోభీష్టంబు స్పష్టంబుగన్. 28

మ॥ అనఘా! చెంత వసించి నేవిననె? యావంతైన నెన్నండు నే
యునికిన్ దాఁటియెఱుంగవీవు పితృపాదో క్త్యర్థ్వమున్ జామద
గ్న్యుని చందమ్మున మంచపుం దొడుగత్తై యుండంగ సేవావిధిన్
దనియంజేసి దివిన్వెలుంగమఱతే తండ్రిన్ నృసింహాగ్రణీ! 29

వ॥ సుగుణనిధియు నాత్మజ్ఞానపూర్ణుండును హరిభక్తాగ్రణియు నగు
పుండరీకునట్లు జననీజనక సేవ సల్పితివి. సజ్జనతాలక్ష్మణుండగు
లక్ష్మణునికరణి నగ్రజుఁ గొల్చితివి. పక్షపాతంబులులేక తగవులు
దీర్చితివి. కలకాలంది నన్నొదక విత్తంబు లొసంగి యర్థులఁ దృప్తి
నొందించితివి. అదియునుగాక 30

క॥ ఎఱుఁగుదువో? లేదో? మీ
పురుషోత్తముఁ డగ్రసుతుఁడు బుధసద్గోష్ఠిన్
నరసారాట్పురవరమున
నరుల గెలిచి జరిపెనంట యవధానంబున్. 31

క॥ శ్రోత్రియ కవిజీవిత చా
రిత్రము మణిరత్నమాల శ్రీరామవిభు
స్తోత్రము మున్నగు కృతులన్
శ్రోత్రానందముగ వ్రాసెఁజుమి యీ సుతుఁడున్. 32

క॥ వేదాంత డిండిమము నను
వాదము గావించి తెనుఁగుబాసను హృదయా
హ్లాదకర శైలి జననీ
పాదములకు భక్తితో నిషాళు లొసంగెన్. 33

క॥ తెలివిగలవాఁడు చుట్టం
బుల కెలమిం గూర్చువాఁడు బుధ గురు దైవం
బులఁ గొల్చువాఁడు [illegible]
త్తుల [illegible]. 34

గీ॥ రెండవ సుతుండు సుగుణగరిష్ఠుఁ డధిక
భక్తి భవదీయ పాదసేవల నొనర్చు
చిష్టగతి నుండు నీ పుత్త్రి లీ యిరువురు
తల్లిదండ్రుల భక్తితోఁ దనుపువార. 35

సీ॥ అట్టి నీ సుతు లిద్ద ఱడుపాఙ్ఞలకు లోఁగి
యిలు దిద్దికొనిపోవు చెలిమి నుండ
నతిథిపూజల కేకొఱఁత లేకయుండ క్షే
త్రములెల్ల కొల్చులఁ దన్పుచుండ
మృదుమధురోక్తుల నెదిగిన కవితాల
తాంగి వశంవద యగుచునుండఁ
దారబాంధవ మిత్రవర్గంబు నిన్నతి
గౌరవంబున నెప్డుఁ గాంచుచుండ

గీ॥ నైహికేచ్ఛల మఱలించి యాత్మచింత
లన్మనుఁగు నీ వొకింతకాలము కవిత్వ
రచనకు న్వినియోగింపు మచలదీక్ష
సింధుగంభీర ! లక్ష్మీనృసింహధీర ! 36

క॥ అవశాపసవ్యకరణుఁ, బ్రవృద్ధుఁ బిత దైవముబలె భక్తిశ్రద్ధా
భివవగుచును సేవించితి, వవురా బహుకాల మెల్లరాశ్చర్యపడన్.

ఆ॥ కన్నులార నేను గాంచనే నీ పితృ
పాదపూజ వట్టి పట్టి కేను
చెప్పవలఁతి నెట్లు ? శ్రీఘ్రము కృతి సేయఁ
బూను మావధానిభూషణాంక ! 38

క॥ కల దాశుధార నీక
గ్గలముగ నుద్గ్రంథపూర్తికై జంకకు య
త్నలవం బుండినఁజా లొక
నెల నటొ యిటొ పూర్తిగాక నిలుచునె నీకున్. 39

గీ॥ సుమతిచరిత ఋతుధ్వజ ప్రముఖ కృతులు
వ్రాసితివి నవరససుధాబంధురముగ
వ్రాయుమా యింక మాఘపురాణముఁ భ
వత్కవిత్వ వైభవ మెందుఁ బ్రబ్బుకొనఁగ." 40

వ॥ అని మత్సతీర్థ్యుండు రచించిన పద్యంబుల నేను వినియుఁ జదివి
కొనియు నొక్కింత విస్మయంపడి విగతసంశయుండనై. 41

గీ॥ గ్రంథరచనకు విఘ్నముఁ గలుగకుండఁ
బూర్తి నాచేతఁ జేయించి భువిని వెలయఁ
జేయు భారమ్ము హరియందుఁ జేర్చి మ్రొక్క
స్వాంతమున నంకురించె నుత్సాహమపుడు. 42

వ॥ కృతి నెవరికిచ్చెద నను ప్రశ్నం బచ్చట నొదవిన 43

క॥ భగవంతుఁడైనఁ గావలె
భగవంతునిరీతి నరసి పాలించెడి యా
త్మగురుండైనం గావలె
సుగుణామోదద కృతి ప్రసూనముఁ గొనఁగన్. 44

మ॥ భగవంతుండు మదిష్టదైవమగు శ్రీప్రాణేశుభక్తుండు పూ
జ్యగుణుం డిద్ధకృపాబ్ధిదాత కవియాచార్యుండు శ్రుత్యంతపా
రగుఁ డార్వేలనియోగిభూసురుఁడు ధీరమ్ముండు నా తండ్రియే
తగు నస్మత్కృతి పుష్పపూజఁగొన మర్త్యశ్రేణిలోఁ జూచినన్.

వ॥ ఇదియుంగాక, 46

ఉ॥ పింగళి సూరసూరిమణి పృథ్విని దండ్రియె ముఖ్యదైవ మం
చుం గుణియించి దివ్యకృతిసూన సమర్చనఁ జేసె నట్ల నా
కుం గురుఁడున్ గవీశ్వరుఁడు గోవిదుఁడుం బితయైన రామమం
త్రిం గృతి పుష్పపూజ నలరించి కృతార్థుఁడనై తరించెదన్. 47

వ॥ అని సమాధానంబుఁ జెప్పితి నవ్వలఁ దగుపద్యంబుల్లన. 48

సీ॥ అమృతాంశుమాళి హిమాద్రి తనూభవ
౪౬ కొండంతమగఁ జెప్పవచ్చుఁగాక

సకలాఘములను భస్మము సేయఁజాలు మా
హాత్మ్యమ్ము చే నొప్పినట్టిదగుట.
భగవంతుఁడును రమాపతియైన నారాయ
ణానుకంపను గుప్పినట్టిదగుట
ప్రతికర్తలైనవారలకు శ్రేయఃపద
ద్వార మొయ్యన విప్పినట్టిదగుట

గీ॥ గురువు దైవసమానుండు కోవిదుండు
శిష్టశీలుండు తీర్థసంసేవనుండు
నైన పితృపూజ్యపాదుల యాజ్ఞ యగుటఁ
బూనికొంటి మాఘపురాణము ప్రచింప. 49

— వంశావళి —

క॥ ఈ మాఘపురాణమున క, సామాన్య శిరోవిభూష చందమ్మున మ
ద్గ్రామప్రాశస్త్యంబును, మామకవంశావతారమహిమ వచింతుఁగా.

సీ॥ భక్తలోకాభీష్ట ఫలదాత యగు నీల
కంఠేశ్వరుఁడు ప్రాచిఁ గ్రాలుచుండ
లక్ష్మీనృసింహు నాలయవిరాజద్ధరా
ధరవరేణ్యము వాచి మెఱయుచుండ
గ్రామదేవతల ముఖ్యాతఁగన్న యంకమ్మ
విఖ్యాతిగఁ బ్రతీచి వెలయుచుండ
మలరాజు గుండరాణ్మహిప నిర్మితమైన
ఘనతటాక ముదీచిఁ దనరుచుండఁ

గీ॥ బండితాక్రాంత గుంటూరు మండలమున
[illegible]
నిరుపమాన కోటీశాద్రి నిఋతిదిశను
ధీరమాగారమై మీఱు నేరుచూరు.

గీ॥ [illegible] పిన పాటివారు
[illegible] మిన్నికంటివారు

హారిగానకళాఢ్యు లేర్చూరివారు
రమ్యకవితోజ్జ్వలులు పోతరాజువారు
నేరువునఁ దీర్చ నొప్పారు నేరుచూరు. 52

వ॥ మఱియు నిరతాన్నదాతలు విద్యావిధాతలు నగు బ్రాహ్మణుల తోడను, రొక్కంబున జక్కులదొరను ధిక్కరించు వణిక్కుల తోడను, కృషికలాపులు వినయాలాపులు నగు కాపులతోడను, రోగనివారణ విద్యానవద్యులగు వైద్యులతోడను తృణ జల కాష్ఠ సమృద్ధితోడను నేరుచూరు పేరఁగాంచె నట్టి గ్రామంబు ధామంబుగా నుండి పోతరాజువారను గృహనామంబున విరాజిల్లు నస్మదీయ శ్రీవత్ససగోత్రప్రవర ఋషివర్యులు. 53

సీ॥ మూర్తిత్రయిఁ బరీక్ష మొగిసల్పి హరి యెక్కు
డని తెల్పినట్టివాఁ డాదిమర్షి
పుట్టినప్పటి తేజమునఁ బులోమేంద్రారి
నడఁచినవాఁడు రెండవమహర్షి
నిస్తులతమ తపోనియతిఁ జతుర్దశ
భువనకీర్తితుఁడు మూఁడవమహర్షి
తన కోపవహ్ని సంద్రమున జార్చి జగాలఁ
గాచినవాఁడు నాల్గవమహర్షి
గీ॥ వరతపోదానములఁ బరాత్పరు రమేశుఁ
గని భువి దివి వెల్గినవాఁడు కడ మహర్షి
అట్టి శ్రీ భార్గవ చ్యావనాప్నవాను
లౌర్వ జామదగ్న్యులు ఋషు లైదుగురును. 54

వ॥ వారుఁ దేజోమహిమంబులం గూర్చుచుందురు. మఱియును 55

శా॥ శ్రీవిన్యార్జిత లోకధర్మగుణవరిష్ఠుండు ధృష్ఠుండు భూ
దేవవ్రాత సమర్చనీయుఁడుఁ దపో దేదీప్యమానుండు స
త్త్వావిష్టుండు భృగుప్రజామహిత [illegible]
శ్రీవత్సుండు మదన్వయ [illegible] 56

క॥ ఏవంవిధ ఋషిమహిత, శ్రీవత్ససమిద్ధగోత్రసింధు మృగాంకుల్
ధీవర్యవినుత విద్యా, ప్రావీణ్యులు పోతరాజువా రకలంకుల్. 57

శా॥ ఆ వంశార్ణవపూర్ణశీతకరుఁడై యావిర్భవంబంది వి
ద్యావైశద్యమున న్విరించికెనయై యప్పాభిధానుండుఁ దా
దేవాంబ న్వ్రతనిర్మలన్మగులు నా దేవమ్మ కేల్వట్టి యెం
తే విఖ్యాతిని గాంచెఁ గశ్యపునిభాతిన్ గార్హపత్యస్థితిన్. 58

క॥ ఆ దంపతులకు నిర్వుర, కాదిత్యసమాన తేజుఁడై పుట్టి శ్రితా
మోదాపాదకవితరణ, మేదురుఁడై పుల్లమంత్రి మేదిని వెలసెన్.

సీ॥ ఆ పుల్లయామాత్యుఁ డనవద్యగుణముల
నననూయనాఁ దగినట్టి సింగ
మాంబికఁ బెండ్లియై యనఘులఁ బరమయ్య
బాపయ్య దేవయ్య గోపయ యను
వారి నల్వురను గుమారులుగాఁ గనె
నం దగ్రజుఁడు పరమయ్య, బాప
యామాత్య దేవయామాత్యయుల నిర్వురఁ గనె
నందు దేవయకు నర్సయ్య బ్రహ్మ

గీ॥ మంత్రినా నిర్వురైరి కుమారవర్యు
లందు బ్రహ్మయ్య, వేంకటప్పయ్య రామ
యార్యులన నిర్వురం గనె నాత్మజులుగ
రామయకు సుబ్బరావు పుత్రత వహించె. 60

వ॥ పుల్లయ్య రెండవపుత్త్రుఁడైన బాపయ్యకుఁ బాపయ్య చలమయ్య
యను నిద్దఱు సుతులు గలిగిరి. ఆ పుల్లయ్య మూఁడవకొడుకు
దేవయ్యకు బుచ్చమ్మయందుఁ బుల్లయ్య వరదయ్య యను నిర్వురు
కొమరు లొదవిరి. వారిలోఁ బుల్లయ్యకుఁ బుల్లమ్మయందుఁ
సుబ్బయ్య యను తనయుఁడు జనించె నా మొదటి పుల్లయ్య వాలవ
కుమారుండు 61

సీ॥ గోపమంత్రి, ధీసంపద గోపమంత్రి
యోహార్పన న్నేర్పనం బని తీర్పనం బ్ర
తాపరుద్రసమాభిఖ్య భూపమంత్రి
సర్వవిధుల యుధిష్ఠిర తన్మోపమంత్రి. 62

క॥ అల గోపమంత్రి లింగమ
నలఘుగుణం బెండ్లియై యనంతర మిందీ
తులయైన శాయమాంబిక
నెలమిన్వరియించి తీర్చె గృహమేధి విధుల్. 63

క॥ తనయులు తనకుం గలుగమిఁ
దన మూఁడవ యన్న పిన్నతనయున్ వరదా
ఖ్యుని దత్తపుత్త్రునిగఁ జే
కొని కొనియెన్ సౌఖ్యములును గురుతర యశముల్. 64

వ॥ ఆ గోపయ్య దత్తపుత్త్రుండు 65

ఆ॥ వరదయాఖ్యమంత్రి నిరత మర్థులకును
వర దయ నిడు దానవారి తగిన
వరద యగుచుఁ బొటి పస యొసఁగింప ను
ర్వర దనర్చె పాఁడిపంట లిడుచు. 66

ఉ॥ ఆ వరదాఖ్యమంత్రిమణి యాడె వివాహము రూపరేఖ భీ
మావనిజానిపుత్త్రి, సుగుణావళిఁ జంద్రమతిన్, సతీత్వ సం
భావనసత్రిదార, ధృతిమన్మతి నశ్వపతిప్రభూతఁ, బూ
జావిభవప్రతోషిత రసాలశరాంబికఁ, బుల్లమాంబికన్. 67
[illegible]

క॥ [illegible] సంతో
[illegible] శిష్ట [illegible]
[illegible]
[illegible] సతి పుల్లమతో గృహస్థ సద్ధర్మంబుల్. 68

క॥ వరదయకుఁ బుల్లమాంబకు
సురూపులుఁ గళాఢ్యులు గుణశోభితులు బుధా
దరపాత్రులు పుత్త్రిలు న
ల్వురు గలిగిరి శౌరి బాహువుల చందమునన్. 69

ఉ॥ వారలలోన నగ్రజుఁ డపారకళా హరినందనాగ్రిజుం
డౌరిమిఁ బాండవాగ్రజుఁ డనూనతనూరుచిఁ గృష్ణజాగ్రిజుం
డై రమణీమతల్లి సుగుణాంచితవర్తన బుచ్చివెంకమన్
గోరి వరించి శాయకవిగోపతి, గోపతి మీఁఱెఁ గీరితిన్. 70

గీ॥ బుచ్చివెంకమ్మ శాయనబుధునివలనఁ
గనియెఁ బుత్త్రిద్వయంబు శ్రీకాంతవిహగ
వాహువలన విహంగమవాహయుగముఁ
గన్న చెన్నున విన్నాణిమిన్న లెన్న.

సీ॥ ఆ యన్నదమ్ములయందు జ్యేష్ఠుండైన
హనుమంతరాయని కాత్మభవులు
నిరుపముల్ కృష్ణుండు నరసింహుఁడును బున్న
యాభిధేయుండన నైరి ముగురు
వారిలోఁ గృష్ణుండు వైదుషీధృష్ణుండు
గానమ్ముచేత సత్కవితచేత
జనరంజకుండయి సల్పె సీతారామ
శతకాదిక గ్రంథ సముదయమ్ము
గీ॥ శాయకవి రెండవసుతుండు సద్వ్రతాఢ్యుఁ
డమరకాండత్రయంబు జిహ్వాగ్రమందుఁ
దాండవంబాడు నుద్దండపండితుండు
రామనాముండు యాచకకామదుండు. 72

క॥ ఆ రామబుధుని తనయులు
తారాపతిసామ్య కీర్తి ధన్యులు మాన్యుల్

ధారుణి వెలసిరి నరసిం
హారావవ వీరరాఘవాహ్వాయుఁ డనఁగఁ. 73

గీ॥ వారిలో నగ్రజుండైన నారసింహ
రావు లక్ష్మీనృసింహుని రామలింగ
యాహ్వాయుని జంద్రమౌళిని నాత్మజులుగఁ
బడసె వారలు సుమతులు బంధుహితులు. 74

ఆ॥ వరదయార్యు రెండవసుతుండు నరసయ్య
త్యాగమౌళి యంజమాంబయందుఁ
బొరసె సుతులుగాగ బుచ్చయ్య వరదయ్య
సుబ్బరాయఁ డనెడు శుభ్రయశుల. 75

గీ॥ వారిలోపల వరదయ్య పటువచస్కుఁ
జంద్రమౌళిని సుబ్బయ్య సద్విధేయుఁ
డైన హనుమంతరావు దత్తాత్మజులుగఁ
గాని గృహస్థాశ్రమంబునఁ గనిరి కీర్తి. 76

వ॥ వరదయ్యపౌత్రులలో లక్ష్మీనరసింహారావు హయాణభామం బట్ట
భద్రుండై యాంధ్రంబునఁ గవీశ్వరుండయ్యె. గోపయ్య కొడుకగు
వరదయ్య మూఁడవపుత్త్రుండు 77

సీ॥ జనకధరానేత చందాన నుద్యోగి
ధర్మము ల్సద్యోగి ధర్మములును
జరిపి లక్ష్మణమంత్రి శాంతాత్మ రాజమ్మ
భార్యఁగా గ్రహియించి పడసె సుతుల
నరసింహాయను లక్ష్మినారాయణుని రామ
కృష్ణు సీతారాము నిద్ధమాన
మునిఁ బుండరీకాక్షు సుబ్బరాయని నందు
నరసింహామునకు నందనులు లక్ష్మ

గీ॥ ణుండు సూర్యనారాయణాఖ్యుండు శ్రీ స
మేత రాములు మఱి వేంకటేశ్వరుండు
నాఁగ నల్వురు. రామకృష్ణయకు సూనుఁ
డై పొడమె సత్యనారాయణాహ్వయుండు.

వ॥ సుబ్బారాయని కాంజనేయ రాధాకృష్ణులు సుతులై రండ
సింహుని మూఁడవకొడుకగు శ్రీరాములను సీతారామయ
నాలవకొడుకగు వేంకటేశ్వర రావును బుండరీకాక్షుండును
పుత్త్రిలుగాఁ గొనిరి. పుల్లమ వరదయల చతుర్థపుత్త్రిండును
దరణపాత్రుండును దళితాంతశ్శత్రుండును నగు మజ్జనకుండు

సీ॥ గార్హపత్యమునందు గణుతింప నభినవ
ప్రవరుం డనెడి కీర్తిఁ బడసినాఁడు
సత్కవి శ్రుతిపేయ సారపూరమ్ములై
చెలువొందు కబ్బముల్ చేసినాఁడు
తన శిష్యసంతతి ననుకంప పెంపున
శతవధానులుగాఁగ సల్పినాఁడు
కనుసన్నమాత్రన తన పనుల్నెఱవేర్చు
పుత్త్రిపౌత్రులతోడఁ బొదలినాఁడు

గీ॥ తీర్థసేవల గలుషముల్ త్రెంచినాఁడు
పంచయజ్ఞమ్ము లొగిని గావించినాఁడు
పోతరాడ్వంశరత్నమై పొడమినాఁడు
కలిత సుగుణుండు శ్రీరామకవివరుండు.

గీ॥ రాని విద్యలు సేయఁగాలేని పనులు
కానుపింపవు పుల్లాంబ కానుపునెడఁ
గవితచేతను బాండితీగరిమచేత
నీవిచే వృద్ధసేవచే నెనసెఁ గీర్తి.

క॥ ఆ రామకవి ప్రథమ కళత్రంబు

ఉ॥ మేలిగొనాలప్రోవు పతిమిత్రధరాసుర బంధుకోటికిన్
వేలుపుటావు బీదవజ పేర్గొను నక్కటికమ్ముతావు గో
పాలుని లింగనార్యసుత భవ్యగుణాన్విత నర్సమాంబ తాఁ
దాలిమి నేలకొమ్మ శుచితన్మరుతల్లిని గన్న యమ్మయా. 83

క॥ ఆ నర్సమాంబ కనె మును
దా ననువుగఁ జేసినట్టి దానమ్మున ల
క్ష్మీనారాయణు బుచ్చమ
ధీనద్యను దిరుమలాంబ ధృత్యవలమ్బన్. 84

సీ॥ అర్థవిజ్ఞానమ్ము లార్జింపఁదగు విద్య
జనకునియొద్దన చదివినాఁడు
గోపాల్ని కృష్ణయ్య కూర్మి కొమారిత
నతుల నర్సాంబఁ బెండ్లాడినాఁడు
పాత్రులా ఛాత్రుల బహుళకళాస్ఫూర్తి
వాసిఁ జెందెడునట్లు చేసినాఁడు
కుల మభివృద్ధియై యిలమీఱఁగాఁ
బుత్రిపుత్రికా సంతతిఁ బొరసినాఁడు

గీ॥ ధనము ఘనముగ నార్జించి తగినవారి
యక్కఱలు దీర్చినాఁడు నిత్యాన్నదాన
కన్యకాదానములు చేసి క్రాలినాఁడు
రమ్యచరితుండు లక్ష్మీనారాయణుండు. 86

గీ॥ ఆ యనఘుభార్య గోపాలు నన్వయాబ్ధి
చంద్రుఁడగు కృష్ణయాత్మజ సహజశీల
సంతతియుఁ గల్మి గల యదృష్టవతి భర్త
చరణసేవాగుణాలంబ నరసమాంబ. 87

గీ॥ వీరలకు గర్భసంభవుల్ వేంకటాద్రి
యహిత కృష్ణుడు వేంకటచంద్రమౌళి

వేంకటేశ్వరనాముఁడు విదితయుతులు
హనుమమాంబిక సీతాంబ యనెడువారు. 88

వ॥ ఆ లక్ష్మీనారాయణుని తోడఁబుట్టువులలో బుచ్చమ్మ గాదె పేరయ్యకును దిరుమలమ్మ కొప్పరపు నరసింహయ్యకును భార్య లైరి. వారిలోఁ దిరుమలమ్మకు వేంకటరత్నకవి, వేంకటసుబ్బయ్య, వేంకటేశ్వర్లు, లక్ష్మీకాంతము, రామలక్ష్మమ్మ, బుచ్చమ్మ యను వారు జన్మించిరి. వీరి మాతామహి యగు నర్సమాంబ తనకు లక్ష్మీనారాయణ, బుచ్చమ్మ, తిరుమలమ్మ లను ముగ్గురు బిడ్డలు గల్గిన కొలఁదికాలంబునకే స్వర్గంబుఁ జేరినపిదప రామకవి మరలఁ బరిణయంబైన రెండవ కళత్రంబు హారితసగోత్రుండును గాదె కులీనుండును నైన రమణయ్యకు వేంకమాంబయందుఁ బేరయ్య, వేంకట కృష్ణయ్యలకుఁ దోబుట్టువై పుట్టిన సాధ్వీరత్నంబు 89

సీ॥ తలవాకిటనె యెప్డు నిలిచి హాయల్ చూపు
పలుకు నెలంత శుశ్రూషత్వ మెంత
కలకాల మొకనికే నలిమి నిల్వఁగలేని
కమల నిశాంత భాగ్యం బదెంత
పుణ్యజన ప్రాణములఁ దీయుచుండెడి
చండీ నితాంత ప్రసాద మెంత
వరశీలు సుతుఁ బోలు మఱిదినోనాడిన
జానకీకాంత సౌజన్య మెంత

గీ॥ యనఁగఁ గడప దాఁటకయుండి యతితతి క
నంత ధనమిచ్చి కడుఁ బ్రసన్నత వహించి
ప్రియవచస్సుత నెప్పుడు దయనె చూపు
సేవ్య సుగుణకదంబ సంజీవమాంబ. 90

క॥ అతిథులు నభ్యాగతులును, బతిహితులును బంధు లెట్టివట్టుల రాసీ
యతిశయ భక్తి శ్రద్ధాన్వితయై భోజనము పెట్టి విశ్రాంతిఁ గాంచెన్.

సీ॥ బీదలకు సాదలకు నెపు డోదనోద
కములు వస్త్రమ్ములు నొసంగి కనికరించు
తల్లి సంజీవమయె యంచుఁ దగిన వేళ
లందుఁ బ్రజ మ్రొక్కి కొనియాడు నామె యాగి. 92

వ॥ అట్టి సంజీవమాంబయందు రామకవికి జనించిన లక్ష్మీనరసింహము లక్ష్మీకాంతము, విశ్వనాథము, లక్ష్మీనరసమ్మ, మహాలక్ష్మమ్మ యను నేవురయం దగ్రజుండను లక్ష్మీనరసింహనామధేయుండనగు నాకు భార్గవరపు వేంకటరాయ తనయ యగు మహాలక్ష్మి యను ప్రథమభార్యయందుఁ బురుషోత్తముఁడును, నిక్కూరి కోటయ్య తనయ యగు హనుమాయమ యను ద్వితీయభార్యయందు రామలక్ష్మియును రామకోటీశ్వరుండును గలిగిరి. నా ప్రథమపుత్త్రుండు కొప్పరపు వేంకటరత్నకవి తనూభవ స్వరాజ్యలక్ష్మిని ద్వితీయ కుమారుఁడు ముక్తినూతులపాటి వేంకటసుబ్బారాయకవి తనూభవ సీతామహాలక్ష్మిని బరిణయంబైరి. నా ప్రథమ కుమారుఁడు పురుషోత్తమునకు వేంకటలక్ష్మీవరప్రసాదు, సీతారామాంజనేయ ప్రసాదు, సీతాకాంతము, లక్ష్మీనరసమ్మ, శ్రీరంగేశ్వరుఁడు ననువా రౌరసులైరి. 93

చ॥ మదకలహంసయానమును మార్దవమున్ మధురోక్తిభక్తియుక్
హృదయముగల్గఁ దీరిచిన యెమ్మెల బంగరుబొమ్మనాఁగ నె
న్నఁదగిన రామలక్ష్మి యను నాసుత ముద్దులఁ జూపి పెద్ద కూ
కుదుఁడుగ నన్నుఁ జేయకె వికుంఠముఁ జేరె మదీయ దుర్దశన్.

వ॥ నా పెద్దతమ్ముఁడు లక్ష్మీకాంతాభిధేయుండు బ్రహ్మచర్యంబునందె లక్ష్మీశ్వరసాయుజ్యంబు నొందెఁ జిన్నతమ్ముఁడగు విశ్వనాథుండు

ఉ॥ కొంచెమొ గొప్పయో కవిత్వఁ గూరుప నేర్చిచె నేరుచూరఁ స్థా
పించెను దండ్రి రామకవి పేరిట పుస్తకభాండధామ మ
[illegible] సేవఁ దనరించిన కృష్ణభవాలయమ్ము నే
[illegible] పవిత్రులు [illegible] మెచ్చఁగన్ 96

గీ॥ పూర్వసుప్రతిష్ఠితుండయి పోడిమి చెడి
యున్న వీరాంజనేయు మహోగ్రకాయు
వెండియుఁ బ్రతిష్ఠఁ జేయించె విభవమొప్ప
ననఘచరితుండు విశ్వనాథాహ్వయుండు. 9'

వ॥ అతండు కొప్పవరపు నరసింహామాత్య నందన యగు బుచ్చమ్మ న్వెండ్లాడి మహాలక్ష్మమ్మ హైమవతి శారద అన్నపూర్ణ లను తన యలను, ఆంజనేయ రామకృష్ణ జగన్మోహన లక్ష్మణు లను తన యులం గాంచె, అస్మత్సహజాతలలో లక్ష్మీనరసమ్మ గారె వెంకట కృష్ణయ్యకును, మహాలక్ష్మమ్మ వావిలికొలను మరార్తియ్యకును గృహిణులై తమ సాధ్వీత్వ సౌజన్యంబులఁ బుట్టినింటికి మెట్టినింటికిఁ గీర్తింగూర్చి రందు మహాలక్ష్మమ్మకు లక్ష్మీనరసింహారాయకవి తనయుండయ్యె. 98

గీ॥ ఇట్లు పుత్త్రి పుత్త్రిజ దుహితృజులుగూడ
మదుగుపట్టు చెలములను చుడికి యోగ్యు
లగుచు రామకవీంద్రు విఖ్యాతి నెల్ల
కడల వ్యాపింపఁజేసిరి కవిత పేర్మి. 99

గీ॥ గురుకృపాలంబ యగు లక్ష్మీనరసమాంబ
సంతతియు భర్త స్వర్గముంజనినకతనఁ
దల్లులం గోలుపడిన నా తనయయుగముఁ
బెంపఁ జదివింప బడియెఁ దాఁ బెక్కుశ్రమలు. 100

క॥ తలిదండ్రుల బాధ్యతఁ దనతలదాలిచి నాదుసుతులఁ దనసుతులట్టుల్
తలఁచి కృతార్థులజేసిన చెలియలు నరసమ్మబుధాము చేఁగా దీర్ఘ

వ॥ నా తండ్రియగు రామకవీశ్వరుండు. 102

సీ॥ చంపకాదుల నృకేసరి శతకంబు నీ
సాల నేర్చారి శ్రీ నీలకంఠ

తకంబు మఱి నిరోష్ఠ్యమ్ముగా శ్రీ నృసిం
హ శతమ్ము సీసపద్యములఁ జెప్పి
సావిత్రి చరిత సద్భావుఁడైన కుచేలు
కథ బుఱ్ఱకథ యక్షగానములుగ
రచియించెఁ దాళపత్రముల గాగితముల
వ్రాసెఁ బూర్వికకృత గ్రంథసమితి
గీ॥ నాణిముత్తెంబులం బోలు నక్షరముల
నతిథులకు శిష్యులకు నిరతాన్నవస్త్ర
దాన విద్యాప్రదానము ల్దయ నొనర్చె
రవిసమచ్ఛవి వరదయ రామసుకవి. 103

గీ॥ ఆశుకవితను దమ కెనయైనవాఁడు
వెదకినను "నభూతో న భవిష్యతి యను"
సుప్రసిద్ధిని గొప్రంపు సోదరకవు
లొందఁజేసె రామకవీశుఁ డొజ్జయగుచు,

— షష్ఠ్యంతములు —

క॥ ఏవంవిధ కీర్తిజిత వి భావర్యధినాథునకుఁ గృపాసాధునకున్
శ్రీవనితాపతి పదరా జీవారాధునకుఁ గుకవిజిన్మేధునకున్. 105

క॥ నిరతాన్నదాన తోషిత ధరామరసమాజునకు బుధబిడౌజునకున్
గరుణాకర పుల్లాంబా వరదార్యతనూజునకుఁ దపన తేజునకున్. 106

క॥ సురుచిర వాఙ్మధురంజిత సరసారామునకు శిష్యసత్తమచిత్తా
మ్బురుహాహిమధామునకుం గరుణాధామునకు రామకవిసోమునకున్

వ॥ అంకితంబుగా నారచింపంబూనిన మాఘపురాణంబునకుఁ గథా
క్రమం బెట్టులనిన. 108

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘ పురాణము

## ప్రథమాశ్వాసము

క॥ శ్రీధరహార్ష ప్రద బహు
భూధరముల నదులఁ దరులఁ బొల్చును శ్రేయ
స్సాధకశరణ్యమయి సుమ
నోధికగణ్యమయి నైమిశారణ్యమిలన్. 1

వ॥ అట్టి నైమిశారణ్యంబునఁ దొల్లి మునిప్రకరంబు దీర్ఘసత్రయాగంబు సాఁగించుచు సముచిత సమయంబుల సకలపురాణకథాకథనప్రఖ్యాతుండగు సూతునివలనఁ బురాణకథ లానందమ్మగా వినుచుండి రందు భృగుకులతిలకుండగు శౌనకుండు సూతుం బ్రశంసించి. 2

క॥ ఇహపరసుఖములఁ గూర్పఁగ
మహిఁగల వ్రతవితతి నరయ మాఘవ్రతమే
బహుముఖ్య మనుచు విందుము
మహితాత్మా! తెలుపుదాని మహిమం బెల్లన్. 3

మ॥ అనినన్ సూతుఁడు సంతసిల్లి మునివర్యా! శౌనకా! లెస్సప్ర
శ్నను గావించితి విప్ర నేనువుని సాన్నిధ్యంబునం దే తపో
ఘనమాహాత్మ్యము శైలనందనకుఁ దత్కాంతుండు శంభుండు దె
ల్పెను రాఁబోవుచునుండె నాకథ యె విన్పింతున్ వినుండాదృతిన్. 4

శా॥ మందారద్రుమబృంద సత్ఫలరసాంభఃపూర కాసార వా
రేందీమందిర గంధభృత్పవన ధూతేశావలోకాగతా
మందామోదము భాసమాన నిజధామచ్ఛిన్న రాజచ్ఛర
త్కందోల్లాసము సౌధభాస మెసఁగున్ గైలాస *మావాసమై. 5

వ॥ తత్కైలాసశైలాగ్ర భాసమాన ప్రాసాదప్రాంగణంబున వశవర్తులైన గజానన షడానన ప్రముఖ తనూజులును సనక సనం

*అ + ఆవాసమై = శివుని కావాసమై

దన సనత్కుమార సనత్సుజాత ధాతృతనూజాతాది దేవర్షి బిడౌజులును నందీశ్వర చండీశ్వర ప్రభృతి భృత్యరాజులును బరివేష్టింప నవరత్నస్థగిత కాంచనసింహాసనాసీనుండైన శార్ద్రివేయనికాయనలయువలన నుతువంబడు పుణ్యకథాప్రసంగంబున మున్ను సంక్షేపమ్ముగా విన్న మాఘపురాణంబు సమగ్రంబుగా విను కుతూహలంబున జగదంబయైన యంబిక త్ర్యంబకునకుం బ్రణమిల్లి మృదుమధుర సల్లాపంబుల నిట్లనియె. 6

క॥ శ్రీమహిత రజతగిరివర
ధామా! ధామనిధి మిహికధామ రథాంగో
ద్దామా! దామత్వణిప గ్రామా!
గ్రామత్రయాసురవర విరామా! 7

— పార్వతి శివుని మాఘపురాణముఁ దెల్పుమని వేఁడుట —

ఉ॥ తావకవాక్యసంభవ సుధన్ దమిఁ గర్ణనువర్ణపాత్రలన్
ద్రావుచు నున్న నామనమునన్ జనియింపదు తృప్తి యోజగ
త్పావన! లోకనాథ! వృషభధ్వజ! మేరుశరాసనా! మహా
దేవ! ప్రయాగవైభవము దివ్యము పుణ్యద మానతీయవే. 8

గీ॥ ధన్యమైన ప్రయాగ తీర్థమ్మునందు
మాఘమున లేశమేని ధర్మము ? సేయ
నద్రికోటి మడుంగులౌ ననుచు వింటి
మాఘమునకెట్లు గల్గెఁ దన్మహిమమభవ! 9

వ॥ దేవా! మీచే మున్నొకపరి సంక్షేపమ్ముగా నుడువంబడిన మాఘమాహాత్మ్యమ్ము వింటి దానన్దనివిసనక మరల వినఁ గౌతుకం బయ్యెఁ గావున. 10

కం॥ దురితహర మాఘమహిమము
పరమానందమ్మనాదు భావమ్మునకున్
బొరయునమస్తము దెల్పుము
పురదానవ హరణ! విబుధ పూజితచరణా! 11

మ॥ అనుచున్ వేఁడిన పార్వతిన్ గని మహాహ్లాదమ్మునన్ ఫాలలో
చనుఁడో మంగళగాత్రి! హైమవతి మాసశ్రేష్ఠమైనట్టి మా
ఘనిరాసంబును సుస్థిరమైతెనరు దివ్యమాఘమాహాత్మ్యమే
వినిపింతున్ వినుమీ రహస్యమయినన్ బ్రేమార్ద్ర పీవాటచే 12

శివుఁడు పార్వతికి మాఘమహిమఁ జెప్పుట

గీ॥ మాఘమాసమ్మునన్ రవి మకరరాశి
యందునుండఁ బ్రాతస్స్నాన మాచరించు
వాఁడు నిర్దళితాఖిల పాతకుండు
నగుచుఁ బరమపదమ్మున నరుగు గిరిజ 13

కం॥ భానుయుత మకరమాఘ, స్నానమ్మో మాఘమజ్జనమ్మో శ్రద్ధా
నూనతఁ బ్రయాగ నొనరిచె, నేనియువాఁ డేగు విష్ణునిలయమ్మునకున్.

గీ॥ పుణ్యవన్మాఘమునఁ గల్యమునను నదిని
సలుపు తొలిస్నానమునఁ గలుషమ్ములడఁగు
శ్రీనులోకమ్ము రెండవదానఁ గలుగుఁ
దానె ఋణీయౌను మూఁడవదానఁ కి. 15

ఉ॥ సానుమదాత్మజా! విబుధసాధితయౌగ ప్రయాగయందుగం
గానది నీటిలోన నవగాహనమున్ వరమాఘమాసమం
దేనరుఁడైనఁగాని ఘటియించిన వెండియుఁ దల్లిచన్నుఁబాల్
పానముసేయఁబోవఁ డపవర్గరమారమణీవశాత్ముఁడై. 16

మ॥ ఇనుఁడర్ధోదితుఁడౌతటిన్ బురబహిః పృథ్వీస్థకుల్యాతటా
కనదీవారిజలమ్ములం దెవఁడు మాఘస్నానమున్ జేయునో
వనితా! యాతఁడు ముక్తఘోరకలుషవ్రాతుండు పూతుండునై
పునరుద్భూతుఁడు గాఁడు గోడుఁగుడువంబోఁడొక్కరవ్వంతయున్.

గీ॥ వారి పూరమ్ము లేనట్టి బలములేని
సమయములయందు గోష్పాద జలమునందె
మాఘమునఁ గల్యములయందు మానవుండు
స్నానమొనరించినను గలుషమ్ములడఁగు. 18

సీ॥ పాపవిచ్ఛేదినీ! పర్వతనందినీ!
యెట్టిఁగిరైనను మఱియెట్టుఁగక్కైన
మాఘమ్మునందుఁ దామరసాప్తుఁ డుదయించు
నపుడయత్నమ్ముగానైన స్నాన
మేకమేనియుఁజేయ వృజినముల్ నశియించు
నిఁక భక్తితో ఘటియించువాని
పుణ్యాతిశయమును బొగడ శక్యమె విను
మతఁడశ్వమేధ సత్క్రతువుసేయు

గీ॥ వారలొందెడు ఫలమొంది మేరలేని
సంపదలమించి తామరతంపరగుచుఁ
దనకుటుంబమ్ము వర్ధిల్ల ఘనతఁగాంచి
పిదప నథయాధోక్షజ పదముఁజేరు. 19

గీ॥ పార్వతీ! మాఘమాస ప్రభాతములను
స్నానమునుజేసి హరిపూజ సలిపినిమ్న
గాదిక తటమ్ములఁ బురాణమాదరమున
నాలకించినవాఁడు మహర్షియగును. 20

శా॥ మాఘంబందొగి స్నానదాన నరసింహధ్యాన వేదాన్త శా
స్త్రౌఘార్థ శ్రవణంబులేనరుఁడు సేయంబూనఁడో వాని ఘో
రాఘంబుల్ కరణత్రయోద్భవము లత్యంతమ్ము బాధించెడిన్
ద్రాఘిష్ఠస్థితి మాఱు బాము నరుజాతండమ్ములై పార్వతీ. 21

కం॥ కాళీ! తపోమాసోషః, కాలమ్ముల మజ్జనమ్ము గావింపని దు
ర్శీలుఁడు కుంభీపాకో, త్తాలాగ్నిజ్వాలికా విధాతప్తుఁడగున్. 22

కం॥ మానవుఁ డామున మాఘ స్నానంబొనరింపఁడేనిఁ జండాల స్త్రీ
సూనుఁడయి కోటిమాఱులు, తానుద్భవమందుఁ బర్వతప్రియ తనయా!

చ॥ చలినగుభీతి స్త్రీ పురుష జాతుల మాఘమునన్ బ్రభాత వే
ళలజలమందు నెవ్వరు తలల్దగముంచరో వారిఁజూడఁగాఁ

గలిగెడు కల్మషంబులడఁగన్ సరసీరుహమిత్రుఁగాంచి ప్రమొ
క్కులు ఘొనరింపఁగా వలయుఁ గుంజరభంజన వర్యవాహనా! 24

కం॥ బహుయజ్ఞ కర్తనేనను
సహంకృతిఁ దపః ప్రభాతమందు న్స్నానం
బుహిమాద్రిజ యెవఁడుడుగునో
గ్రహింపుమతనిఁ బశుహనన కరణాంత్యజగా. 25

గీ॥ భీతమృగనేత్ర! మాఘ ప్రభాతములను
బాల్యయౌవన వార్ధకావస్థలందె
వండుమువ్మాలు వెలికేగి వారిసిక్తుఁ
డగునొ హరి కృపవాని యఘాళియడఁగు. 26

గీ॥ దృఢతనుండు మాఘస్నాన మెడపకుండఁ
గల్యములఁజేయు టావశ్యకమ్ము గిరిజ!
దాన నూఱుమాఱులు వియద్గంగలోన
స్నానమొనరించు పున్నెమ్ము వానికబ్బు. 27

గీ॥ కటికవాఁడేనియుఁ బ్రమాదకలననైన
స్నానమును మాఘమునఁ జేయువాని పూర్వ
జన్మకృతపాప సంఘముల్ సమసిపోవు
సవితపొడుపునఁ జీకట్లు సమసినట్లు॥ 28

మ॥ అమరీపూజిత! బ్రహ్మహంతయు సురాపాథ్యుండు గుర్వంగనా
గమనుండున్ వసుహారి తత్సఖుఁడు నింకన్ ఘోరదుష్కర్ముఁడున్
గమలాప్తోదయవేళలన్ జరుగు మాఘస్నాన శక్తిన్ మహా
ఘములన్ బాసి కనంగనేర్తురు రమాకాంతేద్ధసాయుజ్యమున్॥ 29

వ॥ మఱియు మహాపాతకాసక్తుల శ్వానమాంసాదులఁ గులహీనులఁ
గ్రూరులఁ గులఘ్నులఁ గష్టులఁ ద్యాగరహితుల వర్జిత నైజ
కర్ములఁ బశుమారకులఁ గృతఘ్నుల నరకాశ్రయుల నసత్యవచ
నుల దాంభికులఁ బరపిండాదుల మిత్రద్రోహుల భ్రూణహత్యా
కరులఁ బరాంగనాలోలురఁ బరార్థ సూచకుల స్వామిద్రోహుల

పంచకుల భ్రూణఘ్నుల మద్యపుల దీనుల సర్వదేవ ద్వేషకుల నాత్మస్తుతి
పరాయణుల ధర్మహానికారుల శఠుల నయోగ్యార్థ నాయకుల సదను
కూల భేదకుల మనోహర ఫలకుసుమ ప్రవాళ విరాజద్ధరాజాత
ఛేదనుల విశ్వాసఘాతుకుల మాయావికలిత వీరుల నకృతాగ్ని
కార్యుల నప్రతిష్ఠుల విప్రప్రయోగానురాగుల గురుద్వేషకుల దంప
త్యంతరాయ విచ్ఛేదకుల గుడిమణియదాయుల భృతకాధ్యాపక
విప్రుల హింసాకారిణుల స్త్రీహావిమోహుల బహిరంగ పాతకుల రహః
పాతకాయకుల జ్ఞానాజ్ఞాన కృత కిల్బిషుల నేవంవిధ బహుపాత
కులంగని మాఘంబున నర్ధసూర్యోదయంబున మాయందు మునిం
గితేని మిమ్ములఁ బరమ పవిత్రులం జేయుమని సర్వజలాశయం
బుల జలంబులు గర్జిల్లుచుండు. 30

ఉ॥ పూరిజనానుషంగతినో చొప్పడునన్య భయానసో పర
ప్రేరణచేతనో స్వమతి ప్రీతిగనో మెఱమెచ్చుగోరియో
సారెకు మాఘకల్యముల స్నానమొనర్చినవాఁడు పార్వతీ!
వారితఘోర పాపుఁడయి తప్పక మోక్ష పదంబుఁ జేరెడిన్. 31

సీ॥ భక్తి మాఘకల్యమ్ముల బహిరుదకము
నందు "స్నానమహంకరిష్యామి" యనుచు
నెవ్వఁడు వచించునో వాని వృజినరాశి
మండి చను నగ్నిచే దూదికొండలట్లు. 32

ఉ॥ మాసములందు మాఘమున మర్త్యులయందు జనార్దనుండు శ్లో
భాసము పేత మూర్తులను భానుఁడు వృక్షములందు రావి వి
ద్యాసమితిన్ శ్రుతుల్ ధరణి దైవము వర్ణములందుఁ గొండలం
దానుమ నోనివాసగిరి యగ్ర్యములై కడుఁ బేరు కెక్కెడిన్. 33

క॥ ఓప్రియ! యెవఁడేనియు మా
ఘప్రత్యూషమున మోహాగతినైన నన
న్యప్రియభక్తి నయినస్నా
నప్రక్రియఁ దీర్చెనేని నష్టాఘుఁడగున్. 34

మ॥ తనకుఁ స్నానమొనర్పఁగాఁడగు తనూదార్ఢ్యమ్ములేకున్న న
న్యునకై నన్ గృతమాఘ మజ్జనునకున్ బూర్ణానుమోదమ్మగా
న్ధనదానం బొనరించి స్నానఫలమున్ గైకొన్న యాతండిహం
బున సౌఖ్యంబులఁ జెంది విష్ణుపదమున్ బొందున్ బరంబందొగిన్.

గీ॥ శీతబాధితమాఘ సుస్నాతులకును
జలి యడంగంగ నీటిపజ్జల నెవండు
కట్టియలు నగ్గిఁ గూర్చి సెగళ్ళు వేయు
నాతఁడును స్నానఫలమొందు హరిణ నయన! 36

క॥ జలములమునింగి చలికిన్, నిలువఁగలే కగ్గిసేవ నెఱపనెడందన్
దలఁపున్న స్నానఫలమున్, జలజాక్షార్పణమొనర్చి సల్పఁగవలయున్॥

గీ॥ బహుకుటుంబికి దారిద్ర్యబాధితునకు
మాఘమజ్జనరతునకే మానవుండు
చలిదొలంగంగ వసన మొసంగువాఁడు
స్నానఫలమొంది తుదకు మోక్షంబుఁ జెందు 38

ఉ॥ సారసనేత్రి! మాఘమున స్నానమొనర్పని మానవున్ బలా
త్కారముగానొ హాస్యగతిగానొ బహిర్జల సన్నిధానమున్
జేరఁగఁ గొంచుఁబోయినను నీటను నాతని తోడమున్గినన్
వారుభయుల్ కడున్ సుకృతవంతులు దాంతులు నౌదురారయన్॥

ఆ॥ వె॥ మందమతిని మాఘమజ్జన మొనరించు
వారికడ్డు సేయు వాఁడు భీత
హరిణలోచనా! మహాపాతకోప పా
తకము లెల్ల నొందుఁ దక్షణంబ॥ 40

చ॥ పెరిమెను దోడఁబుట్టువుల బిడ్డలఁ దల్లులఁ దండ్రులన్న యా
భరణుల మాఘమజ్జన శుభంకరులంగని మజ్జనమ్ము మా
నరెయనువాఁడు ధేనుహననమ్మున నచ్చెడు పాపమొంది భీ
కరనరకమ్మునన్ వెతలఁగాంచు యమాజ్ఞమెయి న్వరాననా!॥ 41

సీ॥ పాపినైన మాఘస్నాన పరునెవండు
బాలిశతనింపసేయునో వాఁడుతప్పక
ఘోరతరమైన రౌరవనారకమునఁ
జేరిపొరమ్ము మీఱుఁగా నేరఁబోఁడు॥ 42

క॥ ఆక్షణముకొలలఁ దొలఁచియు
మోక్షమ్మును జనులకొసఁగి పొగడొందు ప్రయా
గక్షేత్ర తపస్స్నాన స
మృక్షసుకృతమొందుకలదె పృథ్వీధ్రసుతా॥ 43

క॥ బలవంతుఁడు మాఘాంప
మ్ముల వెలినీట సతతమ్ము మునుఁగవలయు దు
ర్బలుఁడు మునుఁగవఁ గడిగికొని
తెలిమిఁ బురాణమ్ము వినిననేని సుకృతుఁడౌ॥ 44

సీ॥ మాఘమజ్జనమున కసమర్థమేని
శక్తిలేనియతండు మాఘప్రభావ
గాథవినినను మజ్జన కర్తగాంచు
నంతపుణ్యమ్ముఁగాంచు హిమాద్రితనయ! 45

సీ॥ మఖముఁపమాఘవ్రత తుల్యమైన
ధర్మమొండొదవదు జగత్త్రయమునందు
దక్షిణాయుతాశ్వమేధ శతప్రకర్త
గనిన ఫలము మాఘవ్రత కర్తగాంచు॥ 46

క॥ మతిమంతుఁడైనఁగానీ
మతిహీనుండైనఁగాని మాఘస్నాన
మ్మతిభక్తిసలిపి మతిశ్రీ
పతిఁదలఁచిన వారిజగమ్ముఁబడయుఁ గడువడిన్ 47

క॥ ఏనయుఁడిట్టి మాఘస్నానమ్మొనరించి వినునో నగరాట్పుత్రీ!
పానిటవానఁ గెడి పున్నము, నేనుఁ దెలిసికొని చెప్ప నేరనుసుమ్మీ॥

క॥ స్నానముసేయునశక్తుం, డేనిఁదపోమాసమెల్ల నేతద్గాథ
నానుపృథభక్తితోవినె, నేనియు వైకుంఠమంను నెఱసుకమంఁదన్

వ॥ అనిచెప్పి మఱియు నిట్లనియె 50

రెండవ అధ్యాయము

క॥ వినువిబుధార్చిత గిరిజా!
మునుమాఘస్నాన మహిమమున హృదయూ శ్రీ
శునితో నొక బ్రాహ్మణనం
దన ముక్తాఘయయి విష్ణుధామముఁజేరెన్॥ 51

చ॥ అనవిని గౌరియిట్లనియె నద్రిని కేతన! యాధరాసుప
ర్వుని సుత యెవ్వరో కలుషపుంజము నెట్టిది చేసెనో తపో
ఘనమహిమంబుచే నెటులు గల్మషపూగ విముక్తినొందెనో
వినుచుము సర్వమన్న వినవే యని శంభుఁడు వల్కెనిట్లియన్ 52

వ॥ చతురంబుధి మేఖలావిడంబిత మహా మహీమండలంబునంగల
అంగ వంగ కళింగ కర్ణాట కేరళ కామరూప గౌడ వనవాస
కుంతల కొంకణ మగధ సౌరాష్ట్ర మాళవ లాట భోజ విరాట
శబర కుకురు కురు అవంతి పాండ్య మద్ర సింహళ ఘూర్జర పారశీక
మిథిల పాంచాల శూరసేన గాంధార బాహ్లీక హైహయ
తౌళవ సాళ్వ పుండ్రక ప్రాగ్జ్యోతిష మత్స్య చేది బర్బర నేపాళ
గౌళ కాశ్మీర కన్యాకుబ్జ విదర్భ ఖురసాణ మహారాష్ట్ర కోసల
కేకయ అహిచ్ఛత్ర త్రిలింగ ప్రయాగ కరహాటక హూణ
కాంభోజ భోజ కాశీ చోళము లనం బరగు నేబదియాఱు దేశం
బులలోఁ బ్రసిద్ధంబైన సకలసంపత్సమృద్ధంబైన సౌరాష్ట్రదేశంబున

—బృందారక పురవర్ణనము—

మ॥ తనరుఁ రూప్య గిరీంద్రహాసక లసత్సౌధాళితో ఖేటజా
త నవాహ్లాదద కేతనాంశుక సముద్యత్స్యంద నౌఘంబుతో
వనధిప్రోద్భవ వాజివారణ సదృగ్వాహేభబృందమ్ముతో
ఘనబృందారక పూర్మతల్లినగరీ గ్రామోత్తమాంగాకృతిన్ 54

సీ॥ కలవందు శూరసంఘమ్ములుకడఁకమై
యెదిరించిహరినైన నదుమఁగలవి
కలవందు నారాసములు చైత్రరథసంద
నమ్ముల పసఁ గ్రిందొనర్పఁ గలవి
కలవందు నాగాసములు మానససరోవ
రాన హేళనము సేయంగఁ గలవి
కలవందు వేశ్యాలయములు నానాదిక
ముల నచ్చరలఁ గేలిసలుపఁ గలవి

గీ॥ కల రచటదాతలాశిబిదధీచిప సములు
కలరచట వేత్తలా శ్రీశుకర్షి నిభులు
కలరచట భక్తులసురేంద్రసుకందుబోంట్లు
కలరచట సాధ్వులాయుమాత్రితలునితులలు.

గీ॥ అచటిపురుషులు విబుధులై నందువలన
నచటిచెల్వ లనిమిషాక్షులైనకతన
దాన హరిభక్తిగుట బృందారకాఖ్య
పురము బృందారకపురమ్ముఁబోలి వెలయు

వ॥ అట్లు సర్వవిధంబుల నెన్నందగిన బృందారకపురమ్మునఁ గ
మ్మని బమ్మకొలమ్మువారిలోఁ దలమానికమ్మగు సుదేవుండు

క॥ బృందారకపుర వాసము
మందరధరభక్తిమగ్న మానసముదియు
న్నందున స్వసుదేవాహ్వాయ
మందఱుసార్థకమై యనఁగనతఁడొప్పారెన్

క॥ అతఁడుయోగ్యాచారో
పేతుం డనవరత మజనపీఠుఁ డామ్నాయ
వార్తార్థతత్త్వవిజ్ఞుఁడు

గీ॥ వేదములనెల్లఁ జదివిన వేరవేలు
శిష్యులతనికి శుశ్రూషఁజేయుచుందు
రందుఁగలయట్టి పరమార్థమనివలన
మదినెఱుఁగఁగోరి యద్రికుమారి ! గౌరి. 60

క॥ అతిథుల నభ్యాగతులను
బ్రతిదివసంబన్నపాన వస్త్రాభరణ
ప్రతతిఁ దనుపుచుగృహమే
ధితండమునఁగీర్తిఁ దత్సుదేవుఁడుగాంచెన్ 61

సాదేవీచరిత్రము

ఉ॥ వానికి నింద్రనీలమణి భాసురదీర్ఘశిరోజయున్ సరో
జాననయున్ బ్రవాళమృదులాధరయున్ దిలపుష్పనాసయున్
మీనసమాననేత్రయు సమిద్ధతటిద్రుచిగాత్రయున్ గరీ
ద్యానయు సింహమధ్యమయునైన తనూభవకద్దుముద్దియా! 62

గీ॥ కుందరదనయు దరహాససుందరాన
నేందుబింబయు సర్వాంగసుందరియును
నగు సుదేవాత్మజకుఁదోచె యౌవనంబు
పుష్పమందు మరందమ్ము పొడమినట్లు. 63

గీ॥ అత్తలోదరి హృదయదౌష్ట్యమ్ము నెల్లఁ
గుంతలమ్ములఁగల్గిన కుటిలతయును
స్తనములంగల్గు బలుపు సూక్ష్మమతులైన
వారికెల్లరకున్ దేటపఱచుచుండె. 64

క॥ లావణ్యము తారుణ్యము
ప్రావీణ్యముగలుగు తనదుపట్టికిఁ బెండ్లిన్
గావించుతలఁపుతోడ సు-
దేవుఁడు తగువరుని భూమిదేవజవరునిన్ 65

క॥ నెమకించుచుండ శిష్యో
త్తముఁడునుమిత్రుండు గుణహితమ్ముగ ఫలముల్

సుమములు సమిధలు దేరవ
నమునకుఁజనుటకు సుదేవనందన గనియెన్ 66

వ॥ అని తండ్రికి జేరి తత్ప్రియశిష్యుండు సుమిత్రుండు సమిత్కుశాది
కంబులకై వనమ్మున కరుగుచుండె, నేనును వానితోఁజని యందలి
యందచందమ్ములఁ గండమ్ములకు విందుగా సందర్శించి వచ్చెదనని
పల్కిన సుదేవుండు పెక్కుతెఱంగుల వలదని వారించియు
నకొక్కమ్ము నెమ్మనమ్మునఁ గ్రమ్మరింపనేరక కుమారికపైఁగల
వాత్సల్యమ్మునఁబోయిరమ్మన నయ్యింతులమేలుబంతి మేలుబంతిన్
గైకొని యాడుచుఁ బాడుచు సుమిత్రునితో నవ్వనంబునఁ
జనుచుండ 67

గీ॥ ఆ సుమిత్రుండు దేశికు నాజ్ఞఁబూని
వనమునన్ జాలదవ్వేగి బహుళవిటపి
పరివృతమ్మగు నవ్వనీభాగమందుఁ
గనెఁ దటాకంబు స్వచ్ఛజీవనయుతంబు. 68

సీ॥ ఆకమలాకరం బరుణాంశు కిరణరో
ధి తరువితాన శోభితతటంబు
పుండరీకారుణాంభోజ కైరవహల్ల
కేందీవరవ్రాత సుందరంబు
శ్రవణానుమోదక ఝంకారకారి మ
త్తాళి సందోహసమావృతంబు
చంచలజ్జలచరాజస్రనిర్భిన్నత
రంగపరంపరా భ్రాజితంబు

గీ॥ శ్రోత్రనివహ మనోహర రుతవిలాస
సంచరజ్జల పక్షిసమంచితంబు
మందగంధవహార్భక మందిరంబు
విహరణాగతప్రాణి సంప్రీతిదంబు 69

వ॥ అట్టికాసారంబు సుమిత్రునితోఁ జనుచున్న సాదేవియుంగని, 70

గీ॥ నాసకుల్లాసమిడు మేలిననలఁ దాల్చి
నోరు నూరించు ఫలముల నారగించి
సారనది వారిఁ గేరెడి నీరుఁ ద్రావి
కమ్మ పూఁబొదల్ పొదలు తీరమ్ముఁ జేరి 71

గీ॥ జంటలై శుకపికములు చక్షురాది
కేంద్రియానందముగ నటియించుచుండ
గనుచు వినుచుంట నామె నెమ్మనము చలన
మొందె సందాటఁ గందర్పుఁ డందె ధనువు. 72

క॥ మారుండా విల్లెక్కిడి, నారిన్ సారించి కుసుమనారాచముఁలా
నారియెదదూర నేసిన, నోరువ నేరక సుమిత్రు నోరగఁ గనుచున్ 73

వ॥ వాని చెంతన్ జేరి పయ్యెర నెపమ్మునఁ బయ్యెద జారవిడుచుచు నొయ్యారంబుగా సవరించుకొనుచు నర్మోక్తులాడుచుఁ జిఱునవ్వుల నవ్వుచుఁ బెక్కు మారవికారంబులు సూపుచుఁ జలింపని సుమిత్రుంగని. 74

సాదేవి తన మారితాపంబార్పుమని సుమిత్రుని వేఁడుట.

ఉ॥ ఓయి సుమిత్ర! దస్రసదృశోజ్జ్వలగాత్ర సుమాంబకాళినా
కాయము గాయముల్సలిపి కాయజుఁ డేచెను సైపనోపనీ
వీయెడ దీనికిన్ దగిన వ్యాత్రిప్రియ దౌషధమొండొసంగి నా
యాయువునిల్పు పున్నియమునందుము పొందుము సౌఖ్యమవ్వలన్ 75

గీ॥ అనిన శివశివ యంచు హస్తాంబుజములఁ
గర్ణములుమూసికొని మహాఘప్రదంబు
లైన వచనమ్ములాడెద వక్కటకట
త్వజ్జనక శిష్యుఁడని యెనదలఁపఁ బోక 76

క॥ గురుపుత్రి! నీకు నే సో, దరుఁడగదా యిట్టులాడఁ దగదిటుఁ డడవృక్
జరుపక పోదముపదమన, గురుఁడాలస్యమ్ము నేయఁ గోపించుఁజమీ 77

క॥ గోవిందుఁడు ధర్మమూర్తి సు
దేవుఁడు సత్సుతవు నీవు ధీయుతవితిహో
సావళిఁబఠియించితి వ
ఘ్యా వచియింపంగఁ దగునె యుదుటున్ బల్కల్ 78

క॥ ఆర్యవినిందితమైన యు,కార్యంబిట మన మొనర్పఁగల్గిన యెడలన్
సూర్యాచంద్రములుండెను,పర్యంతము నరకబాధఁబడవలెనబలా 79

సీ॥ ఘోరఘాతుక జంతుసంచారమైన
గహనమునవింక నుండఁగాఁగాదుమనకు
మనువ! లేపోదమని బ్రతిమాలు నా సు
మిత్రుఁ గడకంటఁజూచు చమ్మోలఁతవలికె 80

సీ॥ పాత్తముల నేనుఁ జదివితిఁబోడముపాప
పుణ్యములెఱింగియుంటి కారుణ్యహృదయ!
ధర "శరీరమాద్యంఖలు ధర్మసాధ
న"మ్మని యెకదా బుధవచనములుగూడ 81

క॥ మారునివిషజాతాస్త్రము లాయాషిణెవంబగిల్చి యంగములోలో
నీఱొనరించెను దసాౕ, కార! కరముఁబట్టికని తగన్మందిమ్మా 82

క॥ గురుదార తారయాత్మే
శ్వరశిష్యుని చంద్రునెనసె బ్రహ్మాత్మజయున్
సురవరునిగలసె మన్మథ
శరానలజ్వాల లోర్వఁజాలక సదయా! 83

క॥ ఏనొక పురుషాధీనను
గానింతకుఁ గన్యనగుట గాంధర్వవిధం
బౌ నిన్నె ముందుఁబతిగా
మానాయనవలనఁ బొందుమార్గముగందున్ 84

మ॥ అనినన్మంచిదిమించుఁబోఁడి మనమిందాలస్యమున్మాని వీ
జనకున్ జేరి తదాజ్ఞదంపతులమై చంచద్విలాసంబులన్

ఘనసౌధాగ్రములన్ మనోహరవనీ ఖండమ్ములన్ సౌఖ్యముల్
గననౌ స్వేచ్ఛగనన్సుమిత్రునుడు లాకర్ణించి యక్కాంతయున్ 85

చ॥ సరిసరి యేమొచెప్పియిట జారుకొనన్ దలపోయుచుంటివి వి
క్కరణిని రిత్తమాటలనె కాలమిఁకన్ ద్రుటిపుచ్చితేని లో
దరికొనుమన్మథాగ్ని నిహత స్ననుజూచెదవీవు బాధదు
ర్భరమగుచో సుమిత్రుఁడది పాపకయోపకఁజూచుచుండునే 86

గీ॥ అనుచు నాదేవి యేమేమొ యారటమునఁ
బలుకుచుండఁగ నిఁకనిందు నిలచుటెల్లఁ
జాపహేతువటంచెంచి బాల! నీవు
రమ్ము రాకుండుమే వేగిరమ్ము చనెద. 87

చ॥ కనుమనిపల్కి యాతఁడరుగన్ దొరకొంటయు నడ్డువోయి య
వ్వనిత వచించె నామృతికిభావములోన సహించియొంటినా
జనకుని జేరితేనిఁ గలుషమ్మెదొనాయెడఁ జేసితంచు మ
జ్జనకుఁడు కోపమూనినను దప్పునె నీకిఁకఁ బాపశాపముల్ 88

వ॥ అదియుంగాక వరవర్ణినీ సువర్ణ రత్నాదికమ్ములు దమకుఁదామై వచ్చుచుండ వలదని తొలంగంద్రోచి చను మూఢునింబలె సద్యస్సంప్రాప్త సౌఖ్యంబుఁ జెఱచికొని స్త్రీహత్యా పాపంబునకును గురుశాపంబునకును బాత్రుండవై యాత్రంబున నరిగెదవైన నొక్కించుక ముందువెనుక లరసి చనుమనుటయు నవ్వటుండు గటకటంబడి తనమనంబున నేను దృఢచిత్తుండనై యీమెకోర్కి నెరవేర్పకపోతినేని సాహసించి ప్రాణత్యాగంబొనర్చి స్త్రీహత్యా పాతకం బంటగట్టినం గట్టు నిక్కడివిధం బిట్టులుండ నీమె నిందె విడచి యొక్కండన సుదేవుంజేర నాతండు నావలనఁ దన నందన మందిరంబునకు రాని కారణంబు వినియు విశ్వసింపక ఘోర శాపంబు నొసంగుటయెకాక ప్రాణాధికఁగాఁదలంచి పెంచుచున్న యేకపుత్రికయందలి ప్రేమం ద్రోయలేక తన్మరణజనిత దుఃఖాతి

లేకంబునఁ దనువుఁదొరంగినం దొరంగుఁ గావున నిట్టి మహా
విపత్తులు జరుగుటకు సమ్మతించుటకంటె నిప్పు డిప్పడంతికోరికిఁ
దీరిచి దానంగల్గు పాపంబుఁ బాపికొనుటకు స్మృత్యుక్త ప్రాయ
శ్చిత్త కర్మంబు లాచరించుకొనుటయె కర్జంబని తలపోయుచుండ
నప్పుడంజయూన హాని వహాన మర్ధాంగీకారంబనియెంచి డగ్గరి
బిగ్గఁగౌఁగిలించుటయు నతండతను ప్రేరణంబునఁ బతిక్రియం బ్రతి
క్రియలాచరించె నంతఁ గంతుశుద్ధాంతంబుంబోని మనోహర
నికుంజంబునఁ బహుళపరిమళాక్రాంత లతాంత పరికల్పితతల్పంబున
నమ్మిథునంబు వివిధ నిధువనంబులం దేలిరి. పదంపడి కొంతవడికి
సుమిత్రుం డుడుపథంబుంగని 89

శా॥ కాంతా! చూడుము వేడితేఁడు మన దుష్కార్యమ్ము వీక్షించియే
యంతేవాసియునొప్పనట్టిపని సేయంజాలి తౌరా సుదే
వాంతేవాసివియై యటంచలుకతో నాలోకనుం జేయుచుం
తంతన్నాతలఁగొట్టమింటినడుచాయన్ దోచె నుగ్రాకృతిన్ 90

ఆ॥ వె॥ అనుచు నాసుమిత్రుఁ డడలి పశ్చాత్తాప
తప్త హృదయుఁడగుటఁ దరుణిఁగాంచి
యించువిల్తుచేత కెద సుంతచింతించి
చిన్ని నగవుతో వచించెనిట్లు 91

ఉ॥ కన్నియవాఁడు కుంతి తన క్రమతనూరుచి మెచ్చికోరనా
యన్నులమిన్న కోరికల నన్నిటిఁ దీర్చినమిత్రుఁడీయెడన్
గన్నులవిల్తుతూపు సెగఁ గాయముతో యముఁజేర్పనున్న యీ
కన్నియ మన్నినిల్పిన సుగాత్రు సుమిత్రునినున్ గలంచునే

గీ॥ అనిన నతఁడనె సర్వసమర్థులు మహి
త ప్రభావాఢ్యులగు దైవతముల కృతుల
కల్పమర్త్యకృత్యమ్ములు పోల్పఁదగునె
నాకలోకంబదెచ్చట నక్కయెచట 93

క॥ ఇదివఱకె వేళమిగిలెను మదిరాక్షీ! వేగ ననుపుమా యంచున్ దా
నదివఱకు సంతరించిన సదమలగుర్వర్థవస్తు సమితిన్ గొంచున్ 94

క॥ సా దేవికూడ రానా. భూదేవకుమారకుండు పోయి గురునకున్
మేదురభక్తిని మ్రొక్కి ఫ, లాదికవన్యమ్ములను సమర్పణచేసెన్ 95

ఉ॥ చేసిన మెచ్చి దీవనలుచేసి సుదేవుఁడు గూఁతుఁజూచి యో
హో సుమకోమలం బయినయట్టిది నీమెయి యెండతాకునన్
గాసిలెఁ బాదముల్ మిగులఁగందెను రాయడవిన్ జరింపర
మ్మా సలిలమ్ములన్ జలకమాడుము సేద యడంగఁబుత్రికా 96

క॥ నీయెడబాటున కెంతయు
మాయమ్మ తపింపఁజొచ్చె మెలఁతుక వేగన్
బోయి కనుపడి పదంపడి
హాయిగ భుజియింపుమనుచు ననిచెన్ దనయన్ 97

వ॥ సుదేవుండట్లు శిష్యుండగు సుమిత్రు నాశీర్వదించియుఁ దన తనయ ననునయించియుఁ బంపి నిజధర్మంబుల నిమగ్నుండయ్యె నంతఁ గొంతకాలంబరిగిన 98

క॥ భూరిశ్రీనొప్పెడు కా, శ్మీరమునుండి యొక వడుగుమిన్నధరా సం
చారంబొనరించుచు బృం, దారకపురిలో సుదేవుధామముఁజేరెన్ 99

ఉ॥ వచ్చినబ్రహ్మచారి కనవద్యచరిత్రున కాతిథేయమున్
హెచ్చినప్రీతితోడ ఘటియించి సుదేవుఁడు వానివిద్దెలన్
మెచ్చి కులమ్ము గోత్రము ననింద్యములౌట యెఱింగి పల్కె నో
సచ్చరితా! మదీయ తనుజాతనొసంగెదఁ బెండ్లియాడుమా 100

గీ॥ నాదుకూఁతురు మేలిగొనాలకిక్క
చీకులకు మూకలకు వేల్పు చెట్టుముక్క
మిసిమిమై చాయ జాళువా పసిడిముక్క
నాతిపిండునఁ జక్కఁదనాలచుక్క 101

వ॥ విద్యావినయ రూప సౌజన్య సౌశీల్యాదుల మత్పుత్రిక నీకుం

దగినయది కాన నో వటూత్తమా! మత్ప్రార్థనం బన్యథాకరింపకు
మనుటయు నతండు సమ్మతించిన సుదేవుండు భార్య కావిషయంబు
చెప్పుచుండ విని సా దేవి వారలంగని 102

గీ॥ నను సుమిత్రునకిడి పరిణయ మొనర్పఁ
దనిన వారట్లుగావించు టనుచితంబుఁ
బాపకరమన సిగ్గుచే బదులుమాట
లుడిగి కాశ్మీర దేశపు వడుగుఁగాంచి 103

శా॥ విద్యాసంపదలుఁ గులమ్ముఁ బితకున్ బ్రీతిన్ ఘటించెన్ గదుఁ
హృద్యాకారముఁ బ్రాయముఁ గలఁడు పేర్మిఁ వీనిఁ బెండ్లాడినన్
సద్యస్స్వర్గసుఖమ్ము గల్గుననుచున్ సంతోషముం జెందె నెం
దాద్యాలాపములిల్పునే మన మదార్ఘ్యంబైనచో వ్యక్తికిఁ 104

సీ॥ అంతఁ గాశ్మీర దేశాగత బ్రాహ్మణ
తనయున కాత్మనందన నొసంగి
మంచిలగ్నమున సమంచితమ్మగు వైభ
వములతో వేద మంత్రములతోడఁ
బరిణయ మొనరించి బంధు బృందముతో సు
దేవుఁ డానందాబ్ధిఁ దేలుచుండఁ
గట్టిన కంకణాల్ కరమున నొప్పారఁ
బసపుబట్టలు మేన బాగుమీఱ

గీ॥ దీక్ష సంపూర్తికాకుండ దినములందె
రోగమున్నొప్పిలేక చేరువ జనముల
చిత్తములు తల్లడిల్ల హఠాత్తుగాఁగఁ
బెండ్లి కొమరుండు గాంచెఁదాఁ బెద్దనిదుర 105

పంచచామరము॥ సుదేవునల్లుఁ డట్టు లీల్గ శోకవార్ధి రాశిలోఁ
దదీయబంధులెల్లమున్గి తల్లడిల్లుచుండఁగాఁ
బదారువన్నె పైఁడిబొమ్మ భంగిఁ బెండ్లి వేడ్కలన్
ముదమ్ముగూర్చు నా సుదేవు పుత్రి బాష్పనేత్రియై. 106

వ॥ గతాసుండై భూతలశయనుండైన పతి చెంగటఁ జేరి శిరమ్ముఁ గరమ్ములఁ గరమ్ము మోదికొనుచుఁ గొప్పమ్మూడి వీడిన నెఱులును బుజమ్మునుండి జారిన పయ్యెదయును ధూళి ధూసరితంబులుగా నేలంబడి పొరలుచు లేచుచుఁ గన్నీరు మున్నీరుగా నిట్లని విలపించె		107

సీ॥ హానాథ! సకలకళానికేతన మన్మ
ధాకార యౌవన ప్రాప్తియపుడె
నీకు నూఱేఁడులు నిండించెనే విధి
నన్నుఁ బెండ్లాడకయున్న నీవు
మరల మీవారల దరిఁజేరి వారికి
సంతోషమిడుదుగా సదయ హృదయ
అగ్ని సమ్ముఖమున "నాతిచరామి" యం
చాడిననుడి కొన్నినాఁడులైన

గీ॥ జరుపకయె యట్టె నను వీడి స్వర్గమునకుఁ
బోవు టుపాటిధర్మమో బుధసమాజ
వినుత నయమార్గనిర్జిత విబుధసచివ!
యించుకంతైన యోజింప కేగఁదగునె		108

ఆ॥వె॥ తాళిఁగట్టు నపుడుఁ దలఁబ్రాలు వోసెడు
నపుడు స్పర్శసౌఖ్య మంతొయింతొ
కనుటవఱకె కాని మనసార నినుఁగూడి
సౌఖ్యమొందు పూజ సలుపనైతి		109

చ॥ అని విలపించుచుం బలుకు నాత్మజపల్కులు నేలఁబడ్డసో
మునకెనయై గతాసుఁడయి భూశయనుండగు నల్లురూపునా
ర్తిని బెనుపంగ నత్తఱి సుదేవుఁడుఁ దత్సతియుఁ దనూజ భూ
మినిబడి యేడ్చుదానిఁ దమమేనులఁజేరిచి పట్టిబిట్టుగన్		110

క॥ వాపోవుచు మాయమ్మా, పాపపువిధినీకుఁ జిన్నిప్రాయమునందే
పాపెఁగద మగనిపొత్తు నిఁకేపగిదిని నీదుజన్మ మీడేరునయో 111

సీ॥ హరినీల రుచిమీఱు కురులఁ దీసినతలఁ
జెల్లనిముసుఁగు గదించుకొనుచు
కుంకుమబొట్టుతోఁ గొనబుగాంచినముద్దు
మోముఁ దమ్మిని బూదిఁ బూసికొనుచు
నవరత్న కనకహార విరాజితగ్రీవ
రుదురక్కపేరుల ప్రోవులిడుచు
హెంబట్టుపుట్టాల నొప్పు నెమ్మెనఁ గో
రాసైనునొగిఁ బెన వేసికొనుచుఁ

గీ॥ కంకణంబుల నిద్దంపుఁ గడియములను
గరముఁదగు కరపదములఁ గంబములటు
చేసికొని పెను వైధవ్య చింతఁగుములు
నిట్టి నినుఁజూచుచుండ మనసెట్లు తల్లి! 112

వ॥ అని పలుతెఱంగులం బలవించుచుండ భిక్షార్థంబు గ్రామంబునం దిరుగు దృఢవ్రతుండను యతివరుం డా రోదనమ్ము విని యటకుం జని మాంగల్య చిహ్నంబులు గల్గి వగలంబొగులు చిన్నికుమారిం బట్టికొని పామరుంబోలి విలపించు సుదేవుంగని బ్రాహ్మణోత్తమా! పండితప్రవర! నీవు పామరునికరణి నేడ్చెదు పాత్రమైన యాపద యేమొ యెఱింగింపు మద్ది తీర్ప సాధ్యమగునేని తీర్చి ముదమ్ముఁ గూర్చెద. 113

దృఢవ్రతుండు సుదేవునకుఁ బత్సృత కథఁ జెప్పుట

క॥ నావిని పదములకెఱఁగి సుదేవుఁడు మాదుఃఖసంహార్తిఁ దొలఁగింపం
గా వచ్చినట్టి నీల, గ్రీఁవుడవే కాక నీవు కేవలయతివే 114

మ॥ యతిచూడామణి! యిద్ది నాసుత వివాహంబేనుగావించితిన్
గతియించెన్ జుమి దీని వల్లభుఁడు దీక్షాపూర్తి గాకుండ స్వ
ర్గతుఁడై భర్తృనిమిత్త మీకలికి దుఃఖంబందఁగాఁ జూచి నా
మతి ధైర్యంబెఱ నేడ్చుచుంటిని మహాత్మా! యాపదుద్ధారకా 115

మ॥ అతి సౌందర్యము మంచిబుద్ధియును విద్యా సంపదల్గల్గు మ
త్సుతకుఁ జిన్నతనమ్మునందె యిటులన్ శోకమ్ము ప్రాప్తింపఁగాఁ
గతమేమో యదిపోవునట్టులొ యెఱుంగన్ దెల్పి మమ్మా విచా
ర తరంగంబులఁ బోవకుండ దరిఁజేర్పన్ భారమున్ బూనుఁడీ 116

క॥ అనుచుం బల్కుసు దేవుని వినయాన్విత వాక్యవితతి వినియతిపతి ధ్యా
న నిమీలితలోచనుఁడై కనియెన్ దద్విప్రతనయ గతకాలంబున్ 117

వ॥ అట్లు తనదివ్యదృష్టిన్ సర్వసమాచారం బెఱింగిసు దేవున్ జూచి 118

క॥ ధాత్రీసురసత్తమ నీ పుత్రిక
ప్రాగ్జన్మమందు పుట్టువుఁగనె స
త్క్షత్రియ గోత్రమ్మున మృదు
గాత్రయు సౌదర్యవిజిత కామాంగనయై 119

గీ॥ అట్లు పుట్టి విదర్భ దేశాధినాథుఁ
బరిణయంబాడి కులటయై పల్లవ ప్ర
బోధమున నొక్కరేయి విభుండు నిద్ర
పోవుచుండఁగఁ గత్తితోఁ బొడిచిచంపె 120

ఉ॥ చంపిన కొంతసేపటికి చాలభయంపడి యేడ్చి ఘోర పా
వంపు స్వకృత్యముం బరులు పారఁగఁ జూచినయట్లులైన దూ
షింపక మానరంచుఁ బతి జీవముఁదీసిన దానిఁబూని బల్
తెంపున నాత్మహత్యయును దీర్చికొనెన్ ధర శీ సురాగ్రణీ 121

గీ॥ అట్లు గతజనిఁ బతిహత్య నాత్మహత్య
నాచరించిన దుష్టాత్మ యాత్మజాత
యయ్యె నీకిప్డు పూర్వ మహోఘమునను
గాంచెనిద్ది వైధవ్య దుఃఖంబునిపుడె 122

గీ॥ అట్టి పాపాత్మురాలు సర్వాభినంద్య
మైన బ్రాహ్మణ వంశంబునందుఁ బుణ్య
మూర్తివగు నీకుఁ దనయగాఁ బుట్టినట్టి
కారణమ్ము వినందగు సూరివర్య 123

సీ॥ ఈ యింతి యింతకుఁబోయిన పదునాలు
గవ జన్మమునను మాఘమ్మునందు
మకరరాశిని నహిమకరుండు వెలుఁగొందు
తఱిని సరస్వతీ తటిని తటిని
నిసుకతో గౌరి రూపెనయించి స్నాతయై
పూజించుచుండెడి పుడమివేల్పు
ముత్తైదువులఁజేరి బత్తిపెంపున నెల
నాళ్లును గన్న పుణ్యంబుకతన
గీ॥ నాదిమంబైన విప్రాన్వ యమ్మునందు
వేద విదుఁడవుఁ గల్మష విరహితుఁడవు
నై వ నీ గర్భమునఁ బుట్టు వండె నివుడు
భూసురస్తుత్య సద్భావ యో సుదేవ! 124

గీ॥ పుణ్యమూర్తికి నీకిట్లు పుట్టికూడఁ
గోలము పెంపును నీపెంపుఁ దలఁపకౌర ?
వనికిఁ జనినప్డు నీదు శిష్యుని సుమిత్రు
ననభిమతుఁ గూడి పాపకార్యంబొనర్చె 125

క॥ ఆ వృజిన మపరిమాణము
గావునఁ బరిణయముజరుగు కాలమ్మునయం
దే వైధవ్యమ్మొదవె ను
దేవా! నీసుతకు నీకు ధృతి విడఁజన్నే 126

క॥ గతవర్తమానజన్మార్జిత సుకృతము దుష్కృతము భుజింపక దేహి
ప్రతతికిఁ దీరునె యిట్టులు ధృతివిడి చింతింపనేల ధీనుతశీలా! 127

గీ॥ పట్టుదలతోడ నెవ్వాఁడు పాపమైనఁ
బుణ్యమైన నత్యుత్కటమ్ముగ నొనర్చు
నో యతండవ్వి తగినట్టు లొసఁగుఫలము
లనుభవించు నాపుట్టువు నందె విప్ర! 128

వ॥ అని దృఢవ్రతుండు నుడివిన 129

క॥ తన తనయ రెండుజాములఁ
బొనరించిన కలుషపుంజములు యతివలనన్
విని చెవులు మూసికొని గిరి
తనయా! యాయతికి మ్రొక్కి ధరణిసురుఁడనెన్ 130

మ॥ యతివర్యుల్ తమబోటిసూరులు కృపా యాదోనిధుల్ నిత్య మా
శ్రిత కష్టంబులఁ బాపి ప్రోతురుగదా చిత్తేశ రాహిత్య మ
త్సుత ఘోరాఘము లెట్లువాయు నెటులొందున్ బ్రాణ మల్లుండుచె
ప్పి తరింపంగ నొనర్పు మార్తి జలధిన్ విశ్వజ్ఞ! వేగంబుగన్ 131

గీ॥ అని సుదేవుండు ప్రార్థింప నాలకించి
పల్కెను దృఢవ్రతుండు నీ పట్టిచేత
మకరమున సూర్యుఁడుండఁగా మాఘు కల్య
ముల నదీ స్నానముల శ్రద్ధఁ జలుపఁజేసి 132

క॥ తీరమున సైకతమ్మున, గౌరింగావించి భక్తి కడలుకొనంగా
నారాధన పదునారుప, చారమ్ములను జరిపింపుసనువాసినిగన్ 133

సీ॥ పదునొకండవ నెలఁ బ్రత్యహమ్మర్థోధ
యమునానదీస్నానమాచరించి
సైకతకృత గౌరి షడ్డశమ్మగు నుప
చార పూజలు పుణ్య సతులఁగూడి
చేసిమ్రొక్కెడి తదాశీస్సులఁగైకొని
తీర్థంబు నాత్మశు దేహమందు
జల్లి నోటను సుంత జారించుచున్న నీ
నందనపాపము ల్నాశనమగు

గీ॥ నల్లునకుఁ బ్రాణములువచ్చు ననఘ! దీన
సంశయం బింతలేదు విచారముడుగు
మనుచు వెండియు నాఘనుం డనుపమాన
మాఘ మాహాత్మ్యముం దెల్పె మధురఫణితి 134

సీ॥ మాఘ శుక్లతృతీయ భూలేఖ తిలక!
మూసివాయన మొక్క సువాసినికిడి
యేడగు ప్రదక్షిణాజ్ఞేసి యిష్టభుక్తిఁ
దనుప నీసుత వితత పాతకములడఁగు 135

గీ॥ మకరమున సూర్యుఁడుండఁగా మాఘమాస
మందు నర్థోదయమున నద్యంబు గాహ
నంబొనర్చ స్త్రీ పురుష జనంబుల కఘ
సమితి నశియించు నేటికి సంశయంబు 136

క॥ మాఘస్నానమ్మొనరిచి
మేఘశ్యామాంగుఁ జక్రి మేదురభక్తిన్
ఏఘనమతి పూజించునొ
యాఘనమతి హరినిజేరు ననఘ! సుదేవా! 137

గీ॥ మాఘకల్యనిమజ్జన మహిమవలన
విధవ గాంచును విధవాంక విశ్వవసతి
సదవగాంచు నాజన్మము సమ్మదమ్ము
భర్తతోఁ బుత్ర పౌత్ర సంపత్తితోడ 138

గీ॥ ద్విజకులజులు మాఘస్నానము జరుపుట య
నుత్తమం బంగనల్సేయు టుత్తమోత్త
మంబు గాన సమస్త కల్మషహారంబుఁ
సకల శోభన సంప్రాప్తి జరుగు విప్ర! 139

సీ॥ పిచ్చివాఁడైన జడుఁడైన వెలఁదియైనఁ
బురుషుఁడైన వేళకు బుద్ధి పుట్టిగాని
మైత్రి బలమునఁగాని దంభమునఁగాని
మాఘమజ్జన మొనరుపం బడయుము క్తి 140

వ॥ అని యిట్లు త్రికాలవేదియు నిగ్రహానుగ్రహ సమర్థుండును సర్వజ్ఞుండు నగు దృఢవ్రత యతివరుండు చెప్పి సుదేవా! త్వరలో

తన కిసుమతి బోధించుట
ననుచితపరుఁడై సుమిత్రుఁడట నేమయ్యెన్ 145

చ॥ తెలుపుఁడటంచు నాసతి నతిం బతికష్టుఁడొనర్ప సర్వమున్
దెలుఁపు వచించె నవ్విధమునన్ గురుఁడైన సుదేవునాజ్ఞచే
వెలలి సుమిత్రుఁ డోర్మిఁ బృథివిన్ జరియించెను గొన్నినాళ్లు వృ
థాఁటకిడె జ్ఞానమొందు మతితో విజితేంద్రియ చిత్తవృత్తితో 146

ఆ॥వె॥ తిరిగి తిరిగి యా సుదేవుని శిష్యుండు
వనములోన గురుని తనయ నెనయు
టను గలిగిన పాప మను తాపమును గూర్చి
యెడఁద బెడఁద నిడఁగ నడలి వడలి 147

చ॥ గురువు సుదేవు శిష్యసురగోవు సదామృదుభావుఁ జూడఁగా
గురువినయమ్మునన్ జని యకుంఠితభక్తిని సాఁగిమ్రొక్కి దు
ర్భరమగు పాతకమ్ము ననుఁ బ్రామికొనెన్ గరుణాబ్ధి! తావకా
దరణాకలమ్ము లేక యెటు దాటఁగవచ్చు మహోఘవార్నిధిన్ 148

సీ॥ అదియెట్టిదన భవదాత్మజ కానకు
నాతోడవచ్చిననాఁడు వనవి
హారమ్ము సల్పుచు మారతాపముఁ జెంది
యా తాపమాప నన్నర్థిఁ గోరఁ
దగదు ఘోరాఘప్రదమ్మని నే నెంత
మాన్పిన వినక యమ్మందగమన
నీవు నాకోర్కిని నెరవేర్పవేని నే
నిందె చచ్చెద నెట్టులేని యనుచు

గీ॥ సాహసమొనర్చుటయు నీమె సమసె నేని
తనయ మృతి దుఃఖమున మీరు తనువు విడుతు
రనుచుఁ జింతించి పాప కార్యమ్ముఁ జేసి
నాఁడఁ గరుణింపుఁడని చరణములఁబడియె 149

క॥ పతితగు ప్రాయశ్చిత్తము
నొనువుగ నని వేడ నతఁడును బదాక్రాంతుఁడై
నడుగఁ దన శిష్యుఁ గనుఁ బ్రే
ముఱి తేరఁ గఁ జేసి దైన్యమును బాపి యనెన్ 150

సీ॥ శిష్యా! నీ కయి నీవు చేసిన యఘమ్ము నా
గాము నే స్మృతి వ్రత యతి స్వామి వలన
నెఱిఁగియుంటిని మున్నె పరేచ్ఛ వలనఁ
గలిగిన యఘమ్ము వోవు మార్గమ్ము వినుము 151

ఉ॥ ఏ కొలలైన దవ్వునను యేయము వేసు దలంచినంతఁ బెం
జీఁకటి వేఁడి వెల్గుఁ గని చెల్లినయట్లు లడంగు వాఁక క
న్నాకయి ముజ్జగమ్ములఁ గనంబడు నేయము యట్టి వేల్పు నా
వాఁకకుఁ బోయి యొడ్డుపది పై దుగయానల కందుమున్గుచున్ 152

క॥ తీరమున నిల్చి యఘ సంహారకుఁడౌ శౌరిఁ గూర్చి యతిఘోరతపం
బోరిమిఁ జేసిన నీకగు, దారుణమగు నీదు వృజినతంతము శిష్యా 153

క॥ అనిన విని యామిత్రుఁడు
తన గురుచరణముల కెఱఁగి తదనుజ్ఞ శిరం
బునఁ దాల్చి జాహ్నవీ ద
ర్శనకౌతూహలముతోడఁ జనఁ జననొకచోన్ 154

మ॥ భగవత్పూజకు యోగ్యమైన సుమముల్ పత్రంబులుం బండు లె
చ్చుగ సంధించు మనోహరాగములతో శుద్ధాంబు సంపూర్ణ సౌ
భగనద్యాళులతో గతస్వరిపుతా భ్రాజిష్ణు సత్త్వాళితోఁ పూగం
బగు దివ్యాశ్రమమున్ మహోజ్జ్వలిత మేతమ్ముఖ్య ప్రభావాఢ్యమున్ 155

ఉ॥ వేకువ లేచి కాలుటడవిన్ గడుఁగ స్తిని గన్న తండు మే
ల్కాఁకను మాఘమజ్జనము లంబొనరించి సుశిష్య యుక్తులై
శ్రీకమనున్ ఖగేంద్రమను స్నిగ్ధమనున్ దమిఁ బూజ సేయుచుం
బ్రాకట మాఘమాసమహిమన్నిని మోదిలు మానులం గనెన్ 156

క॥ కని మ్రొక్కి మానవపాలా ర! నేమమున మీరు సేయు వ్రతమెయ్యది దీ
నినాదవ్రుషలమేమిటి చెప్పుమి పూజనమొయిద్ది వేఁడువాఁడఁ దెలుపుఁడీ 157

సీ॥ శిష్యుఁడగు నాకు మీరలు సేయుచున్న
పాపనాశక వ్రతవిధిఁ బరమకరుణ
నెఱుఁగఁ జెప్పుడు విని తరియించువాఁడఁ
బాపవార్ధినుండి మునిప్రపబష్పులార! 158

క॥ అని శరణ్యంబాచరించు సుమిత్రునివచనమ్ములనుమునివరుల్విని మోద
మ్మున సత్యవ్రతముని చంద్రుని నియమించిరతనికదినుడువఁగా రీ! 159

ఉ॥ సువ్రతకీర్తి లైన మునిసోములచే నియమింపఁబడ్డ స
త్యవ్రతుఁడా సుమిత్రుఁగని ధారుణి దేవకుమార! ఘోర పా
పవ్రజతూలశుక్తి మనుభప్రద సంస్కృతిజాతశుక్తమ
స్త్రీనికరోదయమ్ము విను తెల్పెద మాఘమహాత్మ్య సత్వముల్ 160

సత్యవ్రతుండు సుమిత్రునకు మాఘమహిమఁ జెప్పుట.

గీ॥ మాఘమాసవ్రతమ్మెప్డు మానులెల్లఁ
జేయుచున్నారలిది యఘశ్రేణినడఁచు
మృగగుఁడై సూర్యుఁడుండఁగా నెవఁ డుషస్సు
స్నానమొనరించు నతఁడు కేశవ హితుండు 161

క॥ ఉదయము మాఘస్నాన
మ్మొదీర్చి జలజదళ నేత్రుఁబూజించి వృష
ప్రద మాఘమహిమవినుచు నె
ల దినమ్ములుగడపువాఁడు లక్ష్మీశుఁగనున్ 162

గీ॥ సత్య శౌచమ్ములనువీడి సతతమాత్మ
సంస్తుతియుఁ బరనిందయు సలుపువాఁడు
మాఘమజ్జనమొనరింప మానువాఁడు
బహు ఘాతకుఁడనిచెప్పఁ బడు సుమిత్ర! 163

గీ॥ ఎప్పుడనృత సాక్ష్యమె వచియించువాఁడు
ఖరశ్మశీలోలుఁ డాచార విరహితుండు

మాఘమజ్జన మొనరింప మానువాఁడు
బ్రహ్మఘాతుకుఁడని చెప్పఁబడు సుమిత్ర! 164

గీ॥ కన్యకా హయవిక్రేత ఘనతటాక
సేతు క్షేత్ర యారామ విచ్ఛేత్తవ్యసన
సక్తహృదయుండు మాఘమజ్జనవిముఖుఁడు
బ్రహ్మఘాతుకుఁడని చెప్పఁబడు సుమిత్ర 165

గీ॥ దేవతాద్రవ్యహర్తయు ద్విజవరులకు
నిచ్చినధనమ్ము మరల గ్రహించువాఁడు
మాఘ సుస్నానమును మాను మానవుండు
స్వర్ణతస్కరుఁడని చెప్పఁబడు సుమిత్ర! 166

గీ॥ బ్రాహ్మణులతోడ గురులతో వైరమూను
నాతఁడాత్మసంస్తోత్ర పరాయణుండు
మాఘసుస్నానమును మాను మానవుండు
స్వర్ణతస్కరుఁడని చెప్పఁబడుసుమిత్ర! 167

గీ॥ ఇతర పితృశేషభోజి సంస్కృతివిరహిత
కబళభోజియు నుచ్ఛిష్టకబళభోజి
మాఘసద్వ్రత మొనరింప మానువాఁడు
భర్మతస్కరుఁడని చెప్పఁబడుసుమిత్ర! 168

గీ॥ మొదలనిచ్చెదనని చెప్పి పుడమివేలు
పులకు నాసఁగల్గించి యవ్వలను లేద
నెడు నతఁడు మాఘమజ్జనముడుగునతఁడు
మద్యపాయియటంచనంబడు సుమిత్ర! 169

గీ॥ పరకళత్రాభిలాషి సోదరకళత్ర
రతుఁడు గురుభోగకామినీరతుఁడుఁ గష్టి
మాఘసుస్నానమునుమాను మానవుండు
దేశికద్రోహినాఁబడు ద్విజకుమార! 170

సీ॥ కరపమునకా దర్భ శేసట్టి ధరణిసురుఁడు
సతిముఁ జండాలుతో గోష్ఠి సలుపు ద్విజుఁడు
మాఘ సద్వ్రత మొనరింప మానువాఁడు
తదనుషక్త పాతకి నాఁగఁదగు సుమిత్ర! 171

గీ॥ అంత్యజుని కంకరపము ముట్టైనచాన
పలుకు లాలించుచు భుజించు బ్రాహ్మణుండు
మాఘ సద్వ్రత మొనరింప మానువాఁడు
తదనుషక్త పాతకి నాఁగఁదగు సుమిత్ర! 172

సీ॥ దుష్టసాంగత్యకరణ కుతూహలుండు
వేదహీన కుగ్రామనివేశనుండు
మాఘసద్వ్రత మొనరింప మానువాఁడు
తదనుషక్త పాతకి నాఁగఁదగు సుమిత్ర! 173

గీ॥ బ్రహ్మహత్య సురాపాన భర్మహరణ
గురుసతీరతి మఱిపీని జరుపువారి
మైత్రి యనయెడి పంచకల్మషములైన
మాఘమజ్జనమాత్ర భస్మమగు విప్ర! 174

గీ॥ పడుగులును వివాహమ్ములు వ్రతములును బు
రాణ సంశ్రవణాది ధర్మములు సెఱుచు
వాఁడు మాఘవ్రతమ్మును వీడువాఁడు
పశువిఘాతుకుఁడని చెప్పఁబడు సుమిత్ర! 175

గీ॥ శరణుచొచ్చినవారిని జంపువాఁడు
సర్వ తీర్థమ్ములను నిందసలుపువాఁడు
మాఘసద్వ్రత మొనరింప మానువాఁడు
భ్రూణహంత యనంబడు బుధులచేత 176

గీ॥ శ్రాద్ధములు పితృయజ్ఞముల్ జరుపకుండ
విడుచువాఁడు సద్భార్యను విడుచువాఁడు

గళితశీలుండు త్యక్త మాఘవ్రతుండు
ధేనుహంతనాఁబడును సుదేవశిష్య! 177

గీ॥ ఉదయమున లేచి పితృ మాతృ పదపయోజ
ములకు మ్రొక్కి సౌఖ్యంబును గలుగఁజేయ
కరితేఁగొనువాఁడు మాఘ ధర్మరహితుండు
గోవిఘాతుకుఁడౌను సుదేవశిష్య! 178

గీ॥ మాఘ సద్వ్రతమొనరింప మానువాని
కొదవు పంచమహాపాత కోపపాత
కములుఁ దత్తుల్యములు క్షుద్ర కల్మషములు
నాదిగా ధాత్రిఁగల్గిన యఘముల్లె 179

ఆ॥ వె॥ మాఘమొనర్చునిద్ది మాఘవ్రతము సర్వ
కలుషహరము పుణ్యకరము దీనిఁ
జేయునట్టివాఁడు పాయు మహాఘోర
పాతకములనుండి పాపభీత! 180

క॥ హరితుష్టికొఱకు నర్యుం
డఱపొడమెడు నెడను మాఘమం దవగాహం
బును నిష్ఠఁజరిపి హరిపూ
జ రచించునతండు తురగ సవఫలమొందుక్ 181

గీ॥ మాఘమునకు దేవుండయి మాఘ సద్వ్ర
తఫల మిచ్చునతఁడు దైత్య దమనుఁడౌట
మాఘమున సల్పవలె మధు మధనుపూజ
మాఘ సద్వ్రతాసక్తుఁడౌ మానవుండు 182

క॥ ఎవఁడు తపోమాసమ్మున
రవిపొడుపున నేటమునిఁగి రమయేలిక మే
లివితులఁ దులసీదళముల
సవిధిగఁబూజించు నతఁడు సంగరహితుఁడౌ 183

సీ॥ మాఘకల్పమున నిమ్నగ మజ్జనముసల్పి
తత్తీరమున శేషతల్పునిల్పి
తులసీదళమ్ముల లలితపుష్పమ్ముల
నర్చించి ధూపదీపాది షోడ
శోపచారమ్ముల నొనరించి సమయోచి
తపదార్థముల నివేదనముచేసి
హరిహరిమాఘమాహాత్మ్య మాకర్ణించి
శక్తికొలంది ద్విజవ్రతతికి

గీ॥ నన్నవస్త్రసువర్ణ ధేన్వాదిదాన
ములనొసఁగి దినమ్మొకపూటభక్తిసల్పి
నియతుఁడయి దమయుతుఁడయి నెలదినములు
సేయవలె మాఘ సువ్రతమోయివిప్ర 184

ఉ॥ మాసముసాంతమౌతఁజేని మాధవతృప్తికి శక్తికిం దగ
భూసురభూసురీనివహముల్ ముదమొందఁగనన్నదాన ము
ల్లాసముతోడఁజేయుట యిలాసుర శేఖర! స్నానకర్తకుణ్
వాసినిగూర్చి తద్వ్రతమునం బరిపూర్ణ ఫలమ్ముదార్చెడిణ్ 185

గీ॥ ఇట్లుమాఘవ్రతము హరితృప్తికొఱకు
సలుపువారికి యమభీతి కలుమభీతి
యింద్రియవ్యథశోకంబుఁ బృథివి మరల
జన్మమొందుటకలుగవో జన్నిగట్ట! 186

క॥ ఇదిమాఘవ్రతమీావు వి
నఁదలంచుటనీకుఁ జెప్పినాఁడఁజుమీా మూఁ
డుదినమ్ములుమాఘమ్మునఁ
గొదవడె స్నానములు సల్పుకొమ్మీానదిలోణ్ 187

క॥ కత్యాయనతనయ! యీాక్రియ
సత్యవ్రతుఁడెయుఁగఁదెల్ప శ్రద్ధన్విని దు

షట్కృత్యము గురుసుతహారమున
వాత్రిత్యునివలెఁ దాసలిపినభంగియునవలన్ 188

క॥ గురునకుస్వాఘము దెల్పిన
గురువర్యుఁడు పాపనిష్కృతికొాజుకున్ జనకున్
గురుకరుణనాజ్ఞయిచ్చిన
తెరవు సుమిత్రుండుదెల్పెఁ జెల్లముగ విననన్ 189

వ॥ విని సత్యవ్రతుండిట్లనియె 190

గీ॥ మూఁడుదినములు మాఘశోషములమునింగి
హరినిబూజించి మాఘమహాత్మ్యమువిని
నంతనే సర్వపాపమ్ము లంతమొందుఁ
గాన ననుమానమునుమాని తానమాఘు 191

క॥ పిమ్మట గురూక్తముగుమా
ర్గమ్మున సకలప్రదాత్రి గంగకరిగి ఘో
రమ్మగు తపమొనరుప జ
న్మమ్ము జరామరణములువినష్టమ్ములగున్ 192

క॥ అనిసత్యవ్రతుఁడెటిఁగిం
చిన పలుకులువిని సుదేవశిష్యుఁడు మాఘం
బున మిగిలినమూన్నాళ్లా
మునులఁగలసి నదిని మునిఁగి ముక్తాఘుండై 193

వ॥ సత్యవ్రతాది మునిప్రకాండులకు దండప్రణామంబులాచరించి తదా శీరనుజ్ఞలంగొని భాగీరథీతీరమ్మునఁజేరి యాత్రశ్రమమ్మునఁగల్పించుకొని స్నానసంధ్యావందనాదిక నిత్యకృత్యమ్ములం దీర్చికొనుచు వశీకృత హృషీకుండై శీతోష్ణమ్ములగణింపక నాసాగ్రన్యస్తదృష్టితోనిశ్చల మనస్కుండై దుస్తరంబైన తపంబుఁజేయుచు 194

గీ॥ శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గయుక్త
తుర్భుజుభుజంగశయను జతుర్దశభువ

నాథినాయకు బుధచయారాధనీయు
దితిసుతకృతాంతు సతము నామతిఁదలంతు 195

సీ॥ మేఘసన్నిభగాత్రు లక్ష్మీకళత్రు
భక్తమయచేలుఁబోషిత భక్తజాలు
కౌస్తుభోజ్జ్వలవక్షు శ్రీకరకటాక్షు
మానిహృదయనిశాంతు నామదిఁదలంతు 196

గీ॥ గౌతమీపాతకమడంచి కరివరేణ్యు
శత్రువుంద్రుంచి సాధులసత్కరించి
యలయజామీళు దుర్నిరయము హరించి
మన్చినట్టి రమాకాంతు మదిఁ దలంతు 197

క॥ అనిమనమునహరిఁబొగడుచు ననుపమతపమాచరించు నతనిప్రభావ
మ్మునెచట నెప్పఁడెవఁడువాకొనశక్తుఁడుగాన రాఁడుకుధరకుమారీ 198

క॥ ఈవిధినిసుమిత్రుండును దేవుఁడుఁజెప్పినటు గంగతీరమ్మున నం
హోవిదళన మాఘవ్రతపావనుఁడైతపమునసల్పె బంద్రెండేడుల్ 199

గీ॥ మాధవప్రీతికరమైన మాఘ సువ్ర
తమ్ముఁజేయుచు ద్వాదశాబ్దములు తపము
సలిపి దళితాఘుఁడై శేషశయనుదయను
మోక్షమొందె సుమిత్రుండు దక్షతనయ 200

గీ॥ దేవి! నీకోరినట్లు సుదేవుశిష్యు
చరితఁదెల్పితి నీకథ దురితహరము
మాఘమజ్జనపరుఁడౌ కమాటువినిన
నేడుతరముల పితలతో నెనయుముక్తి 201

క॥ ఈకథభయభక్తులతో నో? కాకున్నఁ బరబాధనోమఱియెటులే.
నాకర్ణించినవాఁడును జేకొనుతన్మాఘఫలముఁజెందునఘమ్ముల్ 202

క॥ హరిభక్తిమయము పాతక
హరము తపోమాసమహిమ మతిమాహాత్మత నే

నరుఁడాలింపఁడో యాతఁడు
పోరినంధతమో నరకముఁబొందు శుభాంగీ! 203

గీ॥ దక్షపుత్రి! ఛందోరహితమగు మంత్ర
వర్య మోంకారరహితతపమ్ము మాఘ
మహిమఁజెప్పనిధర్మమ్ము నిహపరములఁ
దార్పఁగాలేక తుదకు వ్యర్థమ్ములగును 204

4 అధ్యాయము

క॥ ఇహమున నృహరిగృహమునఁ
మహాప్రభువరత్వమొసఁగు మాఘస్నాన
ప్రహితకథ మఱియుఁజెప్పెద
మిహికాద్రికుమారి! వినుసమాహితమతివై 205

గీ॥ మాఘమజ్జనపరుఁడై నమానవుండు
మాఘశుద్ధదశమినాఁ డమంటభక్తి
లక్ష్మినారాయణువ్రతమ్ము లలితగతిని
జేసినట్టులైనఁ బ్రియుఁడౌను సిరిమగనికి 206

వ॥ అనిన హైమవతి యిట్లనియె 207

క॥ ఓరాజమకుట! లక్ష్మీనారాయణు సవ్రతమ్మొనర్పఁగనెవి చే
కూరుపవలెవిధియెట్టిది శ్రీరమణునిపూజయెట్లుసేయఁగవలయున్ 208

శంకరుఁడు పార్వతికి లక్ష్మీనారాయణవ్రతవిధి చెప్పుట

గీ॥ తెలుపుమనశంకరుండిట్లు పలుకఁదొడఁగె
మాఘమున శుద్ధదశమిఁ దిగ్మకరుఁ డుదయ
మగుచునుండ స్నానమొనర్చి యావగా త
టమ్మునవో యింటనో మంటపమ్మమర్చి 209

ఆ॥వె॥ గోమయమ్ముతోడ నామంటపమునలికి
పంచవర్ణరంగవల్లిఁ దీర్చి
యష్టదళపయోజ మదిస్వస్తికావర
ణముగ మంటపమ్ము నడుమవ్రాసి 210

క॥ నానాపుష్పఫలముల వితానాదికముల నలంకృతమ్మొనరిచియా
పై నవకలశమ్ము సుజల సూనఫల యుతమ్మునిల్పి సుస్థిరభక్తిన్ 211

క॥ మానితచేలమ్మిడి ల
క్ష్మీనారాయణుని ప్రతిమఁజేరిచి భక్తి
జ్ఞానమ్ములఁ గల్పోక్తవి
ధానమ్ములఁ బూజసేయఁదగును దదీశున్ 212

ఆ॥వె పీఠమధ్యమునను బ్రీతి సాలగ్రామ
శిలను నిల్పి బత్తిసెంగలింప
నమృతపంచకమున నామ్నాయవేదులఁ
గలసి స్నానవిధిని సలుపవలయు 213

సీ॥ స్నానమ్ము దుగ్ధపాథోనిధాననివాసి
కంబరం బష్టాపదాంబరునకు
యజ్ఞోపవీతంబు సుజ్ఞానదాతకు
గంధంబు వనమాలికాగళునకుఁ
బ్రసవంబు బిసరుహావాసినీనేతకు
ధూపంబు పావకోద్దీపకునకు
దీపంబు భాస్కరతేజోవిరాజికి
నైవేద్యమఖిల విశ్వావనునకుఁ

గీ॥ దమ్ములము సుముఖునకుఁ బ్రదక్షిణమ్ము
విష్ణునకు జోత నరసింహవిభునకు జప
మారఘుపతి కోంకారాదికాక్షరత్ర
యాత్మకమ్మగు మంత్రాన నమరుపఁదగు 214

క॥ తులసీదళముల మృదు సుమ
ముల నగరునుచందనములఁ బూజించి పరీ
మళమిళిత ధూపదీపము
లలఘువిలాసములనొసఁగి యధికశ్రద్ధన్ 215

వ॥ స్వాదురసభరిత బహువిధఫలమ్ములును, క్షీరాన్నాపూపాదినానా భక్ష్య భోజ్య లేహ్య పానీయోపేత శాల్యోదనంబును మహానైవేద్యం బొనర్పవలయు 216

క॥ పిమ్మటను దామ్రపాత్ర జ
లమ్మున సకలాదితిజ నిలయునకు హారిక
ర్ఘ్యమ్ము నొసంగన్వలయును
సమ్మదమునవ్రతము సేయు జనుఁడద్రిసుతా 217

ఆ॥వె॥ ఇట్లొనర్చి దేవ! యేనిన్నుఁగూర్చి కా
వించుచున్నవ్రతము నంచితమగు
ఫలమునొందఁజేసి భవబంధమునుగోసి
నన్నుఁబ్రోవుమన్న వెన్నుఁడోము 218

గీ॥ మాఘమజ్జనాసక్తుఁడౌ మానవుండు
బంధుమిత్రులఁగూడి సద్భక్తితోడఁ
దండులము లుప్పు గుడము మొదలగువస్తు
వులను ద్విజులకు దానమీవలయు గిరిజ! 219

క॥ వ్రతమునసమాప్తముగా సా
క్షతకరుఁడయి మాఘమహిమఁ జక్రియెదుటఁద
ద్వ్రతకర్త భక్తిభావా
న్వితుఁడై వినవలయు సభ్యబృందముతోడన్ 220

వ॥ అటుమీఁద శక్తికొలంది బ్రాహ్మణులకుభోజనంబిడిసత్కరింపవలయు నివ్విధంబున మాఘస్నానపరుండు తన్మాఘశుద్ధ దశమీదినంబున లక్ష్మీనారాయణవ్రతంబొనర్చి నేనిఁ దత్ఫలంబునఁ బూర్వజన్మకృత మహాదుష్కృతంబులు మేరుమందరతుందిలంబులైనను నగ్నికణం బున భస్మంబులగు దూదిగుట్టలట్టు తుదిముట్టనశించు. మఱియు నీ లక్ష్మీనారాయణవ్రతంబు సేయఁదలంపుగలిగియు ధనలోపంబున జరుప నోపనివానికి ధనసహాయంబొనర్చు నుదారునకు నేతద్వ్ర

తంబౌనర్చనం గలుగుఫలంబు సిద్ధించుననిచెప్పిపూలిగట్టు రాచూలి
కిట్టులనియె 221

క॥ మేనకసుత! పూర్వము ల
క్ష్మీనారాయణుని వ్రతసమీక్షణమున దు
ర్మానిజనిమాని యొక భూ
జాని మొదలిమేనిపోలు పెసంగ వెలింగెన్ 222

ఉ॥ నావిని మ్రొక్కి గౌరి ఫణినాథవిభూషణ! శంకరా! మహా
దేవ! సుభావ! యావసుమతీపతి యెవ్వఁడొ మత్తచిత్తుఁడై
యేవృజినంబుఁజేసి జనియించెనొ దుర్భరనీచయోనిఁ దా
నావలనెట్లు ముక్తిగనె నంతయుఁదెల్పుఁడటంచు వేఁడినన్ 223

మ॥ శర్వుఁడప్పుడు చెప్పసాగెను స్వాదుభాషణశీలుఁడై
సర్వశాస్త్ర విశారదుండును సర్వభూతదయాళుఁడున్
గర్వదూరుఁడు ధీరుఁ డాశ్రితకల్పభూరు డుదారుఁడీ
యుర్విఁ గౌతమనామునిసత్తముఁడొప్పెఁ బూర్వముఖర్వుఁడై 224

గౌతమముని లక్ష్మీనారాయణవ్రతము సేయుట

క॥ ఆగౌతమ ముని నిర్గత రాగులు సువిధేయులు పడరాతివిజేతల్
ధీగురులగు ననుచరజనపూగము శిష్యవ్రజమ్ము మొగిసేవింపన్ 225

గీ॥ తీర్థసంసేవఁజేయుచుఁ దిరిగితిరిగి
మాఘ మేతెంచుసరికి నిమ్నగలతెగల
రాణి నగహారిణిని కృష్ణవేణిఁజేరి
తత్తటమున నాశ్రమముఁ గ్రొత్తగ ఘటించి 226

గీ॥ అందు శిష్యానుచరులతో నధివసించి
ప్రొద్దుపొడుపునఁ గృష్ణలో మునిఁగి పిదపఁ
జెంగటంగల యొక రావిచెట్టుమొదల
భుజగశాయికి భక్తితోఁ బూజసలిపి 227

వ॥ తన్ననుసరించు శిష్యప్రముఖులకు మాఘమాహాత్మ్యంబు విశదీక
రించుచుఁ బ్రతిదినమును స్నానం బొనర్చి దినంబులు గడపినంత 228

గీ॥ దశమియే తేర నశ్వత్థతరువు మొదల
మండపము వేసి పూవులుం బత్రములు ఫ
లమ్ములాదిగఁగూర్చి యలంకరించి
నహుమ వేసినతమ్మి శ్రీనాథునిల్పి 229

క॥ గౌతముఁడు శిష్యసంయుతుఁడై తామరసాక్షు పూజ లతిశయభక్తి
స్ఫీతాత్ముండై చేసెడు, నాతటి నొక వేపిచేరె నటకభిముఖియై 230

క॥ చేరిహరిపూజఁజూచుచు, నారావికిఁగొంచెమెడము నందున్న శునిన్
సారాచారుఁడు గౌతమ ధారుణిసురున్నాజ్ఞ శిష్యతతిదండములన్ 231

మ॥ కరయుగ్మంబులఁ బట్టి కొట్టిమిగులం గారింప భీతిల్లి యు
త్తరముం దారి యనంతరమ్ము విబుధేంద్రస్థానముం బట్టి యం
త రవిప్రోద్భవు దిక్కుకెక్కి యవల న్బాశ్యాశకున్ జేరి చూ
డ్కిరమానాథుని పూజలన్నిలిపియుండెం గుక్కపెన్మక్కువన్ 232

మ॥ తిరుగన్ దానినిజూచి గౌతముని యంతేవాసులెంతేని భీ
కరదండంబుల మోదుచుండ నిలువంగాలేక తొల్లింటివై
ఖరిగా నుత్తరపూర్వ దక్షిణములుం గాఁజుట్టినమ్రాస్యమై
వరుణాశన్ ద్విరదాశనావనిరుహ ప్రాంతమ్మునం జేరినన్ 233

వ॥ మరల నయ్యంతేవాసులు డాసి గాసింబరుపఁ దాళంజాలని యా
శునకం బెప్పటిచొప్పున వలగొని వచ్చియయ్యశ్వత్థంబున కెదురుగా
యథాస్థానంబున నిల్చినఁ దత్క్షణంబ — 234

వేఁగరథ మహారాజ చరిత్రము

సీ॥ పూర్వపర్వతముపైఁ బొడచూపు రవినా శి
రమ్మున మణికిరీటమ్ము వెలుఁగ
రాకానిశా చక్రవాకారి జోకను
గళకళలాడు వక్త్రము సెలంగ
సుమచాప రత్నపీఠమువోలి తారహా
ర విరాజితాయతోరస్సు దనర

శుండాల తుండాల ఖండాలమును నవ్వ
నాజాను బాహాద్వయంబు గ్రాల
గీ॥ వెడఁద కన్నులు శ్రీమించు వీనుదోయి
నూనమగుకొను కాననౌ మేనునెసఁగఁ
జూచువారికి నద్భుత స్ఫూర్తిగాఁగ
నిలచె శ్వానంబు రాజన్య తిలకుఁడగుచు 235

శా॥ ఆమాడ్కిన్ నృపరూప మబ్బినయతం డత్యంత సద్భక్తితో
ఛ్ఛామక్త్యోత్తముఁడైన గౌతముని పాదాంభోజము ల్సోకఁగా
భూమిన్సాఁగిలి మ్రొక్కెఁగాంచనమణీ ప్రోద్యత్కిరీట ప్రభా
స్తోమంబుల్ ముని నేత్రపద్మయికి నచ్చోఁగ్రొత్త సొంపీయఁగన్ 236

కం॥ ఆశ్చర్యము తద్విధము విపశ్చిద్వందితుఁడు మౌనివరమేశుడు దా
నిశ్చల దృష్టింగని యంభశ్చరకేతన సమాను మహితజ్ఞానున్ 237

చ॥ కరములు వట్టిలెమ్మనన నఖండవిధేయత లేచినిల్వ నో
పురుషవరేణ్య! కింపురుష పూరుష నేతవా? వృత్రజేతవో
నరుఁడవొ కిన్నరుండవొకొ నాగవరుండవొ చందురుండవో
సురవర పుత్రకుండవొ త్రిశూల్యవిలోకిత దర్పకుండవో 238

చ॥ తెలుపుము వేల్పులన్మిగులు తేజునవొప్పెడినీకు నక్కటా
యలుపపు కుక్కరూపెటుల నబ్బినదో కలలిబ్బి నమ్మిమై
దెలియక యెట్టిదోసముల తెట్టెలు బెట్టిద మూనిచెట్టవై
సలిపితి వొక్కొ యెల్లపుడు సాదుల బీసలనేద లేదొకో 239

వ॥ అని తన చరిత్రంబెఱుంగనెంచి యడిగిన గౌతమమునివరునకు
నరనాయకుండు మ్రొక్కి వినయమ్మున నిట్లనియె. 240

చ॥ మునివర! చంద్రవంశమునఁ బుట్టితి వేగరథాభిధానముం
గొనితిని వంగదేశమునకుం బతినైతి శ్రుతిస్మృతీతిహా
స నివహానూక్త ధర్మము లజస్రము సల్పితి వింటబదంటనై
యొనసితిఁ గిరితిం బ్రజల నేలితి బిడ్డలఁ దండ్రికైవడిన్ 241

క॥ గోవసుధా ఘృతగుడములు
నావులుఁ గనకమ్ము వెండి నూత్నాంబర ధా
న్యావళి లవణములని పది
యై వెలసిన దానములు మదాచరితమ్ముల్ 242

చ॥ కనకము వెండి రత్నములు గన్యలు మావులు నావులావులున్
ఘనతర కావ్యముల్ కరులు గ్రామములున్ గృహముల్ పొలాలుస్యం
దనములుఁ బల్లకీలు శయనమ్ములు ఛత్రములంచుఁ బేరుఁగాం
చినపదునాఱుదానమ్ములు సేసితి భాసుర భూసురాళికిన్ 243

చ॥ సతతము నన్నదానములు సల్పితి వేసవులం దగత్యమై
న తలములన్ బ్రపాతతి జనమ్ము సుఖంపడ సంఘటించితిన్
గ్రతువులు పెక్కు సేసితి నరాతులచే నరిఁగొంటి సద్యశో
లతికలఁ బెంపొనర్చితిఁ దులాపురుషాదిక దానకర్తనై 244

గీ॥ బావులును జెఱ్వులును ద్రవ్వఁబడియె విప్ర
గణమునకు దేవతలకిండ్లు గట్టఁబడియె
వనులు వేయంగఁబడెఁ గృతుల్ గొనఁగఁబడియె
ధనము నిలదాఁచి సప్త సంతతినిఁగంటి 245

వ॥ మఱియు మహర్షిప్రోక్తధర్మంబులెల్ల నాచరించితింగాని తుట్టతుదకు
నాకెట్టును దుర్గతి దప్పదయ్యె దానికింగారణంబువినుండు 246

శా॥ సర్వజ్ఞుండు మునిప్రపూజితుఁడు గృష్ణధ్యానభస్మీకృతా
ఖర్వాఘౌఘుఁడు కామముఖ్య రిపుషట్కవ్రాత విధ్వంసి సా
పర్వాత్మాధరధీరుఁ డార్యజనకల్పక్ష్మాజాతమ్ము శ్రీ
శర్వోపమ్యుఁడు పైంగలర్షి యొక ఘస్రమ్మందు విచ్చేసినన్ 247

పైంగల మహర్షి నేగరథునికడకు వచ్చుట.

ఆ॥ ఆమహర్షిరాక నాలించి యెదురేగి, దండవత్ప్రణామతతి నొనర్చి
యర్ఘ్యపాద్యవిధులనతిభక్తిఁబూజించి యుక్తపీఠిఁగూరుచుండఁజేసి 248

ఉ॥ ఓ మునినాథ! మీపద పయోజపరాగముచేత మద్గృహం
బేముఁ బవిత్రమైతి మిపుడిచ్చటికిన్ శ్రమమెల్ల సైచియున్

దామరుదెంచు కారణము నాకెఱిఁగింపుఁడు దానిఁదీర్చి యీ
భూమిని మానవుండనయి పుట్టువుగన్న ఫలమ్ముఁ గాంచెదన్ 249

క॥ అని విన్నవింప నాతఁ, డనఘా! యజ్ఞార్థమర్థమర్థింపఁగ నే
జనుదెంచినాఁడననఁగా, వినియు త్తతినిత్తుఁగొనుఁడువి త్తంబన్నన్ 250

క॥ పైంగలుఁడు హృష్టుఁడయి న
న్నుంగని ప్రశ్నించి నేను నుడువఁగఁ దా రా
జ్యాంగవిధానము దానము
లుం గూరిమి విని కృపావిలోకనుఁడగుచున్ 251

చ॥ పలికె నృపాల! నీదు పరిపాలన శీలన దానధర్మముల్
తెలియఁగవింటిఁ గంటిని మదిన్ముదమెంతయుదాన నెప్పుడు
ఖలులగు వారికిన్ దెలుపఁగాఁదగనట్టిది మాఘధర్మమేఁ
దెలుపఁగఁబూనుకొంటి సుకృతి ప్రవరుండగు నీకునర్మిలిన్ 252

గీ॥ మకరమున సూర్యుఁడుండఁగా మాఘమాస
మున నుదయముల రవి యఱ పాదమునపుడు
తానమొనరించి తన్మహాత్త్వంబువినుము
దాన దానవవైరి సంస్థానమబ్బు 253

గీ॥ ఎవఁడు మాఘమునన్ రవి యించుకంత
పాదమునెడ స్నానమొనరించు భూప! వాఁడు
తైర్థికులు నన్నదాతలు ధర్మరతులు
నశ్వమేధులు గను ఫలాలందు నెందు 254

సీ॥ మాఘమ్మునందు మార్తాండవాసరయుక్త
సప్తమినైన దశమినినైనఁ
బ్రత్యూష వేళ నెవ్వఁడు స్నానమొనరించు
నాతఁడుహరియింట నధివసించు
మఱియుఁబూర్ణిమనాఁడు మజ్జనమును సేయు
వాని యేనకకోటి భస్మమౌను

ప్రతిపదాదిగను ముప్పది మాఘదినముల
నొక్కనాఁడేనిఁ బ్రత్యూషమునందు

గీ॥ స్నానమొనరింపఁబూనని మానవాధ
ముండు మృతుఁడయి కడజాతిఁబుట్టుచుండుఁ
జలికి భయమంది మాఘ మజ్జనముమాను
నుత్తముండేనిఁ జండాలయోనిఁబుట్టు 255

క॥ కానఁ బరకర్మంబులు
పోనాడి తపఃప్రభాతముల బహిరుదక
స్నానము చేయుము యముభయ
మేనాడును గలుగఁబోదు పృథ్వీరమణా! 256

చ॥ అని యిటునాకు మోక్షపద మబ్బగఁ జెప్పిన పైంగలోక్తులన్
విని నరకప్రదంబు లతినింద్యము లేననినట్టి వాక్యముల్
మునివర! విన్మ నేనపుడు మూర్ఖతఁ బైంగలుఁజూచి ధీనిధీ!
పౌనరుపఁజాల మాఘమునఁ బ్రొద్దున నే చలినీటస్నానముల్ 257

ఉ॥ దానము లెన్నియైన వసుధాసురవర్యుల కిత్తుఁగాని నే
స్నానము శీతలోదమున సల్పఁగఁజాలను గ్రీష్మమందె యు
ష్ణోప్ణ నెటులోర్తు మాఘమున సూర్యుఁడు పుట్టెడు వేళఁ జేయఁగాఁ
గానఁ దపోనిమజ్జనసుకర్తవుఁ గమ్మని చెప్పఁబోకుడీ 258

గీ॥ మకరమే సున్నగాఁ జేయు మానవులను
దానచలిగాలి సోఁకుచుండానఁ బీకు
వానితోఁగూడుకొన్న మాఘాన స్నాన
ముదయముల నేటఁగావింప మనరులున్నె 259

క॥ ప్రాణములఁదీయు మాఘ
స్నానముఁ గావింప మేనునాశనమైపో
నేనేమి పున్నె మొనరుతుఁ
గానతపస్స్నానమునకుఁగడఁగ మునీంద్రా! 260

వ॥ అని యిట్లు మాఘధర్మంబుల నాదరింపక పలుకు నాపలుకులు విని పైంగల మునిపుంగవుండు నిమేషంబైన నందుండక కడురయంబునం జనుచుండ నేనును గూడంజని మహాత్మా! తమరిట్లకాలంబున ననేకకంబులం గొనక వెడలిన నాకును నా రాజ్యంబునకును హాని సంభవించుంగాన మద్గృహమ్మున భుజించి యజ్ఞమ్మునకు వలసిన ధనమ్ముం గొని చనుండని వినయ వినమిత శిరస్కుండనై బహువిధంబులం బ్రార్థింప నెట్టకేలకు వలయు విత్తంబుం మాత్రము గొని స్వాశ్రమమ్మునకరిగె నంతఁ గొంతకాలమ్మునకు 261

క॥ మృతుఁడనయి నరకబాధలు
వితతంబుగఁ గుడిచి పెక్కువేలేఁడులకా
పితృపతి సంత్యక్తుఁడనై
క్షితికింజనుదెంచి సిగ్గుచేటుగ నకటా 262

క॥ రాసభ జాతిజన్మము
భూసురవర! మూఁడుమాఱ్లు పొంది వ్యథా సం
త్రాసమ్ములు గని యొంతయుఁ
గాసింబడిపిదప శ్వానగర్భమునందున్ 263

క॥ ఇరువదినాలుగుమాఱులు
పోఁబొరి జన్మించి పూటపూటఁ గడుపు క
క్కురితికినై యింటింట
న్దూరఁబడి పడినాడ మేనునొగులంగ దెబ్బల్ 264

వ॥ అట్టి నాకు 265

మ॥ తుదకీనాటికిఁ గుక్కమేన్వదలె సంతోషంబు నిండారఁగా
నొదవె న్మానవదేహమేమన మదీయోదంత మార్యా! భవ
ద్వాద నాలోకనజాత భాగ్యమిదికాదా కానిచో హేతు వె
య్యదియో తెల్పు మనల్ప కల్పఫల సాక్షాపమ్యాద మోక్షార్తులన్ 266

గీ॥ చెప్పఁగలవార లీరాట చెప్పఁడెల్ల
నేను విని చేయవలసిన దేదియైనఁ

గలిగనేని ఘటించి యఘమ్ముఁ బాసి
పూతచరితుండ నయ్యెద గౌతమర్షి! 2

చ॥ అను నరనాథువాక్యముల కచ్చెరువొంది ముహూర్తకాలమా
మునిపతి ధ్యానమున్నిలిపి భూధవుగాథ సమస్తమేర్పడన్
మనమున నాకళించికొని మానిని! పార్వతి! వీతపాతకున్
ఘను ఘనదాను వేగరఘుఁగాంచి వచించెను గౌతముండిటుల్ 2

ఉ॥ పైంగలమాని నీకెఱుఁగఁబల్కిన వైఖరి మాఘధర్మమె
న్నంగడు నుత్తమం బఘవినాశక మవ్యయ లోకదంబు రా
సింగము యట్టిదాని నిరసించుటచేత జుగుప్సితాతినీ
చాంగక జంతుగర్భముల నందఁగఁగల్గెను బాములామెయిన్ 2

సీ॥ మనుజేంద్ర! యీనాఁడు మాఘశుద్ధదశమి
యాటఁ గృష్ణానది నాత్మశిష్య
సహితుండనై యుపస్నానమ్ముఁగావించి
తటమున నశ్వత్థ తరువుక్రింద
మంటపమ్ము ఘటించి మధ్యలక్ష్మీయుక్త
నారాయణుని నిల్పి భూరిభక్తిఁ
బూజఁగావించుచో ముందు శ్వానంబుంట
దురితప్రదంబని తోఁచి నేను

గీ॥ శిష్యులకుఁ దెల్ప వారునిం జేరి తరుమ
వలయముగఁ దిర్గి యెప్పటితలముఁ జేరి
తట్లు బెదరించుటలు భయమందినీవు
తిరిగివచ్చుటల్ ముమ్మాఱు జరిగెనిందు 2

గీ॥ మాఘదశమిని మాచేయు మాధవ వ్ర
తమ్ముఁగాంచుట శిష్యబాధలకు నిలువఁ
జెల్లమిం దిర్గుటలు ప్రదక్షిణములగుట
శునితనువుఁబోయి మానవ తనువుఁబొసఁగె 2

వ॥ కావున నీకిప్పటికి మాఘస్నాన తిరస్కారపాతకంబు నశించె నిప్పు డైన నీకృష్ణవేణీ పావనజలంబుల మాఘస్నానంబొనరింపుము 272

క॥ దానన్ గతజన్మోపాత్తైనఃకోటులు నశించు నెన్నటికిని జ
న్మానకు రాఁబోనిహరి, స్థానావాసంబుగల్గు జనపాలమణీ! 273

సీ॥ కనుక నీతునకెద బీతుఁ గొనక నీవు
మాధవప్రీతికరమైన మాఘ మజ్జ
నంబు బహిరుదకంబున నంబుజాప్తు
నుదయ వేళను గావింపు ముల్లసమున 274

ఉ॥ భూతలనేత కీవిధిఁ దపోమహింబునఁగల్గు చిత్రముల్
గౌతమమౌని చెప్పనెడఁ గత్యయనాత్మజ! పిప్పలకుమా
జాతము తొఱ్ఱనుండి పెలుచన్ ధరపైఁబడి యొక్కకప్ప చిం
తాతుము లాంతరంగమునఁ దన్మునిచెంగటి నేలకుంజనెన్ 275

వ॥ చని కనుల నీరుగార్చుచుండ 276

ప్రజ్ఞాముని భార్యచరిత్రము

శా॥ ఆరీతింద్రుటి యేగఁ జూపరుల కత్యాశ్చర్య మేపార శా
లూరాకారము మాఱి మారునతనూలోపంబుఁ బాపంగఁ గాం
తారమ్మందుఁ దపస్వయైన రతినా నారం దయార్ద్రైనమేల్
చీరన్నెమ్మెయి యొప్పనిల్చె మునిరాజీవాక్షి దాక్షాయణీ! 277

సీ॥ అటులు సర్వాంగసుందరయైన మౌని
పత్ని త్రపచేతఁ దలవంచి పయఁటచేలఁ
జక్క సవరించుకొని ముని చరణములకు
జోత లొనరించి పుడమినిఁ జూచుచుండె 278

ఉ॥ గౌతముఁ డప్పుడట్లు తమ కన్నులముందటఁ గప్పగా ధరా
జాతము తొఱ్ఱనుండిపడి చక్కనితాపసి పెండ్లమౌటకున్
జేతమునందు నచ్చెరువుఁజెందుచు నమ్మని కొమ్మఁగాంచి కం
జాతదళాక్షి! నీవదలి స్వస్థతఁదెల్పుము నీచరిత్రమున్ 279

శా॥ శ్రీకాంతామణినా సులక్షణములం జెల్వొందునీ కల్పమౌ
భేకాకారమదేమి పాపకృతి నచ్చెన్ రావిపెన్దొఱ్ఱలో

నీకావాసమదెట్లు గల్గె నిపుడీనిస్తుల్య మాంగల్య కాం
తాకారం బెటులబ్బె నబ్బురముమాస్వాంతమ్మునలం గ్రమ్మెడిన్ 280

సీ॥ పూర్ణచంద్రుని గ్రమ్మి ముదురుచీకటి పౌజు
తేజన మీాజె నీదేహమందు
సంపంగివిరిం జేరి చంచరీకశ్రేణి
కాంతుల నీనె నీగాత్రమందు
గంకీరవము పజ్జ గజరాజకుంభముల్
వృద్ధిఁగాంచెను నీశరీరమందుఁ
నేనుంగుచేఁజిక్కి యెఱ్ఱదామరపూవు
తావుల నమరె నీతనువునందు

గీ॥ నిట్టి చిట్టిలపెట్టైవె నట్టినీవు
జాతివైరంబుఁ బాపఁజాల్ సత్తపస్వి
చానవైనట్లుతోఁచె నీ చరితమింక
శంకవిడనాడి నుడువు మజ్జాతగంధి 281

క॥ ఆతీరున గౌతమముని, నేతవలన నడుగఁబడిన నెలఁత తదీశా
జాతజ్ఞానమ్మునఁ దన, భూతచరిత్రమ్ము సర్వముం దెలిసికొనెన్

వ॥ అని శివుం డుమకుం జెప్పినచొప్పున సూతుండు శౌనకాదులకుం జెప్పె.

శా॥ దైత్యధ్వంసి పవిత్ర పజ్జలజనిత్యధ్యాన సద్భక్త సాం
గత్యా! గత్యనుబోధి దుర్భరమహా ఘధ్వాంత మాఘవ్రతా
దిత్యా! దిత్యధినాథతుల్య విబుధాతిస్తుత్య ధర్మామరా
మాత్యా! మత్యనుకూలశిష్యయుత రామామాత్య! మాత్యాశ్రితా! 284

— గద్యము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర పతదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ, వినయప్రధానభూషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబునఁ బ్రథమాశ్వాసము.

# మాఘపురాణము

## ద్వితీయాశ్వాసము

క॥ శ్రీలక్ష్మీనరసింహప, దాలంబి మనోంబుజాత! హారహారహరి
వ్యాళవర సురపకరిప, ప్రాలేయ సుకీర్తిసాంద్ర! రామకవీంద్రా! 1

వ॥ అవధరింపుమట్లు కైలాసంబునఁ బార్వతికిఁ బరమేశ్వరుండెఱింగించిన తెఱంగున నైమిశారణ్య శరణ్యులగు శౌనకాది మాన్యాగ్రగణ్యుల కఖిల పురాణకథా కథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె నవ్విధంబున గౌతమతపస్వి దివ్యవదనారవిందావలోకన మహత్త్వంబుచేఁ దనగతకాల చరిత్రంబు దెలిసికొనిన ప్రజ్ఞామౌని మానిని యమ్మహాత్మునకు జోహారుగావించి

### 5 అధ్యాయము

ప్రజ్ఞామునిభార్య తనకథను గౌతమునకుఁ జెప్పుట

క॥ ఓ మహితచరిత! సంయమి, సోముండగు జ్ఞానసిద్ధి సుకుమారిని ప్రజ్ఞా మునివర్యునిభార్యను, మేముంట కవేరజా సమీపవనమునన్ 3

క॥ నాపతి సర్వజ్ఞుఁడు మాత, పాపుంతుఁ బరోపకార పారీణుఁడు వి
ద్యాపరపరమేష్ఠి కృపా, కూపారుండాత్మవేత్త గురుశీలుండున్ 4

క॥ సతతము నతిథుల నభ్యాగతులనతుల గతులఁ దృప్తిఁగావించును శి
ష్యతతిని శ్రుతిస్మృతుల సన్నుతులంగావించు గౌతమమునిప్రవరా! 5

సీ॥ ఏమెయినైనఁ గోపమన నెట్టిదియో యెఱుఁగండుసుండు ప్ర
జ్ఞాముని వానికిన్ దివసనాథుఁడు దోఁచినమీద లేచి పెన్
సోమరినై గృహక్రియలు సూడక మేనికలంకృతుల్ గడున్
బ్రేముడి నాచరించుకొను నేను గళత్రమనైతి దుర్విధిన్ 6

వ॥ ఏ నట్టి మందమతినైనను మహాత్ముండైన నామగండు వయ భయంబుల ననుదినంబు నాకువలయు జ్ఞానంబు గఱపుచుఁ గావేరీ నద్యుత్తర తీరంబున నాశ్రమంబు నిర్మించుకొని తపంబు సేయుచుండ నొకపరి మాఘ మాసంబరుదెంచుటయు 7

ఉ॥ కారుణికాత్మ! నామగఁడు కల్యమునన్ వెసలేచి నిద్దురన్
గూరెడు నన్ను లేపి ప్రియ! కోమలి! మాఘము వచ్చెఁగాన కా
వేరికి స్నానమున్ సలుప వెళ్లెద నిల్పుతిశుద్ధిచేసి వి
స్తారతరాఘమాఱుటకు స్నానమొనర్పఁగ రమ్ముచయ్యనన్　　8

క॥ అని నన్ను లేపి నాపతి, చనినన్ నేసెజ్జవీడఁ జాలకయున్నన్
దినమణియుదయించెడులో, ననస్నానంబాచరించినావిభుఁడొయ్యన్

ఆ॥వె॥ వచ్చి కసరి లేపఁ దచ్చనలాడుచు
నగలు బొగలుఁగా గృహమ్ముదుడిచి
యలికి ముగ్గువెట్ట నాతండుఁ దత్కాల
కృత్యములను నాచరించుచుండు　　10

వ॥ ఇట్లు కొన్ని దినంబు లరుగఁ బ్రథమపక్షంబున సప్తిసప్తక వాసర యుక్త సప్తమి వచ్చుటయు నాటి వేకువ నామగండు నిద్దురలేచి నన్ను లేపి నేఁడైన వేగంబ గృహశుద్ధింగావించి నాతోవచ్చి కావేరీ నీరంబుల స్నానంబొనరింపుము త్వత్కృతజన్మాంతరపాతక వ్రాతంబు విఘాతంబగు నంతట తన్నదీతీరంబున మత్కృత మంటపమ్ము గోమయంబున నలికి పంచవర్ణ చూర్ణంబులతో స్వస్తి కాదుల రచింపుము.　　11

సీ॥ అందు లక్ష్మీయుతుండైన నారాయణు
　　　నిలిపి నేఁబూజింప నీవు వేడ్కఁ
బంచభక్ష్యోపేత పాకంబుగావించి
　　　కొని తెచ్చి ధూపదీప నికరముల
నర్పింపు నైవేద్యమైన యాపిమ్మట
　　　మంగళహారతింబాడి నన్నుఁ
జేరి నాతోఁ బ్రదక్షిణ నమస్కారము
　　　ల్గావించి త్రిముహూర్తకాలమైన
గీ॥ మాఘమాహాత్మ్య మాలించి మాధవాంఘ్రి
కమల విమలోదకంబులఁ గాంచఁబాన

మాచరింపుము హరినామ మాత్మయందు
స్మరణమొనరింపు మతిభక్తి జలజనయన! 12

సీ॥ ఈవిధంబున మూఁడునాళ్లని మాఘ
మజ్జనముసల్పి కామరుణ్మత్సరాది
కముల వర్జించి భక్తి మాఘవ్రతమ్మి
నాచరింపుము హరిపదమబ్బునీకు 13

క॥ అని బోధించెడి ప్రాణేశునిగని యెవ్వారలైనఁజూచిరె మాఘం
బును డస్ఫలమునుదద్దేవుని దత్స్నానమున బాధవొందుటదక్క 14

సీ॥ చండాంశుఁడుదయించి జామైననేకాని
పర్ణశాలనువీడి బైటికేగఁ
జాలను మధ్యాహ్న సమయమ్మైననుగూడ
సలసల క్రాగెడి జలముఁగాని
మొదలిపైఁ బోసికోనోప నోవల్లభ
యట్టి నేనా మాఘమందుఁ గల్య
సమయమ్మైన నదీ జలములమునుఁగుట
లేటిమాటలు భరియింపరాని

గీ॥ శీతబాధకుఁ బ్రాణముల్ చెల్లుకొనినఁ
జేయువున్నంబదేమి మీ రెప్పినట్లు
మాఘమున మజ్జనము మూఁడుమార్లు నేను
సలుపఁజాలను జాలను జాలనాథ 15

క॥ అను నామాటలు వినియు
య్యానఘుఁడు బహుపుణ్యదివసమగు నీనాఁడై
నను మాఘోషస్నానము
నను గూడి పౌనర్ప్రరమ్ము నవలాయనినన్ 16

గీ॥ ఏటిలో స్నానమనుమాట లేటికేను
బ్రొద్దుపొడుపునఁ జలినీట మునుఁగుటట్టు
లుండఁ గాలైనఁదడియుట కోర్వనోర్వ
ననెదు నాపెడనుడులకమ్మునివరుండు 17

వ॥ కడుంగనలి 18

గీ॥ ఎట్టి సద్బోధయును జెవినిడక ధర్మ
విముఖుఁడగు పుత్రు బ్రాహ్మణ ద్వేషమూను
భూపవశ్యుని నప్రియాలాపయైన
భార్యనప్పుడె దండింపవలయుననుచు 19

క॥ పాతకరూపిణి చలికిన్, భీతిలు నీవిపుడె కృష్ణవేణీతటిని
శ్శీతము జలరహితము శాఖాతుందిలముచలదళము గలదద్దానన్ 20

వ॥ పెనుతొఱ్ఱగల దండుఁగప్పవై పడియుండుమని శపించినఁ దచ్చా
పాంజన భంజిత మధాంధ్యనై గడగడవడఁకుచు నా యొడయని
యడుగులపయింబడి 21

క॥ శాంతినిశాంతా! కరుణా, వంతా! స్వాశ్రిత సమూహ పాతకగాఢ
ధ్వాంతనవభానుమంతా! కాంతా! సుస్వాంతనిభృతకమలాకాంతా!

క॥ సోమరినై చలిబాధకు, నేమాత్రంబోర్వలేమి నెదురాడిన న
న్నీమాడ్కి శపించితివి, యేమందుక మగుచు నెట్టులుందుదయాబ్ధీ 23

క॥ కోమలి నబలను భార్యను, భూమిసురోత్తంసహింసపానరింపక గ
ణ్యామల కరుణాన్వితమతి, నామందూకతను బాపు నలినభవాభా 24

వ॥ అని బహువిధంబులం బ్రార్థించుచు నా కన్నీటందడిసిన తన పదం
బులు వదలని నన్ను నెట్టకేలకుం గరుణార్ద్రదృష్టిం జూచుచు 25

గీ॥ తరుణిరో మాఘమున శుద్ధదశమినాఁడు
శిష్యులకు మాఘ మహిమంబు సెప్పువాని
గౌతముని నీవుగనుట తత్కథితకథను
వినుట యేనాఁడొ శాపంబు వీడునాఁడె 26

క॥ లేమా! లెమ్మనిచనియెను, నామగఁడేటికిని మజ్జనమ్మొనరింపం
గా మునివర! నాకప్పుడె, స్వామికొనెం గప్పరూపు రమణీత్వమతెన్ 27

గీ॥ కలికి రూపమ్ముగోల్పోయి కప్పరూపు
గాంచి యొగురుచు నెగురుచుఁ గలిపయు తిన

ములకు నీ రావితొఱ్ఱ లోపలికివచ్చి
యుంటి నిచ్చోట నాగతి కున్నరనుచు 28

ఉ॥ ధాతనుబోలుభక్త లపితమ్ముఁదలంచుచు నెన్నఁడబ్బునో
గౌతమమౌని దర్శనము కర్ణములెప్పుడు తద్వచః పరి
ష్యాత సుధానుపానమునఁ జొక్కునొ నీచము నిందితమ్మునౌ
యీతనువెప్డుపోయి మతియెన్నఁడు స్వాకృతిఁ గాంచుదానవో 29

క॥ అశ్వత్థకోటరస్థక నశ్వరమానమున నుందు నాగౌతమ మౌ
నీశ్వరదర్శనమెటులగు శాశ్వతమోనాకు ఛేకజన్మమెయనుచున్ 30

సీ॥ ఎంతయేనియు నెదఁ దపియించుచుండఁ
గడచె నరుణోదయాల్ గోటికన్నఁ బెచ్చు
నేటికబ్బెను మీనుడుల్ నెమ్మివినఁగ
మిము విలోకింప మత్స్యరూపము వహింప 31

కం॥ ఉత్థితకరుణా! యిచటఁగ, పిత్తాదిఫలావనీజ వితతి వెలయ న
శ్వత్థము క్రిందనె దైత్యజ, నోత్థానవిదారి పూజ యొనరుప నేలా 32

క॥ కోటరమునుండి కదలెను, పాటియు సత్వంబులేని ప్లవరూపననున్
మేటికృపఁబోవఁగా నీ, నాఁటికిఁ దమకిట్టి బుద్ధినాటంబోలున్ 33

సీ॥ మునివర! యటంచుఁ దనదైన పూర్వచరిత
విన్నవించిన యయ్యుస్ని మిన్నఁగాంచి
గౌతముఁడునవ్వి యిట్లు పల్కుందొడంగె
నాలకింపుము ప్రాలేయశైలతనయ! 34

చ॥ ఓమగువా! మహాత్ముఁడు పరోన్నతిఁగోరెడివాఁడు చూడఁగా
నీమగఁడట్టివాని నవనీతసమాన సుమానసంబయో
సామవచోవిదూరవును జాల్మవునౌ భవదీయమూర్ఖతన్
భూమిధరారి శత్రుమయి పొందఁగఁజేసెను నిన్ను దుర్గతిన్ 35

ఉ॥ కప్పకునీటియం దునికికల్గిన నాఁకలి దప్పి నుంతయున్
ముప్పునొనర్పలేవనియు భూరుహా నిమ్నుతమందు నైనచోఁ

జొప్పడ వన్నపానములు సోయము వాయునటంచునెంచి ని
న్నిప్పగిదిన్ శపించె జలజేక్షణ! నీపతి వేత్తగావునన్ 36

ఉ॥ భూరుహనిష్కుటమ్మునను బొక్కుచు స్రుక్కుచుఁ జెక్కలేఁడు లా
హారము నీరముం దొరక కత్యధికవ్యథనుంటకంటె నా
హార మెదేని యబ్బునిరయంపు నివాసము వాసిగాదె పం
కేరుహపత్రనేత్ర! పరికించిశపించె భవద్విభుండునిన్ 37

గీ॥ జలచరములెల్ల మాఘ మాసమ్మునందు
సహజముగ నీటనుంట మోక్షమ్ముఁగాంచుఁ
గాన నీటనివాసమ్ము గలుగనీక
శుష్కతరుకోటరమ్మునఁ జొనిపెనిన్ను 38

గీ॥ చలికి భయమంది పతిమాట సలుపవౌట
నుర్విజము తొఱ్ఱఁ గప్పవై యుండవలసె
మాఘ సుస్నానవిముఖ కల్మషమువలన
నాత్మమలభోజివౌ చిట్టు లడలవలసె 39

క॥ పతిమాటనుజవదాటక, పతిసేవలు సేయుచుండి పాతివ్రత్యాం
చితయగుసతిగాంచును శ్రీపతినిలయమ్మిహసుఖమ్ముఁబద్మదళాక్షీ! 40

గీ॥ ప్రాణనాథుఁ దిరస్కారమాచరించి
తాస్వతంత్రించి యెట్టివ్రతమ్ములెట్టి
పున్నెములుచేసినను బెద్ద బొరియవడిన
కడవలోనీరువోసిన కరణిఁగాదె 41

క॥ పతియే పుణ్యక్షేత్రము, పతియే గురుమూర్తి ప్రాణపతియే లక్ష్మీ
పతి పతియే హైమవతీపతి, పతియే విశ్వస్రష్టు పడతులకెపుడున్ 42

క॥ పతివాక్యమాదరింపని, యతివ యితరసుకృత వితతి నందదుసిద్ధిన్
బతినివిడనాడిస్వేచ్ఛగ, క్షితిఁదిరిగినకొమ్మనరకగేహయెనుమ్మా 43

గీ॥ రమణుపదములు గడిగి తదమలజలము
సతముఁదలఁదాల్చి త్రావినసతికి గంగ

ముమ్నగానన్ని నదులలో మునుఁగుఫలముఁ
గోటిచాంద్రాయణఫలమ్ముఁ గూడఁగల్గు 44

క॥ పతిలేనిమగువ గుణునను,మతివడసియుఁగాని పతిని మతినిడుకొనిగా
నితతాఘాభ్రేఁదలింపఁగ,వ్రతములు సేయంగవలయు వనితాభక్తిన్ 45

వ॥ సతికిఁబతినిమించిన విశేషంబెప్పుడెచ్చట నేమియులేదు నీ వెంకెత
నంబ నిన్నింతకాలంబు ఘోరనరకాధికంబైన యాతరుకోటరం
బున బాధలనుభవింపంజేసె నిప్పుడు పుణ్యప్రదంబైన మాఘశుద్ధ
దశమీదినంబున మత్కృత లక్ష్మీనారాయణవ్రతం బీక్షించి
మదుక్త మాఘమాహాత్మ్యంబు వినుటవలన నీ సర్వపాతకమ్ములు
నశించి తొల్లింటి నీరమణీయ రమణీరూపంబు నీవులభించెఁ గావున
నింకనైనఁ జలికి భయంపడక 46

ఉ॥ ఏనసులార్చు మాఘమున నిందుముఖీ! చలికోర్చి కృష్ణవే
ణీనది నిర్మలాంబువుల నిత్యమహర్ముఖమందు భక్తితో
స్నానముసేయుమా సుకృతసంపదచేనెనలేని విష్ణుసం
స్థాననివాసమబ్బు సతతమ్ము సుఖమ్ము. గరమ్ము చేకురున్ 47

క॥ ఆఁడుదియైనను మఱి మగ
వాఁడైనను మాఘమునఁ బ్రభాతమ్మునఁ బ్రో
ల్పిడిచని నదినిమునిఁగిన
నీడెనయని నలిననయను గృహమున కేఁగున్ 48

గీ॥ మాఘశుక్లమ్మునం బూర్ణిమాసి దశమి
సప్తమిని బ్రతిపద్దివసములనొక్క
నాఁడయిన స్నానమాడని నరుని ఘోర
పాతకమ్ములు నాశమెప్పటికిఁగావు 49

సీ॥ మాఘ శుక్లమునఁ బాడ్యమిస్నానమొనరించు
వారి పాపములు సమీరఘాటిఁ
జెడు మేఘములమాడ్కి నడఁగు నేకాదశీ
ద్వాదశీతిథులఁ బ్రభాతములను

నదినీట మునిఁగి నందకపాణిఁ బూజించి
మానసానంద కృష్ణామహిమ
వినువారి కలుషముల్ వీతిహోత్రజ్వాలఁ
దూలశైలములట్లు కాలిపోవు
గీ॥ మఱి చతుర్దశీ పూర్ణిమా మహితతిథుల
స్నానమొనరించి హరిపూజసల్పి పదియు
నెనిమిది యపూపములొకే యింతసంఖ్య
నమరు పూరీలొ నైవేద్యమాచరించి 50

ఆ॥ వాని వేణుపాత్రలోనుంచి దానమ్ము
బ్రాహ్మణునకు నిచ్చువాఁ డిహమున
సుఖములెల్లఁగాంచి సురలోకసుఖమొంది
భూమిఁబుట్టు సార్వభౌముఁడగుచు 51

వ॥ అట్లు సార్వభౌముండై పుట్టి సర్వసంపద్భోగంబులతో నేకచ్ఛత్రాధిపతియై సర్వసర్వంసహామండలంబు పాలించి శ్రీపతికృపాతిరేకంబునఁ గైవల్యంబందుఁ గావున నెట్టులైన మాఘస్నానంబొనరించి విరించిజనకుం బూజించి శక్తికొలంది దానంబులిచ్చుట శ్రేయస్కరంబని గౌతమమునీంద్రుండు మాఘమహిమం బెఱింగించిన విని 52

సీ॥ వేగరథావనీవిభుఁడుఁ బ్రజ్ఞాముని
జాయయు మాఘమాసమునఁ గడమ
దినములు గౌతమమునివరాశ్రమమున
వసియించి వారితోఁ బ్రత్యహములఁ
గృష్ణవేణీనది కేగి స్నానమొనర్చి
యశ్వత్థనారాయణార్చనమ్ము
సల్పి గౌతమహాని చంద్రోక్తమాఘమా
హాత్మ్యమాలించి యనంతరమ్ము
గీ॥ వారి యనుమతి నాత్మనివాసములకుఁ
జేరిరి నృపుండు రాసిరిఁ జెట్టఁబట్టి

ధర్మపాలనమును మాఘధర్మములను
జరిపి హరిఁగొల్చి వైకుంఠసదనుఁడయ్యె 53

క॥ ప్రజ్ఞామునివరు భార్యయు, విజ్ఞానము గాంచిమించు వినయమ్మున దో
షజ్ఞుండగు ప్రాణేశ్వరు, నాజ్ఞందలఁదాల్చి సల్పె మాఘవ్రతముల్

వ॥ ఇట్లమ్మునిపత్ని ప్రత్యబ్దంబున మాఘధర్మంబు బద్ధశ్రద్ధం జరుపుచు
హృదయేశ్వరు పాదోదకంబు గనులకద్దుకొని పానంబొనర్చుచుఁ
గొంతకాలంబు కుటుంబినియై సుఖంబుండి సభర్తృకయై దేహాంతం
బున మందరధరుమందిరంబుఁ జేరి నిత్యానందంబుననుండెం గావున
మాఘస్నానదానతపంబులు మనుజున కధిక తేజఃఫలసిద్ధులుఘటించి
సకలకలుషంబులు నశింపఁజేయు 55

సీ॥ పాతకాద్రిచయంబు దపఃప్రభాత
మజ్జనశతారధారకు మదిని బెగడి
స్నానహీనుల మానససాగరముల
డాఁగియుండును సతము హిమాగతనయ! 56

క॥ పాతకఘనజీమూత,వ్రాతమ్ము తపోనిమగ్నవాతాహతి ని
ర్ధూతమయిపోయి స్నానా,పేతజనాచలశిఖాళి వేడ్కంబట్టున్ 57

క॥ ఏనస్సులను దమస్సులు
సానుమతీ! మాఘకల్యసమయముల నదీ
స్నానార్కునిచేఁ జెడి త
త్స్నానవిహీనాత్మగుహల సతమున్ డాఁగున్ 58

సీ॥ వ్రతచయమ్మున మాఘధర్మసమమైన
సద్వ్రతము లేదుగాన నిష్ఠాగరిష్ఠు
లగుచుఁ బరిశుద్ధులగుచు నిరంతరమ్ము
మానవులు దద్వ్రతముసేయ నౌను గిరిజ! 59

క॥ సకలార్తినాశకమ్మును, సకలసుఖప్రదము మాఘసద్వ్రత మిది దాఁ
పక నీకెఱిఁగించితిఁ గోరిక వినువారలకు యజ్ఞకృత్ఫలమొదవున్ 60

వ॥ మఱియును 61

## 6 వ అధ్యాయము

గీ॥ బుద్ధిపూర్వకముగఁ గాకపోయినప్పు
టికిని దైవయోగమున ఘటిల్లిన యొక
మాఘమజ్జనమునఁ జను మనుజుఁడు హరి
జగమున కయోగ్యుఁడగు శూద్రుచందమునను 62

క॥ అనిపల్కిన విని హిమగిరి
తనయ మహావినయమున సుధాకరమౌళిన్
గని మ్రొక్కి తెల్పుమా శూ
ద్రునికథ నాద్యంతముగను దోయధిశరక్షీ! 63

వ॥ అట్లు శూద్రకథాకర్ణనకుతూహలయై ప్రార్థించిన యర్ధాంగికి గిరిధనుర్ధరుండు కర్ణానందమ్ముగాఁ దత్కథ నెఱింగించెద సావధానవై వినుము 64

ఉ॥ బాసలకెల్లఁ దల్లియయి భాసిలుదైవతభాష తత్కుమా
రీసముదాయమందతిగరిష్ఠవిలాసములన్ స్వమాతృకన్
దీసి యెడమ్ముగానిడెను తెల్గు తదీయసురూపసంపదన్
దేసెములన్నిటం దెలుఁగుదేశము కీరితిహెచ్చె నెచ్చెలీ! 65

—: ఆంధ్రాభివర్ణనము :—

చ॥ సిరియుఁ జిరాయువున్ బ్రజయు సేమముఁగూరిచి భక్తసంతతిన్
గరమలరారఁజేయు త్రిజగత్ప్రిత వేంకటనేత కిక్కయై
భరతమునందెయేమిటి ప్రపంచమునంతటఁ బేరుఁగన్న శ్రీ
తిరుపతికొండ యాంధ్రజగతిన్ వెలుఁగొందు నగేంద్రనందనా! 66

సీ॥ తారకాలింగ మందాకినీనదులతో
నమరావతీపురం బలరునట్లు
విశ్వనాయక జాహ్నవీద్వీపవతులతో
వారణాసీపురి వరలునట్లు

శ్రీరంగనాథ కావేరీ ధునులతోడ
శ్రీరంగనగరంబు సెలఁగునట్లు
మొగిహాటకేశ్వర భోగవతులతోడ
భోగినాయకు ప్రోలు పొల్చునట్లు

ఆ॥ అతుల శిల్పకళయు నమరేశ్వరస్వామి
వృజినదమన కృష్ణవేణి తనకు
ఖ్యాతిఁబెంచుచుండ నమరావతీపురం
బాంధ్రదేశమందు నమరుగిరజ 67

సీ॥ పానకాలనృసింహ పరమప్రభావ సం
ప్రకటనానూనమా మంగళగిరి
యేటేట శివరాత్రి కెచ్చుప్రభల్ సేర్చు
కోటీశుఁడుండు త్రికూటశిఖరి
తను గన్నవాని కుత్తరజన్మమును దుల్చు
మల్లికార్జుని శ్రీశైలధరమ్ము
గర్వించినట్టి భక్తశ్రేణిసాఁకు రా
మావాసమైన భద్రాచలమ్ము

గీ॥ నిజజలమ్ములఁ బ్రజలకు నిత్యభుక్తి
ముక్తులిడు కృష్ణగౌతమమునికుమారి
తుంగభద్ర పినాకిని యుంగొసంగ
జగతిఁ బేరొందె నాంధ్రదేశమ్ము సుమతి! 68

సీ॥ సకలసస్యమ్ములు ఫలించు సారవంత
మైన భూములు ఖనిజముల్ సూనములు ఫ
లమ్ము లోషధులొసఁగు వృక్షమ్ము లాంధ్ర
భూమి నున్నట్టు లింక నే భూమిలేవు 69

ఉ॥ దైవములందుభక్తి నిజదారలయం దనురక్తి సర్వాదు
ర్భావవిమర్దనక్రియల బంధురశక్తి సదాబుధప్రమో

దావహానూక్తి యన్యవనితార్థవిరక్తి ప్రాసంగి కీవియుగ్
శ్రీవిభవంబు సాధుతయుఁ జేకురియొప్పెడ నాంధ్రభూమిజుల్ 70

సీ॥ ప్రాణమ్ము తృణముగా భావించి ప్రబలశా
త్రవునైన డీకొను ధైర్యగుణము
వలయు నాకిదియని వాంఛించు నర్థికిఁ
దనువుఁగోసి యొసంగు త్యాగగుణము
దనకోరు లెవు డెగ్గులనె సేయుచున్న నా
వేశమ్ము గనని గాంభీర్యగుణము
శరణన్నవాని దోషములు లెక్కింపక
ప్రోది గావించు కారుణ్యగుణము
గీ॥ పరులువడు కష్టములు సెవిఁబడినమాత్ర
మిగుల సాయపడెడు మది మెత్తదనము
పలికిబొంకమి మానమ్ము నిలిపికోలు
పుట్టితోఁబుట్టుఁ దెలుఁగుస్త్రీ పూరుషులకు 71

గీ॥ విశ్వదాతలుఁ గవిపరమేశ్వరులును
భక్తరత్న గాయకసార్వభౌమ వీర
కేసరులు మృతజీవు లుత్కృష్టశీలు
రుదయమగుచుందు రాంధ్రమాతృదరమందు 72

వ॥ మఱియుఁ గోరిన కోర్కులందీర్చి నిరుపేదలంబ్రోచు మహాత్యాగులు ధైర్యసంపజ్జితాది త్యాగులు, మహేంద్రోపమానభోగులు, నశేష విద్యావిశేష శేష భోగులు, నిస్తులసమస్తవస్తుప్రశస్త సౌధసమాజ విరాజమానపురీవరంబులు, బహువిధ ధనధాన్యగోమహిషీ వృషభ సంఘాతసమేత సామాన్య గ్రామనికరంబులు, నానావిధ మృదు మధుర ఫలప్రసవమహిత మహీరుహాసహిత వనంబులు, పతితపావన జీవనోపేత నదీనద కమలభవనంబులు, నగణ్యాపుణ్యక్షేత్రంబులు, నిరతాన్నదానసత్రంబులు గలిగి చెప్పన్నారు దేశంబులం దలమాని కంబై యొప్పు నాంధ్రదేశమ్మునందు 73

ఉ॥ ధారణి సేద్యముం జరిపి ధాన్యము లెల్ల ఫలింపఁజేసి వి
స్తారదయం బ్రజోపకృతిసల్పెడు శూద్రకులప్రశస్త మం
దారమహీరుహాంచితవనమ్మున సర్వవిసర్జనీయ దు
త్తూరకుజమ్మునాఁగ నొక దుష్టుఁడెసంగె సుమందసంజ్ఞతోన్ 74

సుమందుని చరిత్రము

క॥ ఆతఁడు పిత్రార్జితధన, జాతము సహజార్జితమ్ముఁ జాతుర్యమునన్
జేతఁదగఁ బట్టుకొని సహ, జాతులకీడయ్యెఁ దనదు స్వార్జితమనుచున్

క॥ బత్తెల నావుల మేకల, గుఱ్ఱమ్ముల లొట్టిపిటలఁగొని యమ్ముచుఁ దా
నెఱ్ఱని యెండకు వానకు, నఱ్ఱుమరల్పకయె కూర్చె నమితధనంబున్

సీ॥ తాలు విడిపోవనీయక ధాన్యములను
గలిపి గాదెలఁబోయించి కఱవువేళ
నందఱునుమీఱి బలుధరకమ్మి ధనము
మందసమ్ములఁబోయు సుమందుఁడెప్పుడు 77

క॥ కూలికిపోయిన బీదలు, కాలెడు మాపొట్ట పిల్లకాయలు కడికై
సోలిరని యెంత వేఁడిన, వేళకు నీఁడీయఁదగిన విత్తముఁగొలుచున్ 78

సీ॥ గుత్త జట్టిగఁ బనిసేయఁ గుదిరిచికొని
తనదుపని పూర్తియైనమీఁదట సగంబె
యాది ననుకొన్న దానిలో నతఁడొసంగుఁ
జట్టుచివరకు నెన్నొ పేచీలువెట్టి 79

సీ॥ కుంటివారికిఁ బుట్టు గ్రుడ్డివారికి ముదు
సళ్ళకేన్ బిచ్చమ్మొసంగనీఁడు
స్వల్పులు చను దేరఁ జల్లకై లేవని
కుడితితొట్టింబోయుఁ గడవలెన్నొ
పెరుగును బాలును దరుణమ్ముఁ గనిపెట్టి
మితిలేని వెలకు నమ్మించుచుండు
బదుగుబాఁపనికైన జెడిరాలు గోఁగాకు
నేని తిర్పెమ్ముగా నిడఁడు సుంత

గీ॥ యెట్టులుం దప్పిపోనట్టి చుట్టమెన్నఁ
డైనవచ్చిన గుజ్జమ్ము లేని దినని
పాడుపురుగుల బియ్యమ్ము వండఁజేసి
పెట్టునటు పట్టుబట్టు నా పిసినిగొట్టు 80

క॥ తనపొట్టకైన సరిగాఁ,
దినకయు ననువైన వలువ దేహమునిండం
గనుగట్టకయు నతండుం
గొనకొని విత్తమ్ము గోట్లకొలఁది గడించెన్ 81

వ॥ అట్లు వజ్రకఠినహృదయుండును సర్వదేవబ్రాహ్మణ నిందకుండును సాధుజనాపకారియు నగు సునందునకు నవనీతకోమలహృదయయు దేవబ్రాహ్మణభక్తిపరాయణయు దీనదయాళువును భర్త్రాజ్ఞావశవర్తినియు నైన కుముద యను శోభనాంగి దాక్షిణ్యమ్మునకు ధార్మరాప్తివిధంబున భార్యయై కాపురంబుసేయుచుండ నా సునందుండు తన ధనమ్ము మఱియుం బెంపొనర్చు తలంపున వృద్ధి కిచ్చుచు 82

సీ॥ ఇచ్చినధనమున కెనిమిదిరెట్లు బం
గారంపు నగలు తాకట్టుపెట్టు
కొని వాయిదామీరకును నసల్ ఫాయిదా
లీకున్నఁ గుదువ సొమ్మీయననుచుఁ
జెప్పి యప్పటికిఁ దానెప్పట్టునకొపోయి
కన్నట్టకుండి తాకట్టుసొమ్ము
నంతయు హరియించు నధమన్ను నింటిలోఁ
గంటికింపుగ నేది కానఁబడిన

గీ॥ నద్ది తనకబ్బుదాఁక నైచ్యమునకోర్చి
యెన్నియో యత్నములు సేయు నెట్లుగూడఁ
దనదు తమిదీరకున్న నిర్దయవహించి
గృహపతికొనర్చును సునందుఁ డెగ్గులొకట 83

క॥ ఏందుఁ బదిరెంటఁ జన్మ,మ్మందుండు సుమందుఁడైన నర్చించిన భ
క్తిం దానగుఁ బ్రీతుండు సు,మందుఁడుగా డెట్టులు నధమర్ణులయెడల౯

వ॥ అవ్విధమ్మున దయాదాక్షిణ్యమ్ము లెట్టివో యెఱుంగక కూరా
త్ముఁడై పెక్కుతెఱంగులఁ బ్రజాద్రోహంబుసేయుచు ధనం బార్జించు
మగని దుండగమ్ములు చూచి సైపనోపక సదమలమృదుహృదయ
యగు కుముద సమయమ్ములరసి యరసికుండగు పతిం జేరి విన
యమ్మున "స్వామీ! మనకు వార్ధక్యంబు ప్రాపించె నింతవఱకు
సంతానం బేమియుఁ గలుగదయ్యె నీ యార్జించిన విత్తంబి త్తనువులు
మిత్తికి౯ పాత్తినఁ దినువారెవ్వ రీ మనరెండుపొట్టల కింతకూడున్నం
జాలదా! యింకనైనఁ బాతకహేతువగు పరపీడనమ్ము మాని
కూడబెట్టిన ధనమ్ము పాత్రదానమ్ముసేయుచు లోకమ్మున బేరుండు
లాగున ధర్మకార్యమ్ములొనరింపుఁ డందువలన నైహికాముష్మిక
సుఖంబులుగల్గుఁ దిరుగజన్మంబెత్తినఁ దినం గట్టనుం గలిగియుండు
నని చెప్పుచుండుంగాని యతం డప్పుడఁతి నుడువులు పెడచెవుల
నిడుచుఁ దానింటలేనితఱి తనభార్య బీదల కేమైన నిచ్చునేమో
యను ననుమానమ్మున నన్నివస్తువులయందు గుర్తులిడికొనుచు 85

సీ॥ మాతండ్రి యెట్లో సంపాదించియుంచెనం
చాకాంతుఁ దినుసంతు లేకయున్న
నప్పుఁదీర్పగవచ్చు నతిరిక్తునకె పట్టెఁ
డన్న మీఁడను నింద యలమికొన్నఁ
జిల్లిగవ్వకుఁగూడ సేయుపో ఘోరప్ర
మాణమంచెల్లరుం బలుకుచున్న
గొంటురి యని మొత్తుకొన్న సాయము సుంత
యేన్నల్పుఁడని చుట్టలేడ్చుచున్నఁ

గీ॥ బ్రోవులై యెల్లెడల డబ్బు మూల్గుచున్న
వ్యావకాధిక్యమున సుఖమబ్బకున్న
నూరు పొమ్మన్నఁ గాడు వేరారయన్నఁ
జను ధనార్జన కితర దేశములకతఁడు 86

గీ॥ ఆ సుమందుఁడు వ్యాపారమాచరింప
నన్యదేశాల కొక్కమాఱరిగినపుడు
మాఘమాసమ్మువచ్చె సమస్తదుస్త
రాఘగాఢతమస్తరుణార్కమగుచు 87

శుచివ్రతముని సుమందునింటికి వచ్చుట

శా॥ ఆ మాఘంబున నొక్కనాఁడు క్షణదాప్రారంభమావేళ నెం
తేమేఘంబు లమోఘవర్షమున ధాత్రిన్ నీరధింజేయ న
చ్చో మేనెల్లను బట్టలుం దడిసి సంక్షోభించుచున్ మానిను
త్రాముండైన శుచివ్రతుం డలఁతజేరం బాఱె నాయూరికిన్ 88

గీ॥ వచ్చి యూరేయి తలఁదాఁచు నిచ్చఁ దగిన
వసతి వెదకుచును సుమందు పంచఁజేరి
యింటిలో నెవ్వరయ్య పెన్వృష్టివలన
దస్సితిని పరదేశి బాడబుఁడఁజుండి 89

వ॥ అనుచు శుచివ్రతుండు పలికినపలుకులు సెవింబడుటయు 90

ఆ॥ వంటయింట బువ్వవండుచుఁ గలియఁగాఁ
బెట్టుచున్న కుముద వేగవచ్చి
తలుపుఁదెరచి మేనువలువలు నీర్గార
వడఁకుచున్న మానివరుని గాంచి 91

వ॥ దండంబిడుటయు దీవించి మునివరుండు 92

క॥ అమ్మా! మార్గమ్మున వ
ర్షమ్మునకుం దడిసినాఁడఁ జలిగాలికి దే
హమ్మెల్ల నొచ్చె మఱి వ
ర్షమ్మాగదు తమముబలియు రాతిరి వచ్చెన్ 93

క॥ కావున నిచ్చట నేఁటి వి
భావరి వసియించి తెల్లవారెడు వేళన్
నేవెడలిపోవువాఁడఁ గృ
పావతి! యీాదాన మీయవలయును మాకున్. 94

వ॥ నీకు శుభంబగుతమనుటయు నా కుముద చాలజాలింబడి "స్వామీ! యీపాటి స్వల్పవిషయంబునకు మీరింత ప్రార్థేయపడ నేల? లోనికిరండు మిగుల నలసితిరి మీకంఠస్వరంబును డగ్గుత్తికవడియె నని లోపలికిం గొనిపోయి ముందు నూత్నవస్త్రంబులం దెచ్చియిచ్చి వీనింధరించి మీ యార్ద్రపరిధానంబులు విడువుండని ప్రార్థించిన నాతం డట్లొనర్చుచుండఁ గుముద యమ్మునివరుండు వసింపఁదగు ప్రదేశంబు పరిశుభ్రంబుచేసి యొక కంబళంబు వేసిన నాతం డందాసీనుండగుటయు 95

సీ॥ చిదుగుపుల్లల నమ్మునిచెంగట నిడి
మండఁగాఁజేసి చలిఁ బాపికొండటంచుఁ
జెప్పి యావునుబిదికి తక్షీరములను
గాఁచివానను శర్కరఁ గలిపి తెచ్చి 96

క॥ వీనిఁ బుచ్చికొనుండో,మానీశ్వర యనుచు వేఁడుమానిని భక్తిన్
మానసమున మెచ్చిపయః,పానముగావించి క్షుత్పిపాసలఁ బాసెన్ 97

వ॥ అంత నా కుముద మఱియొక రోమశాలిం దెచ్చియిచ్చి దీనిం గప్పికొనుండు చలియుండదన నతండది గైకొని "తల్లీ! నీ యింటి పనులుమాని మా నిమిత్తంబు చాల శ్రమంపడితివి. నీబుణం బెట్లు తీర్చికొందు. నీవేగి భుజియింపుము. ప్రొద్దువోయె. నీమగండు కనుపడకుండె నింటలేడా?" యనుటయు నయ్యింతి "మహాత్మా! నామగండింట లేకుండుటవలననే పుణ్యమూర్తులైన తమకీపాటి సేవ సేయఁగల్గితి. అతఁడు వ్యాపారంబున నితర దేశం బులకరిగె. భక్తిజ్ఞానంబులు లేనివాఁడని" చెప్పి మునివరునాజ్ఞం గొని చని భుజించి శయనించె. శుచివ్రతుండును సుఖసుప్తుండై నాలవజామున మేల్కాంచి 98

సీ॥ వనజాతదళనేత్ర! వార్షికాంభోధర
సన్నిభశ్యామల చారుగాత్ర!

గంగాజనకపాద! కలుషదావానల
సంవర్తసమయదుస్తరపయోద!
సౌవర్ణమయవస్త్ర! సాధుబాధకకంఠ
దారణాతులసహస్రారశస్త్ర!
వైనతేయతురంగ! వాసవవిద్విష
త్ప్రాణజగత్ప్రాణపటుభుజంగ!

గీ॥ జంగమస్థావరాత్మక సర్వలోక
మండితోదర! దరహాససమహిత! హితజ
నప్రమోదక వాక్యామృతప్రసార!
సారసోద్భవజనక! మోక్షమ్ము నిమ్ము 99

చ॥ సరసిజపత్రనేత్ర! దనుజప్రకరేంధన వీతిహోత్ర! మం
దరనగధారి! శౌరి! ఖగనాథతురంగ! కృపాతరంగ! శం
కరనుతపాదపద్మ! మునికౌశికమానససద్మ! యిందిరా
వర! వరదా! ముకుంద భవబంధములన్ దలించి ప్రోవుమా 100

గీ॥ మీన కూర్మ వరాహ లక్ష్మీనృసింహ
వామన భృగుజ జానకీరామ కృష్ణ
బుద్ధ కల్క్యవతారావతార మూర్తి లోక
పాలనము సల్పు దేవ! శ్రీపాదరావ! 101

క॥ అనుచు శుచివ్రతి సంయమి
దనుజాంతకు భజన సేయుచు ధ్రువము న మే
ల్లోని కుముద ముదముప్పొదలఁగ
మునిపతికిఁ మ్రొక్కి వినయమున నిట్లనియెన్ 102

క॥ ఎందుండి యిందువచ్చితి [illegible] రేతెంచి మిం పుఁడు నా
డెందము వినుటకుఁ దొందర [illegible]

గీ॥ ప్రార్థనము సేయ మానిని చెప్పఁదొడంగె [illegible]
దుంగభద్రాజలంబుల దోఁగ వచ్చి [illegible]

 [illegible]

నాఁడ నీడకు శ్రీరంగనాథ దర్శ
నమునకరిగెద నిటనుండి విమలచరిత! 104

సీ॥ మఱియు నిప్పుడు మాఘమ్ము జరుగుచుంటఁ
దీర్థసంసేవఁ గావింపఁ దిరుగుచుంటి
నీప్రయాణ మక్షయమోక్షహేతు వింది
రేశ సంప్రీతికరము సాధ్వీ! యటన్న 105

ఉ॥ ఎట్టిది మాఘమాసఫలమెట్టిది తీర్థనిషేవణమ్ము పెన్
గట్టుల యట్టి పాతకనికాయము దేన నశించుఁ గవ్వపున్
గట్టునుదాల్చు దేవరమనమ్మునఁ దృప్తివహించు దేననా
కట్టివిశేషముల్ దెలుపవయ్య యన న్మునిసెప్పె నీక్రియన్ 106

గీ॥ దేని మహిమమ్ము వినినచో దేహధారి
జన్మశతసమార్జిత కలుషవ్రజమ్ము
వలన విడువంగఁబడునో తత్కలుషదమన
మాఘమహిమమ్ము వినుము సమగ్రభక్తి 107

చ॥ సకలమహాధ్వరాచరణసంభవ తత్ఫలముల్ ఘటించు నీ
మకరసమేతమాఘమున మజ్జనమున్ రవి దోచువేళ నూ
రికివెలి నీటిలోసలుపు స్త్రీకయినన్మగవానికైన నా
రక మొనగూర్చు పావనికరమ్ము లయమ్మగు నాక్షణమ్మునన్ 108

సీ॥ అనఘాత్మ! మాఘమ్మునందుఁ బ్రాతఃకాల
మున నేటినీటిలో మునిఁగి హరిని
దెల్లని నల్లని దివ్యసూనమ్ముల
వితతి గంధిలకరవీరములను
తులసీదళమ్ముల చెలిమితోఁ బూజించి
మాఘమాహాత్మ్యంబు మధువిరోధి
కథ లాలకించుచుఁ గలకొలందిని దాన
ములు నిత్యమును జేయు పురుషుఁడైనఁ

గీ॥ బాలఁతి యైన జ్ఞానాజ్ఞానకలన సలుపు
బ్రహ్మహత్యాది పాతకపంచకమ్ము
వలన విడువంగఁబడి ధరాతలసుఖమ్ము
లిమ్ముగాఁగాంచి పిదప మోక్షమ్ముఁగాంచు 109

ఉ॥ స్నానము దానముల్ జలజనాభసమర్చయు మాని మాఘ మే
మానవుఁ డూరకేగడపు మానిని! వాఁడు వసించు దుర్గతిన్
మానుగ జన్మమందు నొక మాఘనిమజ్జనమైన లేని య
జ్ఞానుఁడు ఘోరరౌరవమునంబడి మాఁడును బ్రహ్మకల్పముల్ 110

క॥ క్రతుశతఘటనంబునఁ బుణ్యతీర్థచయసేవనమునఁ ద్యాగమ్మున శ్రీ
పతిపూజనుగాంచు శుభస్థితులు దపస్స్నాన మొందు సేసినఁ గల్గున్

క॥ కనుకనల మాఘమజ్జనమున కెన పుణ్యంబు లేదు మొగితన్మాఘం
బునను బ్రయాగక్షేత్రంబున స్నానము సేయువాఁడు పుట్టఁడు మరలన్

గీ॥ మాఘమందుఁ బ్రయాగ నమర్త్యనదిని
స్నానమొనరించి మాధవార్చన మొనర్చు
వాఁడు దత్ప్రసాదమ్ముచే స్వర్గమందు
వాసమొనరించు జగముండువఱకుఁ గుముద! 113

వ॥ మాధవప్రీతికరంబగు ప్రయాగక్షేత్రంబునఁ జేసిన మాఘస్నానం
బున నెట్టి ఫలంబుగల్గునని విజ్ఞులు వినుచుండిరో యట్టి ఫలంబు
కృష్ణవేణీ, కావేరీ, నర్మదా, తుంగభద్రా, సరస్వతీ, గోకర్ణ,
ప్రభాసశోణభద్రా, గోదావరీ, దక్షిణకూపాది, వేగవతీ, సుర
దీర్ఘికా, ప్రత్యక్ప్రవాహా, తామ్రపర్ణీ, భానుమతీ ప్రముఖ పుణ్య
నదీ విమలజలంబుల మాఘస్నానంబు సేయువారలొంది విష్ణు
సాయుజ్యంబు నొందెదరు. మఱియు దేవఖాతతటాకంబులనైనఁ
గూపాదికోదకంబులనైన మాఘస్నానంబొనర్చువారును ముక్తిం
జెంది తిరుగ జన్మంబునకు రారు 114

ఆ॥ షాలఁతి! మాఘమందుఁ బుణ్యతీర్థమ్ముల
గోష్పదోదకములఁ గ్రుంకులిడిన

బాఁపనపీనుఁగా! ముద్దరాలగు నా ముద్దియ కిట్టి చెట్టతలంపు పుట్టించి పీటముంచి దుడ్డు లాగికొనిపోనెంచితి కాఁబోలు నీ దుడ్డున నీ జడ్డిగం బడంచెద”నని తన చేతికఱ్ఱనెత్తి యత్తపసినెత్తిపై మొత్తంబోవుచుండ వారిం గొట్టకుఁడు. బ్రహ్మహత్యా మహాపాపంబు సంభవించు నిందు వారి తప్పేమియు లేదనుచుఁ గుముద యడ్డంబేగఁ దదీయోద్దండదండాఘాతం బయ్యండజగమనకుఁ దగిలి సొమ్మసిలి నేలంబడి లేవకున్న సుముందుండు భ్రాంతుండై యిట్టిచో ధనమ్ము డగ్గరనుంచుకొని నేనిట నుండరా దిది యింటం దాఁచి వచ్చెద నిచ్చట నిది యెట్లైనం బిదప సవరించుకొందునని చనిన శుచివ్రతుం డా కుముదకడకు వచ్చి శుభవాక్యంబుల దీవించుచుఁ దన తాలవృంతంబున విసరుచుండఁ గొంతవడికిఁ గుముద తెప్పిఱిలి లేచి “స్వామీ! మీకేమైన దెబ్బతగిలెనా నాకతంబున మీకెట్టి ముప్పు చొప్పడెనని నొచ్చుకొనుచుండఁ దల్లీ! నాకు దెబ్బ తగుల లేదు కాని నాహేతువున యోగ్యురాలవు సాధ్వీమణివియు నగు నీ కీ తాడనంబులబ్బె నీ మగండు మరలవచ్చిన నిన్నేమిసేయునో స్నానమ్ము లేకున్నమానె నింటికేగు మేను నాదారిం బోయెద ననుటయు 127

చ॥ కుముద వచించె నిప్పుడిటకుం బెస నాపతివచ్చెనేనిఁ బా
పములడఁగించు మాఘపుఁ బ్రభాతనిమజ్జనమాగిపోవు వే
గముగనుబోయి చెర్వునుదకంబుల వేళకుమున్గి యంత గే
హమునకుఁ బోవుదాన నెటులైనసరే వడిరండు మీకలుం 128

ఆ॥ ధన్యులైన మీదుదర్శనమబ్బియుఁ
గలుపదళిన మాఘఫలము వినియు
మాఘమజ్జనంబు మాని నే నింకెట్టు
లను దరించుదాన మునివరేణ్య! 129

వ॥ అని నుడువుచుఁ గుముద వడివడింజని శుచివ్రతుండు సంకల్పమ్ము సెప్పుచు నాజ్ఞయొసంగ నా తటాకోదకంబులఁ మునుంగుచుండ నట

సుమందుండు బొక్కసంబు నిక్కం జక్కందాఁచి దండపాణియై త్రోవఁబూనుకొనుచు వచ్చి తటాకంబున మునుంగు నిజాంగనం గనుంగొని "యోసి రంకులాడీ! యెంత గడుసరివైతి విందనుక నా దండాహతిం జచ్చినయట్లు పడియుంటివి. నన్ను మోసగించుటకా? బళిబళీ! బుద్ధిలేక చెరువునీటఁ గ్రుంకుచుంటివా యని కొట్టుచు కెట్టవట్టిలాగినఁ గుముద నిలువరించుకొనలేక నీటం బడుటయు నావేగంబున నామెం బట్టుకొనియున్న సుమందుండును దజ్జలంబులఁబడి తడిసె నవ్వేళ నిర్వురు లేచిరి. పిదప భర్త వెలుపలికిఁ దివుచుచున్నఁ దృప్తిగా స్నానంబుసేయ నిచ్చగల కుముద నీరిలోనికి గుంజుటవలనఁ దద్వల్లభుండు నిందుస్నానంబొనర్చినవారి తీరున సంసిక్తసర్వావయవుండై నిజదారం దూరుచుఁ దిట్టుచు నెట్టుకొనుచు నింటికింజనియె. శుచివ్రతుండును సకాలంబున మాఘస్నానంబొనర్చి తాత్కాలిక నిత్యకృత్యంబులఁదీర్చి తీర్థయాత్రా పరాయణుండై పూర్వదిగభిముఖుండై యేగె నంత 130

సీ॥ కొంతకాలముననఁ గుముదా సుమందులు
బహుళామయమ్ముల బాధితులయి
యిర్వురు నొకనాఁడు మృతిఁజెందుచో నంత
ముందు కుముద ప్రాణములు సనంగ
శ్రీహరి దూతలు చిత్రధ్వజోజ్జ్వల
న్నవరత్న వసువిమానమ్మొకండు
గొని తెచ్చి యామెను గూర్చుండఁగాఁజేసి
చనను న్నింతలో సాధ్వసప్ర

గీ॥ దస్వరూపులు యమునిదూతలు సుమందుఁ
జేరి ఘోరను బిగఁద్రొక్కి జీవములను
దీసి పాశమ్ములంగట్టి తిట్టి కొట్టి
కొనుచుఁ బోవుచునుంట నా కుముదగాంచి 131

వ॥ చింతించి హరిదూతలంగాంచి యిట్లనియె 132

క॥ మీ రెవ్వరయ్య దేవా, కారులు నను దివిజపుష్పకమ్మున దయతోఁ
జేరిచి కొనిపోయెదర, వ్వారలు భీకర్ములు నాడు వెల్లభూఁ ద్రాళ్లే

గీ॥ కట్టి బాధించెదరటన్నఁ గాంతతోడ
శౌరిదూతలు పల్కిరో సాధ్వి! మేము
విష్ణునకు సేవకులము మా విభునియాజ్ఞ
నిను వికుంఠమ్మునకుఁ గొనిచనెదమిపుడు 134

ఉ॥ వారలు కాలకింకరులు పాపిభయంకరులన్న నా పెయుం
గ్రూరుఁడు మత్తచిత్తుఁడును ద్రోహపరుండగు నాదుభర్తకున్
ద్వారక మే శరణ్యమగు నాకు మహాఘకరానుసక్తికే
తీరున దుర్గతింబడక దేవుని జేరఁగఁ దక్కెఁ జెప్పుఁడీ! 135

గీ॥ మాఘనిభయమున నే నణుమాత్రమైనఁ
బున్నెమొన్నఁడుసేయ నో యన్నలార!
యట్టి దుర్జనాజ్ఞాబద్ధనైన నాకు
నెటుల సంప్రాప్తమయ్యె లక్ష్మీశుపదము 136

మ॥ అనుమాటల్విని విష్ణుదూతలనిరీ యాసాక్షి! వర్షర్తువి
ప్రునిశావేళ సమాదరించి మఱి తద్బోధం దపస్స్నానమే
య్యనఁ గావించితి వామహత్త్వమున శ్రీప్రాణేశుసాన్నిధ్య మీ
వెనయంజాలితి విందుసంశయము లేదేమాత్రముం గన్గొనన్ 137

గీ॥ మాఘమజ్జనమొనరింప మనసులేని
మూర్ఖులకు నేదొకతమునఁ బొసఁగినట్టి
స్నానమే మోక్షమొసఁగుచో శ్రద్ధతోడ
సలిపిన సుభావవగు నీకుఁ గలుగుటరుదె? 138

వ॥ అట్లు పంకజనాభకింకరులు దెల్పిన విని క్షుమ్ముద యిట్లనియె. 139

ఉ॥ ఓ మహనీయులార! పురుషోత్తమలోకము ...
... మరతర్పణక్రియయు మాఘనిమజ్జనమే కృతార్థులుగ్గాఁ ...

దామనినారలా పుడమి దయ్యపుటర్చనకుం బదార్థముల్
నామగఁడౌ సుమందు గడనమ్ము లెయాగక పారఁజూచినన్ 140

వ॥ "ద్రవ్యద్వారాణి పుణ్యాని" యని విజ్ఞు లనుచుందు రక్కతమ్ము న నేఁ గావించిన విప్రార్చనపుణ్యంబు నా భర్తదియెగదా! యిదియుఁ గాక తనకిష్టములేకున్న నేవిధంబుగా సంభవించినను మాఘస్నానం బుత్తమలోకంబొదవించునని తమరిపుడ నుడివియుంటిరటులైన 141

గీ॥ ఏను సరసిఁదపస్స్నాన మిచ్ఛఁజేయ
నా మగఁడనిష్టుఁడై పైకి నన్నులాగఁ
బడితి నేనీట నారెట్టఁ బట్టియున్న
వాఁడు గాన నాతోఁబాటు పడియెనతఁడు 142

క॥ ఆరీతి నీటఁబడుటను, గోరి నిమజ్జనమొనర్చు కోవిదు నటులై
తీరము సేరెం గావున, నారమణునకున్ ఘటిల్లె స్నానఫలమ్మున్

గీ॥ ఇట్టి పున్నెమ్ములున్న నా హృదయవిభుఁడు
నరకమున కేగుటయె ధర్మసరణియైన
నాకుమాత్రమ్ము మీ హరిలోక మేల
సతికిఁ బతితోనునికియె మోక్షమ్ముగాన 144

వ॥ నా మగండుపోవుతావునక యేనుం బోయెద నన్ను విడువుండన నాసందర్భంబు విమర్శించి యందుఁ గొందఱు సుమందు నీడ్చికొని పోవు యమభటులకడ్డుపోయి యితండు మీనరకంబునకు రావలసిన యవసరంబులేదు విడువుండన వారు భయంపడి విష్ణుదూతలకు మ్రొక్కి కొంచెముతడ వోపికఁబట్టుఁ డేము మాఱేనికెఱిఁగించి వాని ముదలఁగొనివచ్చెదమని చెప్పి జమునిలెంకలు పర్విడి దేహధారి కృత పుణ్యపాపవిలేఖకుండైన చిత్రగుప్తుం డాసి తద్వృత్తాంతంబు విన్నవించిన నతండుఁ దన లెక్కలబొక్కఁ జక్కఁగాఁ జూచి యిట్లనియె 145

ఆ॥ దూతలార! వినుఁడు దుష్టుఁడైన సుమందు
పాపపుణ్యముల ముఘర్జునందుఁ
బాపగణనమునకుఁ బట్టు నెన్నోదినాలు
పున్నియంపు పద్దు సున్నకన్న 146

ఆ॥ ఐన మరలఁజూతు నాగుఁడు కొంచెంబ
టంచుఁ జూచి యాతఁడనియె నిట్లు
కొట్టకొనను గలదు కుముదమూలకమైన
మాఘమజ్జనంపు మహితఫలము 147

క॥ ఆపాపభూధరంబులు, నీపున్నెముఁ ద్రానునందునిడి తూచంగా
పాపములకన్నఁ బున్నెమె, పైపెచ్చుగనుంట నరకవాసమువాసెన్

వ॥ అని చెప్పి చిత్రగుప్తుండు సుమందుని యమకింకరవిముక్తుంగాఁ జేసిన నతండు నిజభార్యయగు కుముదంగూడి విష్ణుకింకరానీత దివ్యవిమానంబధిష్ఠించి పునరావృత్తిరహిత వైకుంఠంబుఁ జేరి శ్రీహరిసాన్నిధ్యంబున సుఖంబుండె. సత్సంగంబునఁ గల్గిన మాఘస్నానఫలం బెంతనివచింతు 149

క॥ సుజనస్నేహము మోక్షము
కుజనస్నేహమ్ము నరకకూపముఁ గూర్చున్
బ్రజలకుఁ గావున నెప్పుడు
సుజనస్నేహంబుసేయఁ జూడఁగవలయున్ 150

క॥ పనులెన్ని యున్నఁగానీ
పోనరుపవలె మాఘమాసమున స్నానము మ
జ్జన దానహీనముగ నెలఁ
జనఁజేసెడు వాఁతఁ డసురజన్మముఁ గాంచున్ 151

క॥ మనుజుఁడు మాఘోషమ్మున
నోనరించిన స్నానమహిమ నురుదురితంబుల్
హానవమగు నవుడె పిమ్మట
దనుజాంతకు లోకమబ్బు దక్షతనూజా! 152

ఆ॥ వాజపేయశతము భ్రాజితాగ్నిష్టోమ
శతమును నతిరాత్రశతము మఱియు
నన్యమన్యుశతమునం దబ్బుపుణ్యముల్
మాఘమజ్జనమున కాఁగలేవు 153

శా॥ ప్రాతఃకాలమునం దపస్సున బహిఃప్స్రాధస్సునన్ మున్ని కం
జాతాక్షున్ శ్రితపక్షు విశ్వవిభుఁ బూజంజేయు నవ్వాఁడు దా
వీతాంహోగణుఁడై సుశాంతగుణుఁడై పిత్రాదికోపేతుఁడై
శ్రీతన్వీశని వేశ వేశ్ముఁడగు ధాత్రీభృద్ధవాత్మోద్భవా! 154

## 7 వ అధ్యాయము

గీ॥ మాఘుసుస్నానఫలము సన్మానితమ్ము
మఱియుఁ జెప్పెద విన్ము హైమవతి! వేడ్క
నాలకించిన జన్మశతాలయందుఁ
జేసిన యఘవ్రజమ్ము నశించుఁజుమ్ము 155

ఉ॥ స్నానముసేయ వీల్పడని సంకటముల్పడునట్టివానికిన్
వానికులమ్మునందు జననమ్మునుగాంచిన యట్టివాఁడెవం
డైనఁ దపోనిమజ్జన మయత్రపద కోరిమి నాచరించి య
ద్దానఁ బొసంగు పుణ్యము దత్తముచేసినఁ గల్గు సద్గతుల్ 156

ఉ॥ ఈవిధిఁ దెల్పుగాథ యొకఁ డేనెఱిఁగించెదఁ గృత్తపాప గో
దావరితీరధారిణిని ద్వాపరమందు ముకుందపాదరా
జీవమరందపానపరచిత్తుఁ డుదాత్తుఁడు వేదవేత్త సం
సేవిత పుణ్యతీర్థుఁడు సుశీలుఁడునా నొక విప్రుఁడొప్పెడిన్ 157

గీ॥ ఆ సుశీలుండు తీర్థసేవాభిలాషఁ
దిరుగుతఱి నొక్కసమయానఁ దెరువుదప్పి
దారుణ మగమ్యమైన కాంతారమందుఁ
బడి నడచుచుండె నెత్తురు లొడలవెడల 158

శా॥ ఆ కాంతారమునం దనంతమగు వృక్షానీకమాత్మీయశా
ఖాకాండంబుల సూర్యకాంతులఁ జొరంగానీమి దర్పత్రియా

మాకారంబుగనుండి త్రోవఁజనఁగా నంత్రోద్వయంబాడ కెం
తో కాతర్యమునొందునాతనికి నాప్తుండయ్యె గార్చిచ్చటన్ 159

వ॥ మఱియు బలురక్కసులనందగు బలురక్కసిమ్రాఁకులతోడను బారు
గల బూరుగులతోడను బెనుతాడులకీడంబోని యూడలుగల్గి కపట
జటిపటలంబునానొప్పు వటవిటపిచ్ఛటలతోడను దుష్టజనసదృక్ష
విషాముష్టివృక్షంబులతోడను జడలుగదియు వెదురుపొదలతోడను
గంటకోట్టంకితంబులగు గచ్చ కోరింద గుబురులతోడను దృగ్భీష
ణవపుర్విశేషణంబులగు మహాంగ మాతంగ పతంగ తురంగ కోల
శార్దూల శుండాల ద్వీపి శరభాదిక ఘాతుకమృగజాతంబుల
తోడను దదీయగ్రీవాజనిత ఘోరారావంబులతోడను గాకోలూక
శ్యేన గండభేరుండాదికానేక నాకచరంబులతోడను మహావాత
పతితతరువ్రాత సంభూతభీతికర ఘనధ్వనులతోడను దావానల
దందహ్యమాన నానావిధ క్షితిరుహ వితానజనిత చ్ఛటచ్ఛటాశబ్దం
బులతోడను హృదయవిదారకంబగు నయ్యరణ్యంబునం జను
సుశీలుండు 160

గీ॥ కాంచె నొక్కెడ సునిశితకంటకములు
గమ్యమానాఖిలప్రాణికంటకములు
స్వాదుతాదూరఫలరసఘంటకములు
నైన ఖదిరమహాభూరుహముల గుములు 161

క॥ కనుఁగొనుచు సుశీలుఁడు దా
పున కేగుచు నతని కర్ణపుటభేదన ఘో
రనినాదం బొకపరి మఱి
యు నొక్కపరి పెద్దయేడ్పు టులివు వినఁబడెన్ 162

క॥ రోదనయుతమైన మహానాదము భయదమ్ముగా వినంబడ నపు డా
భూదేవమౌళి కాతరుఁడై దైత్యారినిస్మరించె స్వాంతముననిటుల్

చ॥ అడవుల సంకటస్థలుల నార్తినిజెందిన భక్తపాళికిన్
బొడకటుడు కష్టములెడలించి ప్రోచు దయాహృదయా! శుభాలయా!

జలధిని కేతనా! భుజగశాత్రవ కేతన! నారసింహ! యీ
యడవిని నాకుఁ గల్గిన మహాభయబాధలు వాపి కావుమా! 164

క॥ గృహముల గహనమ్ముల దు
స్సహదహనమ్ముల జలశ్మశానమ్ముల నా
వహమగు బహుళాపత్తులు
నృహరీ! కృప నీవు గనిన నిర్మూలితముల్ 165

వ॥ సుశీలుఁ డట్లు నారాయణదివ్యనామ స్మరణంబు చేసి త్యక్తభయుం
డును సుస్థిరహృదయుండునై యీఘోషసమిళితమహానాదం బెవ్వఁడు
సేయుచుండెనో చూచెదంగాక యని యా చంద్రచెట్లసందుగా
మెల్లమెల్లన కొంతదవ్వు చని 166

సుశీలునకు బ్రహ్మరాక్షసుండు గనుపడుట

సీ॥ చింతనిప్పులఁ గేలిసేయు కన్నులవాని
నరుణవర్ణ శిరోరుహములవాని
గిరిగహ్వరకరాళ వివృతవక్త్రమువాని
రక్తాక్తదంష్ట్రలు గ్రాలువాని
హాకారఁ దినలేమి బక్కచిక్కినవాని
బండికందెనచాయఁ బరగువాని
క్షుద్బాధ మృగములకొఱకు వేచెడువానిఁ
బెడబొబ్బ లెంతయుఁ బెట్టువాని

గీ॥ ఖదిరకంటక భిన్నస్వగాత్రగళిత
రక్తమనురక్తచిత్తుఁడై త్రావువాని
మానముడిగి దిగంబరుఁడైనవాని
ఖదిరకుజలీను బ్రహ్మరాక్షసునిఁ గనియె 167

ఆ॥ కాంచి యొకముహూర్తకాల మట్టులె నిల్చి
వాని వెతల నెల్లఁ బాఱఁజూచి
మనసుకరఁగి విడిచిచనలేక యెలుఁగెత్తి
యా దయాళు విట్టులనియె గిరిజ! 168

శా॥ ఓయీ! యెవ్వఁడవీవు పెన్బరిసెలట్లొప్పారి తీక్ష్ణమ్ములై
కాయమ్మా ఖదిరద్రుకంటకతతుల్ గాయమ్ములంజేయ న
ట్లే యాచంద్రవసించి మూర్ఛిలుచుఁ దెల్వింబాసి శోకించుచున్
హేయాచారతనుండు నీదు విషయంబేమో వినంగోరెదన్ 169

క॥ నీరూపుఁగనిన రాక్షస,వీరులకే భీతిగలుగు విడువక నీకున్
దారసిలు సిలుగులంగను, వారలయెద వజ్రమైన వడినీరమగున్ 170

వ॥ కావున నీ పరిదేవనంబుమాని మానసంబున దిటవూని నీ సమా
చారంబు సమగ్రంబుగా నెఱింగింపుమన నతం డా పలుకులు విని
శోకంబువదలి కనులుదెరచి యా సుశీలుని దివ్యతేజోమయముఖ
పద్మమ్మొక్కింతసేపు నిదానించిచూచి కరపుటంబులు జోడించి
నిటలతటంబునఁజేర్చి 171

క॥ ఆఁకలిదూపల నావఁగ,లేక స్వమాంసాస్రముల మలీమసముల నే
యేకాలముఁ గైకొనియెదు,నాకు భవద్వచనములు వినంబడినంతన్

ఉ॥ మానవమాంసమిత్తతి సమగ్రముగా లభియించెనంచు నా
మానసమందునుబ్బి క్షణమాత్రముకాలము మిమ్ముఁజూడ ను
గ్రానలతుల్యతేజము త్వదాననగోచరమై మదీయదు
ర్జ్ఞానతమమ్ముఁ బోనడఁచి జ్ఞానపదమ్మునుజూపెఁ దాపసీ! 173

చ॥ అమలదయాంతరంగ! వసుధామరవంశమణీ! బుధాగ్రణీ!
కమలభవోపమాన! హృతకల్మష! పుణ్యమయస్వరూప! దు
ష్టమతులకష్టముల్గనుచు జాలినిజెందెడు మిమ్ముఁగాంచుటన్
గ్రమమున మత్పురాభవదురాగతముల్ దెలియంగఁజాలితిన్ 174

వ॥ మహానుభావుండవైన భవద్దర్శనంబున మత్పూర్వజన్మకర్మంబులు
కన్నులఁగట్టినట్లు పొడకట్టుచుండె. శ్రమయనక వినెదరేని నా చరి
త్రంబు విన్నవించెద నాలకింపుండని యా బమ్మరక్కసుండు 175

గీ॥ పూర్వమందుఁ బశ్చిమదేశమున సమస్త
తీర్థవరమైన గోకర్ణతీరభూమిఁ

దనరుచుండె మధువ్రతమనఁగ నొక్క
యగ్రహారంబు సాధువిప్రాకరంబు 176

ఉ॥ అందలి యస్మదీయకులులందఱు వేదవిదుల్ దపోధనుల్
మందరధారిసంస్మరణ మగ్నమనస్కులు సద్వచస్కు లా
నందమయుల్ వికీర్ణదిననాయకనందను లధ్వరక్రియా
నందితదేవశేఖరు లనర్గళసర్వకళావిశారదుల్ 177

క॥ ఆ మహనీయనివాసగ్రామంబున గ్రామణీత్వగరిమంబునఁ ద
ద్భూమిసురవంశజుఁడ నే,నామున గోరాజిఖరము నట్టులనుంటిన్

క॥ క్రిమినలు శివిలును నాచే, నమరిన హేతువున గ్రామమండలిజనముల్
దమతమ వ్యవహారమ్ములు, విమర్శసేయంగ నన్నె వేఁడెడివారల్

గీ॥ అట్టిపట్టుల మాటనేర్పుట్టిపడఁగ
సారముండని లెక్చరు చాల చెప్పి
వచ్చిన తగాద తీర్పక వాయిదాను
వేసి పంపుదు లంచంపుటాసఁ జేసి 180

క॥ లంచము నెక్కువగా నర్పించెడు నవ్వాని దే యన్నృత మన్యాయం
బంచు నెఱింగియు మదినొ,క్కించుక శంకింప కతనికిచ్చెద గెల్పున్ 181

గీ॥ బ్రాహ్మణులయిండ్లఁ జక్కనిపడఁతి మంచి
వస్తువులు నాదు కనుదోయిఁ బడియెనేని
నా కరమ్మున కబ్బునందాఁక నాకు
నిదుర యొదవదు మదియును గుదుటఁబడదు 182

గీ॥ లేనితప్పులు శాఁపలపైని మోపి
దండుగలు దీసికొంటి నత్యంతముగను
సభల నన్నృతంబులే కాని సత్యమైన
పల్కు పల్కినయట్టి పాపమునఁబోవ 183

క॥ అక్రమమెట్టిదియైనన్, వాక్రుచ్చినయంత నెంతొ వడిఁ జేసెడి దు
ర్ధీక్రూరోద్యోగపేతులు నా,కై క్రిందన్ జెక్కుమందిగలరు మహాత్మా!

క॥ ఆకతమున నాకెల్లరు, లోకువనై వారి కల్మిలో నొక్కొకపాల్
నాకిచ్చి తృప్తిపఱచెడ, రేకాలము వారిమన్ని వృథపోకుండన్ 185

గీ॥ దోపిడులు సేయుచుండెడు దొంగవాండ్రు
బ్లాకుమార్కెట్టులొనరించు వర్తకులును
దుష్క్రియార్జకులగు నెల్లదుష్టజనులు
సెండఁజేసెద రఱపాలు ముందె నాకు 186

ఆ॥ తస్కరాళివలన దహానునివలనను, బావిచావువలనఁ గేవలమ్ము
నష్టమొంది కుందు నరుల రిపోర్టులఁ, బెదరఁజేసికొంటి విత్తమెంతొ

క॥ శుభముల నశుభవిధమ్ముల
సభయాత్మకులగుచు నచటి తన్మోసురతతి న
న్ను భుజింపఁగఁజేసి మఱి మ
దభిమతములఁ దీర్చివంపెదరు నన్నెపుడున్ 188

గీ॥ ఎచట భోజనమబ్బక నింటియందె
కుడువ నవసరమెపుడైనఁ బోడమేని
నాఁడు పెనురోగమున లంఘనంబొనర్చి
నట్టులుగనుండు నోజన్నిగట్ట నాకు 189

క॥ ఇట్టుల సాధుల వెతలం, బెట్టుచు దుర్వృత్తిఁ గూడఁబెట్టిన ధనమున్
గట్టులఁజేసితి లెక్కం, బెట్టఁగలే రద్ది యెంతవినువనివారున్ 190

సీ॥ ఆపోశనముఁ బట్టునప్పు డేతెంచిన
యభ్యాగతికిఁ బట్టెఁడన్నమిడక
భిక్షాటనముసేయు వికలాంగ వృద్ధుల
కేని గుప్పెఁడు గింజలైన నిడక
తలిదండ్రి తూర్ధికముల భోక్తలకె కడు
పారఁగాఁ బప్పుకూడైన నిడక
గ్రహశాంతికపతనాదికములైన పున్నెంపుఁ
[illegible] గాజాలనొక కాని ఖర్చునిడక

గీ॥ నాలినిం బిడ్డలను సరియైనరీతిఁ
బోషణముసల్ప కాకలివోవఁ దినక
దుడ్డునంతయుఁ గేపలా వడ్డికిచ్చి
పెంపొనర్చితి బీదల కొంపలార్చి　　191

ఉ॥ దానము సున్న సంధ్య కడుదబ్బర తీరువుసేఁత కాంచనా
ధీనము సత్యమన్న మృగతృష్ణలనీరు దయారసంబు వై
జ్ఞానరత ప్తలోహగతవార్లవమక్రమమాసురంబు కా
పీనముకాణయాచియె పవిత్రచరిత్ర! సుశీల! నాయెడన్　　192

గీ॥ పంక్తిభోజన మబ్బినపట్ల నల్వు
రనుకొనఁగ దొంగజపము నే నాచరింతు
నేమి మంత్రంబటందువో "యెవనికొంప
తీతునా" యన్న యష్టాక్షరీతిలకమె　　193

మ॥ ధనసంబంధవిహీనమైన భగవద్ధ్యానార్చనల్ చేసి యై
న నెఱుంగం బ్రుటియైన విష్ణునికటానన్ దీపమేఁ బెట్టలే
దనయమ్మోం బరకామినీ ధనగతస్వాంతుండనై యుంటచే
ననఘా! యేమనిచెప్పవాఁడను మదీయంబైన యేనస్తతుల్　194

గీ॥ ఏను నాయంతి సత్సంగమెఱుఁగఁ దమకుఁ
దామె సజ్జనుల్ నేనున్నతావుఁజేరి
సత్కథలు ముచ్చటింప నా స్థలమువదలి
చనెద ననుఁబోలు దుర్జనసమితికడకు　　195

క॥ హరికథలకరిగియెఱుఁగను, హరికథ చెవిఁబడిన లేచియరిగెద నెడగాఁ
బరులకు నపకృతిదక్కన్, జరుపఁగలేదెప్పు డిట్టిజనులకుపకృతిన్　196

వ॥ వైకుంఠైకాదశీ ప్రముఖసుదినంబులనైన నుపవసింపకపోవుటట్లుండ
దుర్వ్యసనంబులన్మానక మహాపర్వపుణ్యాదినంబుల నొడలు చక్కఁ
దడియువడువున స్నానంబైనఁ జేయక యూహాతెలిసినది మొదలు
దండ సహాయంబునఁ దిరుగఁగలయంతవట్టు సజ్జనకంటకుండనై

ప్రవర్తించి తుదకు ముదిమికిందోడు దుష్టకుష్ఠవ్యాధిబాధితుండనై మలమూత్రంబులు నన్నపానంబులు మంచమ్మునందె యగుట దుర్గంధదూషితుండనై దారపుత్త్రాదులైన డగ్గరఁజేరునర్హతలేక పెక్కేండ్లు క్రిమికీటకపాటితశరీరుండనై యుండి దేహంబు విడిచి యమలోకంబునకరిగి నా పాపంబులకుఁదగినట్లు రౌరవాది నానావిధ నరకంబుల బహుసహస్రహాయనంబులు నుడువరాని బాధలనుభవించి కాలకింకర విముక్తుండనై యిలాతలాంబునకు వచ్చి సృగాల బిడాల సారమేయ రాసభ సూకరాదిక నీచయోనుల ననేకపర్యాయంబులు జనించి తుదకు 197

క॥ మానవదుర్గమమగు నీ, కాననమున రెండుకాళ్ళు ఖదిరాకృతిపై
మే ననురాకృతియునుగా, నేనుద్భవమైతి దళితహృదయారాతీ! 198

ఆ॥ కాళ్ళు చంద్రచెట్టువేళ్ళుగాఁ బుడమిలో
నిమిడియున్నకతన నిట్టునట్టుఁ
గదలమెదల వీలుగామి నేప్రాణియుఁ
బడని యిడుమలెన్నొ పడుచుచుంటి 199

చ॥ అనఘచరిత్ర! యివ్వని మదంతికసంచరజంతుసంతతిన్
దినదినముం దినందిన గతించె నఱాకటఁ గొంతకాల మా
ఘనిత్రుధ నేనొనర్చెడి విరావములన్ భయమంది చేతికం
దనిగతి దవ్వుదవ్వులఁ జనందొడఁగెన్ మృగముల్క్రమంబుగన్ 200

క॥ మృగరక్తమాంసములచే
దగయును నాఁకలియుఁ గొంత తగ్గించెడి నే
ను గడకు నవియున్ దొరకమి
సగమున సగమైనవాఁడ నంయమిరేఁడా! 201

క॥ నాకాఁకలి పెరిగినయటు, నాకెలఁకుల ఖదిరకుజగణమ్మభివృద్ధిం
గైకొని కరువలికతమున, నాకాయమ్మెల్లఁ బెనువ్రణమ్ములఁజేసెన్

సీ॥ ఆ వ్రణమ్ముల వెడలెడు నస్రమాంస
ములను బెనుతుత్తిపాసలఁ బొగిలి యెందుఁ

జనఁగజాలని నేను నా జఠరవహ్ని
కాహుతిగఁ జేసికొనుచుంటి నఘవిదూర! 203

గీ॥ ఆత్మర క్తమాంసాదినై యధిక హేయ
గతిని నేనిట్లు పెక్కేండ్లు బ్రతుకుటరయ
రాక్షస తపస్విలకు నమరత్వమిాని
ధాత వెఱచి నాకిడినచందమ్ము దోచె 204

చ॥ సదయహృదబ్జ! సజ్జనులస్వాంత మదెంతయు వెన్నకన్ననుఁ
మృదువనిపల్కు విజ్ఞుల సమిద్ధవచస్సులు మిాకెచెల్లె దు
ర్మదమునఁ దొల్లిచేసిన దురంతమహాఘఫలంబుగా వనిం
గదలఁగలేక కేకలిడు కష్టుని నన్గని జాలినొందుటఁ 205

గీ॥ జలమొ పత్రమొ పుష్పమో తలనువేసి
దోసిలొగ్గ దయంగంట జేసికంటి
నల్పసంతోషియందు రెయ్యదియులేక
దయనుగన్న మిా కేబిరుదంబు తగునొ? 206

వ॥ మహాత్మా! భవద్వదనసహస్రపత్రదర్శనమాత్రంబున నాకుఁ బూర్వ
జన్మజ్ఞానంబుగల్గె. తుదలేనివెతలం బరితపించుచున్న నన్నుద్ధరింప
వేంచేసిన నీవు శంకరుండవో లేక దుష్టదైత్యనాశంకరుండవో కావ
లయుఁ గాకున్న నన్యుల కింతటి స్థైర్యంబును మహాత్వంబును
గలుగనేరవు. మహాత్ములకు దయగలిగినచో నెట్టికట్టిఁడినైనఁ
గాదవెట్టక ప్రోచెదరు కావున నన్నీవిపత్తునుండి రక్షింపుఁడు. కర్మ
ఫలానుభవంబుతీరక యింకను నేనిట్టులెయుండవలయు నేని హేయం
బులగు స్వీయకాయగళిత మాంసాస్రంబులఁ దినం ద్రావంజేయు
క్షుత్పిపాసలనైన లేకుండజేయుండని కరంబులు ముకుళించి నత
శిరస్కుండైన యా బ్రహ్మరాక్షసునితో సుశీలుండిట్లనియె 207

ఉ॥ పూర్వమునందు శ్వేతుఁడను భూతలనేత వదాతకీర్తి ని
ర్గర్వి సుపర్వపర్వత తిరస్కరణామితధైర్యశాలి యా

యుర్విని ధర్మమార్గమున నొప్పఁగ నేలి యెడందనూడులో
నార్వరనాఁగియేగి వని కచ్చట మూఁడవయాశ్రమస్థుఁడై 208

సీ॥ తపము పెక్కేండ్లు గావించి తనువుడించి
దేవపురికేగి యాఁకలిపోవ కేఁప
బమ్మదరిఁజేరి తన క్షుధాబాధఁ దెల్పి
యింది దేమనవాశ తానందుఁడనియె 209

చ॥ నరవర! రత్నగర్భకధినాథుఁడవై నపుడైనఁగాని సు
స్థిరమగు శాంతిఁ గానసముఁజేరి తపమ్మొనరించునప్పుడేఁ
దొరకొని యన్నదానమునఁ దుష్టియొనర్పవ యొక్క దేహికే
కరణినిబాయు నీకడుపుఁగాల్చెడి యాఁకలి యేడకేగినన్ 210

సీ॥ దానములలోన నుత్తమదాన మన్న
దాన మది సేయునటువంటి మానవుండు
వేరు పున్నెమ్మొలంజేసి వేల్పువీడు
సేరినను వాని కాఁకలిదీర కేఁచు 211

ఉ॥ పుణ్యము లెన్నొ చేసిన ప్రపూతుఁడ వౌట ధరిత్రిలో మహా
రణ్యమునం దపస్వితఁదొఱంగిన నీతను మాంసఖాదివై
మణ్యభిరామమైదైవత విమానమునం జరియింపుమిచ్ఛమై
గణ్యచరిత్ర! యన్న నృపకాంతుఁడు శ్వేతుఁడు ధాతకిట్లనెన్ 212

వ॥ దేవా! మద్విసర్జితశరీర మాంసాహారంబున నొక్క దివసంబెసను. మఱునాఁడేమిసేయవలయు. ఇట్టి దుష్టాహారంబునఁ గడపు కాలంబు నకుఁ దుదియెన్నండో సెలవిండన్న "నరేంద్రా! నీశవంబు చివుకక యేనాఁటికానాఁడు పూర్ణమాంసంబగుచుండు. ఇట్లు పెక్కువేలేండ్లరుగ నగస్త్యమహామునివలన నీ క్షుత్పీడ వీడునని నలువవలికిన నా శ్వేతుం డట్లనలిపె. నీవొయన్నాది నానావిధోత్తమదానంబులలో నొక్కటియైన నణుమాత్రంబుసేయక సర్వదా పరపిండాదుండవై శంకింపక సాధువిప్రుల వేధించితి వట్టినీకేవిధంబున నీహేయాహారంబు దప్పవనిన నా బమ్మరక్కసుండు 213

మ॥ ఘటసంభూతమహర్షి దర్శనమునన్ తుర్మానేత యాత్మీయమా
ఘటసంజాతపలాశితన్వదలి స్వర్గంబాది సద్విష్టపో
ద్ఘటసౌఖ్యంబులఁ జెందినట్టులు భవద్వక్త్రాబ్జసంవీక్షణా
ఘటనం ద్వత్కృప నేను బాధలఁదొలంగంబోలదే సంయమీ!

గీ॥ ధైర్యగురుతను వింధ్యభూధరము వంచి
కడుగభీరతఁ గడలి సొంపుడుగఁ జేసి
మహిత వైదగ్ధ్యవరమూర్తి మనము నిలుపు
మీ రగస్త్యున కెనయైనవారె కాన 215

క॥ శ్వేతుని దుష్స్థితి కలశీజాతుఁడు పోకార్చినట్టిచందమునఁ గడున్
రోఁతగఁ బ్రతికెడి నను బరిపూతునిగావించి ముక్తిఁ బొందింపఁగదే!

క॥ అని పెక్కుగతుల దనమన మునఁజాలి పొసంగునట్లు మొఱవెట్టెడు న
ద్దనుజునితో మునిపతి యీవనిదాపున జలములున్నవా చెప్పుమనన్

క॥ ఆ మనుజాశనుఁ డనియెన్
స్వామీ! యీ వనమునందు జలములు పండ్రెం
డామడల కవల నున్నవి
యీమధ్యధరిత్రి లేవిఁ కెట్లో నాఁగన్ 218

క॥ తనయులు నీకుం గలరా, యనఁ దొలిపుట్టువున నల్వురాత్మజులవ్వా
రును సర్వవిధుల మానీ, నను మేలనిపించిచనిరి నరకంబునకున్ 219

గీ॥ వారి పుత్రులు పౌత్రప్రపౌత్రు లింత
వఱకు నస్మన్మధువ్రతపురమునందుఁ
గ్రమత గ్రామణిపదమునఁ గ్రాలి దురిత
కర్మములఁ దండ్రులను మించఁగలిగివారు 220

క॥ మామకకులజుఁడు బాష్కల
నామకుఁ డిపుడప్పురమ్మున న్నివసించున్
గ్రామణియై దుష్టజన
గ్రామణియై యతనికతనఁ గార్యముఁగలదే 221

సీ॥ వాఁడు పెద్దలనుడి వినువాఁడుకాడు
మావలె న్మెఱమెచ్చులమాటలైన
నాడఁ డాతనివలనఁ గార్యంబు సున్న
తమరె యెటులైన నా వెతల్ దలఁగుఁడన్న 222

సీ॥ బ్రహ్మరాక్షస! నీవింక భయము శోక
ముడుగు మే బాహ్మణుని జేరి యుగ్రవనిని
నీ పడెడు బాధలెల్ల గణించి వాని
వలన నీబాధఁ బాపెదుభరము నాది 223

క॥ అరిగెదననఁగా దైత్యుఁడు
కరములు జోడించి మీ ముఖవిలోకన మా
మొఱకుఁ జ్ఞానిని జేయదె
పరోపకారాచరణసుభావ! సుశీలా! 224

వ॥ అను నా బమ్మరాకాసికి దిటవుగలుగు మాటలుసెప్పి యటవెడలి కతిపయప్రయాణంబుల గోకర్ణక్షేత్ర సమీప మధువ్రతగ్రామమ్మఁ జేరి యందు బాహ్మణుంగని వానితోఁ దానుఁగనిన తత్పూర్వప్రపితామహుని దురవస్థ యంతయుం జెప్పిన 225

ఉ॥ బాహ్మణుఁ డా సుశీల ముఖపద్మసమీక్షణచే స్వకీయమా హమ్మృతజాలముం దెలిసి దుర్భర వేదనఁజెంది మానిప త్ప్రమ్కారమంటి క్రొక్కి మునిపుంగవ! ధారుణిమిమ్మఁబోల్ దయా పుష్కరధుల్ గలారె? శ్రమముల్సహియించితి రస్మదర్థమై 226

క॥ ఎక్కడ ఘోరాటవియో
యెక్కడ మత్పూర్వబాధ లీక్షించుటయో
యెక్కడ మధువ్రతమో
యెక్కరణిని మీర లీడ కేతెంచితిరో? 227

వ॥ మహాత్మా! సజ్జనులగు మీకుఁదక్కఁ దక్కొరులకిక్కరణిం గోపింపం బోలునే! మదీయప్రప్రపితామహ దుర్గతిమోక్షంబున కే నేమి యొనర్పవలయు నానతిండని ప్రార్థించిన సుశీలుండిట్లనియె 228

క॥ మాఘస్నానముదక్క మ
హాఘౌఘములడఁచి మోక్షమందింపఁగ నిం
కే ఘనమఖములు వ్రతము ల
మోఘత్యాగములు శక్తములు గావెప్పుడున్ 229

క॥ వ్రతములలో నుత్తమమగు
వ్రతమ్ము మాఘవ్రతమ్ము బాహ్మల! యది నీ
వతిభక్తి నాచరింపుము
హతమగు స్వాఘములు పూర్వికాఘౌఘంబుల్ 230

గీ॥ మాఘమాసవ్రతమ్ము సమగ్రభక్తి
సలుపువాఁ డాత్మపాతకజలధిఁ దాఁ ద
రించి తన పూర్వపితలఁ దరింపఁజేయుఁ
గాన కావింపు మద్దానఁ గలుగు ముక్తి 231

వ॥ ఘోరనారకవాసులైన నీ తండ్రి మొదలు దుర్గమగహానంబున ఖదిరకుజలీనుండగు నీ ప్రప్రపితామహ పర్యంత పితృకల్మష కష్టంబులు వాపుటకు నాకంబునకనుపుటకు నీకిష్టంబేని స్నానాదికంబగు మాఘవ్రతంబొనర్పు మెల్లియ మాఘమాసంబు ప్రవేశించు నీ వా వ్రతంబాచరించుట నిక్కువంబేని నే నీనాఁటిందుండి తద్విధానంబు నీకుపదేశించి చనెదనన నాతండు మహాప్రసాదంబనుటయు సుశీలుం డానాఁ డట నెయుండి మఱునాఁ డరుణోదయంబునకు ముందె మధువ్రతపురమ్మున కించుకయెడమ్ముగా నుండు తటాగమ్మున కా బాహ్మలుం దోడ్కొనిపోయి సంకల్పవిధానంబున స్నానంబును దర్పణంబును జేయించి మఱియు వలయు విధంబులెల్లఁ గఱపి చనియె నంతట నుశీలుండు చెప్పిన తెఱంగున బాహ్మలుండును 232

శా॥ మాసంబంతయు స్నానతర్పణములున్మానాధపూజల్ వ్రతాల్
ధీసంపన్నధరామరప్రతతి తృప్తింజెంద నన్నాంబుగో

వాసోభూధనదానముల్ సలిపి తత్ప్రాప్తోరుపుణ్యాంబు సం
త్రాసార్తుల్ గను బమ్మసోకునకు ధారాదత్తముం జేసినన్ 233

ఉ॥ పాదపటుత్వమడ్గి బహుబాధలఁ బెట్టినయట్టి చంద్ర యన్
పాదప మప్డెపీలి ధరపైఁబడ బాపనసోకు సమ్మదా
పాద పరాత్పరస్మరణ భక్తినొనర్చి త్యజించి వేగ వ్యా
పాదపరాయణాకృతిని భాస్వరమూర్తిని జేరె శ్రీహరిన్ 234

ఆ॥ పాపభీతుఁడైనవాఁడు మాఘస్నాన
మాచరింపవలయు నద్రితనయ!
భక్తి వీడి గర్వపరతఁ జేయనివాఁడు
నరకబాధ లెపుడుఁ బొరయుచుండు 235

వ॥ అని శివుండు పార్వతికిం జెప్పినచొప్పున సూతపౌరాణికుండు
శౌనకాది మహామునులకుం జెప్పె. 236

—: ఆ శ్వా సాం త ము :—

మాలిని॥ దురితనివహదూరా! స్తుత్యకారుణ్యపూరా!
శరధినిభగభీరా! చంద్రమశ్ కీర్తిసారా!
వరదబుధకుమారా! బ్రహ్మవిద్యావిచారా!
ప్రరుచివిజితశూరా! రామయాభిఖ్యధీరా! 237

– గ ద్య ము –

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభాషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘపురాణము

## తృతీయాశ్వాసము

క॥ శ్రీరాజితకావ్యాచర, ణారూఢ యశోవిశేష! యాశ్రితపోషా!
యేరుచుఁడి నృహరి కరుణా, సారోద్యత్తేజ! రామసచివబిడౌజా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యాశ్రమణ్యులగు శౌనకాది మహానివ
ణ్యుల కఖిలపురాణకథాకథన ప్రఖ్యాతుండగు సూతుండిట్లనియె
నవ్విధంబునఁ గైలాసంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబుఁ
దెలుపుచున్న శివుండు 2

క॥ గిరిజా! మున్నొక విద్యా
ధరజ తపస్స్నానమహిమ దైత్యేశుచేఁ జం
దొఱఁగి హరిభక్తు వరునిగఁ
బొరసి సుఖంబొంది తుదకు మోక్షముఁ గాంచెన్ 3

క॥ నావిని పార్వతి దేవా!, యా విద్యాధరజచరిత మాద్యంతముగాఁ
నావీనుఁగవకు మోదం, బావహిలం జెప్పు మంజులాలాపములన్ 4

క॥ ఇట్లు వేడిన పార్వతి కిందుమౌళి
చెప్పఁదొడఁగె విద్యాధరశ్రేష్ఠుఁడొకఁడు
సంతులేమి సంతాపితస్వాంతుఁడగుచు
ధాతఁగూర్చి గంగదరిని దపముఁ జేసె 5

— విద్యాధరుఁడు తపమ్మున బ్రహ్మవలన వరమొందుట —

క॥ నిలిపి సకలేంద్రియమ్ములఁ
జలి కెండకు సైచి ధాతృసన్మంత్రము ని
శ్చలభక్తిఁ జపించుచుఁ దా
సలిపెఁ దపమ్మతులభంగి శ్యామశుభాంగీ! 6

క॥ ఆ యనఘుని తపమటు సుర
హాయనములు వేయి జరిగినంతట వాణీ

నాయకుఁడు మెచ్చి తెల్లని
చాయఁగొనబారు నంచ సాంద్రాణిపయిన్ 7

గీ॥ అధివసించి రయమ్మున నరుగుదెంచి
తనను ధ్యానించుచున్న విద్యాధరేంద్రుఁ
గాంచి వచియించె నీవు కావించుచున్న
దుష్కరతపమ్ము నాకు సంతోషమొసఁగె 8

క॥ విద్యాధరవర! వరముల, నుద్యత్ప్రేమమున నీకు నొసఁగుటకై యే
నుద్యుక్తుఁడనై వచ్చితి, సద్యస్తపముడిగి యడుగు స్వాభీష్టంబుల్ 9

వ॥ అను నలువ పలుకులు చెవుల కమృతోపమానమ్ములుగా సోఁకిన విని నిమీలితలోచనుండై తపమ్ముసేయుచున్న విద్యాధరుండు కన్నులందెరచి యెదుట సాక్షాత్కరించిన స్రష్టకు సాష్టాంగనమస్కారంబు లొనర్చి లేచి కరపుటీఘటితనిటలతటుండై యిట్లని నుతించె 10

సీ॥ సత్యనివేశాయ శారదాధీశాయ
పాపనాశాయ తుభ్యం నమోస్తు
ఖండితమోహాయ కనకాభదేహాయ
హంసవాహాయ తుభ్యం నమోస్తు
నిఖిలగరిష్ఠాయ నిర్జరజ్యేష్ఠాయ
యతులనిష్ఠాయ తుభ్యం నమోస్తు
చతురాననాయ శ్రీపతి నాభిజననాయ
పద్మాసనాయ తుభ్యం నమోస్తు
గీ॥ మౌనిసంతాన శరణాయ తే నమోస్తు
త్రిభువనీసృష్టికరణాయ తే నమోస్తు
ధీరసన్నుతచరణాయ తే నమోస్తు
దీనభర్మణాయ ద్రుహిణాయ తే నమోస్తు 11

చ॥ ఇందిరకున్ సమస్తజగదీశ్వరుఁడుం గరుణాబ్ధియైన గో
విందునకుం గుమారుఁడవు విశ్వసృజుండవు దేవదానవా

నందకరుండవ ప్పలుకునాతికి నేతవునైన యో శతా
నంద! త్వదాస్యదర్శనమునం జరితార్థుఁడనైతి నెంతయున్ 12

చ॥ కడుపు ఫలింపకుండుటను గాపురమందలి కల్మి తెల్లఁ గా
ఆడవినిగాయు వెన్నెలలయట్టులు రిత్తలెయయ్యెఁ గాన నా
యొడలి కెడందకింటికిని నొవ్వనుక మ్మరుసమ్ము సొంపు నే
ర్పడఁగ నొసంగు మొక్క మగపట్టిని మేలిగొనాల జెట్టినిన్ 13

క॥ ఆ మాటలు విని పల్కెను
తామరసోద్భవుఁడు నీకుఁ దనయుఁడు వొడమం
డీమెయి నొక కూఁతురు సుగు
ణామేయచరిత్ర జననమందునటంచున్ 14

క॥ అది విని విద్యాధరవరుఁ
డిదియేమి మహానుభావ! యేఁ దనయునకై
కద తపియించుట నా కీ
కొద తీరకయున్న ముదముగూరునె యనుచున్ 15

మ॥ వినతుండై సుకుమారుఁ గోరుకొను నా విద్యాధరశ్రేష్ఠుతో
ననఘా! నీకు జనించుపుత్రి నిజపుణ్యాస్ఫూర్తిచే దుష్టనా
శనమున్ సల్పఁగఁ జేసి సౌఖ్యపడు నిన్ సంతోషిగాఁ జేయుఁ బొ
మ్మనుచున్ బమ్మ యదృశ్యుఁడయ్యెఁ జనె విద్యాభృద్వరుండింటికిన్

గీ॥ అట్లు విద్యాధరుఁడు ప్రాపితాభిలాషుఁ
డగుచు నిలుసేరి యచటి వృత్తాంత మాత్మ
కాంత కెఱిఁగించి సుఖముండఁ గొంతకాల
మునకుఁ దత్సతి గనె నొక ముద్దుకొమరి 17

క॥ ఆ బిడ్డ శుక్లపక్షపు, జాబిలిరేకవలె పెరిగి సంపూర్ణకళా
ప్రాబల్యంబున యువకుల, ధీబలముఁ గృశింపఁ జేసె ద్విజరాజముఖీ!

వ॥ అట్లు నవయౌవనవతియు విద్యావినయవతియు సన్మతియు నిరుప
మాన సౌందర్యవతియు నైన తమ తనయంజూచి విద్యాధరదంపతు

లుద్వాహంబుసేయు నూహమెయినుండి పుత్రికకుఁ దగు వరుని
వెదకించుచుండ నందు విద్యాధరి తన భర్తతో నిట్లనియె 19

మ॥ వ్రతముల్ దానములుం దపంబులు నొనర్పన్నేటికత్తోయభూ
సుతు కారుణ్యమునం గుమారిక మనస్తోషంబుగాఁ గల్గె మేల్
సుతయైనన్ సుతుఁడైన నీమెయగుటన్ జూడ్కుల్ నిమేషంబు సు
స్థితిమై నుండఁగనోడు నాడుకొన నెందేఁ బోయినన్వల్లభా! 20

సీ॥ కన్యఁ బరిణయమైనంతఁ గాపురమున
కత్తవారింటి కనుపు టెందైనఁ గలద?
దీని నారీతిఁ బంపి నామేన నొక్క
నిముస మునురులు నిలువఁగా నేరఁ గాన 21

చ॥ ధనికుఁడు గాకయున్న గుణధాముఁడు సత్కులజుండు సుందరుం
డనఘుఁడు మేల్కళాన్వితుఁడు యౌవనవంతుఁడు ధీరుఁడైనవా
నిని వెదకింపుఁ డాతనికి నెమ్మిఁగుమారికనిచ్చి పెండిలిన్
బొనరిచి యింటనుంచికొని పుత్త్రముకాలము సంతసంబునన్ 22

మ॥ అనుచుం బుత్రివియోగమొప్పనిప్రియావ్యాహారమాలించి తా
ను నదేరీతిని జాలిఁజెంది మన మెంతో ప్రేమతోఁ బెంచినన్
దనయన్ భర్తృగృహంబు సేర్పవలెఁ జింతంజెందినం దప్పదై
నను నీమాటను ద్రోయకట్టులనె యత్నం బేను గావించెదన్ 23

వ॥ అని చెప్పి విద్యాధరుండు గుమారికకుం దగు వరాన్వేషణ
మొనర్చుచుండ 24

— వీరుఁ డను రాక్షసుని చరిత్రము —

క॥ వీరుఁ డను దనుజవర్యుకు,మారుఁడు కులదేవతయగు మాయాశక్తిన్
గూరిచి తపమొనరిచి త,త్కారుణ్యప్రాప్త సర్వకాంక్షుండగుటన్

సీ॥ సర్వవిద్యల సర్వశాస్త్రముల శ్రుతులఁ
బండితుండయి శాస్త్రార్థవాదనముల
దక్షుఁడై కామరూపకధారి యగుచు
వివిధశక్తియుత మాయాయుద్ధ విజయుఁడగుచు 26

గీ॥ దేవ భూదేవభయదుఁడై దిక్కులెల్లఁ
గెలిచి తృప్తుండుగాక నన్గొలిచి వరము
లందఁగా నెంచి తపముసేయంగఁ దగిన
తావు వెదకుచు ద్రోణాద్రిదాపుఁ జేరి 27

వ॥ అప్పర్వతంబు సర్వేంద్రియపర్వంబులగు పుష్పఫలభరిత నానావిధ దివ్యతరు లతావితానంబులతోడను స్వాదూదక మోదక నిర్ఝరములతోడను బహుఖగమృగంబులతోడను మనోహరంబుగా నుంటకు మెచ్చి దీనియందు మృతులైనవారిం బ్రతికింపఁగల విశల్యకరణి, సంధానకరణి, సౌవర్ణకరణి, సంజీవకరణి యను దివ్యౌషధీవిశేషంబులుండునని పెద్దలవలన వినంబడు నదియుంగాక 28

ఉ॥ కర్బురరత్నసంతతులఁ గ్రాలుచునుండెడి యిన్నగంబు మా
కర్బురరత్నముల్ తపమఖండముగా నొనరింప యోగ్యమా
పూర్బలభేది యిందు తపముల్ ఘటియించిన నన్ను మెచ్చి యా
యుర్బహుళత్వదార్ఢ్య విభవోజ్జ్వలశక్తులు నాకొసంగఁడే? 29

మ॥ అనుచున్ వీరుఁడు నిశ్చయాత్మకుఁడునై యా ద్రోణశైలోత్తమం
బున మేలౌ చరియన్ జలాశయము నింపున్నింపు మారేడుచె
ట్టును నెల్గొందు ధరిత్రి వజ్జ తుదిఁ బ్రేల్వొందించి చూపున్ ఖరాం
శునియందుంచి మదీయమంత్రము జపమ్మున్ జేసె సన్నిష్ఠుఁడై 30

శా॥ ఆ జాడన్ బదిరెండుమాసములు క్రవ్యాదాధినాథుండు నా
పైఁ జిత్తమ్మును జేర్చి హెచ్చుగఁ దపింపన్ మెచ్చి శూలంబు నా
కైఁ జెల్వొంద వృషేంద్రు నెక్కి కృప సాక్షాత్కారమున్ జేయ ర
క్షోజాతాగ్రణి భక్తి పెంపున నమస్సుల్ పెక్కుగావించుచున్ 31

వ॥ వినయవినమితశిరస్కుండై యిట్లని స్తోత్రంబు గావించె 32

— అశ్వధాటీ వృత్తము —

కాళీ మనఃకమలజాళీ! సుధాకిరణమాళీ! దయాజలనిధీ!
నాళీకభూముఖసురాళీడ్యతాండవసుకేళీ ప్రశస్తనటకా!

హేళీందుచక్రయుగ! వ్యాళీవిభూషణ! మరాళీవళక్షతనుభా!
శూలీ! మహాసుగుణశాలీ! మహేశ్వర! కపాలీ! హాలాహలగళా!

బాణాసురావనధురీణా! సదాసుహృదరీణార్థ సౌఖ్యదఘృణా!
బాణాయితాద్రిధర! తూణాయితాబ్ధివర! వీణామునిస్తుతగుణా!
ఏణాంకధారి! సుమబాణాసనారి! గిరిబాణాసనా! వృషభకం
ఖాణా! శ్రితాఘహిమశోణామరా! గిరిశ! క్షోణాధిపా! ఫణిగుణా! 34

ఈశా! సమస్తజగదీశా! నిరస్తభవపాశా! మహేశ! మునిభూ
క్లేశాపహా! గగనకేశా! ప్రవర్ధితసుకేశాసురా! సురవరా!
కాశాధిపాభరణ! కాశాబ్జకుందనిభ! కాశాధిపేడ్యచరణా!
దాశార్హజారి! సుహృదాశార్హమోక్షద! సదాశార్హ! పూర్హర!
హారా! 35

శైలాలయా! భువనజాలావనోల్లసన! హాలాహలాంచితగళా!
ఫాలాక్షజజ్వలనకీలా విదగ్ధరతిలోలా! శిరశ్శశికళా!
వ్యాళాంగదా! రిపుమరాళాంబుదా! వ్రాతసుశీలాంగబాధకగదా!
శూలాయుధా! విలసితేలారథా! నటనలీలానుమోదితబుధా! 36

ఏఱున్ దలన్నిలిపి యూరున్మలన్నలిపి పేరున్ గడించు పబువా!
పోరున్ దినన్ దిరుగు పాఱున్ దివిన్ బెరుగుగౌరున్మొయిన్న గుదోరా!
యేరున్ నినున్ దొరయువారుండరంచుఁ బలుమాఱున్ దోసం
గడచు నీ
పేరున్ దలంచుచు జోహారున్ బొనర్తుఁ గొలబారున్ దొలంచు
పెరిమన్ 37

వ॥ ఈతీరున సన్నుతించిన నేనును 38

క॥ యాతుర్వాతాధీశ్వర!, సీతపమును సంస్తవంబు నిరుపమమై మ
చ్చేతః ప్రీతిఘటించె న,హా తెల్పు మొసంగెదన్ ద్వదభిమతమెల్లన్

మ॥ అని నేఁబల్కిన వాఁడు సంతసిలి సర్వాధ్యక్ష! ఫాలాక్ష! న
న్ననుకంపన్ దిలకించె దేని యని దైత్యధ్వంసిఁ జక్రాయుధున్

దునుమంగఁ లేడి శక్తి నిమ్ము సురసంద్రోహమ్ము దానమ్మదం
బును స్థైర్యంబును జెంది క్రమ్మరుత మెప్టున్ స్వేచ్ఛమై యెల్లెడన్

ఉ॥ నావుకు నవ్వి యో దనుజనాయక! చక్రిని బమ్మతంత్రి యు
ద్ధానిలో నెదిర్చి జయమందఁగ నాకును శక్తి చాల దే
నేవిధి నీకు వాని వధియింప వరమ్మిడ నేర్తుఁ గోరుకో
మ్మా విపరీతమైన చెడుమార్గముఁబట్టక మేల్వరమ్మనన్ 41

శా॥ ఆ మాటల్ విని రాక్షసుండు పరమేశా! కేశవున్ ఘోరసం
గ్రామోర్విన్ దునుమాడఁగా వరమొసంగ న్నీమనం బొప్పెకో
దేమో యట్టులనైన శత్రుతతి మాయింపంగ దక్షంబు యు
ద్ధామోఘంబు భవ త్త్రిశూలమది యిమ్మా సమ్మదమ్మొప్పడన్ 42

గీ॥ అద్ది నాకేలఁ గ్రాలుచో నసురవైరి
యొక్క లెక్కయె కృప శూలమొసఁగవయ్య
యంచు వీడఁడు వేడ నా హస్తమందుఁ
గల త్రిశూలాన శూలంబుఁ గలుగఁజేసి 43

వ॥ వానికొసంగి యీ త్రిశూలంబు నీకేలనుండ నిన్నెదిరించిన శాత్రవుం
డెట్టివాఁడైన నీచేఁ జచ్చు నిది లేనితఱిఁ గయ్యంబయ్యెనేని నీకు
మరణంబు దప్పదింతియ కాక ధర్మమార్గంబు వీడినను గీడుమూడుం
గావున జాగరూకుండవై మనుమన నాతండు "దేవా! నాయం
దేమేని ప్రమాదంబుఘటిల్లినను నీవిచ్చిన యీ శూలంబునందక్క
తక్కిన యే సాధనంబునం జావకుండ వరంబొసంగు" మన నట్ల
యగుతమని నేనంతర్ధానంబు నెందితి నంత వాఁడును 44

క॥ శూలము కేలం గ్రాలఁగ
నాలమ్మున నన్నుఁ గెల్చు నధికులుగలరేన్
వైశమ్మ రంకు రండని
ప్రేలుచుఁ జరియించె సకలవిష్టపములలోన్ 45

సీ॥ సోఁకుతేని శూలముశక్తి శూరులెల్ల
రెఱిఁగియుండుట వానితో దుర మొనర్ప

నే జగమ్ములన్ నెవ్వరు నేమటంచు
నెదుర లేరైరి యోటమి కిచ్చగించి 46

మ॥ అటు లా వీరుఁడు సర్వలోకవిజయం బార్జించి వారాశిను
ద్భటనిమ్నస్థలమందుఁ బూర్వరమురుప్రాకారసద్వారవి
స్ఫుట నానామణిభర్మసౌధపటలీ పూర్ణంబుగాఁ గట్టి మా
జట స్వర్గంబన నిష్టదాత్రి యగుచున్ రాజిల్లు మాయాదయన్ 47

ఉ॥ ఆ నగరీగరిష్ఠతకు నాతఁడు మోదము సెంది యాప్తులా
దానవనాథులన్ దితిసుతిప్రకరమ్ములఁ జేరఁదీసి ప్ర
జ్ఞానిపుణత్వమొప్పఁ ద్రిదశప్రభువైభవ మించు కేనియున్
లేని విభుత్వమున్ దొరయ నేరదనంగను నేలె లోకముల్ 48

శా॥ ఆ రాత్రించరనాథుఁ డవ్విధముగా నాప్తాసురశ్రేణితోఁ
బారావారజలాంతరస్థపుర మావాసంబుగాఁ జిత్తమం
దీ రాజ్యంబును నీ విలాసగరిమం బీప్రాయ మింపైనకాం
తారత్నమ్మును భార్యగాఁ గొనకయున్నన్ వ్యర్థమంచెన్నుచున్

గీ॥ అప్సరసలెల్ల కాంతలయందు మేలు
బంతులంచు నెఱింగియు వారియందుఁ
గన్నెతన మెన్నఁడో జారుకొన్నదగుట
వారుఁ జేపట్ట నర్హలు గారటంచు 50

క॥ పదునాలుగు లోకంబుల
ముదితలఁ గన్యాత్వమునను బొదలెడివారిన్
వెదకి తనమదికి ముదమిడు
సుదతీరత్న మ్మొకర్తుఁ జూపట్టమిచేన్ 51

వ॥ సంచలితస్వాంతుండై యదృశ్యాకారంబున లోకంబులెల్ల మరల
మరల తిరిగి తిరిగి పరిశీలించుచు నొకపరి నాకలోకంబున నొక్కెడ.

— వీరుఁడు స్వర్గంబున వైద్యాధరిఁగని మాటలాడుట —

శా॥ కాంచెన్ గాంచనగాత్రి నీలకచ రాకాచంద్రబింబాస్య రా
యంచన్మించిన మందయాన వికచాబ్జాభాయతాక్షిద్వయన్

బంచాస్యోపమమధ్యఁ బల్లవసదృక్పాదన్ లసన్నాసికన్
బ్రాంచద్బింబనిభాధరిన్ లలితశోభాహృద్య వైద్యాధరిన్ 53

గీ॥ చూచి యా మేచకాలక సొబగు మెచ్చి
కామరూపధరుండైనకతన నతను
తరుణమోహనరూపమ్ముఁ దాల్చి యింతి
పోవుత్రోవ నెదుర్పడి పొలఁతికనియె 54

ఉ॥ ఓ కమలాక్షి! లక్ష్మివలెనొప్పెడి నిన్ననినట్టి ధన్యుఁ డ
స్తోకగుణాంబురాశి పరిశుద్ధయశస్కుఁడెవండు రాణిగా
నీ కయిఁబట్టి హారిసుఖనీరధిఁ దేలెడి పూరుషోత్తముం
డే కులసంభవుండు వచియింపుము వీనులకిందు విందుగన్ 55

క॥ ఈ రేడుజగమ్ములఁ గల, వారిజలోచనలఁ గంటి వారెవరికి నీ
సౌరునఁ బదియాఱవపాల్, గూరుపఁడా బమ్మ యేటికో విరిబోఁడీ!

క॥ వినిపింపఁదగిన దేనియు
వినిపింపుము నీ చరిత్ర వెలఁదీ యన నా
తనికనియెను విద్యాధర
తనయ నయము భయముఁదోపఁ దతమృదులోక్తిన్ 57

గీ॥ అనఘు విద్యాధ రేశ్వరుం డంబుజాత
భవునివరమున సుతగాఁగఁ బడసె నన్ను
యోగ్యుఁడగు వరు వెదకుచునుండి తండ్రి
పరిణయ మొనర్పఁడయ్యె నిప్పటికి నాకు 58

క॥ అని చెప్పి పోవుచుండిన
వనితామణికనియె నతఁడు వనజేక్షణ! శం
భుని మెప్పించి వరమ్ముల
నెనసితి నను బోలఁ డెవ్వఁ డేవిషయమునన్ 59

క॥ సరియైన కన్య దొరకమిఁ
బరిణయమాడమియె కొఱఁత పడఁతీ! నన్నున్

వరునిగ నీవొప్పిన నా
కొఱంతయు లేకుండఁబోవుఁ గొలమలరారన్ 60

సీ॥ తగిన దాంపత్య మిది గానఁ దలిరుఁబోఁడి
సంశయింపకుమనుడు నా చాన వలికె
జనకపోషితనగు నన్నొసంగుటకును
గ_ర్త పితయాట నడుగు మా ఘునిఁ జేరి 61

ఉ॥ క్రోధము రాకయుండఁ దనకు న్వెత సుంతయుఁ గల్గకుండ వై
ద్యాధరి పల్కఁగా విని రయమ్మున నా దనుజాధిపుండు వి
ద్యాధరనాథుఁ జేరి వినయమ్మున మ్రొక్కి మహానుభావ! నే
సాధితసర్వలోకుఁడను జాలఁడు నన్నెదిరింపఁ జక్రియున్ 62

క॥ ఇలు వేలుపు కనికరమునఁ, గలిగెను సకలార్థసమితి గడియించితి వి
ద్దెలనన్నింటిని హరుదయ,వలనన్ శూలంబు నాకు వశమైయుండెన్

సీ॥ నాకుఁ దగినట్టి కన్య యేలోకమందు
నగపడకయుంట బ్రహ్మచర్యమున నుంటి
నేఁటికిం గంటి నీసుత నిరుపమాన
కన్యకామాన్య రాజన్యగణ్య ధన్య 64

వ॥ ఇట్టి నీ ముద్దుపట్టిఁ జెట్టఁబట్ట ననుగ్రహింపుమని పల్కు నమ్మాయావి
వచనంబులు తన మనంబునకు డంబంబులుగాఁదోచిన విద్యాధరుండు
వానితో నిట్లనియె 65

శా॥ నీరూపంబునకుం గళాగరిమకుం నీ బాహువిక్రాంతి కో
నూరిగ్రామణి! నా కుమారి తగ దెచ్చోనైనఁ దుల్యన్మనో
హారిన్నారిని జూచుకొమ్మరుగు మీా యబ్జాక్షి నీకీయఁగా
నేరన్నే నన వాఁడు సిగ్గువలనన్జేరె న్నిజాగారమున్ 66

సీ॥ అరిగి రాక్షసవిభుఁడు విద్యాధరేంద్ర
వందనా సుందరాకృతి డెందమందు
నిలిపి కందర్పదర్పనిర్గళిత ధైర్య
సారుఁడై యిట్లు దలఁపోయసాఁగె వాఁడు 67

సీ॥ మోము వెన్నెలలీను గాము కీల్జడ పాము
చూపువలపు రేడు జోదుతూపు
ముక్కు సంపగిమొక్కు మోవి తేనియక్రోవి
కురులు కొదమతేఁటి మెఱుఁగుగఱులు
కుచములు హారిలికుచములు నూఁగారు
కప్పురంగు పిపీలికముల బారు
ఊరువుల్ రంభికాదారువుల్ మీఁగాళ్లు
తాబేళ్ళు గోళ్ళు ముత్యాలచాళ్ళు
గీ॥ గమము చతురాననుని తురంగమము మధ్య
మమ్మ గగనమ్మ జఘనమ్మ మహితలమ్మ
కంధరమ్మ రమాసుతు కరదరమ్మ
భళిరె! యీ బాల నెనయని బ్రతుకదేల? 68

వ॥ అనుచు నమ్మందగమన సౌందర్యంబు డెందంబునం దలపోయుచు నయ్యహోరాత్రంబులు రెండును రెండు బ్రహ్మకల్పంబులమాడ్కి నేగించి తుద కేయుపాయంబుననైన నవ్విద్యాధరతనయఁ దన యవసథంబునకుఁ జేర్చుటయె కర్జంబని యన్నిర్జరవిరోధి మనంబున నిశ్చయించుకొని 69

మ॥ మరునాఁ డా తొలినాఁటిచందమున నమ్యుగ్రూప మేపారఁగాఁ
గరమం దుగ్రవరాత్తశూలము వెలుంగన్ మాయకాఁడౌట నె
వ్వరికిం గన్పడకుండఁ బుష్పలతికావాలంబుల న్నీరు బం
గరుబిందెన్ గొని తెచ్చిపోయు సుగుణౌఘస్థాన వైద్యాధరిన్ 70

క॥ చేరంజని సుమకోమలి!, చారునవీనప్రవాళసమకర పదముల్
కాఱియపడ నిటు లతలకు, నీరిడు నినుఁజూడ మనము నీరైపోయెన్

గీ॥ భర్తగా నన్ను నీవు చేపట్టు మిపుడె
దేవనాథుని రాణిచే దినదినమ్ము
వరవుడము నీకుఁ జేయింతుఁ దరుణి యనెడు
వానితోఁబల్కె నా యింతి భయమునొంది 72

గీ॥ నిన్న మా తండ్రి నీతోడ నన్నదేమి
మరల నిపుడీవు వల్కెడి మాటలేమి
సదువులన్నియు నేర్చుట జ్ఞానమెనసి
నట్టివాఁడవు నీ విట్టులాడఁ దగునె? 73

క॥ వెలచెలులతోడఁజలె స
త్కులజాతులతోడ నొంటిఁ గొంకక యిటు వి
చ్చలవిడి మాటాడుట యో
గ్యులకుం ధర్మంబె? యెఱుఁగవొకో నీవిదియున్ 74

చ॥ అని తలవంచి నీరమునకై చను సుందరిఁగాంచి పోకుమీ
వనితరో! నీ సుఖంబును భవజ్జనకుండు తలంచెనేని యీ
నని నను బంపునే? తెలివియబ్బిన నీవయినన్ రవంత యో
చన మొనరింపకేగెదవు సౌఖ్యముఁ కెట్టుల నీకుఁ జేకురున్ 75

గీ॥ జ్ఞానమొదవిన నీవు గాంధర్వవిధిని
నన్నుఁ బెండ్లాడు మొరుపెత్తనంబదేలఁ
గాలహారణంబుసల్పకు కల్కి యనెడు
నతనితోడ విద్యాధరసుత వచించె 76

సీ॥ బలపరాక్రమముల భాగ్యభోగంబుల
నసదృశభంగి నీ వెసఁగుచున్న
గాంధర్వవిధిఁ బెండ్లి కలుపదూరంబైన
నా తండ్రి తనకు సంతాన మెంతొ
కాలంబు లేకున్నఁ గమలాసనునిఁగూర్చి
తపమాచరింప నాతండు మెచ్చి
యిచ్చిన వరమున నేన జన్మించుటఁ
బ్రాణంబులెల్ల నాపైని నిల్పి
గీ॥ పెంచుచుండిన తండ్రి యభీష్టమేం స్వ
తంత్రనై పీటబుచ్చఁగాఁ దగునె నన్నుఁ

గాన కాతండు బ్రదుకనే గడియసేపు
తగనిపని యిద్దియాట నీదారిఁ జనుము 77

ఉ॥ మంచిగఁబోక యింకఁ జెడమాటలనాడుచు నుంటివేని ర
క్షించెదఁ దోటకాపరుల వీరులు వారలు చేరిరేని బం
ధించెదరన్న వాఁడు దరుణీ! వెఱపించెదె నన్నుఁగాంచు మీ
వంచును హుంకరించుచు భయంకరమౌ తనరూపుఁ జూపినన్ 78

సీ॥ అబల భయకంపితాంగియై యవశయగుచుఁ
జేతి బిందెను వదలి తద్భూతలమున
నల్ల నొరగుచునున్నచో నసుర పట్టి
చంకనిడికొని దివి నేగె సత్వరమున 79

వ॥ అట్టులా రక్కసుండు వైద్యాధరిం గొన్పుఁబోవునెడ మార్గంబునం గనిన దేవదానవ సిద్ధసాధ్య గరుడగంధర్వ కిన్నర వసురుద్రాదికు లెల్లరు దయాహృదయులయ్యు వాని శూలంబునకు వెఱచి తొలంగి చనుచుండ నిరాతంకగమనంబునఁ దన పురంబుఁ జేరి నిజప్రాసా దాంతర్భాగంబున నక్కాంబుకంఠిం డించి విశ్వాసపాత్రల రక్షః కళత్రంబులఁ గాపుంచి వారివలన నానేకనేక సౌకర్యంబులు గల్పించుచుఁ దనయం దనురాగంబువొడము నుడువులు బోధసేయించుచు

మత్తకోకిల॥ సర్వశాస్త్రములందుఁ బాండితి చాలగాఁ దనకున్న నా
పూర్వదేవుఁడు సత్యలోకమువోయి వేల్పులపెద్ద హాం
సార్వుఁగాంచి నమస్కరించి మహాత్మ! పెండ్లికిమూర్తమా
యుర్విపృద్ధిగఁ గాముసౌఖ్య మనూనమై తగఁబెట్టవే! 81

గీ॥ అనుచు వేఁడెను రక్కసుఁగని విధాత
నాకు సరియైన కన్య యే లోకమందు
లేదనెదవెప్పు డిపుడేడ నీ దృగబ్జ
హర్షదాయిని పొసఁగె నా నసురవరుఁడు 82

ఉ॥ వేధముజూచి కేల్మొగిచి విశ్వసృజా! మహితాత్మ! విూరు వి
ద్యాధరనేత కొక్కతనయం గరుణింపరె యద్ది నే జగ

చోధన సేయుచుండఁ గనఁ జొప్పడె నిప్పటికప్పాలంతి మ
త్స్నేహముఁ జెర్చినాఁడ సుఖసాగరమందెపు డోలలాడఁగన్ 83

ఉ॥ కావున మంచిలగ్న మనుకంప వచింపుఁడన న్విచారించి యా
దేవవిరోధి శాస్త్రము మదిం దలపోసి యతండు కామబా
ధావృతమానసుండగుట నన్యనయంబులు బుద్ధికెక్కవం
చావనజోద్భవుండు వన యంతికమందలి శిష్యవర్యుచేన్ 84

సీ॥ పంచాంగ మొకటి తెప్పించి పారఁగఁ జూచి
శ్రావణమందు దర్శతిథి నేఁడు
నేఁడాదిగా వచ్చు నేఁడాది పండుగ
లోన ముహూర్త మనూనగుణయు
తంబు గన్పడదు నూతనవర్ష పంచాంగ
మిప్పుడిప్పుడె గుణియించుచుంటి
మద్ది పూరితియైన యంత లగ్నముఁ జూతు
మరుదెమ్మ ఫాల్గునమందు మరల
గీ॥ శాస్త్రపద్ధతిఁ బెండిలి జరగనట్టి
కాంతఁ గూడిన దుష్ప్రజ గలుగుఁ గాన
నింక మాసాష్టకము దాఁక నెట్టులైన
మనసు నిలుపుము చనుమన దనుజుఁ డరిగె 85

వ॥ ఇట నసురచరిత్రంబిట్టులుండ నట నాకలోకంబున విద్యాధరదంప
తులు నిత్యంబు పూఁదోఁటనుండివచ్చు వేళ కానాఁడు తమ నందన
మందిరంబునకు రానందున నందురి యెల్లకడలును సందుగొందు
లును వెదకి వేసారి దురంతచింతాక్రాంతులై రందు విద్యాధరుండు.

ఉ॥ పుత్రిక! నీవు చేసిన తపోభవదివ్యఫలమ్ము నిన్న లో
కత్రయమాన్యుఁడౌ సుగుణకంధి కొసంగి వివాహ మొందు నే
మాత్రము లోటుపాటులనివాడ్కిని జేసి స్వధామమందె దౌ
హిత్రభవప్రమోదమున దృష్టిని జెందఁగఁ గోరియుండఁగాన్ 87

క॥ ఎవ్వడును కని విని యెఱుఁగని
చపలాత్ముండెవఁడొ వచ్చి జల్పము లెన్నో
త్రపవీడి పల్కి నిన్నుఁ
స్వపత్నిగ నొసంగుమన్న సమ్మతి గామిన్ 88

క॥ అతనికి నిన్నీ నంటిని, యతఁడే నీకిష్టుఁడైన నా మాటను నా
శ్రుతిఁబడ వేసిన వెంటనె, యతని కెసేయనొకొ పరిణయమ్ము కుమారీ!

క॥ నీవే ప్రాణమ్ముగ నెద, భావించెడి మమ్ముఁవీడి వాఁడెదొ బోధం
గావించిన భ్రమవడి వడిఁ, గైససమైపోవఁ దగవె కన్న కుమారీ! 90

వ॥ నీకుఁగల విద్యాపరిజ్ఞానంబును ధర్మాభిమానంబు బితృమాతృభక్తి
విధానంబును నిదానంబును మున్నుగాఁగల సద్గుణంబులగణించి
చూడ వాఁడెవ్వండొ ధర్మంబుదప్పి మాయావియై మందుమాకుల
వివశంజేసికొని పోయియుండుంగాని నీవు మనసార వానిం ప్రేమించి
మమ్ముఁ బరిత్యజించిపోతివనుటకు నా యంతరంగం బొప్పకున్నదని
కన్నుల నీరుఁగార్చుచుండ నాతని భార్య యిట్లని విలపించె 91

సీ॥ కాఁపురమ్మున కేవచ్చి పాపలకయి
మొగము వాఁచితి నెన్నేండ్లొ పుట్టితీ వా
కరుకవె నాకు నీ బాల్యకాలఘటిత
వివిధచేష్టలఁ గన్నను బిడ్డలందు 92

క॥ మోహమ్ము తీఱకుండుట
దౌహిత్రుల ముద్దుచేష్టితములం గనఁగా
నూహ యొనర్చితి మాతకు
ద్రోహముఁ గావింప నెట్లు దొడఁగితివమ్మా! 93

సీ॥ అన్నిట నీ కెనయైనట్టి పురుషుని
గొనివచ్చి నిన్నిచ్చి కులము మెచ్చఁ
బరిణయమ్మొనరించుపట్టునఁ బెండిలి
పీటలపై నీవు ప్రియుని చెంతఁ

దలవంచి కూర్చుండు చెలువమ్ముఁ దలఁద్రాలు
పోయుచోఁ బ్రియుచేయి చేయిసోక
సిగ్గొంది క్రీగంటిచేఁ జూచుచందమ్ముఁ
గాంచి హర్షించు భాగ్యమ్ము నాదు

ఆ॥ కన్నుదోయికిఁ బెండ్లి సింగారములను
జేయు భాగ్యంబు నా కేలుదోయికిఁ బతి
పేరు మెలఁబెట్టి చెప్పఁగా వినెడు భాగ్య
మకట! నా వీనుఁగవకు లేదయ్యెఁ బుత్రి! 94

చ॥ నిను గొనిచన్నదుర్గుణుఁడు నీచుఁడు నిన్నువశంబొనర్చుకో
ననయు మసత్యభాషణములాడుచునుంటఁ దృణీకరించి మ
మ్మునె తలఁపోయుచేడ్చునెడ మోహితుఁడై యిడునట్టి బాధలే
యనువుగ నోర్చుచుంటివోకదా మృదుగాత్రివి నీవు పుత్రికా! 95

క॥ అరికొఁ గూఁతు గొనముల
సారెకుఁ బేర్కొనుచు నీరుజాలై కనులం
గారఁగ నేడ్చెడి ప్రియ క
న్నీరల విద్యాధరాధినేత తుడుచుచుఁ 96

క॥ ప్రియురాల! శోకముడుగుము
స్వాయంభువుఁడు వరమొసంగుసమయమ్మున స
ద్దయుఁడై పలికిన పలుకులు
భవిష్యమాదరములు తెల్పువాఁడు వానిని వినుమా! 97

మ॥ వనజాతోద్భవుఁ డస్మదీప్సితముఁ దీర్పన్వచ్చి నేవేఁడఁగా
"ననఘా! నీకు జనించు పుత్రి నిజపుణ్యాస్ఫూర్తిచే దుష్టనా
శనముం జేయఁగఁ జేసి సౌఖ్యపడు నిన్నంతోషిఁగాఁ జేయుఁ బొ
మ్మనుచుం బల్కినవాఁడు భావివిషయం బౌనాఁడె సాధ్వీమణీ!

క॥ కనుక మన యాత్మజను దు
ర్జనుఁడొక్కఁడు బల్మిఁగొంచు చనుటయె నిజమై

నను దద్భగవద్వాక్యమె
యనయముఁ గాపాడుఁ జింతనందకు మింతీ! 98

వ॥ విద్యాధరుం డట్లనుడివి తనభార్య నూరార్చి కుమారి తలంపునకు వచ్చినపుడెల్లఁ గుమారిల్లుచు దినంబులు గడపుచుండె నట దురాచారుండగు వీనుండు నలువవలన సెలవొంది తన నెలవునకుఁబోయి వైద్యాధరి డాయంజని 99

క॥ ఏణీలోచన! తావక, పాణిగ్రహణమ్మునకు శుభముహూర్తము నే
వాణీశు నడుగ నా గీ,ర్వాణజ్యేష్ఠుండు లెస్స పరికించి యనెన్ 100

క॥ ఎనిమిది మాసము లేగిన
యనంతరమున శుభలగ్నమబ్బెడు నందాఁ
కను దొందరఁజెందినఁ గీ
డెనయునటంచాడె విశ్వసృజుఁ డటుగానన్ 101

మ॥ నిను నేనంతకుముట్ట మద్గృహమున న్విశ్వమ్మునంగల్గు వ
స్తునికాయంబుల నగ్ర్యముల్గలవు చేతోమోదమున్గూర్చువా
నిని వాసంగొను మెద్ది నీకు హితమో నేనద్ది గ వింటుఁ జిం
తను వర్జించి ముదమున న్మెలఁగు విద్యాభృద్వరేణ్యాత్మజా! 102

శా॥ నీ కే వస్తువులందుఁ బ్రీతిగలదో నిక్కమ్మ తెల్పు మే
లోకంబం దవియున్న నిప్డరిగి తల్లోకేశులం గెల్చి య
స్తోకప్రౌఢతఁ దెత్తు నాపయిని నీ చూపుల్ కృపంజూపినన్
నీకున్ దాసుఁడనై చరింతుఁ ద్రిజగన్నేత్రిన్ నినుం జేసెదన్ 103

క॥ అని పల్కెడు దోషాచరుఁ
గని దోషాచరుని గనిన కమలాకృతి వా
డినమోము వాంచి యశ్రులు
కనుగవఁ దొరఁగంగ మూఁగగతి సతి యున్నన్ 104

మ॥ లలనారత్నమ! నిన్ను నేను బ్రతిమాలన్ జేలవై యేల చిం
తిల నేలోపము నీకుఁ గల్గదిట నీ దీనత్వముం బాసిమై

చెలువమ్మున్ మెఱుఁగిడ్డకుందనము వాసిం దీసిపోఁ జేయ కి
ట్టు లసంస్కారశరీరవౌటఁ గని చూడ్కుల్ వ్యాకులంబందెడిన్ 105

క॥ వెలువక సంతసమున నా
కదనమ్ముగఁ బల్కుమనెడి యసురకు విద్యా
ధరనందన వచియించిన
మఱుమాటలు వినుమటంచు మకుశీవుఁడనియెన్ 106

మ॥ దనుజా! నా తలిదండ్రులన్నొఱఁగి బల్ తాపవ్యథుర్యుండవై
నను నీ తెచ్చు టెఱుంగకయ్యిరువురుం బ్రాణాలతో నుండ ర
య్యనఘానిష్టకరు న్నినున్ గనుట నీ యాలాపముల్ వింటఁ గ
ల్గిన పాపంబులు వోవుమార్గము నెఱింగింపన్ బుధుల్లేరుగా 107

గీ॥ బుధుల నడులేమిటికి నుపర్బుధున కీ శ
రీర మాహుతిఁ జేసి శరీరమునకు
దుర్జనస్పర్శనంబునఁ దొడరినట్టి
పాపములఁ బాసి నాకమ్ము వడయుదాన 108

ఉ॥ అంతకుఁ దక్క వేరు సదుపాయము లేదని చింతినొందు న
య్యింతికి రక్కసుండనియె నిందుముఖీ! యశుభంబులాడ నీ
కంతటి కష్టమే మొదవె నందఱు నీకిట నప్రము లేకదా
వంతను వీడు పాపములు వాయునె యేయెడ నాత్మహత్యచే 109

గీ॥ ప్రాణములతోడ నున్నట్టివారి కెప్డు
డేని మానసదుఃఖంబు లెడలి సౌఖ్య
మబ్బుఁ గావున నీ యభిప్రాయ ముడిగి
మెలఁగుము ముదితచిత్తనై కలికిమిన్న 110

చ॥ అను దనుజేశువాక్యముల నాత్మవిమర్శ మొనర్చి యగ్గిలోఁ
దునవిడ నాత్మహత్య యగు దాన నఘమ్ములు హెచ్చుఁగాని పో
వునె వెతలొందిప్రాణములఁ బోకడ వెట్టకయుంటినేని మా
తను బితనుం గనంబొసఁగు దైవకృపాలవపాత్రనైనచో 111

చ॥ అని మనమందు నెంచి యసురాధిపుతో నల కాంత వల్కె నే
తనువుఁ బరిత్యజించెడు విధానము మానితి నిష్ఠ మేనికిన్
గొనబిడు భూషణాళిపయిఁ గూరిమి సుంతయు లేదు దైవమున్
మనముననిల్పి! యెప్డు స్మరణమ్ము నొనర్చుచుఁ బుత్తుఁ గాలమున్ 112

సీ॥ రాక్షసేశ్వర సోమవార వ్రతమ్ము
నాకుఁగల దా దినమునఁ బినాకపాణి
యాలయమ్మున కేగి యత్యంతభక్తి
శివునకున్ మ్రొక్కి పూజలు చేసి వేడ్క 113

క॥ ఫలములును భక్ష్యభోజ్యము
లలఘువిధిం గూర్చి శివునకర్పించి ద్విజా
వలిఁ దనిపి పిదప నన్నము
జలములు నేఁగొనెద నటులు జరగని యెడలన్ 114

ఉ॥ అన్నము నీరు ముట్టుకొనఁ బ్రాణము వీడెద నీ పురంబునం
దున్నది యే దయాబ్ధియగు సోముని యాలయమన్న దైత్యుఁ డో
యన్నులమిన్న! విన్ము భవదర్చిత దైవము మన్మనోరథం
బున్నరవేర్చు వేల్పగుటఁ బొందితి డెందమునందు నందమున్ 115

శా॥ శ్రీకంఠాలయము ల్మదీయపురిలోఁ జెల్వొందు నద్గునన్
నీకున్నట్టి నియామకవ్రత మిట న్నిర్విఘ్నమై సాఁగెడిన్
శోకంబున్విడు పూజకున్వలయు వస్తువ్రాతమున్ దెల్పు మ
స్తోకశ్రద్ధను దెత్తు రిందలి వెలందుల్మాటమాత్రమ్మునన్ 116

వ॥ అదియుంగాక మఱియొక విశేషమ్ముఁ దెల్పెద వినుము 117

సీ॥ తారకాలింగ మాకాశతలమునందు
ధాత్రియందు మహాకాళదైవతమ్ము
హాటకేశుండు పాతాళమందు శ్రేయ
మిచ్చు దర్శించుమాత్రన మచ్చెకంటి! 118

క॥ అటువంటి హాటకేశుఁడు, కుటిలాలక! నాపురికి మిగుల దాపట కే
గుట యుక్తమేని చేటీ,చ్చటతోడం బోయి వ్రతము సాగింపు తగన్

మ॥ శుకవాణీ! పెడత్రోవఁబోవక మనస్స్ఫూర్తి న్ననున్ భర్తఁ గా
నికరప్రేమ వరించినట్లయిన దేని న్నీవు గావింప ను
త్సుకతం బూనెదొ దాని నష్టి నెరవేర్తుం గింకరప్రక్రియన్
సకలప్రాణుల నెల్లవేళలఁ ద్వదాజ్ఞావర్తులం జేసెదన్ 120

క॥ ననుఁ గాదని పోవంగా
ననబోఁడీ! నీకు వశమె నంపకధరుఁడే
నని నన్ వెఱఁగనఁబడఁ డెట
నన నీకెవ్వాఁడు సాయమగుఁ దొలఁగిచనన్ 121

గీ॥ రిత్తభ్రమ వీడి నన్ను వరింపుము నేడి
వానితోడ విద్యాధరబాల వలికె
నిష్టపడి నిన్ను నే వరియింతుననుచుఁ
దలఁపఁబోకుము కలనైన దనుజతనుజ! 122

చ॥ పరుషవచస్సులాడి బలవంతుఁడన న్గరువమ్మున న్ననుం
బరిణయమయ్యె దేనియును బ్రాణయుతాంగముతో సుఖంబులన్
బొరయఁగలేవు ధర్మపథముల్విడనాడిన యట్టి చెట్టకుం
ద్వరితము సంభవించు రవినందనమందిరమంద సౌఖ్యముల్ 123

గీ॥ ప్రబల నిష్ఠను సోమవారవ్రతమ్ము
సలుపు నను భక్తురాలిని సాఁకలేక
దుర్మరణమొందఁ గను నేని దుష్టహరుఁడు
భక్తవరదుం డనెడు పేరు భువనమున్నె? 124

వ॥ అనుచుఁ బెక్కుతెఱంగుల నిర్లక్ష్యంబుగాఁ దనమనంబున కహితం
బును నశుభంబును గాఁబల్కుచున్న వైద్యాధరి వాక్యంబులఁ
గడుంగనలి యా రక్కసిదొర పండ్లు పటపటఁ గొఱుకుచు నోఱ
నుండి యుడిదంబు వెలికి యుమ్మొఱకునఱితిన్నఱకెదనని దరియ
బోరఁ గురంగటనున్న సురారులడ్డంబువచ్చి మెల్లన శాంతవచ
నంబులం జెప్పిన నాఁడు దానిఁ జంపుట పాడియుఁ బౌరుషంబును

గాదు. ముద్దరాలగు నిమ్ముద్దియన్ దినక్రమంబున వివిధోపా
యంబులచే నీకు వశయగునట్లు చేసికొనవచ్చునన నతండు శాం
తుండై కరవాలంబొఱంజొనిపి వైద్యాధరి హాటకేశ్వరు నాల
యంబునకరుగునప్పుడు కాపరులుగాఁ దగు దానవీదానవుల నియ
మించి వారికి వలయు విషయంబులు బోధించి నిజప్రాసాదంబున
కేగినంత 125

—: రాక్షసస్త్రీలు వైద్యాధరికి వీరుని బెండ్లాడుమని బోధించుట :—

ఉ॥ సాధుతలేని మూర్ఖదనుజాతలు కొందఱు కుందుచున్న వి
ద్యాధరనందనం దఱిసి యమ్మకచెల్ల యిదేమి పిచ్చి స
ర్వాధికశక్తియుక్తు నసురాగ్రణి నీ దయఁగోరు వీరుఁ జే
తోధవుఁగా వరింప కిటు తూలఁగనాడెదవేమి భామినీ! 126

క॥ ఏ మాంసం బే మద్యము, నీమదికిష్టంబొ కోరు నిముసమునందే
నీముంగలఁ దానేయిడు, మా మనుజాశనుఁడు నీకు మగఁడైనయెడన్

ఆ॥ మద్యమాంససేవ మత్తెక్కి మావీరుఁ డతివ! నిన్నుఁ దఱిసినట్టివేళ
జుట్టుఁబట్టి గట్టి మొట్టునఁగొట్టినఁ దిట్టఁబోక ముద్దుఁబెట్టుకొనును,

క॥ మానుగ వారల మోహం
బేమనీ వచియింతు మింతి! యే మునిసినఁగా
నీ మఱి తాఁచినఁగానీ
సామముతోఁ గాళ్ళవ్రాలి సలిపెదరు నతుల్ 129

ఆ॥ వనిత! యితఁడు నట్టివాఁడె కావునఁ గేలు
పట్టితేని స్వారిఁగొట్టవచ్చు
ననెడి తమదు పల్కు లాలింపకేమి యుఁ
బలుకకున్న వార లలుకవోడమి 130

గీ॥ నంగనాచి విధమ్మున నాతి నీవు
కూరుచుండినఁ దీరునే సారె సారె
కేము తెల్పు నుడుల్ వినవేని నిన్ను
ముక్కలుగఁగోసి తినుఁడనె రక్కసిదొర 131

వ॥ కాన నిన్నీక్షణంబ చంపి తుంపులు తుంపులొనర్చి యింపుగానున్న మేమారగించెదము. లేకున్నఁ గాకులకు గ్రద్దలకు వైచెదమని సోఁకు నెలంతలు గత్తులెత్తి పైకిదూఁకిన విద్యాధరనందన భయంపడక వారింజూచి దయయుంచి మీరుతలంచిన కార్యంబు వేగిరంబకానిండు. నా కష్టంబులు గట్టెక్కనందనుక మోక్షప్రాప్తికై యేను బరమేశ్వరధ్యానంబు చేసెదనని కనులుమూసి యైదుపదిచేసి 132

శా॥ శ్రీనాథాంబురుహ ప్రభూతముఖరా శేషామర గ్రామణి
ధ్యానార్హంబు నగేంద్రజాహృదయపద్మావాసముల్ భక్తసం
తానాభీష్టఫలప్రదప్రథిత సంతానంబునౌ నీదు ప
త్పానీయప్రభవద్వయమ్మునకుఁ జోతల్ చంద్రమౌళీశ్వరా! 133

ఉ॥ ఏదవాఁకో మృకండుసుతు మృత్యుముఖంబునఁబడ్డవానిఁ గ
ల్పాదుల సంతిమంబులఁ జిరాయువుతోఁ దగ నల్పె వేగ నా
ఖేదముఁ బాపి నీదు దరికిన్ గొనిపొమ్మి భవమ్ముఁజిమ్మి నీ
పాదములాశ్రయింతు శ్రితపాపవిమోచన! ఫాలలోచనా! 134

చ॥ అసురులబారిఁ జిక్కితిని ప్రాణములందమి లేదు శీలమే
యసలున బ్రుంగునో యనెడి యారితి పూరితియయ్యె నిప్డు నా
దోసఁగులనెంచఁబోక కృపతో భవదంఘ్రులఁజేర్చుకొమ్ము రా
తుసజనతా మహాతిమిరకల్యవిరోచన! ఫాలలోచనా! 135

క॥ అని విద్యాధరనందన
మునిని బురారిని నుతింపఁ గ్రవ్యాదలకిం
తనరాని తపః మొదవుడు
మనముల వెఱఁజెంది శాంతమానసలగుచున్ 136

సీ॥ వనిత! మా రాజునకు నీవు వశ్యవగుదు
[illegible] యీ పాట్లు నీకబ్బ వింక నైన
[illegible] మారుచుకొమ్మమ దనుజపతుల
వలంతు టులిపునఁ గనువిచ్చి పలికె నిటులు 137

క॥ ఓ తరుణులార ! తడయక
నా తనువుం గోసి తినుఁడు నాకందున నీ
పాతకపు టునికి తొలఁగును
భూతేశుని పూతపదము పొసఁగును గానన్ 138

క॥ అని దృఢమతియై పలికెడి, వనితకు వారనిరి సోమవారము రేపే
గనుక నల హాటకేశ్వరుఁ, గనఁ బాతాళమున కేగఁగావలెనుగదా

శా॥ పూజాద్రవ్యము లేమి కావలయునో పూర్ణేందుబింబాననా!
నీ జంకున్విడనాడి తెల్పుమన నా నీరేజపత్రాక్షి చే
తోజాతాంతకు పూజకున్వలయు వస్తువ్రాతముం జెల్పి ని
ర్వ్యాజానందముతోడ నాఁడు గడపెన్ సాంబాంఘ్రిసక్తాత్మయై

క॥ మఱునాఁడు ప్రొద్దుపొడుపున
నరుసంబునఁ దానమాడి యభవుఁ ద్రినేత్రుం
బురహరుఁ దలఁచుచు నుండెడు
తఱిఁ గంఠీరథ మొకండు దానవకాంతల్ 141

ఉ॥ తెచ్చిన దేవయోనిసుత తేకువదానను గూరుచుండఁగాఁ
బొచ్చములేనిపూన్కిఁ దమ మూఁపులఁదాలిచి జాగరూకలై
యచ్చపు సామిబత్తిగల యా సురసంతతి కాఁపుగాయఁగాఁ
జెచ్చెర హాటకేశ్వరునిచెంగటఁ జేర్చిరి దానవాంగనల్ 142

—: వైద్యాధరి పాతాళంబున హాటకేశ్వరు సేవించుట :—

గీ॥ అంత నక్కాంత పాతాళహాటకేశ్వ
రాలయమ్మునఁ గల వింతలరసి మురిసి
దానవీపాళి చూపిన మానసాఖ్య
సరసియందు దోఁగి ప్రదోషసమయమందు 143

మత్తకోకిల॥ హాటకేశ్వరుఁ జేరి మ్రొక్కి సహస్రనామ సమర్చనన్
బోటిమిన్న మొనర్చెఁ బత్తినిఁ బూవులున్ దళముల్ త్రియా
మాటపాటల గంధులీయఁగ నంత నన్న మపూపముల్
సాటిలేనిఫలాల్ని వేదసల్పి యిచ్చెను హారతుల్ 144

గీ॥ అవల సాష్టాంగముగు మ్రొక్కులాచరించి
దోసిలొగ్గి మహాదేవ! దుష్టబాధ
లడఁచి మామకశీలంబుఁ జెడఁగనీక
ప్రేమఁ గాపాడుమనుచుఁ బ్రార్థించి కదలి 145

చ॥ అతివినయమ్ముతోడఁ గనకాభరణాంబరరాజి విప్రదం
పతులను బూజచేసి బుధమండలిదీవెనలంది యీశ్వరా
ర్పిత ఫలభక్ష్యముల్మెసవి రే యటనే వసియించి దానవీ
ప్రతతివహించు యానమున వచ్చెను వీరసురారి వీటికిన్ 146

శా॥ ఆలీలన్ బ్రతి సోమవారము మహాహ్లాదంబు దొల్కాడఁ బా
తాళప్రాంచిత హాటకేశ్వరు పదద్వంద్వంబుఁ బూజించుచున్
గాలక్రీవుని దేవదేవుని మనఃకంజాతమందుంచి త
ద్బాలారత్నము పుచ్చె కొన్ని నెలలో ప్రాలేయశైలేశజా! 147

వ॥ అవ్విధంబున జరుగుచుండ నొక సోమవారమ్మున విద్యాధరతనయ యథాక్రమంబున హాటకేశ్వరునకుఁ బ్రదోషసమయ సముచిత సమాసనామాదిక షోడశోపచార పూజలు నిర్వర్తించి కరంబులు జోడించి 148

చ॥ వృషభతురంగ! తాపసవరేణ్యమనోబ్జపతంగ! సాధువి
ద్విషదహిరాడ్విహంగ! సురవేగవతీస్ఫురదుత్తమాంగ! క
ల్మషచయభంగ! హస్తచలమండితచారుకురంగ! దుగ్ధస
ద్విషధినిషంగ సర్వజగతీభృదనశ్వర! హాటకేశ్వరా! 149

ఉ॥ వ్యాళవిభూషణా! శ్రుతిసమాశ్రయభాషణ! భక్తపోషణా!
హేళిసుధామయూఖ దహనేక్షణ! మానితనూజరక్షణా!
పాలితదాసపాప! కనకక్షితిభృద్వరచాప! గోప! పా
తాళజగత్ప్రదీపక! సుధాభుగనశ్వర! హాటకేశ్వరా! 150

చ॥ శరధి మథించునప్పుడు విషంబు జనించి జగంబులెల్లఁ జె
చ్చెర దహియింపఁగా నెదియుఁ జేయఁగనేరక యెల్లరున్నఁ ద

ద్గరళము మ్రింగి లోకతతిఁ గాచిననాఁటి కృపారసంబు నీ
చరణసరోజదాసిపయిఁ జల్లఁగఁజెల్లదె హాటకేశ్వరా! 151

ఉ॥ సైరిభవాహనుండు రథసంబునఁ బాశములం దగిల్చి మృ
త్యాకరబలంబుతోఁ దివుచుపట్టున శంకర! కాలకాల! సం
గూరిమి నోముమ ద్దపసికుఱ్ఱనిఁ గాచిననాఁటి నీ కృపా
సారము నాపయిం జిలికి సాఁకు మహేశ్వర! హాటకేశ్వరా! 152

చ॥ అసురవరేణ్యుఁ డీడ్డ గడువందుకు గతించెను జాల నాకిటన్
బొసఁగిన కష్టముల్ దులిచి ప్రోవఁగ శక్తులులేరు నాకొలల్
పసరుదనంబుఁజూడ కజలన్ దనుజాతవిఘాతకేలనై
యనువులు పీడకుండఁ గృపనారసి కావుము హాటకేశ్వరా! 153

వ॥ అటు లా కుటిలాలకహాటకేశ్వర ప్రార్థనంబుఁ గావించుచుండ 154

గీ॥ ఆ దినము పౌషమాసమ్మునందుఁ బౌర్ణ
మాసి సోమవాసరమాట మానిరత్న
మైన నారదుఁ డరుణోదయమున లేచి
వేల్పుటేరునఁ దానమ్ముసల్పి బత్తి 155

శా॥ ప్రాతర్వేళను గొల్చి తారకపతిన్ స్వర్ణిమ్నగన్మన్గి గం
గాతోయమ్ములఁదోఁగి భూస్థలి మహాకాళేశు మధ్యాహ్నసే
వాతృప్తుం బొనరించి భోగవతి నంభస్స్నానముం జేసి య
ప్పాతాళమ్మున హాటకేశు దరిసింపన్ సంజవేళం జనెన్ 156

వ॥ అవ్విధంబునఁ జనిన నారదునకు హాటకేశ్వరు సముఖంబున 157

క॥ కరకమలంబులు మోడిచి
కరుణారసధామ! సోమ! ఖలభీమ దయన్
శరణమవగుమను విద్యా
ధరపుత్రిక కానుపించెఁ దతదైన్యమునన్ 158

సీ॥ అట్లు గన్పడిన విద్యాధరాత్మజఁ జూచి
యబల! నీవిట కేటులరుగుదెంచి

తేను నారదుఁడ నా కెఱిఁగింపు నీ కథ
యన్న నక్కాంత జోహారు సల్పి
తాత! విన్నని తన్ను దనుజుండు బల్మిమైఁ
గొని తెచ్చుటలు మొదల్కొని జరిగిన
నిముసమ్ము వఱకును నిర్గమించిన కథ
నుడివి పెండ్లికి బమ్మ యిడిన గడువు

గీ॥ నందుఁ జాల గతించె నన్నాదరమునఁ
జూచి యీ నీచుచెఱఁ బాచి ప్రోచువారు
లేరుగా యెందుఁ దుద కతిఘోరభంగిఁ
జావుమని వ్రాసెఁగాఁబోలు నా విరించి 159

మ॥ నను బ్రాణంబులకన్న మిన్నగ నెడందన్ జెందమిన్ నించి పెం
చిన మాతాపితలన్ గటా! తుదకు వీక్షింపంగ నే నోచనై
తిని మీరల్పని నానిమిత్తమయి చింతింపంగ వల్దంచుఁ దీ
తెను మీ మీ ఋణబంధమంచని మహర్షీ! వారి నోదార్పవే! 160

మ॥ అనుచుం గన్నులనీరుగార్చు నల విద్యాభృత్కుమారిం దయా
ఖనియౌ నారదమౌనిమౌళిగని శోకంబందఁగాఁబోకుమీ
దనుజుండెట్లును భర్తగాఁడు భగవద్భక్తున్ మహాజ్ఞాని ధ
ర్మనిధానంబగువాని శూరవరు నీ ప్రాణేశ్వరుం జేసెదన్ 161

క॥ భీతివిడనాడు మీ వీ, రాతిరి యిటనుండువగుట రమణీ! మరల
స్నీతో మాటాడెద నివు,డాతిగకంటి పదసేవకరిగెదననుచున్ 162

వ॥ పోయి హాటకేశ్వరు నభిషేకనామార్చనాదిక ప్రదోషసమయసము
చితపూజావిధానంబులందనిపి కొంత రాత్రి గడచినపిదపఁ గావలి
రాకాసులు నిద్దురం దూఁగుచుండుట నెఱింగి వైద్యాధరిం జేరఁ
బిలిచి 163

— నారదుఁడు వైద్యాధరికిఁ శుభంబగు నుపాయంబు చెప్పుట —

ఉ॥ మానిని! నిన్నుఁగావఁగ సమర్థుఁడు కైటభవైరి యొక్కఁడే
కానఁ దదంఘ్రిసన్నిధికిఁ గ్రచ్చరఁ జేరి వచింతు నీ వెతల్

నికి మాఘసన్నుతి మపారముదంబును గూర్చునొట నె
న నొనర్పు మద్దియె సమస్తశుభంబులు నీకొసంగెడిన్ 164

కఁ బదునైదుదినముల కేగుదెంచు
కరయుత మాఘమాసంబు మగువ! యపుడు
టకేశు పురోభాగమందుఁ గల్గు
ానససరోజలంబుల మహితనిష్ఠ 165

ణుం డర్ఘోదితుఁడగు
ణమ్మున స్నానమాడి దైత్యారిని జాల్
నైన నీటనైనను
జె స్థండిలమందునైన మానితభక్తిన్ 166

లసితసుమములఁ దులసీ
ముల గంధముల ధూపతతులన్ దీప
మ్ములఁ బూజించి నివేదన
లమిం గావించి మ్రొక్కులిడి యటమీఁదన్ 167

ాఘమహిమమ్ము వినఁదగు మగువమిన్న!
త్య మీరీతి నియతవై నెలదినమ్ము
చరించితివేని నీ యార్తి నడచి
ాఘవల్లభుఁడగు చక్రి మనుచు నిన్ను 168

ాఘమాసంబెల్ల మజ్జనంబొనరించి
హరిని బూజించినయట్టివాఁడు
వ్యను గోర సత్కన్యయు ద్రవ్యంబుఁ
గోరిన ధనముఁ గుమారకులను
ర నుపుత్రులు క్షోణీశ్వరతఁ గోర
నరనాయకతయు జ్ఞానమ్ముఁ గోర
నమ్ము దివిఁ గోర నాకమ్ము మోక్షమ్ముఁ
గోర మోక్షము సరసీరుహాక్షి

గీ॥ యాత్మఁ జలిఁగోర సత్కృతి యైదువతన
మర్థిఁగోరఁ జిరంటిత యబ్బు మఱియు
సెవ్వ రెది కోరిచేసిన నిచ్చు మాఘ
సద్వ్రతము గాన సల్పు మాసక్తిఁ జాన! 169

క॥ అని చెప్పి వ్రతవిధానము
లనుకంపన్ బోధసేసి యజ్ఞానన! వై
త్యునివలన న్విఘ్నంబొం
జని సదుపాయమున సల్పు స్నానవ్రతమున్ 170

గీ॥ ఇది మొదల్కొని నీ చెఱ యెట్టులేని
దొలఁగఁజేసెడి పనిఁబూని మెలఁగువాఁడ
మాఘసద్వ్రతసక్తవై మఱపుగొనక
సోమవారవ్రతము సల్పు మో మృగాక్షి! 171

వ॥ ఇత్తెఱంగున నత్తెఱఁగంటితపసి వైద్యాధరికిం జెప్పి యామె సేయు నమస్కృతులొంది దీవించి గగనగమనంబున వైకుంఠంబుఁ జేరి సనకసనందనాది బృందారక మునిబృందపరివేష్టితుండై యానంద కరాలాపగోష్ఠినున్న వెన్నునింగని సాష్టాంగవందనంబొనర్చి తదను మతి సముచితాసనంబునఁ గూర్చుండి వైద్యాధరిచరిత్రం బెఱింగించి దీనవత్సలుండవు, దుష్టవిధ్వంసకుండవు, సర్వసమర్థుండవు నగు నీవలన నసురబాధిత యగు నయ్యబల కడతేరవలయునని విన్నవించిన విరించిగురుం డొక్కించుక యోచించి 172

క॥ ఎఱుఁగుదు నారద! విద్యా
ధరసుత సద్గుణగణంబు దానవలోకే
శ్వరు దుర్గుణములు వాఁడా
పురహరు శూలమ్ము వడసి పొందినయామున్ 173

క॥ రక్కసిఁ దేనిం దూరమునఁ
జక్కడఁపఁజాలువాఁడు సౌరాష్ట్రవిభుం

డొక్కఁడె మద్భక్తుల నతఁ
డెక్కుడు గుణశాలి సంయమీశ్వర! వినుమా 174

శా॥ సౌరాష్ట్రేశ్వరుఁడై హరిద్రఘుఁడు విజ్ఞానాంచితుండై సదా
నా రూపంబు మనంబునన్నిలిపి యంతశ్శత్రులం గెల్చి పా
పారూఢాత్ముల సంహరించుచు నయాధ్యాసక్తుఁడై సాధుమం
దారంబై ప్రజ నేలుచుండె సుతులం దండ్రింబలె న్నారదా! 175

మ॥ బహుజన్మార్జిత పుణ్యయోగుఁడగుటం బ్రాప్తించె నీనాఁటికిన్
మహినాథత్వము జ్ఞాన మెద్ది యొనరింపం దా మదిం బూనునో
సహనంబొప్పఁగ నప్పనిం దుదగనన్ సాఁగించు యోగీంద్ర! దూ
నిహతారాతి కసాధ్యకార్యమెదియున్ లే దెవ్విధిం జూచినన్ 176

వ॥ నారదా! వివాహలగ్ననిశ్చయంబున కప్పాలసుదిండి మరల ఫాల్గున మాసంబున నంబురుహసంభవ పురంబునకరుగు నప్పయనంబున యుద్ధగంధంబుండదని వాఁడు శూలంబు గృహంబున నె యుంచి పోవు నత్తరుణంబున హరిద్రఘుం డమ్మహనీయాయుధంబుఁ జేకొన వలయు నట్టితఱి వీరుని భృత్యులగు దైత్యులతోఁ బెనుకయ్యంబగు నా కయ్యంబున డయ్యక యొయ్యన జయంబుఁగొనుటకును సముద్ర గర్భస్థంబగు వీరునిపురంబున కేగుటకును నృపునకు వలయు దివ్య సాధనసంపత్తి సిద్ధింపఁజేయుము. నీవిప్పుడ యేగి యనాథ యగు వైద్యాధరిం గాపాడుమని హరిద్రఘునకుఁ బ్రోత్సాహంబుఁగొల్పుము. నీవు విద్యాధరతనయకు మాఘవ్రతంబు బోధించుట మేలయ్యె నిదియొక ముఖ్యకర్తవ్యంబుగా నెంచి యయ్యబల కెట్టియిక్కట్టులు గలుగకుండ దుండగీఁడగు వీరుని దునిమింపు మరుగుమన నారదుం డా హరికి మ్రొక్కి మొగులు తెమ్మనఁ జనిచని 177

ఉ॥ స్రష్ట్రిధికప్రభావులు ధరాసురవర్యులు హస్తచూర్ణిత
త్వష్ట్రిభినిర్మితాస్త్రిలు నృపప్రవరుల్ మొదలన్ని జాతులే
రాష్ట్రమునన్ స్వధర్మమున రక్తివహించి చరింతు రట్టి సౌ
రాష్ట్రము శ్రీపరాజిత సురప్రభురాష్ట్రముఁ గాంచ వేడుకన్ 178

సీ॥ కాంచి యా దేశమునఁ గల కాననములు
గొలఁకు తోఁటలు పొలములు ఫలసుగంధి
సుమపయస్సస్యశోభ నేత్రముల కెలమిఁ
గొలుపఁ దాపసిమిన్న రాకోటికిఁ జేరి 179

వ॥ తదధీశునకుఁ దనరాక ద్వారపాలకులవలన నెఱింగించిన విని హరి
దక్షుండు తత్క్షణంబ 180

క॥ ఎదురుగఁ జని మ్రొక్కిడి కర
పదనీరేజముల కర్ఘ్యపాద్యములిడి నా
రదుఁ దోడ్తెచ్చి వినయ మెదఁ
బొదలఁగఁ గూర్చుండఁజేసి భూపతి యనియెన్ 181

క॥ బృందారకసంఘ గో
విందాకృతు లాత్మతత్త్వవేత్తలు మీ రీ
మందిరమున కేతెంచుట
నొందెను శ్రేయములు మునిజనోత్తమ! నన్నున్ 182

ఉ॥ ఇచ్చట కీరు వచ్చు పని యెద్దియొ తెల్పుఁడు సంతసంబుతోఁ
జెచ్చెర శౌరి తోడ్పడినఁ జేసెద నావుడు నారదుండుఁ దా
నచ్చిన వేడ్కఁ జెప్పె నసురేశుఁడు దుర్మతి దేవయోనిజన్
మ్రుచ్చిలి వార్ధిమధ్యపురిఁ బ్రోదిగఁ దాచుట మున్నుగాఁ గథన్

సీ॥ చెప్పి యా దుష్టరాక్షసుఁ జెండి యబల
యైన వైద్యాధరిని గరుణాంతరంగ
మునను గాపాడవలయు నీ వనుడు నృపుఁడు
నే నకర్తను దేనికైన హాని! 184

శా॥ వారాశ్యంతరపుర్వరంబునకుఁ బోవన్ శక్యమే దేవతా
వైరిన్ దారుణశూలధారి ననిఁ జంపన్ సాధ్యమే? యార్తయా
నారిం బ్రోచుట ముఖ్యధర్మమగుఁ బ్రాణంబిచ్చియైనన్ మునీ!
యేరీతి న్నెరవేర్పనౌనొ యివి? నీవే చూపుమా త్రోవలన్ 185

వ॥ అని నృపుండు వల్క విని నారదుండు "మానవేశ్వరా! నీ ప్రశ్న
మాబోంట్లకు మహాహ్యంబు. మన్నుమున్నుగా మిన్నువఱకు నిండి
యున్న పశు, పక్షి, మృగ, పిపీలికా ప్రభృతి బ్రహ్మపర్యంత
ప్రపంచంబును, గోడ, మేడ, చెట్టు, గుట్ట, గట్టు మొదలగు స్థావ
రంబులను, గోయి, నూయి, యేఱు, మున్నీరు మున్నగు జలా
కరంబులను, చండాల, శూద్ర, వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణాది
వర్ణంబులను, మాతృ, పితృ, పుత్ర, పౌత్రాది సంబంధులను,
నాసేవక మహారాజపర్యంత నానామానుషవ్యక్తులను, దారకాది
సూర్యపర్యంత గ్రహంబులను నిది యది యననేలఁ గనులకగపడు
సమస్తంబును విష్ణుమయమ్ముగాఁ జూచుచు వానికి శ్రీనికేతను
నామమ్ములిడుచుఁ బిలుచునెడ విష్ణుఁడా! యనియు, గమనంబున
శ్రీహరీ! యనియును బలుకునెడ గోవిందా! యనియుఁ బుచ్చు
కొనునెడఁ గృష్ణా! యనియుఁ దినుతఱి దామోదరా! యనియు
లేచువేళఁ గేశవా! యనియుఁ బండుకొనునపుడు నారసింహా!
యనియు నిద్రయందు మాధవా! యనియు నాటల వాసుదేవా!
యనియుఁ దిరుగుచో వామనా! యనియు వ్యసనసమయంబున
హృషీకేశా! యనియు సంతోషకాలంబున శ్రీధరా! యనియుఁ
బ్రతిక్షణము కంజేక్షణ ధ్యానతత్పరుండవై కర్తృత్వరహితుండవై
నిష్కామహృదయంబుతో స్వధర్మంబుల నెఱవేర్చుచుఁ దత్ఫలం
బులు వాసుదేవార్పణంబొనర్చు నీవు సేయంబూనిన కార్యంబున
కంతరాయంబు గలుగదు. వినుము 186

ఆ॥ ఫాల్గునమున పోఁకు బమ్మ వీఁటికి నేగు
నవుడు శూల మింటియందె యుంచుఁ
గనుక నీవు దానిఁ గొనవచ్చుఁ గావుండు
పొలసుఁ దిండి దండుఁబోరఁ జెండి 187

క॥ నీ రథరథ్యంబులకును, సారథికిని నీకు దప్పి జనియింపదు తూ
ణీరమ్మక్షయమగు విలు, దారితముం గాకయుండు ధరణీశమణీ!

క॥ హరికృపచే నీ యపయశము, క్షరణింపఁబెడి రుఁగు నీటఁ దారల బాటన్
పరమేష్ఠినిఁగని దానవుఁ, డపు డెంచెడితఱిని ద్రోవ నడ్డఁగవలయున్

వ॥ మఱియు మహామహావానేహమ్ముల మోహనాస్త్రంబు నీ కవసరం బగు నాసంగెదఁ బుచ్చుకొమ్మని శుచియై వచ్చిన హరిద్రఘునకుఁ బ్రయోగోపసంహారమంత్రంబులతో సమ్మోహనాస్త్రంబిచ్చి యే నిప్పుడరిగి తరుణిం బరసి మరల వచ్చెదనని చెప్పి యప్పుడమియొడయనిచే నతిశేషసత్కారంబొంది యక్షేచ్ఛం జనియె నట రక్కసు నగరున 190

క॥ మఱుదినము మాఘమాసమ్ము ప్రారంభమునని
తెలిసి విద్యాధరాత్మజ పాలసు దిండి
గరితలం బిల్చి నాకు మాఘవ్రతమ్ము
గలదు రేపె దానికి మొదల్గాన మీరు 191

క॥ మానససరోవరమ్మున
స్నానమ్మొనరించి వ్రతమునలుపుచు నెలయున్
నేనందె యుందుననుచున్
దానవునకుఁ దెల్పి రండు త్వరగా ననుడున్ 192

క॥ వారలు వీరుని చెంతకుఁ, జేరి యెఱింగింప నతఁడు చెచ్చెర నయ్యం
భోరుహముఖదరికింజని, నారీ! యీ వ్రతము సేఁత నష్టము నాకున్

ఆ॥ మాఘవల్లభుండు మాధవుఁ డాతండు
మత్కులమ్మునకె విపత్కరుండు
వానికిష్టమైన వ్రత మీవు సేయుట
కేను సమ్మతింప నిందువదన! 194

ఉ॥ కోరిన కోర్కులెల్ల సమకూర్పఁగ నేర్పరి దర్పకారి లేఁ
డా! రమణీ! యతండు ముదమంద నొనర్పు వ్రతంబులెన్నియే
న్వారక తద్విరోధమ్ముల నొనర్చుట కెయ్యది నీవు కోరినన్
దీరుతఁ దక్షిణాంబ నమదీయక కావున దీని మానుమా! 195

ఉ॥ దానవుఁ డల్లువల్క వనితాతిలకమ్ము ముఖమ్మునం గనున్
దీనతఁ డోఁప నీ వ్రతమ నేకభవాఘవిదారకంబు సం
తానకరంబు దీనిని యథావిధిఁ జేయఁగఁ జాలకున్నచో
మానెడి నన్నపానముల మత్తనువాత్తిలి మిత్తి గ్రింగఁగన్ 196

క॥ అనుపమ శాంతిలు తలుసిం
గని దనుజుఁడు మదిని గంది కానిమ్మమ్మా
త్రనె హాని యేమియగుఁ గాం
తను మఱిఁజత నెపుడుఁ జూడఁదగునా యనుచున్ 197

వ॥ ఆ వైద్యాగ్రకి సంతోషంబుతోఁ గళకళలాడుచుండుటయె ముఖ్యం
బుగాఁ దలంచు నాతండు దానవనివహంబుఁ బిల్చి యామె యభి
మతంబుఁ జెల్లింపుఁడు. జాగరూకులై యుండుండని చెప్పి యతం డేగిన
నయ్యసురబిసరుహాక్షులు యథావిధానంబున మఱునాఁ డరుణో
దయంబగులోన మానససరసిదరి కా సుందరిం జేర్చిన 198

ఉ॥ వరానివరోపదేశవిధి మానసనామసరస్సునం బయో
జానన స్నానమున్సలిపి యచ్యుతుఁ దత్తటమందునిల్పి స
త్స్వానవిరాజిఁ బూజఁ బరిశుద్ధమతిం బొనరించి యర్ఘ్యమా
వాని నివేదనల్ సలిపి భక్తిని మాఘమహత్త్వమున్వినెన్ 199

గీ॥ మాసమంతయు నియతయై మజ్జనమ్ము
హరి సమర్చయు మాఘమాహాత్మ్య మెలమి
వినికియుఁ నుదీర్చి యంతరమ్మునఁ బొసంగు
సోమవారాలఁ బూజ యీశునకుఁ జేసె 200

క॥ మాఖవ్రత మా యమృతమ
యూఖానన పూర్తి చేసి యుదధిందగు నా
లేఖారిపురముఁ జేరి ద
యాఖని హరిఁ దలఁచుచుండె స్వాంతములోనన్ 201

వ॥ అంత మాఘమాసంబు నిర్గమించి ఫాల్గునంబు సొరఁబడిన రక్కసి
రేఁడు దన యిక్కంగల నల్లద్రావుడులనెల్ల రప్పించి నా పెండ్లికి
ముహూర్తమ్ము పెట్టించుకొనివచ్చుటకై యేనిపుడు దామరచూలి
ప్రోలికరిగెద. నేవచ్చుదనుక నేర్పుతో నీకొట్టికిఁ గాపాడుచుండుఁడు
తెఱివేచి మన దాయలు కీడుసేయఁగడంగుదురు కాన మీమేనుల
నుసురులుండునంతకు నంతకునైన నీ చెంతకు రానీకుండని చెప్పి
నలున నెలవున కాతండు సనిన 202

ఉ॥ నారదుఁ డప్పుడష్టసురనాథుపురమ్మున వార్తలెల్ల వే
సారకెఱుంగుచుంట దితిజప్రవరుం డజుఁ గానఁబోకఁ దా
నేరుపునం గ్రహించి ధరణీధవమౌళి హరిద్రథాఖ్యునిం
జేరి సమస్తముం దెలిపి చేయఁగఁ జేసె రణప్రయాణముం 203

సీ॥ అతఁడు యుద్ధసన్నద్ధుఁడై స్యందనమున
వాద్యములఁబోలు హయములఁ బూన్పంగఁ జేసి
యంతఁ దనయంతవాని సహాజు నొనరిచి
ఋషికి మ్రొక్కి దీవనలొంది యెక్కె తేరు 204

ఉ॥ ఎక్కిన తేరు సారథి గిరీశుని తేరును గిరినుండు నాఁ
ద్రొక్కుడు లేని తెక్కలిడి రొప్పిన జక్కుల వేగిరమ్మునం
జెక్కలుగల్గు కొండవలె జివ్వన నేల చలింప డగ్గరం
గ్రక్కునఁ ద్రోవ యిచ్చె జలరాశిపలాశిచయేశుపీటికిం 205

వ॥ హరిద్రథుం డా మార్గంబునఁ దన రథంబుఁ దోలించి రాక్షసవీరుం
డగు వీరుని పురాంతికమ్ముఁ జేరి శంఖధ్వానమ్ము చేసిన 206

శా॥ ఆ రావమ్ము సముత్కటమ్మయి పృథివ్యాకాశముల్నిండి త
త్పూరాదిత్యవిరోధిరాజిఁ గలతంబొందింప నవ్వీరు లా
రా రా! యెంతటిధైర్యవంతుఁడో యితం డావంతయుం భీతిలే
కీరీతిం జమదెంచి రేఁగెనను చెంతేఁ గ్రోధయుక్తాత్ములై 20'

మ॥ అరదాలం ద్విరదాల నశ్వముల శౌర్యస్ఫారులై యెక్కి కొం
దఱికం గొందఱు కాల్నడం మృగవితానంబెక్కి పెక్కండ్రు సఁ

గరసన్నాహముతోడఁ బ్రోల్వెడలి పేరెన్ పాఁకమయాఁక ల్నరే
శ్వరునిఁ దాఁకెను నాకలోకభవు లాశ్చర్యంబుతోఁ గన్గొనన్ 208

చ॥ అటువలె నేల యీనినక్రియన్ దనుజుల్ నృపుఁదాఁకి యాశుగ
చ్ఛటలును దోమరమ్ములును శక్తులు శూలములుం గదాసులున్
బటుభుజసారము ల్లయముఁ బ్రస్తుతికెక్కఁగ నేసి చేసిరా
క్కట దిగిభేంద్రము ల్వెఱచి కంపము నొందఁగ సింహనాదముల్ 209

శా॥ ఆ సంరంభము లెక్కసేయక నృపాధ్యక్షుండు సంవర్తవే
ళాసప్తాశ్వతనూజుఁడో యన రణోల్లాసంబు భాసిల్ల బా
ణాసం బెక్కిడి జ్యానినాదమున దైత్యస్వాంతముల్ బ్రయ్య బా
ణాసారంబును నింపి యార్చె రిపుకోపాగ్నిజ్వాలజ్వాలలన్ 210

వ॥ అప్పుడా దనుజసమాజంబు దామేసిన బహువిధఘోరసమరసాధన
ప్రకరంబున నొక్కటియుం జిక్కకుండ ముక్కలుముక్కలు గావిం
చిన హారిద్రథుని చాపనైపుణ్యంబు మెచ్చుచు మఱియుం జెలరేఁగి
పటురయంబున శరచ్ఛటలం బరఁగించిన నృపుండు 211

చ॥ అవి తనుసూతగుజ్జముల స్యందనమున్ సిడమున్ శరాసమున్
దివులఁగనీక చూర్ణమయి దవ్వున నే పడునట్లు చేసి శా
త్రవుల పతాకముల్దునిమి ధర్మములన్ విదళించి విస్ఫుర
త్కవచములం బగిల్చి బెడిదంబుగ నాటె శరాళి మేనులన్ 212

ఉ॥ దానఁ జలింపకయ్యసురతండము వెండియుఁ జాపదండముల్
బూని నిశాతబాణచయమున్ బరఁగించిరి చూచు ఖేచరుల్
దీనతఁ జెందఁ బోరఁ గడిదేరిన యా నరపాలమౌళి య
వ్వాని దళించు వేగమును వాసవముఖ్యులు మెచ్చిరిచ్ఛలన్ 213

శా॥ ఆరీతిన్ దనుజప్రముక్తశరముల్ వ్యర్థంబుఁ గావించి దు
ర్వారోదగ్రకలంబవర్షమునఁ దద్వక్త్రాబ్జముల్ సించి కాం
తారంబందు ఖరాదికాస్రవుల ధ్వంసంజేయు రాముండు నా
సౌరాష్ట్రాధిపుఁడొప్పె నప్పుడు రణక్ష్మామండలిం జండతన్ 214

ఉ॥ అంతనఁ గ్రుద్ధులై యసురు లాజ్యముఁ ద్రావిన వహ్నులట్లు మ
స్యందిన భానుబింబములయట్లులునై నిగిడింప హేతులన్
మందరధీరుఁ డా నృపతిమౌళి ఘనాఘనబాణమేసి య
య్యాండజతేజసింగిణులు నమ్ములు వాహనముల్ జళించినన్ 215

వ॥ రాక్షసులెల్లరు శరశరాసనవాహన వైకల్యంబున మోములు వాడు
పాఱ నొక్కించుక కలంగియు ప్రభుభక్తిపరాయణులగుటఁ బ్రభు
వచనంబులు దలంచి ప్రాణంబులఁ దృణంబులవలెఁ బరిగణించి
తెంపుచేసి నిన్నుం జంపకమాననుచుఁ దానేయు నిశితసాయక
నికాయంబులఁ గాయంబుల మితిలేని గాయంబులగుచున్న లెక్క
సేయక త్రోసికొనివచ్చు వారి పట్టుదలంగని వీరు తమ శరీరంబులఁ
బ్రాణంబులుగలుగ రణపరాఙ్ముఖులుగారని తలంచి 216

ఉ॥ శ్రీహరికి న్నమస్కృతిని జేసి తపస్వికిఁ గేలుమోడ్చి యు
త్సాహముతోడ సింహనినదంబొనరించి రణోర్విఁ బజ్జగ
ద్ద్రోహిని దుర్మనంతకసురుల్ స్మృతిఁ గోల్పడఁ జెల్లునంచు స
మ్మోహనబాణమేసె నృపపుంగవుఁ డా పౌలదిండి పండుపై 217

ఆ॥ దాన నసురసమితి దమ తెల్వి దప్పట
సమితి భూమిఁబడిరి చచ్చినట్టు
లపుడు నృపుఁడు చంద్రహాసంబు చేఁబూని
తేరు డిగ్గి పల్కె సారథిఁ గని 218

క॥ పురికరిగి నేను శూలముఁ
గరమునఁ గొనివచ్చులోనఁ గర్బురనాథుం
డరుదెంచెనేని యెదిరిచి
దురముం బొనరించి నిల్పు దోర్బలమెసఁగన్ 219

సీ॥ అనుచు నవసరమైనచో నసురతోడ
రణముఁ గావించువిధము సారథికిఁ దెల్పి
తాను దానవనాథు సౌధంబుఁ జేర
నందుఁ గాంచె న్నదైత్యు లుపగ్రభంగి 220

వ॥ ఖడ్గహస్తులై నిస్తులప్రతాపంబున హరిద్రక్షకు నెదిరించి తమకు ఖడ్గ
యుద్ధంబునఁగల నైపుణ్యంబు జగన్మాన్యంబుగాఁ బోరు నెడ    221

చ॥ అతఁడును ఖడ్గచాలనరయంబున నాఁకులమూఁక మీఱి యు
ద్ధతగతిఁ బోరి వారి శిరముల్ సుర వారము గీరితింపఁగా
క్షితిఁ బడఁగొట్టి శూలమును జేరి నమస్కృతిసల్పి తత్పతిన్
సితిగళు నన్ను నెన్ని వెసఁజేకొని మున్ మిహి నోత్రపుత్రికా! 222

చ॥ కరమునఁబట్టి శూలమును గ్రక్కున బల్లిదుఁడా హరిద్రక్షుం
డరసముఁజేరి మెక్కి తనయంతను సంతసమొందఁజేసి పెన్
గిరిశిఖరంబుపై నిలిచి కేసరి గర్జలొనర్చినట్లు సు
స్థిరమతితో హరి స్తవము సేయఁబొడఁగె శుభాంగి! యీ క్రియన్

— అశ్వధాటీ వృత్తములు —

శ్రీనా! సువర్ణపరిధానా! తమోహ్యదభిధానా! జలేజనయనా!
నానావతారధర! దీనార్తిదైన్యహర! జ్ఞానార్జనప్రియకరా!
మీనాంకధాత్రయుగమూనాంక! నీలవిలూనార్యశంక! దివిజా
ధీనా! ప్రమోదితసుధీనా! హతానుర వితానా! ఖగేనగమనా! 224

ధారాధరోపమశరీరా! శ్రుతిప్రకరచోరా సురేశ్వర హరా!
గిరాశుగప్రచయఘోరాజిమృత్యుపరిహారార్థమందరధరా!
వారాశిగర్భగత భూరామనోమనమరారాతిద్రుంచిన దొరా!
నారాయణా! స్వమనుపారాయణామృతద! గోరాణ్మనఃప్రియకరా!

శ్రీదా! మునిప్రకరమోదాస్పదా! దితిజఖేదాయకా! వరహరీ!
వేదాంతవేద్య! సురఖేదాపనోదన! ప్రసాదాభిరామవదనా!
కాదారిపత్ర! సితపాదార్క నేత్ర! కులకాదాత్ర! చక్రధర! ప్ర
హ్లాదానిశాభినుతపాదా! హిరణ్యకశిపూదగ్రవత్సదళనా!    226

మ॥ రమతోన్ ధాత్రికిఁ బ్రాణనాయకుఁడవై రత్నాకరావాసివై
యమరజ్యోత్స్నసముత్కటాండనివహోత్పత్తుండవై యరిలో
కమునుత్పాలమవైన నీవొనరకై ఖర్వుండవై త్రిస్థితిమా
త్రమహిన్ వేఁడితి వో త్రివిక్రమ! దయాధామా! సనూన్ బ్రోవుమా!

మ॥ కృతవీర్యాత్మజుఁడాదిగాఁగల ధరిత్రీనాథులన్ ఘోరదు
ష్కృతపుణ్యాత్ముల భార్గవుండవయి నిర్నిద్రప్రతాపంబునన్
క్షితిపైఁ గూల్చవె పెక్కుమాఱులు పలాశివ్రాతవిధ్వంసకా!
హృతసాధువ్రజతాప! తాపసనుతాంఘ్రీ ధ్వాంతసందీపకా! 228

ఉత్సా॥ రామా! పయోముగభిరామా! ఖలాసురవిరామా! నభో
మణిసుధా
ధామాక్ష! మోక్షదనుతనామా! మనోజ్ఞసుమదామా! సఖాయి
తరుమా
రామామనోభవ! త్రివిష్టపామాచరేడనుజభీమారకా! బంధగణా
రామాదిమాస! నృపసోమా! ధరాప్రియసుతామానసాపహరణా!

అశ్వ॥ కుందాభదేహా! ముచికుందాదిభక్తమణి బృందార్చితామలపదా!
బృందావనీ వ్రజమిళిందాలకాహృదయ నందార్థ వేణునినదా!
మందాయమూరిజనమందార! ప్రాథమికబృందారకాద్రిభిదురా!
నందానుమోదక! ముకుందా! యశోవిజితకుందాబ్జచందన హరీ! 230

సీ॥ బుద్ధరూపమ్ము వహియించి పొలసుదిండి
పొలఁతుకల యీలువులడంచి ముక్కోటికెల
రక్కసులఁ జంపఁజేసిన పక్కిడాలు
వేల్పు! గుడును కైదువుదాల్ప! వినతి నీకు 231

సీ॥ అధిపతులు స్వార్థపరులై నయమ్ముదప్పి
ప్రజలఁ బీడించునెడఁ గల్కి వపువుదాల్చి
వలయు పనులెల్లఁ దీర్చెదువానికి న్నల
కేసరికి సేవలొనరించి కేలుమోడ్తు 232

క॥ కైటభవైరీ! శౌరీ!, హాటకమయచేల మునిజనామరపాలా!
ఖేటస్తుత్య గరుత్మద్ఘోటక! నాగేంద్రశయన! తోయజనయనా!

ఆ॥ అనుచు నా న్నృపుండు హరినామకీర్తన
మాచరించుచుండ నజుని గాంచి

తిరిగివచ్చు నసురు తెరవున రణక్షేము
రాజుఁ బడిన బంధురాజిఁ జూచి    234

వ॥ క్రోధశోకంబులు మనంబుఁ గలంప నిలింప వైరి హరిద్రఘుఁ జేరి    235

ఉ॥ ఎవ్వఁడవీవు నాపురికి నే క్రియవచ్చితి వారికెన్నియున్
జవ్వను లెక్కసేయని నిశాటవిహారుల నెల్ల గెల్చి తా
కవ్వపుఁగొండ తాల్పుఁ బలుగాకి! నుతించెద వేటికేడ? నీ
క్రొవ్వడఁగించి కండలను గోసి శివావళి పాలొనర్చెదన్    236

కం॥ ఊరుం బేరుం జెప్పుము, తీరెనొ నీ కిహసుఖమ్ము తీరకయున్నన్
జేరుదువె నాదు ప్రోలికిఁ, గ్రూరా! కపట ప్రచార! కుటిలాకారా!

వ॥ అని ప్రేలుచున్న రక్కసిదొరతో నరపతుండు    238

శా॥ సౌరాష్ట్రాధిపుఁడన్ హరిద్రఘుఁడ దుష్టధ్వంసనాచారుఁడన్
నీరేజేక్షణ దాసదాసుఁడ నిటన్ నీవొక్క వైద్యాధరిన్
జోరత్వంబునఁ దెచ్చి కారనిడితంచున్ వార్త రా వెంటనే
క్రూరున్నిన్ననిఁ జంపి తత్సతికి లగ్గుం గూర్ప నేతెంచితిన్    239

గీ॥ అనిన "పిట్ట కొంచెము కూఁత ఘన"మటన్న
నుడి నిజంబయ్యెఁ బ్రేలు నీమొదల మాన
వాధమా! యప్డె నను జంపి యబల బంది
నుండి విడిపించినప్డె నీ వృంతమిందె    240

కం॥ గేహమున కేగి రణస
న్నాహమ్మున నరుగుదెంచి నరనాయక! నా
సాహసము నస్త్రబలమున్
బాహాబల మెఱుకపఱతుఁ బ్రథనక్షోణిన్    241

చ॥ దురమున నన్నెదుర్పఁగల దోర్బలశాలి నిమిత్త ముద్ధతిన్
దిరిగితి సర్వలోకము లదేవనిగాఁ గనుపింపఁడొక్కఁ డీ
సరి కరుదెంచితీవ యరుసంబెననెన్ వెస వత్తునంచుఁ దా
నరుగఁ బ్రయత్నముం సలుపునాతని నడ్డి హరిద్రఘుండనెన్    242

— హరిశ్చంద్రుఁడు సింహముతో యుద్ధముసేయుట —

క॥ ఇంటికిఁ బోనేమిటి కో
తొంటరి! నా కథిమి చూచి తొలఁగఁడలంతే
మంటనయి తేసి నిలిచి మ
గంటికిఁ జూపింపుమన నఖాంచత్క్రకథతోన్ 243

క॥ పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
పుచ్చినచందమ్ముగాదె పురుషాధమ! నీ
మచ్చున్నాశఁగ శూలముఁ
బుచ్చుట నా ముష్టిహతియె పొరిపుచ్చు నినున్ 244

మ॥ అనుచుం గన్నుల నిప్పుకల్ దొరఁగ దైత్యాధీశుఁ డత్యుద్ధతిన్
ఘనఖడ్గంబొఱఁదీసి భూవిభుని దాఁకన్ రాజపంచాస్యుఁడున్
ధనువున్ సజ్యమొనర్చి మీటి శరసంతానమ్ము గుప్పించినం
దునిమెఁ దుత్తునియలై పడన్ దనుజనాథుండడ్గ ఖడ్గాహతిన్ 245

చ॥ అపుడు నృపాలమౌళి నిశితాంబకముల్ శతము ల్సహస్రముల్
విపులరయమ్మునం బఱప వీఁకను ఖడ్గరయమ్మునం గడున్
నిపుణుఁడు గాన వాని నవనిం దిలలంతలుసేసి వేసి వే
లుపు లడలొంద సింగపు టెలుంగొనరించెఁ గురంగలోచనా! 246

ఆ॥ దాన నృపతి కనలి తన వెంట నర్థచం
ద్రాశుగమ్ము తొడి మహాపటిష్ఠ
భంగి లాగి వదలి వైరి కరాసిని
ముష్టికంటఁ దునిమె ముదితమిన్న! 247

వ॥ అప్పుడాపార్థివుండు నిజకులదేవత యగు మాయాదేవిం బ్రార్థించి
తదనుగ్రహప్రాప్త రణోపకరణపరిపూర్ణంబైన రథంబెక్కి యొక్క
బలువిల్లెక్కువెట్టి నారి సారించి పెడబొబ్బఁ గావించి 248

క॥ తొలుకారు మొగులువలనం
గలిగిన బలువాన గట్టుఁ గప్పిన విధిగా

నలుగుల ముంచిన సంతయుఁ
గలఁగక యా ప్రకమిచేఁడు గడువైళమునన్ 249

క॥ పెనుగాలి, వానమబ్బున్
మొనకట్టఁగనీక యడఁచు పోలికి వినుచూ
లిని బాడమొంచెడి గములం
జనర్చు ములుకులను జజని తలఁగెను దానిన్ 250

చ॥ అసురుఁడు చెచ్చెరన్ సునికితాఁ బకజాలము శేయ నవ్వి యా
కసమున నట్టిమై యరుణకాంతులకైనను గ్రమ్మనియమిన్
ముసరిన చీఁకటుల్ నృపతిపుంగవుఁ డేసిన బాణపుఙ్క్తిచేన్
బొసఁగిన మాటచే నడఁగిపోయె నిమేషములోఁ జలోపదీ! 251

చ॥ అనుపమధాటి దైత్యుఁడు శరాసనమొప్పఁగఁ జక్రముంబలెం
దన కరమందుఁ దోఁప శరతండమహాస్త్రాలు పర్వఁ జేయఁగాఁ
గనలి నృపుండు ధర్మగుణకందవినిర్గత బాణవృష్టి న
ద్దనుజశరాగ్ని నార్చి బెడిదమ్ముగఁ ద్రుంచెను జాపదండమున్ 252

ఉ॥ రెండవవిల్లు రక్కసుల జేఁడు కయిఁగొని నారిఁగూర్చి బ
లాఁడమమప్పలోపలనె ఖండనముం బొనరించె భూమినా
థుం డదియున్ సురారి క్రుధతో నతివేగము దోఁపఁగా ధను
ర్దండము లెన్ని తాల్చినను దాల్చుటయే తడవయ్యెఁ ద్రుంపఁగా

వ॥ అట్లు హరిద్రథధరాపురందరుండు దన చాపంబులెల్ల రూపుమాపిన
క్షపాచరవరేణ్యుండు 254

ఉ॥ రక్తరుచిం గనుల్ వెఱ కరంబిడఁ గేలను విద్విషచ్చిదా
సక్తి నిశక్తిఁ బట్టి రభసంబున నేసిన విస్ఫులింగముల్
దిక్తతిఁ గ్రమ్మఁ గ్రక్కుచు నెంచెడు దానిని వెంటనే ధరా
భుక్తిలకుండు ద్రుంచె నిరుమూఁడుగ వాఁడిలకోలదైదిటన్ 255

ఉ॥ త్రుంచినయంతఁ గుంతములుఁ దోమరముల్ ముసలమ్ము లొయ్యన
క్తుంచరుఁ డేయ వాని నృపకాంతుఁ డడంచి తన్మాత్ర మట్టె భే

దించి శరీరముల్గుమి దెబ్బలఁ దాఁటులతోఁ దఁజేసి పా
టించెను నెత్తురోటులు గిరిందిగు శోణఝరమ్ములో యనన్ 256

మ॥ ప్రదరాఘాతజరంధ్రభూరుధిరధారల్ జ్వాలలై క్రాలన
త్రిదశద్వేషి లయాగ్నిహోత్రుగతి నెంతే భీషణాకారుఁడై
గద హస్తంబునఁ బట్టి త్రిప్పి నృపవక్షఃకుడ్యలక్ష్యంబుతో
వదలెం జూచెడి ఖేచరాళ్యనిమిషత్వం బప్లు భీతిం జెడన్ 257

మ॥ బెడిదంబై చనుదెంచు నగ్గదను బృథ్వీనేత నిర్భీతచి
త్తుఁడునై తార్క్ష్యుఁడు దారుణోరుఫణినాథుం బట్టు చందమ్మునం
గడఁకం బట్టి విరోధి సారథిని దాఁకన్వైవ నా దెబ్బతోఁ
బడియెన్ సారథి సంగరక్షితి మహావాతాహతాద్రిస్థితిన్ 258

ఉ॥ సారథివద్ద రథ్యములు స్యందన మట్టిటుఁ ద్రిప్పుచున్న న
వ్వీరుఁడు తేరు వీడి వినువీధికి నేఁ యదృశ్యుఁడై పడిన్
వారిముగాకృతిన్ రసితనాదములుం దమమున్ ఘటింపఁగా
మారుతబాణమేసి క్షణమాత్ర హరించె నృపుండు తత్కృతిన్ 259

మ॥ దనుజుండున్ బెనుకొండలున్ దరులుదుస్థానస్థుఁడై క్రుమ్మరిం
చిన వజ్రాంబకమేసి చూర్ణములు చేసెన్ వాని భూజాని కా
ననసంచారణ ఘోరసత్వతనువుల్ నక్తంచరుండూని తో
చిన నాగ్నేయశరమ్ము చేత హరియించెన్ భూపుఁడా రూపులన్

వ॥ మఱియును వీరుండు మాయాయుద్ధంబునఁ బద్దయుఁ జెలరేఁగ
నీఱాఁగ యాగడమ్ములిఁక సాఁగనీఁగూడదని నరేంద్రుండు రౌద్రాస్త్ర
ప్రయోగమ్మున నమ్మాయావి కావించు మాయలెల్ల మాయించిన
దానం బ్రయోజనంబు లేమి యామినీచరుండు భూమికిం డిగ్గి
మండిపడుచు 261

శా॥ గోత్రచ్ఛేదిముఖామరుల్ దలఁక దిక్కుల్ వ్రీల శేషాహి భూ
భృత్సంఘంబునఁ గంపమొంద రవిమూర్తి న్వెల్గుతగ్గన్ మరు
చ్ఛత్రుం డద్భుతబాహుదార్ఢ్యమెసఁగన్ సంవర్తకాలుంబలెన్
ధాత్రీశుద్వర మొక్కెడెత్తుకొని దీనం జచ్చితంచాప్పుచున్ 262

వ॥ సింహాసనాక్రమణాంబులతోఁ దనపై వచ్చు దైత్యయూథంబులఁ గనలోకించి
మాణిక్యఘనుండు బ్రహ్మశిరోనామకాస్త్రంబు వింట సంధింపంబూనిన
నాకాశవాణి "క్షోణీశ్వరా! యిప్పురంబు త్రిశూలి శూలంబునం
జిక్కఁ జిక్కిన యే దివ్యాస్త్రంబులవలనం జావని వరం బొందిన
వాఁ"డనుడు నా నుడులు విని తత్సంధానమ్ము మాని మానవేశ్వ
రుండు 263

— మాణిక్యఘనుండు పెనఁ జను రాక్షసుఁ జంపుట —

శా॥ కేలుం దోయిని మోడ్చి చక్రియడుగుల్ కీర్తించి భక్తిన్ మహా
కాలుం గృత్తిసుచేలు నెంచి విబుధౌఘుం బాత్మలన్ మోదిలన్
శూలం జేసిన మంటలీను చడి నక్షోభిత్తి ఛేదించినం
గూలెన్ రాక్షసనేత వజ్రదళిత క్షోణీధరంబుం బలెన్ 264

క॥ అత్తఱి మింటన్ వేలుపు
బిత్తరులాటాడి రమరబృందమ్ములు పూ
మొత్తముల వాన గురిసిరి
చిత్తము లానందభరముఁ జెందినకతనన్ 265

ఉ॥ అప్పుడు మోహనాస్త్రహతి నబ్బసమబ్బు దొలంగి రక్కసుల్
దెప్పలువిచ్చిచూచి తమ తేఁడు దురమ్మునఁ గూలియుంటచే
దెప్పరమైన భీతి నృపతిం గని కావుమటంచు మ్రొక్కఁగా
నప్పరమార్థవేది యభయంబు నొసంగి వచించె వారితో 266

ఉ॥ దానవులార! మీ విభువిధంబున దుష్పథమందుఁ బోక వి
జ్ఞానముగల్గి సత్పథమునం జరియించుచునుండుఁ డీ పురిన్
మానితశీల నొక్క యలనాగను మీ పలలాశి తత్పితల్
గానకయుండ బల్మిమెయిఁ గైకొనివచ్చెనుగాదె! యీడకున్ 267

క॥ వీరలు నారులచే న,వ్వారిజపత్రాక్షిఁ దగినవైఖరి నిటకున్
వేరప్పింపుండనఁగా, నా రక్షోవరులు మ్రొక్కి యరిగి రయమునన్

గీ॥ అందలంబున విద్యాధరాత్మజాత
నుండఁగాఁజేసి మేల్మొసుఁగొం డమర్చి

దాని దానవి పాళిచే మానవేంద్రు
ముందు దింపించి రమరారిబృంద మగజ! 269

వ॥ అప్పుడు మరుం డోటనుండి వెడలించిన పూపుటడిదంబు బెడంగు నను, జారుసీరదబహిర్గతాచంచల చంచలాలతిక చందంబునను బైకప్పుc దొలంగించిన జాళువాపసిండిబొమ్మ యెమ్మెను మేలి ముసుంగుc దొలంగించుకొని యుండలంబునుండి యీవలకు వచ్చి విద్యాధరసంపద మోమజవాంచి కరకమలమ్ములు ముకుళించి

ఉ॥ క్రూరుని లోకభీకరుని గుత్సితచిత్తు నసాధ్యసాధనున్
భూరిబలాఢ్యు మర్త్యపలభోజిని నాజిని మ్రించి శీలమున్
జారcగనీక నన్నుబలసాధ్వసమానసc బ్రోచినట్టి దు
ర్వారపరాక్రమా! మదనభాసురరూప! యివే నమస్కృతుల్

ఉ॥ శ్రీకరుc డరిలోకసురవృక్ష మనంతుcడు సత్యప్రపాచ్ఛ ర
త్నాకరుcడీర్ఘకీర్తి యచలాత్మభవాపతి రాజపాళిద
ర్వీకరవిస్ఫురచ్ఛయుcడు విశ్వజగద్విభుc డిచ్చుcగావుతన్
మీకుc జిరాయువున్ సిరులు నిత్యసుఖంబుc బ్రజాభివృద్ధియున్

వ॥ అనుచు 273

ఉ॥ సారసనేత్ర నమ్రయయి స్వాదువచస్సులనాడ జేc డనెన్
క్రూరుల బారిcజిక్కి వెతc గుందెడివారల గోరముల్ వడిన్
బారcగజిమ్మి సాధ్వసముc బాపియు రక్షణ మాచరించుటల్
శూరుల ధర్మమౌ నెకద సోమసమానమనోహరాననా! 274

మ॥ ఖలుcడౌ రాక్షసరాజు నిన్నటు బలాత్కారంబునం దేcగ నీ
తలిదండ్రుల్ మితిలేని శోకమునకున్ ధామంబులై యుండరే
తలcచీ! సోcకు నెలంత లందలము మీcద న్నిన్నుc గొంపోదు రీ
వెలయింబోయి త్వదీయబంధుతతికిన్ హ్లాదోత్సవమున్గూర్పుమా!

క॥ అన వైద్యాధరి పల్కెను
మునికేశ్వర! మీరుcగూడ మాతోc డ దయన్

జనుదేరఁగఁ బ్రార్థించెద
వనఘులు మా పితలు చూడ నర్హులు మిమ్మున్ 276

సీ॥ శరధిగత దైత్యపురి దవిష్ఠంబునాక
శ్రమము నోర్చి సౌరాష్ట్రదేశమున నుండి
వచ్చి ఖలుల్ వచ్చి నన్నుఁ గాపాడిన తమ
రనుమతింపక పోరు నా ప్రార్థనమ్ము 277

క॥ అని వినయమ్మునఁ బలికెడు
వనితకు క్షితిపతి వచించె వనజేక్షణ! నీ
జననీజనకుల సద్గుణ
వనధుల దర్శించుటయు శుభంబగుఁ గానన్ 278

శా॥ మీ తోషం బనుదెంతు లెండన సతిన్ మేనాపయిం జేర్చి యా
హై తేయాంబుజలోచనల్ గొనుచుఁ బోధాత్రీశుఁడుం బోయి త
న్మాతాతాతులఁ జేర్చి మ్రొక్కిన మహానందమ్ముతో వారు భూ
నేతన్ మెచ్చి శుభంబుగా నొసఁగి రన్నే దీవనల్ పార్వతీ! 279

వ॥ అట్టియెడ 280

క॥ వైద్యాధరి మేనా దిగి
పద్యమశంబులకు సాఁగిపడి మ్రొక్కిన నా
విద్యాధరదంపతు లతి
హృద్యానందములు చేతనుఁ దెలఁగొనఁగన్ 281

ఆ॥ లేవఁదీసి కౌఁగిలించి యానందాశ్రు
జలముచేత మేను సల్లపఱచి
మమ్ము వదలిపోయి మా తల్లి యిందాఁక
నెందు నెట్టులుంటి వెలుఁగఁ జెప్పుము! 282

వ॥ అనుచుఁ దన చరిత్రంబు వినుటకై తొందరఁ జెందుచున్న తల్లి
దండ్రులచేత హరిశ్చంద్రమహారాజనకును రాజాసిమూఁకకును సము

చిత్రోపచారమ్ములు జరిపించి యెల్లరు సుఖోపవిష్టులైన పిమ్మటం
దాను పీఠంబు బలాత్కారంబునం గొనిపోవుట మొదలా నిమే
షమ్మునకు జరిగిన వృత్తాంతమ్ము శోకమ్మును విస్మయమ్మును
సంతోషమ్మును జెందుచు జననీజనకులును నప్పుడచ్చటకు వచ్చిన
బంధుమిత్రపరివారమ్మును వినంజెప్పి సౌరాష్ట్రేశ్వరుం జూపి 283.

క॥ మతిలేనివాఁడఁ గానఁగ
నతిపాపుల విబుధరిపుల హరియింపఁగ శ్రీ
పతికిం జక్రికిఁ బురుడై
క్షితిపతి పలు నుతులు మీకుఁ జెప్పఁగ నేలా ? 284

క॥ ఈలువు సెడకుండ న్ననుఁ
బాలించిన యీ నృపాలు పదదాస్యముఁ బ్రా
ణాలున్న యంతకాలము
దాలిమిఁ జేసినను ఋణము తలఁగదు నాకున్ 285

మ॥ ఈ దేహమ్ము లభింపఁ జెంపుఁగన మీరే హేతువౌటన్ మిమున్
గాదం చేపని జేయఁగాఁడగదు గాన న్మీరలే యెట్లో యీ
భూదేవేంద్రుఋణమ్ముఁ దీర్పఁదగు నన్ బుత్రోక్తులాలించి యా
హ్లాదసన్మూర్తి నృపాలుతో ననియె విద్యాభృద్వరుం డత్తఱిన్ 286

చ॥ కృపయుఁ బరాక్రమమ్మును హరిద్రథ! నీదగు సొమ్ములేమ నీ
యుపకృతి యప్పుఁ దీర్చుకొననోపమ జన్మశతాల రత్నగ
ర్భపతులచేతఁ గప్పము లపారముగాఁ గొనుచున్న నిన్నుఁ దృ
ప్తిపఱుపఁజాలు వస్తువులు విప్రపాళిని లేవు గావునన్ 287

ఉ॥ వినయవివేకశాలినిఁ బవిత్రచరిత్ర సుగాత్రఁ బద్మసం
జనితవరోద్భవన్ ఖగవృషధ్వజపద్ద్వయసక్తచిత్తఁ ద్వ
ద్ [illegible] భిరక్షితనితాంత భవత్పదదాస్యకామ మ
[illegible] కృతార్థులఁ జేయుము మమ్ము సన్మతీ !

వ॥ అని వినయమ్ముదోఁప హృద్యంబుగా విద్యాధరుండు పలుకుచున్న
తఱి మహోమతిన్ మహతిన్ రమారమణనామమహిమంబు గానంబు
సేయుచు నారదమునీంద్రుండు వచ్చినఁ బ్రతిభాసహితమ్ముగా
విద్యాధరదంపతులును హరిద్రథనరేంద్రుండును వందనంబులొనర్ప
నాశీర్వదించి వారిచేఁ బూజితుండై మునిపతి భూపతిం గాంచి 289

సీ॥ కనుల మీనతయు మోఁగాళ్ళఁ గూర్మత్వంబు
నడుమున యందసంతత ముఖమున
విధువిలాసంబును వీనుల శ్రీమనో
హరతయుఁ గుచముల ధరణీధరతఁ
గురులను గృష్ణత్వగరిమ నూగ టనం
బలఘు హరిత్వంబు గళమునందు
శంఖరూపముఁ గటిఁ జక్రవిక్రాంతియుఁ
గనుబొమ్మలందు శార్ఙమ్ముతీరుఁ

గీ॥ గలిగి రామాభిరామయై గ్రాలుచున్న
యీ వరాంగిని వరియించితేని నీకు
నెపుడుఁ బంచాయుధానంద మొసఁగి మెసఁగు
హృతపలాశ! హరిద్రథ క్షితితలేశ! 290

క॥ విద్యాధరదంపతు లన
వద్యగుణాంబుధులు గాన వారి యభీష్టం
బుద్యత్కృప నెఱవేర్చిన
ముద్యుక్తులమగుదు మేముఁ బురుషలలామా! 291

ఉ॥ మానినివరుం డిటుల్ వలుక మానవనాథుఁడు నాలకించి యా
యోనకు నడ్డమాడఁగల యంతటి మూర్ఖుఁడనే మైన చిరికీ
ర్తానిని మిన్నయొక్కతె కుమారిక యౌట నెడాటకోప కి
ల్లానసభర్త నిల్పితొన నాత్మఁ దలంపకె యుల్లడంబుగన్ 292

ధర్మపత్ని యగు విద్యాధరతనయవలన నిష్టసుఖంబులొందుచు సత్పుత్త్రులం బడసి రాజసూయ వాజపేయ హయమేధాదిక క్రతు సహస్రంబులొనర్చి యవిచ్ఛిన్న మాఘవ్రతుండై హరిపూజాతత్పరుండై యుత్తమాంగల యభిమతంబులీడేర్చుచుం జెక్కు వేలేండ్లు భూలోకసుఖంబు లనుభవించి దేహాంతమ్మున విష్ణుసేవకానీతదివ్య విమానమ్ము నర్ధాంగీసహితమ్ముగా నెక్కి పునరావృత్తిరహిత వైకుంఠంబుం జేరి శౌరిసాయుజ్యంబు నొందె నట నాకలోకంబున విద్యాధర మిథునంబును దౌహిత్రభవానందమ్మును బుత్రజన నానందమ్మునుం బొందెం గావున మాఘవ్రత ప్రభావంబుం దెలిసి కొని వొనర్చినవారు వైద్యాధరింబలె సర్వశ్రేయంబు లొందెదరని నిటలాక్షుండు నగపుత్త్రికి నిట్లనియె 299

మ॥ రవి మాఘంబున నక్రమందుండగు తఱిం బ్రత్యూషవేళం బురం
బవలం గల్గిన నీటమున్గ నతం డత్యంతాఘముల్బాసి దే
వవరేణ్యార్చిత వారిజాధవపదప్రాప్తుండగున్ లేనివాం
డు విపన్నాత్ముండునై యింట బాధపడు నెప్డు న్నిక్కువం బద్రిజా! 300

మ॥ నగజా! మాఘమునం బహిర్జలమునన్ స్నానమ్ముం గావించి ప
న్నగశాయిన్ భజియించి తత్పదభవార్ణఃపానముం జేసి పా
పగణచ్ఛేదక తత్కథల్ వినుచుం నెవ్వాం డా నెలంబుచ్చు న
వ్విగతాఘుం డతండిందిరాధవ పదాప్తిం గాంచు సౌఖ్యంబులన్

క॥ ఈ వైద్యాధరి కథ స
ద్భావంబున విన్నం జదువ వ్రాయ సమస్తం
బా వృజినములు నశించును
గైవల్యముం గల్గు మేనకావరపుత్త్రీ! 302

వ॥ అని శివుం డుమకుం జెప్పెనని సూతపౌరాణికుండు శౌనకాది మహామునులకుం జెప్పె 303

— ఆశ్వాసాంతము —

శిఖరిణి: బుధవ్రాతాహ్లాదప్రద సుకవితా! పూతచరితా!
సుధాంశూద్యత్కీర్త్యావృతదశదిశా! సూరినిశా!
క్షుధాదూరా! ధీరా! గురుగుణధురా! కోవిదవరా!
ప్రధానాస్యాస్యాబ్జోల్లసన్ముదితరవీ! రామసుకవీ! 304

— గద్యము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర నరసయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభూషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ స్వామినే నమః.

# మా ఘ పు రా ణ ము

## చతుర్థాశ్వాసము

క॥ శ్రీగోపమంత్రిపౌత్రా!
భాగీరథ్యుదకమగ్న పావితగాత్రా!
రాగాద్యవగుణజైత్రా!
సన్మార్గ్యచరిత్ర! రామకవి వృషపుత్రా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యనివాసులగు శౌనకాది మహామునిశ్రేష్ఠులకు సకలపురాణకథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె నవ్విధంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబుఁ దెలుపుచున్న శివుండు 2

## 9 అధ్యాయము

గీ॥ అంతు లేని సుఖములు గల నబ్బఁజేయు
మాఘమాహాత్మ్య మెఱిఁగింతు మఱియు శ్రేష్ఠ
వినుము పరమార్థ మిది గాన విబుధ పూజ్య
పాదనీరజ! శీతపర్వతతనూజ! 3

గీ॥ పూర్వమున గృత్స్నమదనామ మునివరుండు
వేదవేత్త సశిష్యుఁడై విబుధనదిని
మాఘమజ్జన మొనరించి మధువిరోధి
సైకతస్థలి నిల్పి పూజలను సల్పి 4

క॥ హరిసత్కథ వినిపించెడు
తరుణమ్మున జహ్నువనెడు తాపసవర్యుం
డెఱిఁగింపు మాఘమజ్జన
గురుమహిమము వినఁగ నాకుఁ గుతుకంబయ్యెన్ 5

వ॥ కరుణాభరణులును సర్వజ్ఞులు నగు మీరు మాఘస్నాన మాహాత్మ్యంబు నాకెఱింగింపఁదగుదురు గాన సమగ్రంబుగా వినిపింపుఁడని

వేడ్క గృత్స్నమదుండు సంతసించి నీ ప్రశ్నమ్ము చాల బాగని
జహ్నుమునితో నిట్లనియె 6

ఉ॥ సక్రమగుఁ బర్వఁదైనతరుణమ్మున మాఘమునందుషమ్మునన్
సక్రమభంగి మజ్జనముసల్పిన పంచజనుండు పూర్వ మా
నక్రకునీతి సర్వకలుషమ్ములఁ బాసి శుభమ్ములొందు ధూ
త్రక్రమ! జహ్ను పూ! యనినఁ దన్ముని గృత్స్నమదాఖ్యుతో ననెన్ 7

ఉ॥ మున్నలవజ్రపాణి కడుమూర్ఖతఁ జేసిన దోసమేమొ? యే
యెన్నఁ మాఘమజ్జనవిధి న్నెఱవేఱిచి ఘోరపాపవా
రాన్నిధిను త్తరించెనో? ధరాదివిజోత్తమ! తెల్పుమన్న నా
మన్నుతుఁడైన గృత్స్నమదమౌనివరేణ్యుఁడు వల్కె వానితోన్ 8

తే॥ ఆదియుగమునఁ దుంగభద్రాంతికమున
నాశ్రమమొనర్చికొని యుండె నాత్మవేత్త
కామముఖమానసారి షట్కప్రభేత్త
యతులవిజ్ఞాని మిత్రవిందాఖ్యమౌని 9

క॥ ఆ మునికి సోమసముముఖ
భూమి నిభశ్రోణి వారిముక్తచ సుమనః
కోమలగాత్ర గజగమన
కామిని మీనాక్షి గృహిణిగాఁ జెలువొందెన్ 10

గీ॥ ఆకె యొకమాఘ ఋతుసమయాంతమందుఁ
దుంగభద్రోదకమ్ములఁ దోఁగి కేశ
జాతముల నార్చుకొనుచు బాలాతపమున
నిలువఁబడియుండెఁ జలిబాధఁ దలఁగిపోఁగ 11

వ॥ ఆ సమయమ్మున 12

చ॥ దనుజుల సంహరింపఁగ శతారథమందు బలిష్ఠులైన స్వ
ర్గనిలయులన్ దిశాపతులు దురమ్మునకై తనతోడ రాఁగ న
మ్మునిపతి యాశ్రమాధ్వమునఁ బోవుచు నేటిదరిం జలోదరిన్
మనసిజమందిరిం దొరయు మానికశ్రేత్రముఁ జూచి మెచ్చుచున్ 13

సీ॥ చపలచిత్తుఁడై యాకెతో సంగమమ్ము
సల్పఁగా నాత్మయందు నిశ్చయ మొనర్చి
యనతిదూరంబునందున్న యంబుజాత
ముఖిని మోహించి తలఁచుచుఁ బోయె వనికి 14

చ॥ అరిగి యమాశఁగల్గిన పలాశగణేశులతోడ ఘోరసం
గర మొనరించి గెల్చి తిరుగం దనప్రోలికిఁ బోవ నెంచి స
త్వరముగఁ జన్న తెన్నున నె వచ్చుచునుండఁగ మిత్రవిందభూ
సురవరు నాశ్రమస్థలము చూడ్కికిఁ గన్పడె వేల్పుఱేనికిన్ 15

వ॥ అప్పటికి సాయంకాలంబగుటయు నింద్రుండు నే నీ యాశ్రమవాసి
యగు మిత్రవిందుం దర్శించి వారిఁ సేవించివచ్చెద మీరరుగుఁడని
తనతో వచ్చువారలనెల్లఁ బంపివేసి తా నా మిత్రవిందు పర్ణశాల
కరుగువఱకమ్ముని సంధ్యాసమయకృత్యంబులకై తుంగభద్ర కేగి
యుంట సూక్ష్మరూపియై తత్పర్ణశాలయం దొక కోణిగపైఁ జేరి
యమ్మిత్రనాక్షి సౌందర్యంబుఁ దనివితీఱ వేయికన్నులం జూచు
చుండె 16

సీ॥ విబుధవరుఁడయ్యు నింద్రుండు వృజినకృత్య
మాచరింపఁగఁబూనె సూర్యాఖ్య నెప్పుడు
సత్పథంబునఁ జను నేను జనదు చూడ
నని తొలంగెనో నా భానుఁడస్తమించె 17

క॥ తరువాత మిత్రవిందుఁడు, సరిత్తునుండి నిజపర్ణశాలకుఁ జని రా
తిరి భోజన మొనరిచి సుం,దరితో శయనించి యపరతామసివేళన్

ఆ॥ నిదురనుండి లేచి నిజశిష్యులుండిన, యితర పర్ణశాలకేగి వారి
లేపి వేదపాఠ మోపికఁ జెప్పుచు, నందె కూరుచుండెనయ్య విప్ర!

క॥ తఱియెఱిఁగి వజ్రి సుందరి,దరికిన్వేగముగ నేగి తరుణీమణి! ని
ర్జరవరుఁడన్నిపైఁగల, మరులున నిటకేఁగియుంటి మదనవశుఁడనై

సీ॥ కాన నన్నేలుకొమ్మని కాంత కేలు
పట్టినాఁడ నిక్కముని లాగి బయలికేగ

క॥ తక్కిన వేలుపులెల్లను
నొక్కటిగాఁగూడి పగఱ నోర్వఁగ వెలిమేన్
జక్కని నెక్కిడి తమ రా
యిక్కువఁ గనఁదగిన వెరవు నెఱుఁగుటకొఱకై 40

వ॥ నెనకుమంభోయి తోయమధ్య సమీపంబున నొక ప్రత్యంతపర్వతా
గ్రంబునకరుగ నది మకరమాఘంబు గాన ధూతపాతకులగు మహా
మునులు కొందఱాకాశగమనంబున వేంచేసి తత్పాదాగ్ర దేవ
ఖాతపూతోదకంబుల నర్ధోదయస్నానంబుచేసి వాసుదేవపూజఁ
గావించి మాఘమహిమంబుఁ జెప్పికొనుచుండ వారిం గని యని
మిషులెల్ల మెల్లన దరికరిగి మ్రొక్కి వినయంబున 41

ఆ॥ బ్రహ్మవేత్తలార ! పాదాగ్రమున మీరు
సేయు వ్రతమదేమొ చెప్పుఁడనిన
నా మునీంద్రు లప్డు ననుకంపఁ జెప్పిరి
మాఘమహిమ మిట్లు మర్త్యతతికి 42

క॥ ఓ వేల్పులార! మాచేఁ, గావింపంబడెడు నిద్ది ఘనతరకలుషా
టవిదళన మాఘవ్రత, మా విష్ణున కిద్దిముఖ్య మన్నివ్రతాలన్ 43

ఉ॥ మీరలెఱుంగ నెంచుట సమిద్ధజగద్ధితబుద్ధిఁ దత్సవి
స్తారముఁ జెప్పవారమనుమత్తమశీల వినఁజెల్లు నర్కగుం
డైరవి యున్న మాఘమున యందు బహిర్జలమం దుషమ్మునన్
వారక స్నానముం జలుపువారలు గాంతురు మోక్షసంపదన్ 44

గీ॥ మాఘమున వేకువన్ లేచి మాధవుదీశు
సంస్మరించిన వారి దోషమ్ములపుడె
భస్మమగు స్నాన దాన జపముల భక్తి
సల్పువాఁడు ధన్యుండు నిస్సంశయముగ 45

సీ॥ మాఘంబునందు బ్రాహ్మణులకు గోదాన
మిచ్చిన శివలోకమెనయుఁ దిలల

నొసఁగిన విధులోకమొసవు నపూపమ్ము
లీయఁ బానీయజహితునిలోక
మబ్బు నన్నంబిడ నాకలోకము గల్గుఁ
బాయసమిా ధ్రువవసతి పొసఁగుఁ
గంబళ్ళపుతుకునఁ గాలి నెచ్చెలి తావు
సేకురుఁ జేలలఁ జేతఁ దాత

గీ॥ జగము దాల్పును వృషభ విసర్జనమున
విష్ణువిష్టప మమరుఁ బవిత్రతమము
కలుషహరమగు వ్రతము మాఘవ్రతమ్ము
కన్న వేరొండు లేదు సుధాంధులార! 46

గీ॥ మాఘ శుక్ల చతుర్దశియందుఁ బూర్ణి
మాసి గోతిలాపూప కంబళ సువర్ణ
పాయసాన్నాంబరంబులు భక్తి విప్ర
వరుల కిడువాఁడు నైకాంతవాసుఁడగును 47

క॥ ఈ మాఘవ్రతము వనీ
ధామ మునీశులకు ముక్తిదాయకము గృహి
స్తోమమ్మున కవ్విధమున
క్షేమము శ్రేయము నొసంగు జేజేలారా! 48

ఉ॥ బాలురు కోడెకాండ్రు ముదివారలు నారులు రోగపీడితుల్
నాలుగుజాతులం బొడమినారలు వర్ణిముఖుల్ జనుల్ చలిన్
దాలిమిపీడి మాఘమున స్నానముసమ్మునఁ జేయకున్నఁ జం
డాలకులమ్మునందు జననమ్మునుగాంచి యనంతరమ్మునన్ 49

వ॥ పుల్కసరజకకులాల తైలికాది నీచ మర్త్యవంశంబులందొదవి పిదప శ్వాన ఖరోష్ట్ర వంచక వృక పుండరీక సూకర కాక ఘూక మూషిక క్రిమి కీటక రూపంబులం బ్రాపించి యాపై పిశాచరూపంబులొంది మితిలేని వెతలఁ గుతిలపడుచుండెదరు 50

క్రమకపోలుండు కరుణాలవాలుండు
నవకకర్ణుండు సునాసికుండు
సింహసంహననుండు శ్రితదైన్యహాననుండు
పోషితార్తుండు దామోదరుండు
తే॥ శంఖముఖ్యపంచాయుధసంయుతుండు
హారకుండల కటకాదికాంచితుండు
గరుడతురగుండు శౌరి జగత్ప్రభుండు
దైవతవితానమునకుఁ బ్రత్యక్షమయ్యె 57

ఆ॥ అపుడు దేవతలెల్ల సాష్టాంగవంద
నంబు లొనరించి లేచి వినమ్రులగుచు
దోయిలించి మహాభక్తితోడ సంస్త
వమ్ముఁ గావింపఁదొడఁగిరి భవవిదూర! 58

## 10 అధ్యాయము

— దేవతలు నారాయణమూర్తిని స్తుతించుట —

మ॥ శ్రుతివేద్యున్ సకలేజ్యు వేదచయవాసున్ నిన్ను విజ్ఞానసం
గతులేకాక విమూఢమానసు లెఱుంగన్ లేరు ఛాయాసతీ
పతి తారాపతి భారతీపతి సతీప్రాణేశ దేవేశ సం
స్తుతయుష్మత్పదసారసద్వయము చక్షుఃప్రీతిఁ గూర్చున్ హరీ! 59

మ॥ అమరానందసుధాబ్ధిపర్వశశికి న్నాకామృతత్యాగికిన్
భ్రమరాంబాధవ వాగ్ధవావనునకున్ వైకుంఠసంవాసికిన్
స్థిమితాపాదికి వేదికిన్ సతత సచ్ఛిద్రూపసంభాసికిన్
గుమనోదండికి దేవదేవునకు మ్రొక్కుల్ నీకు లక్ష్మీశ్వరా! 60

మ॥ భువనంబుల్ సృజియింప ధాతవయి పెంపుంజేయ శ్రీనేతవై
యవియింపం ద్రిపురాభిజేతవయి బ్రహ్మాండంబు లత్యంతనీ
రవృతంబౌతఱి నొక్కరుండవ శ్రుతిప్రస్తూయమానుండవౌ
చు వటత్కోమలదళప్రసుప్తిఁ గను విష్ణూ! నీకుఁ గైమోడ్పుల్ 61

వ॥ అని కల్గిన డగ్గుత్తికం జక్కసేసికొని మరలిట్లు వేఁడిరి 62

మ॥ మును లోకంబులు గల్గి కష్టసుఖముల్ పూర్ణంబుగా నొందె ని నా
శనముం జెందుచునుండు నప్రకృతికి శాస్త్రజ్ఞులైనట్టి నీ
ర్వనితానేత్రముఖామరుల్ దెలియ నేరర్గాదె? కైవల్యపం
బున తామర్త్యనగంబుఁ దావకపదంబున్ శ్రీశ! వారుద్రిశా! 63

మ॥ భువనంబంతయు నీవ నీతనువుహా సూక్ష్మద్వ్యాంశ్రేణి నుం
డు విధాత్రండచయంబు బానత్వమున నెప్డున్ వానిలో మేటి బ్రా
భవమొప్పన్ వసియించు నెల్లరు భవత్పాదిష్ణం గనన్నేరు బు
ద్ధివికాసంబు నశించు రాజసము వృద్ధిం జెందుటన్ కేశవా! 64

మ॥ తొలుతన్ మాయ సృజించి పిమ్మటను ధాతుస్వాంతబుద్ధ్యాదులన్
గలుగంజేసి గుణమ్ములన్నలిపి యంగం బేర్పడంగూర్చి య
వ్వాల జీవాత్మయు గస్వరూపమునఁ దద్వ్యాసమ్ముఁ గావించి యా
టల నాడింతు ప్రపంచరంగములనిండన్ సూత్రధారుండవై 65

మ॥ జలధింబండిన నీదు నాభిసరసీజాతమ్మునం బుట్టి యా
నలజాతుండు నిజోద్భవస్థలముఁ గానన్ లెస్స త్రిగ్గాడి త
జ్జలధిం దానెదిగ నకేనెవడ నేతత్పద్మముం దాల్చు న
య్యాలఘుం డెవ్వఁడటంచుఁ జింతిలఁ దపస్సంచీవు వాక్రుచ్చినన్ 66

మ॥ పిపడన్ నీదగు బొడ్డుపద్మ్ముఁగడంకన్ వేయేండ్లు లా వేల్పుపె
ద్ద దపమ్మున్ ఘటియించి యన్నిటికి నాధారంబు నీవే యటం
చెద గుర్తించి నుతించి యెల్లజగముల్ సృష్టింపఁగా నీవు వా
నిఁ దగం బెంపొనరింతు వాత్మబలమున్నెక్కొల్పి నారాయణా!

మ॥ వదనంబుల్ పదినూర్లు వేయికనులున్ బాహుల్ సహస్రంబునున్
బదముల్ నూఱుపదుల్ గలట్టి తనువుల్ పైయన్ని దీపింపఁగాఁ
బదియున్నాలుగు విష్టపంబుల సదా వ్యాపించి యన్నింటిపై
ని దశాంగుష్ఠ సమున్నతుండవగు శ్రీనేతా! నమస్కారముల్ 68

మ॥ భువనంబుల్ పదునాల్గు నీకడుపులో మూలన్ సభూతాళులై
నివసించుం బజ చావుపుట్టుకల నెన్నే వానిలోఁ గాంచుచుం

మ॥ భవదీయోత్తమనామవర్ణయుగముం భావించుటన్ బర్వతో
ద్భవసంప్రాప్తమహత్త్వయై పరమశాస్త్రజ్ఞాత్రియై దాత్రియై
శివసంతోషదయై కలాశ్రితకథాశేషజ్ఞయై ప్రాజ్ఞయై
భవముల్ వాపి శ్రితాళికిన్ సుగతులీఁ బ్రాపింప్రాగాదే? హరీ! 76

మ॥ యుగకోటుల్ ఫణినేత వేమొగములన్ యుష్మన్నుతిం జేసి శ
య్యగ నీకౌటకు యోగ్యుఁడయ్యె నటులే సత్త్వైకమూర్త్యైన ప
న్నగవిద్వేషి భవన్నుతిన్ జలిపి జెంపాపై విరాజిల్లి మే
లగువాహంబుగ నయ్యె నీకు జలజాక్షా! నాకసన్నందనా! 77

మ॥ శ్రుతులన్ ద్రుచ్చిలి సోమకాఖ్యసురశత్రుం డబ్ధిలో దాఁగి యు
చ్చతురాస్యున్ వెతలొందఁ జేసిన మహస్వామిస్వరూపాన న
ద్దితిజుం జంపి శ్రుతుల్ విధాతకిడి ప్రీతిఁగూర్చవే రక్షితా
శ్రితసంతాన! దయానిధాన! నళితారిపాణి! నారాయణా! 78

మ॥ దనుజుల్ మమ్ముఁ గలంచి యమ్మృతపాత్రిన్ బల్మిఁ జేపట్టి తా
మె నిజాభీష్టముఁ దీర్చికోఁదలఁచఁ గూర్మిన్ మాయయిన్నిల్పి మో
హినివై వారల మోసపుచ్చి యమృతం బిచ్చెదె మాకీవు? భ
క్తనికాయావనకృత్ప్రవీణ! ఖగరాట్యంఘాణ! నారాయణా! 79

మ॥ అనిలో మమ్ము జయించి మాత్రిదివరాజ్యంబేలు వీరున్ విరో
చనజున్ వామనవర్ణివై త్రిపద భూస్థానంబు యాచించి పెం
చి నిజాంగమ్ము జగత్త్రయమ్ముఁ గొని మా శ్రీలెల్ల మాకీవె? య
య్యనుజప్రేమము నేఁడును న్నిలుపు మో యజ్ఞాక్ష! నారాయణా!

మ॥ నిసుఁగుం బ్రాయమునన్ ధ్రువుండొకసపత్నీమాతృవాగ్ఘేయవా
క్యసరాఘాతము నోర్వలేక యడవిలో విశ్వాత్మకున్నిన్నుఁగూ
ర్చి సమస్తస్తుతిపాత్రమైన తపముం జేయంగ హర్షించి వా
ని సదాస్థానమునందు నిల్పవె దయాస్నిగ్ధాత్మ! నారాయణా! 81

మ॥ మకరగ్రామణికగ్గమై రణములో మత్తేభనాథుండు డ
స్సి కరంబుజ్జ్వలశుద్ధచిత్తమున నిర్జించింప వేవేగ నా

నణే నీవేగ తదీయ శాత్రవుని కంఠచ్ఛేదముం జేసి నీ
యుణిలంకాచ్యుతి సత్పదమ్మొసఁగలేదా? శ్రీశ! నారాయణా! 82

మ॥ ధ్రువుఁ డేపాటి బుధుండొ రాక్షసుని పుత్త్రుం డెట్టిపుణ్యుండొ హ
స్తివిభుం డెంతటి బుద్ధిశాలియొ ఫణిశ్రేష్ఠుండు దానెంత సా
ఘవొ నిన్నుం గొనియాడి నీకృపకుఁ బాత్రుల్గావుటన్ వారె భ
క్తవతంసమ్ములుగాఁ బ్రపంచవినుతిం గన్నారు నారాయణా! 83

మ॥ కనకక్ష్మాధరధీర! కైటభముఖ క్రవ్యాదసంహార! దు
ర్జనకాంతారకుఠార! కోటిరతిరాట్సంకాశ శృంగార! పా
వనచిత్తాబ్జవిహార! సర్వభువనభ్రాజద్యశస్సార! పం
కనికాయాబ్ధసమీర! శౌర! సరిదీడ్గంభీర! నారాయణా! 84

మ॥ సమరక్ష్మాతలభీమ! భీమదయితాసంస్తవ్యపాదాబ్జ! య
స్తమరాళాహితకీర్తి! కీర్తితదయాసంపూరితాలోక! లో
కముదాపాదకదాన! దానవగణోద్గంధేభహర్యక్ష! య
క్షమహీదాయకచక్ర! చక్రహితరాజత్తేజ! నారాయణా! 85

చ॥ శ్రితజన దుఃఖనాశకముఁ జిత్రచరిత్రము సత్పవిత్రమై
న తమ పదాబ్జయుగ్మము మనంబునఁ జేర్చి నమస్కరింతు ము
ద్ధతిదితిజాతఘాతులము దైన్యసమేతుల మార్తి భీత దే
వతలము మమ్ము విస్మృతకృపం గనుగొమ్ము రయమ్మునన్ హరీ!

ఉ॥ మాకిఁకనైన నాకమున మా ప్రభు వింద్రుఁడు లేఁడు మాకు నా
పాకవిరోధి యిప్పటి నివాసతలమ్ము నెఱుంగరాదు దు
ర్భీకులు దైత్యదానవులు రేఁగి దురమ్మున మమ్ము గెల్చినా
రో కమలాక్ష! యిట్టియెడ రోయ్యనఁ బాపుము నీ శ్రితాళికిన్ 87

గీ॥ మాకు నిమ్మెడ నాదిత్యమాళినైన
మఱియొకనినైన సర్వసమర్థుఁ దెచ్చి
ప్రభువుగా నిచ్చి యాగా వెతల్ పాపి ప్రోవు
మెంపుగ నీ యాజ్ఞలోఁ జరియించు మమ్ము 88

సీ॥ మాఘమాసమ్మునన్ రవి మకరమందు
నుండునప్పు డుషోవేళ యుమ్మనధిపుఁ
దుంగభద్రోదకమ్ములఁ దోఁగఁజేయుఁ
డందుచే సుముఖుండగు సంతెకాళ 93

క॥ శక్తుఁడయి నాకమున కా
సక్తిం జనుదెంచి యప్పుడె సంగరమున నా
రక్తపతతిఁ గూలిచి క్రతు
భుక్తిలకుల మిమ్ముఁ బ్రోచుఁ బురుభుజశక్తిన్ 94

మ॥ అని విష్ణుండు వచింప దేవచయ మత్యాశ్చర్యముంబొంది యో
వనజాతేక్షణ! క్రుద్ధమానివర శాపప్రాప్తదూరాసభా
ననమున్మార్చి నిజాస్యమిచ్చి దివికిన్ రాజాలు సామర్థ్య మిం
ద్రునకున్ మాఘనిమజ్జనంబె యిడునే? తోషంబు మాకబ్బునే? 95

చ॥ అమరులు శంకమై యటులునాడు నుడుల్విని నవ్వి విష్ణు వో
సుమనసులార! యిద్ది యొక సోద్దెమె? పూర్వమునం దపోధనో
త్తముఁడగు కౌశికుండు వసుధాస్థలిఁ బుట్టెడు వేళ జారతా
ఘమున నెసైన వానరముఖచ్యుతిఁ గాంచఁడె? మాఘమగ్నతన్ 96

వ॥ అని ఖగేంద్రవాహనుండు నుడివిన పల్కులు విని వియచ్చరు
లచ్చెరువుంజెంది దేవా! విశ్వామిత్రచరిత్రం బాద్యంతంబు విన
గుతూహలంబయ్యె నానతీయవే యని వేఁడఁ హరి యిట్లనె. 97

శా॥ పూర్వంబందొక మాఘమందుఁ దనయాపుత్ర్యాపగా వారి గం
ధర్వుల్ దారకుమారయుక్తముగఁ బ్రాతస్స్నానముం జేసి తీ
రోర్విన్ మాఘవిభున్ ననున్ గొలిచి శ్రద్ధోపేతులై స్వాశ్రమః
పర్వంబౌనటు మాఘమాసమహిమ ప్రాశస్త్యమాలించుచున్ 98

సీ॥ మరల నాకాశగతిఁ గుటుంబములతోడ
నాకమునకేగు చా నెలనాళ్ళు వ్రతము
జరుపు చందొక గంధర్వవరుని భార్య
యొప్పు స్నానంబునకు రామి యెఱిఁగి విభుఁడు 99

క॥ శావని మెన్నో తెన్నుల
నా నెలఁతుక పెడసరమున నాడిన వెడ క
ద్దాని బలాత్కృతిఁ దోకొని
స్నానమ్మునకేగె స్వకుల సంతానముతోన్ 100

క॥ ఏగి తన ప్రాణనాయిక
భాగీరథిస్నానమొనరుపం బల్కి కడున్
వేగిరపడి యా నదిలోన్
దోఁగె సకాలమ్ము మించునో యను మదితోన్ 101

క॥ ఆ కైవడి నక్షత్రోదయ
మౌ కాలమ్మునను స్నానమాడి పయోర
త్నాకరశయాను పూజలు
సాకల్యము సల్పి మాఘచరితము వినియున్ 102

వ॥ మదీయ ధ్యానాసక్తచిత్తుండగుట స్వభార్యావిషయంబుఁ దలంపక తక్కుంగల గంధర్వజాతంబుతో గగనగమనంబున నిజనిలయం బునకరిగె నిచ్చట 103

ఉ॥ శర్వశిరస్స్థ వేగవతిసన్నిధి వల్లభముక్తయైన గం
ధర్వి తదీయకాలజనితంబగు శీతలవాతబాధఁ దా
నోర్వఁగలేక భర్తనుడి నొల్లక స్నానము మాని మానితా
ఖర్వ ఫలప్రసూనదళ కాంతతరువ్రజ దృష్టిహృష్టయై 104

చ॥ సుఖముగఁ గాలముం గడపు సుందరిమిన్నకు దేవయానులు
న్ముఖులయి యంతరిక్షమునఁ బోయెడుచోఁ దను బోవఁబూనఁబో
యె ఖమునఁ బోవుశక్తి నశియించి తపస్సున మజ్జనంబు లే
మి ఖిలముఁగాంచె సాధ్వీత సమిద్ధవాఞ్ఛ నిరాకరించుటన్ 105

గీ॥ అట్టు లాకాశమున నేగునట్టి శక్తి
సాధ్వితయు నష్టమగుటకు స్వాంతమందుఁ
జింతనొందుచుఁ గాల్నడఁ గొంత దవ్వు
పోయి నిర్మనుష్యారణ్యభూమిఁ జేరె 106

వ॥ అట్టియెడ 107

క॥ భూమికిం బ్రదక్షిణం బ,త్యామోదముతోడం జేయునట్టిడు మౌని
గ్రామణి విశ్వామిత్రుం, డా మడవతిదరికి నరిగి యవలోకించెన్ 108

— విశ్వామిత్రుండు గంధర్వకాంతం గూడుట —

ఉ॥ ఆ నెలంతన్ గనుంగొనినయంతన యంతకుముం దెడందలో
నా నెల నిండకుండ ఘవినంతయుం గాల్నడం జుట్టనున్న తా
నా నెలం గేరుమోముగల యంగనసంగతి పీడలేమిచే
నా నెలవే సమస్తముగ నాత్మందలంచి వచించె నాకెతో 109

సీ॥ కాంత! కాంతారమందు నేకాంతముగను
దిరుగు నిన్నుం గాపాడెడు దిట్ట యెవఁడుం
గానుపింపఁడు లేకున్న మానసమున
భయము వీసము పేఁడు నీవాఁడు గాన 110

సీ॥ పెక్కు కష్టమ్ములకు నోర్చి పృథ్వికేం బ్ర
దక్షిణపుసేవఁ జేయఁగాం దలఁచి తిరుగ
నస్మదీయ కామముం దీర్ప ననుమతించి
శ్రోణి నీశ్రోణి రూపూని సులభయయ్యె 111

క॥ ఒకభూమిసేవకే న్యుత్సుకపడునెడ నీదు నొడలక్ష్మో న్యాకాశ
ద్వీకసేవ నాకుం జేకురె, నిఁక నేం దడయంగ నేల? యేణీనయనా!

క॥ అనుచుం దను డాయు కౌశికుం
గని యిది ధర్మంబె? పరుని కాంతను నన్నీ
వెనయం బూనెదు దానను
మును నీవొనరించిన పున్నెములు చెడిపోవే? 113

చ॥ అలఘుమతుల్ తపోధనికు లార్యులు ధర్మవిదుల్ త్వరంపడన్
వలవదు మాకుఁ డీ కలుషవర్తనమంచు వచించు చడ్డినన్
తలఁపక ముందురాఁగల వెతల్ బలవంతముగాం బొలంతుకన్
గలసెను గాధినందనుండు కాముని కోరిక సేతువున్న దే? 114

వ॥ అట్లా విశ్వామిత్రుండు గంధర్వాంగనతో సంగజసుఖంబులం
గనుచుండ నాకలోకంబునకేగిన గంధర్వుండు స్వగృహంబునకరిగి
భార్యం గానక గంగాతీరంబున నాపె డించుట స్మృతికిఁదెచ్చికొని
వెంటనె యచ్చటకుఁజేరి యొకచో మనోహర లతావృతసికతా
తలంబున సురతాసక్తుండగు కౌశికుని దవ్వోయగు నిజమత్తకాశినిం
గని యరుణీకృతలోచనుండగుచు నత్తపస్వితో నిట్లనియె 115

— గంధర్వుఁడు విశ్వామిత్రుని శపించుట —

ఉ॥ కోతిమిరాలకం గులటఁ గూడితె ముక్ హ్యాతిపుణ్యుఁడైతివి
కోతిమిహీక్ విరక్తిఁ బరకోమలి బల్మి రమించినందునన్
కోఁతిముఖుండవై తెలివిఁ గోల్పడి యీ వనమందె కోరపుం
గోతి మెలంగుచుండుమని క్రోధవివృద్ధి శపించి పిమ్మటన్ 116

ఉ॥ దారనుజూచి యోసి నిరతం బమరాపగ మాఘమజ్జనా
చారులమైన మాబడిని సమ్మతిరాక బలాత్కృతి న్నదిం
జేరియుఁ దానమాడమి నశించె విహాయసయానశక్తి తాఁ
జారె నిజేశునానతిని సల్పమి సాధ్విత నీకు నిత్తఱిన్ 117

వ॥ అక్కతంబున నిక్కౌశికునకుఁ జిక్కి భ్రష్టవైతి నీ వాపంబు
నూపఁబుపటికు సురద్వీపవతిప్రాప్తునఁ బాషాణంబవై పడియుండు
మని శాపంబొసంగి తన నివాసంబునకరిగె నప్పుడ యా స్త్రీ పురు
షులకు రాతి కోఁతి రూపులు ప్రాపించె. వారి కా రూపులతోఁ
బెక్కులగు నిక్కట్లతోఁ బదిరెండేడులు గతించినంత నారద పారి
కాంక్షి భూమిం గ్రుమ్మరు చొక్కనాఁ డా గంగాతీరవనిం జేరి
వానరాననుండగు విశ్వామిత్రుం జూచి యిట్లని వితర్కించె 118

— నారదుఁడు మాఘస్నానమున విశ్వామిత్రు శాపంబుఁ బాపుట —

చ॥ అరరె! యిదేమి చిత్రమొకొ! యాస్యమునంగల చిన్నెలెల్ల వా
నరతను జాటుచున్నయవి నైజముగాఁ గపి యందమన్న వా
నర సహజమ్ము వాలము గనంబడ దంటియు కాశికుత్తుకన్
బెరయుచునుండెఁ బ్రాఁదొలసి పేరులునున్ గుదరాకదండలున్ 119

గీ॥ కావున నితండు దుర్వ్యసనరతుఁడైన వాఁడ
రాస్య మొందినయట్టి పుణ్యాత్మకుం డె
వండొ కాదగునని వాని పజ్జ కేగి
పలుకరింపఁ బండ్లిగిలించి పైకిఁ జూచి 120

గీ॥ నారదా! రమ్ము చెల్లెక్కి యూరఁబండి
తియ్యగా నుండు పండ్లను ద్రెంచియిత్తు
నీకు చెల్లెక్కఁ దగినట్టి నేర్పు లేదు
కాన తిను పొట్ట పగిలెడుకరణి వీని 121

క॥ అనుచుం బలుకులఁ జేతలఁ
గనఁబఱచెడు కోఁతిపనులఁ గని నీ పేరే
మన నాతఁ డేమొ చెప్పిన
మనమున నివ్వాని తెలివి మాసినదనుచున్ 122

వ॥ నారదుండు దివ్యదృష్టిం జూచి సర్వసమాచారంబుఁ దెలిసికొని

ఉ॥ పూర్వము మేనకం గలసి పుత్త్రిముఁ గోల్పడినట్టిడయ్యు గం
ధర్వతలోదరిం గనినతత్క్షణమే గతకాల కష్టముల్
సర్వము విస్మరించి సుమచాపుని కైవసమైన బొమ్మనా
ఖర్వతఁ జెందె గాధిజుఁడె కావున నవ్యులమాట లెక్కయే 124

క॥ వీని మహోఘముఁ బాపం,గా నేవ్రతమో పదఘువిఖండన మాఘ
స్నానవ్రత మొక్కటిగా, కేనద్దానఁదొలఁగింతు నితని దోసంగుల్

ఆ॥ భుక్తశిష్ట మితని పుణ్య మించుకయుంట
వలన మకరమాఘ వాసరములు
మిగిలియుండె నివ్వి మిగిలిపోవకయుండ
సలుపవలయు నితఁడు స్నానవిధిని 126

క॥ మతివిన పదువున నేదియు
పడఁబడగలేఁ డితఁడవచు నారదుఁ డంతన్
జడఁడగు గాధిజు రథి యాఱ
పాడిచెడు నాతఁ గడఁక గంగ మునఁగంజేసెన్ 127

అట్లు భాగీరథీ పావనోదకంబుల గాధిజునిచే జలవంతమ్ముగా సకాలమ్మున మాఘస్నానమ్ముఁ జేయించుచుఁ దానును దత్పావనానంబుగా సంకల్పించి కొన్ని దినంబులు స్నానంబొనర్చి యా ఫలంబు విశ్వామిత్రునకు ధారాదత్తంబొనర్చిన నమ్మునికిఁ బరాంగనాసంగమాత్త పాతకంబంతయు నశించి వానరాననంబు వోయి యెప్పటి మొగంబును జ్ఞానంబును గలుగుటయు నతండు దనకట్టి మహోపకారంబొనర్చిన నారదునకు నమస్కరించి పలుతెఱంగులఁ గొనియాడి తనవలన భ్రష్టయై పతిశాపభాషణంబునఁ బాషాణమై గంగానదీసమీపంబునఁ బడియున్న గంధర్వాంగనావృత్తాంతమ్ముఁ జెప్పి నారదుం గూడికొని తత్పాపపరిహారణంబుగా సంకల్పించి యిర్వురును భాగీరథీజలంబుల స్నానంబొనర్చి తత్పావనోదకంబుం గమండలువులఁ గొని తెచ్చి యక్కల్లుపైఁ జల్లుచుండు నెడ మూఁడు నాళ్ళకునరికి రాయూవు వీడి స్వస్వరూపంబు వహించి నిల్చి గంధర్వి నారద విశ్వామిత్రులకు మ్రొక్కి వారి దీవనలొంది యనుజ్ఞవడసి తానును యథావిధి దినత్రయంబు గంగాజలంబుల మాఘస్నానంబొనర్చి గగనగమనశక్తిం బొరసి తన వల్లభుంజేరి సుఖంబుండె. నారద విశ్వామిత్రమౌనులు నిజాశ్రమంబుల కేగిరి. కావున　128

## 11 అధ్యాయము

ఉ॥ దేవతలార! శాపమున ధీబలనాశనమున్ బ్లవంగ ము
ద్రీనముగల్గి ఘోరవనిఁ ద్రిమ్మరు గాధిసుతుండు పూర్వపుం
జేవఁ దపోనిమజ్జనముచేఁ గనఁ జెల్వుగలట్టి మీఁ శచీ
దేవిమగండు తొల్లిటిగతిన్ వెలుఁగొందడె మాఘమగ్నతన్　129

వ॥ దీనికి మీరు శంకింపం బనిలేదని　130

— విష్ణువు దేవతలకు మాఘమహిమంబుఁ జెప్పుట —

గీ॥ మఱియు మాఘంబునం బూర్ణిమాసివాఁడు
స్నానమాచరించి వృషభోత్సర్జనమ్ము

సేవఁదు గావించునో వాని సేవ్వఁడేనిఁ
బొరయఁగానేర వేరితి మఱిపతతులు 131

గీ॥ మకరమున సూర్యుఁడుండఁగా మాఘమజ్జ
నంబుఁ జేసి మదీయార్చనంబు సల్పి
మాఘమహిమంబు వినువారు మద్గతులయి
బహుసుఖదము మత్పదము వేఁ బడయఁగలరు 132

క॥ సురలార! మహాపాతక
కరులై పిమ్మట భయమ్ముఁ గనువా రహముం
జలుదోఁపఁ దపస్స్నానము
జరిపినఁ బొందెదరు మన్నిశాంత మనఘులై 133

క॥ గంగా కాళిందీ భవ
భంగమ్ములు పేనఁగలుగ నలువ్రృతము గో
త్సంగా మాధవుఁ డొసయం
గంగా ప్రయాగ మొప్పెను దీర్థపమై 134

వ॥ అట్టి సర్వతీర్థోత్తమంబైన ప్రయాగంబున మాఘమాసంబున జాహ్నవీ సలిలంబుల నరుణోదయసమయంబున నొక్కపరియైన స్నానం బొనర్చి తత్క్షేత్రాధిపతియై మాఘవల్లభ తా విరాజమాన మాధవుండనగు నన్నుఁ బూజించి యథాశక్తి బ్రాహ్మణులకు దానంబులిచ్చినవాఁడు సకలమహాపాతకముక్తుండై సత్పాత్రానుండై సమస్త భోగంబుల ననుభవించి దేహాంతంబున మత్సాయుజ్యంబు నొందు. 135

సీ॥ సర్వదేవతలలోఁ జక్రపాణియు సర్వ
సాధ్వీమణుల లక్ష్మి సర్వశాస్త్ర
ముల వేదముల్ సర్వభూపుల రాముండు
సర్వవర్ణంబుల జన్నిగట్టు
సర్వాపగలలోన జాహ్నవి సర్వమం
త్రమ్ములలోనఁ దారకము సర్వ

శైలమ్ములన్ స్వర్ణశైలమ్ము సర్వవృ
క్షముల నశ్వత్థమ్ము సర్వదాన

గీ॥ ముల నన్నదాన మఖిలఋతువుల వసంత
మఖిలమాసమ్ముల న్మాఘ మధికతమము
లట్టి మాఘమజ్జన మాపదాళిఁ ద్రుంచు
నఘముల నడంచు శ్రేయమ్ము ననుఘటించు    1

సీ॥ సర్వతీర్థాధికము సర్వసద్వ్రతాధి
కమ్ము మాఘమ్ము గాన తత్కాల్యములను
సలుపు స్నానమ్ము సర్వయజ్ఞముల దాన
ముల నెఱయునంత కెక్కుడు పున్నె మొసఁగు    1

వ॥ మఱియు గంగా నర్మదా సరస్వతీ యమునా గౌతమీ కృ
వేణీ కావేరీ భీమరథీ పుష్కరవాహినీ తుంగభద్రా సింధు
ప్రణీతా గండకీ స్వర్ణముఖీ తామ్రపర్ణీ దర్శానదీ వేగవ
సరయూ దేవికాది మహానదులయందును గంగాసాగర సం
మంబునను బుష్కర బ్రహ్మావర్త హిమాచల ప్రయాగ గోక
ప్రభాస దక్షిణకైలాస ధనుష్కోటిముఖ చతుర్వింశతి కోటితీ
బులఁ బది సంవత్సరంబులు నిత్యం బరుణోదయంబున స్నా
బొనర్చినవాఁ డెట్టిఫలంబొందునో మాఘమాసంబున భక్తియు
క్తుండై యావుటడుగు వడియలోని నీటనైన మూఁడు స్నానం
లొనర్చినవాఁ డట్టి ఫలమ్ము నొందు. మాఘంబున స్నానంబొనరి
యన్నదీసమీపంబున రమాసహితంబుగా సాలగ్రామ నివాసి
నన్ను యథావిధి నభిషేకించి కోమల తులసీదళ మల్లికా మందా
పారిజాత చంపక వకుళ కరవీర పుండరీక ముఖర పుష్పంబు
భక్తితోఁ బూజించిన నరుండు పునరావృత్తిరహితంబైన మ
మంబుఁ జేరి నిత్యానందుండై యుండు.    1

క॥ ఆమలకంబులతోడఁ ద,షోమాసమునందు స్నానముం జేసినవాఁ
డాముక్తపాపుఁడై మ,ద్ధామమునకుఁ జేరఁబడి సుధాభుజల్లాదా

ఆ॥ గోమయమ్ము పూసికొని మాఘమజ్జన
మాచరించువాని యఘములడఁగుఁ
దొలసి మొదలి మన్నొనిలఁ బూసికొని తాన
మెతఁడుసేయు నతఁడు హీనుఁడు నాకు 140

సీ॥ వారజుండైన ద్విజుఁడైనఁ బడఁతియైన
మాఘమజ్జన మొనరింప మానెనేని
నరకమున కేగి యమునిదండమునఁ దాడ
నములఁ జెందుచుఁ జెక్కు కష్టములఁ గాంచు 141

గీ॥ పాతకము లాచరించిన పడఁతి నరక
మునకుఁ జనినను మాఘమజ్జన మొకప్డు
సలిపియుండిన నందుఁ గష్టములగనక
నాకమున కేగి సుఖముల నందుచుండు 142

సీ॥ పతి విహీన ద్విభక్తపరయైన సతి మాఘ
మజ్జన మొనరింప మానెనేని
నరకబాధల నొందు దురితఘ్నమగు తప
స్స్నానమ్ముఁ జేసిన మానవుండు
నా నెలవునుజేరి యానందుఁడై యుండు
మాఘమాసంబున మజ్జనములు
దానమ్ములొనరించు ధన్యుండు భీకర
నరకలోకమ్ముఁ గనంగఁబోఁడు

గీ॥ మాఘమున స్నానమొనరించి మహితనిష్ఠ
దేవఋషి పితృతర్పణాదికముఁ దీర్చి
మత్కథను విన్నఁ బాపసంహతులు వాయు
స్నానహీనుండు స్వామలభక్షకుఁడె యౌను 143

స్నానము ... మాఘమాహాత్మ్యములఁ దెల్పి ద్విజుం డమలత్వ మొందిన...
వ్రతము ధరించి ఘాతముల మించినబత్తిని నర్ఘ్యమిచ్చి నకా

మానక పూజసేసిన సమస్త మహాఘవిముక్తుఁడై మదా
స్థానముఁజేరు నాతఁడు సతంబును బూజ్యుఁడు మీకు నాకునున్

క॥ మకరతపస్స్నానం బత్యకుటిలమతిఁజేసి రవికి నర్ఘ్యమొసఁగి నా
రికు మ్రొక్కి జపమొనర్చిన,సుకృతిననుం జేరుఁజూఁడీ సురవరులారా!

గీ॥ మాఘమున బహిర్జలమున మజ్జనమ్మొ
సల్పి నను బూజచేసి నా సన్నిధాన
మందు శ్రుతిమాత గాయత్రి నధికనిష్ఠ
జపమొనర్చునాతని కరస్థమ్మె ముక్తి 146

గీ॥ మంత్రతతిని గాయత్రిసమాన మంత్ర
మొకవ డది చంద్రసూర్యధాత్రుగ్రలోక
ముల మదీయ పదంబును గలుగఁజేయు
సంశయములేదు సురలార! శ్రద్ధ వినుఁడు 147

గీ॥ అట్టి గాయత్రి మాఘగాహనమొనర్చి
జపమొనర్చిన యాతండు సర్వతీర్థ
గాహికన్న సర్వవ్రతకర్తకన్న
మిన్నయై యెల్లరన్నఁగా నన్నుఁ గలయు 148

గీ॥ మాఘమజ్జనమును సల్పి మహితనియతి
దక్షిణపుపద్ధ నంజలిదార్చి ప్రణవ
యుక్తముగను గాయత్రి నొక్కొక్కపాద
ముగ జపింప వాని కలుషముల్ నశించు 149

క॥ భూసురుఁడు దపస్స్నానం
బాసక్తిఁ జేసి బ్రహ్మయజ్ఞము నియతిన్
జేసిన నలువ జగమ్మున
వాసిగఁ జిరముండి యంతపై ననుఁ జేరున్ 150

క॥ కవణ మిఘనతఁడు నెప్పుడుఁ
జెవి నాకతఁ జేర్చునతఁడు స్థిరమతి వేధ

స్నవనముఁ దప్పోనిమజ్జన
ము విడక చేయునతఁడు పోనఁబోఁడు యమపురికిన్ 151

క॥ ఏ నరుఁడు మకరమాఘు,స్నానముఁ గావించి శ్రద్ధ సాలగ్రామ
స్థానమున దీపమిడునో, యానరుఁ డే తెంచు జ్ఞానియై మత్పురికిన్

క॥ స్నానముచేసిన నీటిచే
తానన్ మాఘమ్మునం దృఢమ్మగు భక్తిన్
మానక నను గొల్చిన యతఁ
డానందముఁ గను సబంధుఁడై మద్భవతిన్ 153

సీ॥ మాఘంబునను స్నానమాడి గళంబునఁ
దొలసిపూసలపేరు లెలమిఁదాల్చి
గాయత్రి మున్నుగాఁగల మంత్రముల జపి
యించి జలమ్ముల యంచునందుఁ
దులసీదళంబులతో నన్నుఁ బూజించు
నతఁడు కాలుని భయంబంద కన్న
దీయువాసముఁ జేరుఁ దిరముగా నిరతమ్ముఁ
దులసిదండలు దాల్చు నలఘుఁ గల్గె

గీ॥ నమ్ములంటవు మాఘమజ్జనమొనర్చి
నా సమీపమ్మునం బురాణమ్ముఁ జెప్ప
నతఁడు విమలాత్మకుండు మద్భక్తుఁడు వాని
యింట నేనుండి కడపట నిత్తు ముక్తి 154

గీ॥ శబ్దమును భావ మర్థంబు సరిగ లేక
లలితమైన శ్రీరాగ మేళనము లేక
చెప్పఁబడెడు పురాణమ్ము చెంతఁ జేరి
మాఘమువ వినరా దొక్క మాఱుగూడ 155

గీ॥ లేటితెల్లనై ధన్యమై దివ్యమై మ
దీయ సత్కథాపూరితమై యమేయ

మైన మాఘమహిమ మనోహరసురాగ
మునఁ బురాణింప వినఁడేని పొందు నఘము 156

క॥ ఇనుహితవున మాఘునిమ
జ్జనముఁ బురాణశ్రవణముఁ జరిపి సద్భ
క్తిని గొనియాడిన మనుజున
కును నాకము వేఱు లేదు గోభుజులారా! 157

వ॥ మాఘంబున జలాంతికంబున నుండువారు పురాణంబు విన నెవనికి బుద్ధిపుట్టునో యతండు నా రూపంబు నొందు నట్టి పురాణంబు విన నొల్లనివాఁడు నరకంబునఁ గ్రిమి కీటక సమేత మలమూత్ర కూపంబుల నెల్లకాలంబుఁ బడియుండు. మాఘంబున సాలగ్రామ నివాసినగు మత్పాదోదకంబు పానంబొనర్చినవాఁడు సర్వపాపముక్తుండగు నట్లొనర్పని దుష్టాత్ముం డశ్రాంతకృతాంత కృతాత్యంత సంతాపమ్ములొందుచుండు. మాఘవ్రతపరుండై మన్నిర్మాల్యంబు ధరించినవాఁడు గతదురితుండై మహాత్ముఁడగుఁ గావున నిట్టి మహిమాస్పదంబైన మాఘవ్రతంబు ముముక్షువులకగుటచే మీకుఁ జెప్పితి నిఁక మీ రాలసింపక పద్మాద్రికేగి శచీపతిం గాంచి మీకు నాచేఁ జెప్పంబడిన మాఘవ్రతవిధానంబు బోధింపుఁ డందువలన దేవేంద్రున కన్యభార్యాసంగమసంగతదోషం బడంగు నతం డంతఁ దుంగభద్రాజలంబుల మాఘస్నానం బొనర్చెనేని దుర్ముఖరహితుండై సుముఖుండగునని చెప్పిన విని సంతసించి వేల్పుసంఘము విరించిపితకు నమస్కరించి తదనుజ్ఞం గొని యజ్ఞభుగ్నాథు వెదకవారై నంత దైత్యాంతకుం డంతర్ధానంబునొందెనని గృత్స్నమదుండు జహ్నుపుత్రితో నిట్లనియె. 158

— మాఘజలాభిషేచనంబునఁ బొంద స్త్రీ యగుట —

చ॥ అటువలె సోఁకుదారు తమ కానతినిచ్చినమాటకై వేలుపుం
దుటుములు తమ్ముగట్టునకుఁ బొందరగాఁ జని దాన నచ్చట

చ్చట శచిజేనికై తిరుగసాఁగిన నక్షాక పెద్ద లోయ మా
జటమలనాఁగ నబ్బురము ప్రబ్బఁగఁజేయుచుఁ దొండఁ గన్పడెన్

క॥ అది చిన్నకనులఁ గొంచెపుఁ
బదములుఁ గుఱుచైన తోఁక బలుమేన్గలదై
కదలక మెదలక యుండుటఁ
ద్రిదశులు గనుచుండి రేకసృష్టిని విప్రా! 160

గీ॥ అట్లు గను వేల్పుగమి గుండెలవిసిపోవ
భూరిభేరీభవంబైన మ్రోఁతకన్నఁ
బ్రావృడంభోదసంభూత రవముకన్న
మిన్నగాఁ బెట్టె కేక యా మేటితొండ 161

క॥ ఆ నాదము విని సురసం
తానము భీతిల్లి యిట్లు దైత్యుం డెవ్వం
డేని కపటాకృతిని ద
త్త్వానువపుసం దమ్ముఁ బట్టఁ దాఁగెనొ యనుచున్ 162

క॥ సందేహస్వాంతమ్ముల
బృందారకు లెంతొ తడవు వీక్షించి యదే
చందమున నద్ది పడియుం
టం దొండయె యిదియటం చెడందఁ దలఁచుచున్ 163

వ॥ ఆ కృకలాసంబునకుఁ గర్మపరిపాకకాలం బాసన్నంబగుటం జేసి 164

ఉ॥ తొండను బైకిఁదీయఁగఁ గుతూహలులై దృఢమైన తీవెలన్
బండెఁడుగూర్చి లోయఁ దిగి బాఢముగా బిగఁగట్టి దాని నా
ఖండలభృత్యులెల్లఁ గడఁకన్ బలమంతయుఁ జూపి లాగఁగా
మండినచోటనుండి యది యొక్కరవంత చలింప దో మునీ! 165

క॥ దివిజులు కృకలాసంబును
వివిధోపాయములఁ బైనవేసెడు మదితోఁ
దివిరి శ్రమించిన శ్రమ వృధి
చివరకు వ్యర్థమ్మయ్యెఁ బ్రాణిశేఖర జహ్నూ! 166

వ॥ అత్తెఱంగున దెఱగంటి డెంటలా తొండం బైకొఁ జేర్చఁ జాల తపవృ
జతనంబొనర్చి యలసి యేమియు దోఁపక నారాయణుండు తమ
కెఱింగించిన మాఘప్రభావంబుఁ బరీక్షింపఁ దలంచి యది మాఘ
మాసంబగుట మఱునాఁ డర్కోదయంబునఁ దత్సమీప దేవఖాతోద
కంబుల స్నానంబొనర్చి పద్మపత్రంబుల నందలి జలంబులు గొని
తెచ్చి యక్కృకలాసంబుమీఁదఁ బ్రోక్షించుటయు నంతన 167

క॥ తొండ మెయి మాఱి నవమణి
మండనమండితతనూసముచితయై మా
రుం డొఱఁదూసిన యడిదం
వుం దంబున నిలుచఁబడెను ముద్దియ మెయితోఁ 168

క॥ అంతట నా చెలి వేల్పుల
చెంతకుఁజని మ్రొక్కి నిలువ జేజే బారా
యింతిఁ గని నెమ్మనమ్మున
నెంతయు నచ్చెరువుఁ జెంది యీవెవరన్నన్ 169

— తొండ కథ —

## 12 అధ్యాయము

వ॥ అక్కుందరదన నతవదనయై త్రిదివసదనులతో నిట్లనియె 170

క॥ వేశ్మప్రబలత దినమణి,రశ్మికి నెడమీఁక విబుధరంజకమై ని
మ్నాశ్మలమై శ్రీయుతమై, కాశ్మీరం బొప్పుఁ బంటకలికికిఁ దలమై

ఉ॥ అచ్చట నొక్క విప్రుఁడు దయాగుణుఁడై గణనీయ విద్యుఁడై
యెచ్చినకూర్మిఁ దంత్రి తనకిష్ట సుశీల సమాఖ్య సార్థమై
యుచ్చతఁ జెందునట్లు విబుధోత్తమసన్నుతవృత్తి నెవ్వరే
మిచ్చినఁ బుచ్చికొనక గృహికృత్యముల న్నెఱవేర్చు నిచ్చలున్ 172

క॥ ఆ మహితాత్మున కాదవితిఁ
గామాక్షి సమాఖ్యఁ గూఁతుఁగా నేనొక తెన్
నామీఁదఁ బ్రాణముల నిడి
యేమిట లోపంబుఁ గలుగనీయక పెంచెన్ 173

వ॥ నేనును నా తలిదండ్రుల ముద్దుముచ్చటలకుఁ బాత్రంబనై పెరుగుచు నొకింత విద్యం జదివి వివాహయోగ్యనై యుండఁ గులగోత్ర విద్యాబుద్ధులఁ దమకును రూపయౌవనంబుల నాకును దగిన వరు న్వెదకి తెచ్చి మహావైభవంబుగా వివాహంబొనర్చిం గాని నా దురదృష్టంబునన్ జేసి నా మగండు పెండ్లియైన నాల్గవనాఁడ పాముకఱచి యొడలు విడిచిన 174

క॥ నా తలిదండ్రులు తమ జా
మాతృమృతిన్ దుఃఖభంగ మాలిన్బడి త
త్సేతువుఁ జేరఁగనేరక
కాతరులై నాదు గతికిఁ గళవళపడుచున్ 175

క॥ మనుజునకు జనియె కష్టము
మనకష్టం బందు మగువగాఁ బుట్టుట దా
నను బాల్యమున విధవతన్
గనుట కడు న్నోరలేని కష్టంబగుటన్ 176

గీ॥ నాకొఱకుఁ జింతఁ గుమిలి నన్నుచు నింట
నుండఁగాలేక నన్నన్న యండఁ జేర్చి
తమ ధనమ్మన్నకిచ్చి యిద్దరును వనికిఁ
జనిరి తపమాచరించి కాయమును నిల్పి 177

చ॥ తదుపరి గొన్నిమాసములు దాఁటినమీఁద మదంబికాంబ సే
రె దివము మాతులాని నను బ్రేముడిఁ జూడక చల్దివెట్టుచున్
బదరుచుఁ గట్టెకంపలకుఁ బంపుచు దంపుచు బాధవెట్టినన్
మది విసువొంది వారి సదనంబును వీడితి మాఁడితిన్ క్షుధన్ 178

గీ॥ కడుపుసాదఁ బట్టలేక భిక్షమునకేగి
వారలిడువట్టి తొల్లినాఁటి వంటకమ్ములున్
బొట్టఁ బెంచించుకొనుచుండి యెట్టకేల
కిట్లు జీవింపఁ దొరకొంటి నమ్మయ్యలార! 179

క॥ చేరమునఁగాని ధనముఁ
గూరుపరాదంచుఁ గొలఁది కొలఁదిగఁ గాయల్
కూరలు చేరిచి యమ్ముట
చే రొక్కము కొంత కొంత చేయుచునున్నన్ 180

వ॥ భిక్షాటనంబును మానక తొలునాఁడు తెచ్చికొనిన యుపరిశుద్ధా
న్నంబు మఱునాఁ డారగించుచుఁ బ్రాతస్స్నాన హరిస్మరణంబు
లనుమాటయేఁ యెఱుంగక చేయుచున్న వ్యాపారం బభివృద్ధియగు
టచే నొక చిన్నిమాడుగు బాడిగకుం దీసికొని స్వతంత్రనై యుండ
సమీపగృహ జారతరుణీసక్తుండగు వైశ్యకుమారుం డొక్కఁ డా
చెలువయు నేనును జెలిమిమై మెలంగుటచే నప్పుడప్పుడు మన్నిక
టంబునకువచ్చి హావభావంబులు నూపుచుండఁ దారుణ్యవతినైన
నేనాతని రూప యౌవన విలాసంబులవలనఁ జంచలితస్వాంతనై
యొక్కనాఁ డాతని వాలుఁజూపులఁ జూచుచు 181

ఆ॥ చేరిబిడ్డ నీకుఁ జేర్మి నాపై నుంట
నిక్కమగునయేని నేటి రాత్రి
యిటకు రమ్మటన్న నే తెంచె నాతండు
గొంత రేయి యేగినంతమీఁద 182

క॥ ఆరీతి మన్నివాసముఁ, జేరిన వైశ్యుని బ్రక్కఁ జేర్చికొని మనం
బార రతికేళిఁ దేలఁగ, నా రాతిరి యొక్క చిటికెయై చనె నాకున్

ఉ॥ వేకువలేచి జారతఁ బ్రవీణుఁడు నా ప్రియుఁ డేగె నేను నా
చాకిరి కేగితిన్ విబుధసత్తములార! తదాది నిత్య మా
శ్రీకలితుండు నన్రతివిశేషములం దనియంగఁ జేయుచున్
బైకము నిచ్చుచుండె నటుపైఁ బొడమెన్ ధనకాంక్ష మెండుగన్

ఉ॥ దాన దినక్రమాన ధనదాయకు లెట్టిరులైన నెందతే
నైనను నిత్యముం గలసి యర్థముఁగూర్చుట కాని దాన నేఁ

గానియుఁ బుణ్యకార్యములకై వ్యయముం బొనరింప నెన్నఁడున్
సూనశరగ్రహం బొడలఁజొచ్చినచో మది మంచి నెంచునే? 185

కం॥ హరివాసరోపవాసము
జరుపఁగ లేదెపుడు జారసహవాసమునన్
బొరసెడు నింద్రియసౌఖ్య
మ్ము గోర్కమును నాఁడు వృక్షగఁ బోవుననుమదిన్ 186

కం॥ హరికథ వినలేదెన్నఁడు
హరికథ వినువారిఁ జేరి హాస్యమొనర్తున్
నిరతమ్ము బొందితో దివి
కరిగెడి మిముఁ గనెడి నాకు నాకమె యనుచున్ 187

గీ॥ పుణ్యకార్యంబు లొనరించు పూజ్యులెవ్వ
రైన నను జేరి ద్రవ్యంబు నడిగిరేని
నాథుఁడును బిడ్డలును లేని నాకు నెట్లు
ధన మొదవు లేదు పొమ్మనుదాన నెపుడు 188

ఉ॥ వాసనలీను నూనియలఁ బల్మరు రాయుచు మేలిపూలతో
భాసురమానటుల్ జడలువన్నుచుఁ బేర్మిని బెంచు వెంద్రుకల్
గాసిలి మాసిపోవునని కల్మషరాశి నడంపఁజాల్ తపో
మాస నిమజ్జనంబు నొకమాటయినన్ ఘటియింపకుండితిన్ 189

గీ॥ విత్తమటుగూర్చి లుబ్ధత విఱ్ఱవీఁగు
నను గనినవార లెవరి ఋణమ్ము తీర్పఁ
గర్హ్యావృత్తి గణింతు రొక్కమ్ము దాని
దిన వారలకిడవని దూరఁగొనను లెక్క 190

ఉ॥ భూరికళావిరాజితముఁ బూతచరిత్రము సర్వదా సదా
చారయుతమ్ము శంభుపద సారసభక్తిభృతమ్ము భూసురా
గారమునందుఁ బుట్టి మతి కగ్గెడునంతకుఁ బెర్గి రండనై
జారిణినై చరించితిని జాలసమల్ సురలార! నిస్త్రపన్ 191

చ॥ కడపట వృద్ధనై కవలికాండ్ర కతమ్మున విత్తమెల్లఁ గో
ల్పడి తినఁ గూడు కట్టుకొన బట్టయుఁ గన్నులఁ జూచువారు లే
కిడుమలు సెంది మంచమున హేయమగన్వితనై తపించి మే
న్విడిచి లులాయఘోటపుటభేదనసాదనసైతి నేఁ దుదిన్ 192

వ॥ అగ్గతి దుర్గతిఁ గాంచి యందుఁ గల రౌరవాదిక ఘోరనరకంబుల ననేక సహస్రహాయనంబులు యమకింకరకృత సంకటంబులఁ బడి తిరిగి ధరణీస్థలంబునకు వచ్చి శార్దూలజాతిని ముమ్మాఱును వానరజాతిని ముమ్మాఱును వృషభజాతి నేనుమాఱులును విధవాంగననై నూఱుమాఱులును శునకంబనై యెన్మిదిమాఱులును బిశాచంబనై చతుశ్శతపర్యాయంబులును నన్నెనిపర్యాయంబులుగాఁ గాక ఘూక కీటక పక్షికులంబులను సర్పకులంబున శతవారంబులును ద్విశతవారంబులు జంబుకకులంబునను మున్నూఱుమాఱు లూరబందికొలంబునను ముంగినై నన్నూఱుసారులును బిల్లినై యేనూఱుసారులును మూషికంబనై యాఱునూర్లసారులును గృకలాసంబనై యేకోనసహస్రపర్యాయంబులు జన్మించి యా యా జన్మంబులం దనేకకష్టంబు లనుభవించి జన్మాంతరంబున నేఁ జేసిన దోసంపుఁ గొండనానొప్పి నేఁటికి మీచే విముక్తిం గనిన పెనుకొండనై వేయవసారి పుట్టి యట్టిట్టుం గదలనేరక యిక్కట్టులంబడు నేను బుణ్యమూర్తులైన మీచే నీ స్త్రీరూపంబొందుటకుఁ గల కారణంబు వినుండు. 193

మ॥ విధవత్వంబున ముక్తబాల్యదశ [illegible]
బుధగేహంబుల [illegible] భూర్యాతపంబందు దు
ష్పథయానంబున డస్సి [illegible]
క్క ధరాదేవున కైదు[illegible] గ్రాస[illegible]గాఁ బెట్టితిన్ 194

క॥ అక్కాలంబెప్పుఁ డున్నమున్న [illegible]
నక్కటికపుఁ [illegible] మహాత్ము[illegible] మీ[illegible]
రిక్కరణి శ్రద్ధ గైకొని
చక్కని తొలి క[illegible] 195

వ॥ భగవంతుండు మీ యభిమతసిద్ధిం బొనర్చెఁగాతమని సలజ్జయై తల వంచియున్న యయ్యన్నుమిన్నంగని వేల్పులయం దొక్కం డిట్లనియె 196

చ॥ తరుణీ! త్వదీయమైన దురితంబులు సర్వమడంగ వీరిచే
నుఱవుగ మాఘసేచనము నొందితి గావున నిన్ను భార్యఁగాఁ
బొరయఁగనుంటి నీదు తలఁపుం దెలుపం దగునన్న నాకె త
త్స్మరవరు వాలుఁజూపులను జూచుచు మిన్నకయున్న నందునన్

సీ॥ తక్కు సురలెల్లఁ దత్క్రతుభుక్కుచేత
నా చెలువ కేలు గ్రహియించునట్లు సల్పి
సంతసించి యా నూతన జంపతులను
బంపి రమరావతీపురవరముఁ జేర 198

క॥ మానివర! మాఘసేచన,మే నీచపురూపు మాపి మిక్కిలి చెలువౌ
మానినిఁగా నొనరిచి పై,గా నిర్జరవల్లభయునుగా ఘటియించెన్

ఉ॥ అంతట వాసవు న్వెదకులాడుచుఁ బోవుచునున్న దేవతా
సంతతి వీనులంబడియెఁ జండఖరస్వన మద్ది వారు వృ
త్తాంతముఁ గూఁతఁగా నెఱిఁగి యా ధ్వని వచ్చినజాడ వేల్పురా
చెంతకుఁ జేరఁగా నతఁడు సిగ్గిలి వే గుహలోనికిం జనెన్ 200

— దేవతలు రాసభాననుఁడగు నింద్రుం గాంచుట —

వ॥ అప్పుడు దేవతావ్రాతంబునందు 201

సీ॥ పూర్ణిమా సోమసముజ్జ్వలద్వదనుండు
బహుహేయ రాసభ వదనుఁడయ్యె
శ్రోత్ర కర్ణద్వయీసుఖకర స్వాదుకం
ఠనినాదుఁ డురుఖరనాదుఁడయ్యె
శాంతవహాసీత సత్క్రతుఫలాహారుండు
ఘ్రాణఘృష్ట తృణాహారుఁడయ్యె
లోకసంతానోద్ధ నాకనివాసుండు
పద్మశైలగుహాంత నివాసుఁడయ్యె

201

గీ॥ నెవుకు బుధగోష్ఠి ముదమున నెసఁగునతఁడు
పలుకు దోడును లేకొంటి మెలఁగనయ్యొ
నౌర! యితరాంగనా సంగమాత్తదోష
మెంత చేసెను దేవేంద్రునంతవాని 202

క॥ అని కొంతమంది వేల్పులు
వనటంగనఁ గొంతమంది వాగ్భూషలు స
న్మని మొఱఁగి చేసిన యఘం
బున కిది తగుననుచు నగిరి భూసురవర్యా! 203

క॥ మఱికొంద ఱేమిపలుకక
సురపతి చనినట్టి గుహను జొచ్చిరి వారిన్
బెరసికొని మిగతవారున్
జొరఁబడి రమరాధినాథు సుఖమొందింపన్ 204

గీ॥ ఆ శచీనాయకుండు సుధాశనులకు
దృష్టిపథమునఁ బడకుండ నెంచి వారి
కందకయె పోవుచున్న నయ్యమరచయము
గాఢతమ తమోవృత దేవఖాతమందు 205

మ॥ తమ నానావిధభూషణస్థగిత రత్నజ్యోతిసాహాయ్యమ్మనన్
శ్రమముం జెందక వే గమించి యొకచో స్వర్నాథు నీక్షించి హా
స్తములన్మోడ్చి మహేంద్ర! భ్రాతలము యుష్మత్పాదనీరేజయు
గ్మము సేవించెడివార మట్టిమముఁ బ్రేమంబూను నిర్భీతిమై 206

చ॥ పరులముగాము గాన సురపాలక! నీమది హ్రీ భయంబులన్
దొఱఁగుము నీనిమిత్తమయి తోయజనేత్రు భజించి తత్కృపన్
గిరిగుహనున్న నీదయిన క్లేశముఁ దజ్జనికారణంబుఁ ద
ద్ధరణ విధానమున్ దెలిసి యాదట వచ్చితి మిందు నిన్గనన్ 207

వ॥ అని పల్కినవారై మఱియు నీవు దేవతానగరి లేకుండుటెఱింగి
దుష్టులైన రాక్షసులు దండెత్తివచ్చి మమ్ము పాఱందోలి మన

ప్రోలు వశేషజచుకొనిన మేమెదియుఁ జేయనేరక నీకొఱకు వెద
కుచు వచ్చితిమని మార్గమధ్యంబునఁ దమకు సంభవించిన విశేష
విషయంబులన్నియుఁ జెప్పి శ్రీమన్మాధవకథిత మాఘవ్రతమహిమం
జెతింగించి 208

ఉ॥ కరములుపట్టి యుద్ధివిజకాండము రమ్మని వేడఁగా శచీ
వరుఁడు స్వకీయదుస్థితికి వంచి శిర మ్మమరాళితోడ న
గ్గిరిగుహ వీడి కాల్నడక ఖేదమునొందుచుఁ దుంగభద్రద
గ్గఱకునుజేరి యా నదిని గల్పవిధి న్నిజభృత్యరాజితోఁ 209

— ఇంద్రుండు స్వముఖప్రాప్తిం గాంచుట —

సీ॥ తుంగభద్రానదీ! మహోత్తుంగభద్ర
ముల నొసంగుము మాకంచు మ్రొక్కి మకర
మాఘకల్యమ్ముల స్నానమాచరించి
తద్దరిని శౌరిఁ బూజించి తద్గబత్తి 210

సీ॥ మాఘమహిమమ్ము వినుచు నిమజ్జనమ్ము
లర్ధమాసమ్ము గావించినంతమీఁద
జారతాదోషమడఁగి రాసభముఖమ్ము
తొలఁగి యెప్పటిమొగముతో నలరె వజ్రి 211

ఉ॥ అప్పుడు వజ్రపాణి యమృతాశనులంగని మిత్రులార! నా
కిప్పటికబ్బె నైజముఖ మింక నభశ్చరశక్తి చివ్వలో
దెప్పరులైన దాయల వధించెదు బాహుబలంబు పూర్తిగాఁ
జొప్పడుదాఁక నీ ధునిని శుద్ధజలంబుల మాఘమంతయున్ 212

క॥ స్నానమ్ము సేసెద న్నీ
లో నొక కొందఱు మదీయులోలత చే ని
క్కాఁ బెనురాయయిన య
విన్మావాక్షి శాపమడఁప మేకొనవలయున్ 213

సీ॥ అనుచు మిత్రవిందమునీశు వలివ రాయి
యై పడినకాన్త నెఱిఁగించి యనువ వారుఁ

దుంగభద్రలో మూన్నాళ్ళు దోఁగి కొంత
జలముఁ గొనిపోయి యా శిలఁ జల్లినంత 214

— మీనాక్షి శిలారూపంబుఁ బాసి భర్తం గలయుట —

ఉత్సాహ॥ రాతిరూపు వీడి మానిరమణి చెల్వుమీఱఁగా
నాతిమేనితోడ నిల్చినన్ సురవ్రజంబు సం
ప్రీతి మ్రొక్క మంగళములఁ బెరయుఁడంచుఁ బల్క నం
త్యాతఁ దుంగభద్రలోఁ దపఃప్రభాతవేళలన్ 215

క॥ స్నానత్రయ మొనరిచి య
మ్మీనాక్షి హృదీశు నెడఁద మేకొల్పి స్మృతి
ధ్యానము గావించిన నా
స్థానమునకు మిత్రవిందసంయమి వచ్చెన్ 216

గీ॥ వచ్చి తనభార్యఁ దోకొని స్వాశ్రమమున
కరిగె నలవజ్రి మాఘమ్ము సాంత మట్లు
తుంగభద్రోదకమ్ములఁ దోఁగి సర్వ
శక్తియుక్తుఁడై దేవతాసమితిఁ గూడి 217

శా॥ ఆకాశాధ్వమునన్ వడిన్ సురపురీద్వారంబునం జేరి స
ర్వాకంపంబుగ సింహనాదమును జేయున్ దాన మున్నున్న బల్
రాకాసుల్ వినివచ్చి చూచి యల గోత్రచ్ఛేదితేజమ్ము పై
పైఁ గన్పించిన బీతులై పఱచి రాత్మాగారమార్గమ్ములన్ 218

చ॥ పరపడి నిర్గతారిఁ ద్రిదివమ్మును జేరి శచీవిభుండు స
మ్మదమున దేవతానిచయమున్ నిజదారకుమారులన్ సభా
సదులను బుణ్యకర్ముల విశాలకృపన్ దిలకించుచున్ సుఖా
స్పదమగు రాజ్యమేలె మునిసత్తమ! విత్తమగణ్యవృత్తుఁడై 219

సీ॥ గంధర్వ వరశాపకలనఁ గపిగ్రీవుఁ
డైన విశ్వామిత్రమానిమాళి
మిత్రవిందుని శాపపాత్రుఁడై రాసభ
ముఖుఁడైన పీయూషభుగ్విభుండు

జలిమాట వినమి సాధ్వీత జారి నాథత్వు
ధను శిలయైన గంధర్వకాంత
చిత్తచాంచల్యమ్ముచేఁ జెడి బండయై
కానలోఁ బడియున్న మౌనిపత్ని

సీ॥ బాల్యవైధవ్యయై బంధువర్జితయయి
కులటయై చచ్చి రోఁత బాములను జెక్కు-
దాలిచిన విప్రపుత్రిక తాపసేంద్ర!
కనిరి ధన్యత మాఘమజ్జనముకతన 220

వ॥ ఓ జహ్నుమునీ! నీకొఱకు నాచేఁ జెప్పంబడిన సహస్రాక్షుదక్షిణ దిగ్యాత్రయాత్రా ప్రారంభికంబై మరల సురపతికి స్వారాజ్యంబు లభించుటకుఁగల యేతత్కథను శ్రద్ధావంతులై వినువారి కిహపరంబుల సుఖంబులు గల్గునని గృత్స్నమదుండు జహ్నువునకుం జెప్పినట్లు శివుం డుమకుం జెప్పెనని సూతుండు శౌనకాది మునులకుం దెల్పె. 221

— ఆశ్వాసాంతము —

మందాక్రాంత॥ నిస్తంద్రజ్ఞానమహితమతీ! నిర్వ్యాతార్తాత్తభీతీ!
యశ్శ్లోకఖ్యాతికరసుకృతీ! హరివిద్యావిభూతీ!
నిస్తుల్యానందదగళరుతీ! నిర్మలాత్మానుభూతీ!
ప్రస్తుత్యాహ్రామలగుణతతీ! రామకవ్యబ్జసూతీ! 222

— గద్యము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభాషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబునఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘపురాణము

## పంచమాశ్వాసము

### 13 అధ్యాయము

క॥ శ్రీవరదార్యకుమారా!, కైవల్యప్రాప్తిహేతు కవితాసారా!
భూవినుతవ్యాహారా!, గ్రావసదృక్ధర! రామకవిమందారా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యాశరణ్యులగు శౌనకాది మహామునివరే
ణ్యుల కఖిలపురాణకథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె
నవ్విధంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబు నుడువుచున్న
మృడుండు దేవి విను మప్పుడు గంగానదీతీరంబున గృత్స్నమదుండు
జహ్నువుం జూచి మునీంద్రా! పూర్వకాలంబునఁ బంపాసరోవర
తీరంబున మాఘమాహాత్మ్య శ్రవణంబుమాత్రన యొక పిశాచ
వరుండు తన ఘోరపాతకంబులం బాసి ధన్యుండయ్యెనని చెప్ప
టయు విని జహ్నుమునీంద్రుండు 2

క॥ గృత్స్నమదమహామునిమౌళీ
త్వత్స్నేహప్రాప్తివలన దనుజారి కథో
ద్యత్స్నిగ్ధ మాఘమహిమము
గృత్స్నముగా వినుచునున్న నించుకయైనన్ 3

ఆ॥ తృప్తి కలుగదయ్యె నిపుడు మీ నుడివిన
యా పిశాచుఁ డెట్టు లాలకించె
మాఘమహిమ మెట్టు లందెఁ దద్రూప వి
ముక్తి వాని చరిత మొదటినుండి 4

క॥ వినఁ గోర్కి కలిగెఁ గావున
ననఘా! వినుపింపుఁడనుచుఁ బ్రార్థించిన నె
మ్మనమున ముదమంది మహా
ముని గృత్స్నమదుండు దెల్పె భూసురమణితోన్ 5

— వైశ్యుఁడు పిశాచమైన కథ —

ఉ॥ భూసురశేఖరా! వినుము పూర్వమునం దమృతోపమానమై
వాసినిగన్న తోయమున భాసురమై కపినాథఘాతఘో
రాసురమై తపస్విసరహృదబ్జధరాసురమై ధరిత్రిఁ బం
పాసరసీవరం బమరు మానసనామవరోవరంబటుల్ 6

ఉ॥ ఆ నలినాకరంబు దరియందు సమంచిత సౌధపాళితో
జ్ఞానరమార్గనాగత రసావిబుధోత్తమనందనాళితో
దాని సుపత్త్రధేను ఖురతాడనజాధికధూళితోడఁ బం
పానగరంబనంగ నొక పత్తనసత్తమ ముజ్జ్వలంబగున్ 7

చ॥ అటఁగల విప్రులెల్ల రణిమాదులవిద్యల శంకరాజులే
యటఁగల భూభుజుల్ భుజబలామలకీర్తుల సింధురాజులే
యటఁగల కోమటుల్ ధనసమగ్రత గోస్థితి యక్షరాజులే
యటఁగల కాపువారు సుగుణాళినతీక్ష్ణతవ్యాధరాజులే 8

గీ॥ అట్టి యుత్తమపురిని వైశ్యామరతరు
విపినమునను విషాముష్టివృక్షమట్లు
పాపిసెట్టి సమాఖ్యతో వైశ్యుఁ డొంకు
కాపురంబుఁడు సతతార్థకామనుండు 9

ఆ॥ చెడ్డసరకుఁదెచ్చి దొడ్డవెలం జెప్పి
వచ్చి కొనెడునట్టివారి యవస
రమునుబట్టి మిగుల ద్రవ్యమ్ము లాగుచు
బేరమమ్ము నతఁడు విప్రవర్య! 10

మ॥ కొనుచోఁ బాత్రలు రాళ్ళుఁ బెద్దవియగుం గొంకింతలే కమ్ముచో
టనగుం జిన్నవి వాని లాఘవముతోడం బోలలే వెట్టి ధృ
ష్టుని కన్కట్టులునైన నా జమయు ఖర్చుం గన్న మాయాకిరా
తుఁడి వాలింబయికొన్న పార్థరఘుభూతూణమ్ము లట్లుండెడిన్ 11

తే॥ కూటసాక్ష్యమ్ములం జెప్పి కొంత ధనముఁ
కనుముపట్టుల వారించి కొంత ధనముఁ

గొనెదునెడ నమ్మునెడ బొంకి కొంత ధనము
నార్జనముచేసి బహుధనాఢ్యుఁడయ్యె 12

సీ॥ మా తండ్రి యెట్లొ సంపాదించి యుంచెనం
చాకాంక్ష దిను సంతు లేకయున్న
నష్టఁ దీర్పఁగనచ్చు నతిరిక్తనకె పట్టెఁ
డన్నమీఁ డను నింద యలమికొన్నఁ
జిల్లిగవ్వకుఁగూడ సేయుపో ఘోరప్ర
మాణముం చెల్లరుం బలుకుచున్న
కొంతెఁరి యని మొత్తుకొన్న సాయము సుంత
యే న్నల్పుఁడని చుట్ట లేన్చుచున్నఁ
గీ॥ బ్రోవ్వుల యెల్లెడల డబ్బు మూల్గుచున్న
వ్యాపకాధిక్యమున సుఖమబ్బకున్న
నూరు పొమ్మన్నఁ గాదు వే రారయన్న
న్యాయమును దృప్తిలేదు తదార్జనమున 13

మ॥ వివిధోపాయములం బ్రతిక్షణముఁ దా విత్తంబు నార్జించుఁగా
ని వదాన్యత్వ మటుండఁగాఁ గడుపు నేనిన్ నింపఁబోఁ డింపుగా
నవనీదేవత లన్న దేవతలనన్ హాస్యమ్ము గావించుఁ జెం
తవివేకుల్ వారిగాథలన్నుడువ నిద్రాభంగకుల్ సీ యనున్ 14

చ॥ అతనికశ్రత మెంతయు దయాహృదయమ్మున బీదబిక్కలన్
మెతుకును నీరు నిచ్చి యెలమిం గనుచుండును గాని నాథుడై
వతముగఁ జూచు సాధ్వియయి వర్తిలుచుండుటఁ జూపిసెట్టి యా
నతి నదిలేశమైన నొకనాఁడును మీఱఁగలేదు భూసురా! 15

సీ॥ విప్రలలామ! "పాపీ చిరాయు స్సుకృ
తీగతాయు"వను సూక్తికిఁ దగంగ
సెట్టి యెంతేనియుఁ గట్టి డెందముతోడ
ధనమె ముఖ్యమ్ముగాఁ దలఁచి ప్రోవు

సేయుచు నుండఁ బ్రజ్ఞాయజగంబెన్న
నై మపతనముతో నరిగె దివికి
నాతఁ డా యమ కెట్లొ యపరక్రియలుసల్పి
పున్నెమ్ముఁ బాపమ్ము నెన్న కుండ

గీ॥ నిష్ఠురయు నోగిరము మాని నిముసమేని
కాలమును రిత్తపుచ్చక గడనఁజేసె
దానధర్మమ్ములకుఁ గాని ధన మదేటి
కంచు జనములు తన్ను నిందించుచున్న 16

వ॥ అవ్విధంబున ధనార్జనంబె కర్జంబుగా నుండు నప్పాపిశ్రేష్ఠి భోజన
పాత్రలు కొని తెచ్చి యమ్ముటకన్న స్వయమ్ముగ నాకులు తెచ్చి
పాత్రలుగాఁ గుట్టి యమ్ముకొన్న నెక్కుడు రొక్కమ్ము వచ్చునను
లుబ్ధత్వంబున నాకులకై పంపాతట వటవృక్షంబున కేగి యెక్కి
యకాలాశనిపాతమ్మునఁ గ్రిందఁబడి మరణించి నరకమ్మున కుం
బోయి యనేక సహస్రహాయనంబులు మహోదారుణబాధ లనుభ
వించి యిహంబున సుకృతంబు లవంబైనఁ జేయనివాఁడగుటను
దేవబ్రాహ్మణ దూషకుండగుటను హరిదాసాపహాసకుండగుటను
వీని యన్నింటికన్న మిన్నలగు నకాలాశనిపాత దుర్మరణంబు
నొందియు దహనసంస్కారాది కాపరకృత్యంబులు లేనివాఁడగు
టను దక్షిణంబు ఘోరాకారపిశాచుండై యప్పంపాసరోవరసమీ
పన్యగ్రోధంబు నాశ్రయించి తిన నన్నంబు లేక క్షుధాబాధితుండై
తుదకుఁ బశు పక్షి మృగమాంసాహారంబులతోఁ బెక్కువేలేండ్లు
లెండలకు వానలకు దురపిల్లుచుండ నొక మకరమాఘమాసంబున

క॥ బ్రహ్మకుమారుఁడు పాతక, జిహ్మగ ఖగనాయకుఁడు వసిష్ఠుండుచ్ఛ్రిత
బ్రాహ్మణసంతానముతో, బ్రాహ్మీసమయంబునందుఁ బంపాసరసిన్

సీ॥ శుభకరుఁడు వేదవేదాంగ సంకల్పవిధి ని
[illegible]

దరిని గల మఱ్ఱిక్రింద సుదర్శనధరు
నిలిపి పూజించి వినుతించి నెమ్మితోడ 19

గీ॥ శిష్యు లభిముఖులై చెంతఁ జేరి వినఁగ
హరికథాపూరితంబైన మాఘమాస
మహిమ వివరింపసాఁగె సంయమివరేణ్య!
క్రమమైన శ్రీరాగసంగతిని నిల్చి 20

చ॥ ఎతఁడు తపఃప్రభాతముల నేట నిమజ్జనమాచరించునో
యతని కొలల్ దొసంగులు సమస్తము పూర్వభవంబునన్నివా
రితమగు గాఢతామసము దీరి నశించును తత్క్షణంబ య
ట్లైతఁ డొనరింపఁడో యతఁడు హీనగతిం గనుఁ బాపసమ్మదై 21

చ॥ క్రతువులు మున్నుగా నితర కర్మముల న్విడనాడియైన దు
ష్కృతమహిభృచ్ఛతారము హరిస్తుతిపూరకమైన మాఘస
ద్వ్రత మొనరించెనేని నిరవద్య సుఖాస్పదభాసమాన శా
శ్వత హరిసత్పదంబున కవశ్యము సేరును దివ్యరూపుఁడై 22

చ॥ ఇవి మొదలైన సంగతుల నీడితమైన తపోమహత్త్వమున్
జెవులకు నింపుఁ బెంప నిజశిష్యులకుం బరమేష్ఠిచిత్తసం
భవుఁ డెఱిఁగించుచుండ నల మఱ్ఱినియున్న పిశాచుఁ డాలకిం
చి వటమునుండి భూమిని వసిష్ఠమునీంద్రుని ముందటం బడెన్ 23

క॥ పడి లేచి మాఘకథ సెవిఁ
బడుటన్ గొలలాఱి పూర్వభవవిజ్ఞత రా
ర్పడినందున న్వసిష్ఠుని
యడుగులకున్ మ్రొక్కి యాతఁ డతివినయముతోన్ 24

శా॥ శ్రీరామ్రాసి భవామృతమ్ము తినుమ్మా క్షేమం జావనీ దంతికా
కోలమ్మన్వయమండనా! భవదనూనోక్త్యుద్భవంబౌ సుధా
సారంబుంబలె శ్రోత్రపావములఁ బెల్చం బాపి పూర్వస్మృతిన్
జేరం జేయఁగఁజాలునే యిది తపస్సిద్ధిం దటస్థించెనో! 25

క॥ అని కొనియాడి పిశాచుఁడు
తన పూర్వచరిత్రఁ దెలుపఁ దాపసి విని నె
మ్మనమునఁ గడు నచ్చెరువుం
గని కనికారమ్మునఁ వానిఁగని వచియించెన్ 26

గీ॥ ఓ పిశాచ! వినినమాత్రాన నిన్నుఁ
గలుషరహితుఁగ విజ్ఞానకలితునిగను
జేసినది శ్రీశమహిత మాఘమాసమహిమ
మే యగునుగాని మఱియు నొండేదిగాదు 27

క॥ నీ కీ పిశాచదేహము, పోకడఁగను మాఘమాసమునఁ గల్యమునం
దీకొలఁకున మునిఁగినచో, లేకుండినయెడల నిట్టులేయుండు సదా 28

వ॥ అనిచెప్పి నాఁడు గడపి మఱునాఁ డరుణోదయంబున వానిం బంపా
సరోవరంబునకుం గొనిపోయి తజ్జలంబుల రెండు గడియలసేపు
కుశలంగొని మార్జనంబొనర్చుచు సంకల్పపూర్వకంబుగా స్నానంబు
సేయించిన 29

శా॥ హేయంబైన పిశాచతన్ వదలి సద్వేద్యాంచితాకారుఁడై
తోయేజేక్షణ భృత్యసీతమహితాందోళిం బ్రవేశించికొ
మ్మో యోగీశ్వర! మన్నమన్నులని యా యుర్వీసురున్ వేఁడుచున్
బోయెం గోటిరవిప్రకాశమగు విష్ణుస్థానముం జేరఁగన్ 30

వ॥ పిమ్మట వసిష్ఠమహర్షియు సశిష్యుండై నిజాశ్రమంబునకుం జనియెఁ
గావున జహ్నుమునీంద్రా! 31

— గృత్స్నమదుండు జహ్నువునకు హరికథామహిమఁ జెప్పుట —

శా॥ ఎవ్వాఁ డా హరిసత్కథాభ్యసనుఁడో యెవ్వాఁడు తద్బద్ధయో
యెవ్వాఁ డా హరి పాదపద్మయుగళం బేప్రొద్దు ధ్యానించునో
యెవ్వాఁ డుత్తమధర్మకర్మరతుఁడో యెవ్వాఁడు సాధ్విష్టుఁడో
యెవ్వాఁడొందు వికుంఠమిచ్చు హరి దానాత్మాకృతిన్వానికిన్ 32

గీ॥ బ్రహ్మహత్యాది కాఘ నివారిణియు న
నేక యాగాదిసత్కర్మకృత్యసులబ్ధ

ఫలదయును సర్వతీర్థసేవాసమాత్త
పుణ్యదాత్రియుఁ గామముముక్షువులకు　　33

గీ॥ సంతతానందకరయు విప్రస్త్రశత్రు
పట్కులకు మోక్షదయునైన చక్రికథను
వినఁగ నొల్లనివారలు వికృపులేని
నిరయవాసంబొనర్తు పాణికులచంద్ర!　　34

ఉ॥ సారవిహీనమై వివిధశంకల కాకరమై పదార్థలం
కారసుదూరమై సుకవిగర్హితలక్షణమై యుపాధివి
స్తారమునై రసప్రియవిసర్జితమైనను విష్ణుసత్కథా
పూరిత గద్యపద్యచయము న్వినుచుందురు సాధులెప్పుడున్　　35

సీ॥ జన్మమృత్యుతరంగ సహిత సంసార మ
　　హాగాధ వారాశియందు మునిఁగి
పారంబుఁగాన కాధార మెయ్యది దీనిఁ
　　దరియింప ననుచు నాతురముఁజెందు
వారికిఁ దక్షణ పరిలబ్ధహస్తావ
　　లంబమై కర్ణపేయంబు నగుచు
దరిఁజేర్చి కైవల్యధామమ్ము నొందించు
　　హరికథ విననొల్లనట్టి కుమతి
గీ॥ యిమ్మహి న్మతిలేని కష్టమ్ములొంది
　　సౌరిపురిఁజేరి యచ్చోట ఘోరవాది
　　నరకసంప్రాప్తబాధలఁ బొరయుచుండు
　　నఘుసమూహంబు బ్రహ్మఘ్నుఁడందినట్లు　　36

క॥ కావున సుఖమొందంగా, భావంబునఁ దలఁచువాఁడు పాపేంధనక
ల్పావసరవహ్ని సదృశ, శ్రీవిభు కథ వినుట నభ్యసింపఁగవలయున్

ఆ॥ హరికథా విరక్తుఁడగువాని మోమును
బుణ్యచరిత వినని మూర్ఖు మోముఁ

నాకుఁగూపె డెట్లొ చూచుట పొసఁగిన
నపుడె యతఁడు చూడనగును రవిని 38

గీ॥ చక్రి కథలుఁ దదవతారజాత కథలు
భక్తి వ్యాఖ్యానమొనరించువాఁడు నుతువు
వాఁడు వినువాఁడు నచ్యుతత్వంబు నొందు
సంశయము మాని విను దీని జహ్నుకాని! 39

కం॥ పలుపలుకులేల విను మో
యలఘుమతీ! నిమునస్మైన నంపజగ్గొయెనక్
జలజాక్షు కథను వినువాఁ
డొలయుం దక్షిణమ సౌఖ్య ము త్తమపదముగ్ 40

14 అధ్యాయము

కం॥ మును మార్కండేయుఁడు విని
చిన శ్రీహరి భక్తజనవిశేషత విపిన
మ్మున ఘనతమునై కలహ
మ్మొనరించెడు మునులు శాంతి నొందరె జహ్నూ! 41

వ॥ అని పలికిన గృత్స్నమదు వాక్యంబు విని జహ్నుండు మహాత్మా! తత్కథ సుబోధంబుగా నెఱిఁగింపుమని వేఁడ గృత్స్నమదుం డిట్లనియె 42

ఉ॥ తామసదూర సంయమివతంస మహాశ్రమ మిశ్రమంబునై
భూమసుమాదిశోభి తరుపుంజ నికుంజ సురంజకంబునై
సామవిధిప్రచారగజ శత్రుముఖోద్ధత జంతుమంతమై
నైమిశనామధేయ విపినంబు జగంబునడంబు మీఱెడిన్ 43

నైమిశారణ్య వర్ణనము —

[illegible] ఖదిరబు జంబీర నింబ కదంబ మధూకాశోక పారుజాత
పారిజాత ఖర్జూర నారికేళ ద్రాడిమీ ద్రాక్షా రుద్రాక్ష ప్లక్ష నారంగ
మాతులుంగ సాల రసాల తాల హింతాల తమాల శిరీష వట కుట

జాది విటపిచ్ఛటా విస్ఫుటంబును మాలతీ మల్లికా నాగవల్లికాది నానావిధ వల్లికావేల్లితంబును నాకలోకంబునుంబోలె దేవవల్ల భేంద్రాణికా రంభై రావతాంచితంబును సత్యలోకంబునుంబోలె గాయత్రీ బ్రాహ్మీ బ్రాహ్మణ్యా వేదముఖ్యాక పణసాది శ్రేయమా నంబును వైకుంఠనగరంబునుంబోలె విష్వక్సేన మాధవీ ధాత్రీ మన్మథ ప్రకటితంబును కైలాసంబునుంబోలె వృషభకుమారక హైమ వతీ శివానూనంబును నై గోమతీ వేగవతీ స్వాదూదకపానసంతృప్త బహువిధ భూతవ్రాతంబునై యొప్పు నందు **44**

— నైమిశంబున మునుల కలహము —

గీ॥ చాలకాలమ్ము క్రిందట సంయమితతి
ధర్మశంకలఁ దీర్చికోఁదలఁచి సభను
గూర్చి దానికి నధిపుగాఁ జేర్చుటకును
దగినవాఁ డెవ్వఁడా యని వగచుచుండి **45**

వ॥ కొందఱొకనిం బేర్కొన మఱికొంద ఱింకొకనిం జెప్ప నింకకొందఱు వేరొకని వాకొన నల్లెలరుఁ బ్రత్యేక ప్రత్యేక వ్యక్తుల నిరూపించుచు నొకరిమాట కొకరు సమ్మతింపక తీవ్రంబుగా వాక్కలహంబు గావించుచుండు నెడ **46**

ఆ॥ భృగుమహర్షి లేచి యేటి కీ కలహంబు
నిష్ఠతోడఁ దపము నెఱపినాఁడ
యోగివరులు నాకు లోఁగుదు రట్టి నా
పేరు నుడువరాదె మీరలెల్ల **47**

ఉ॥ గౌతముఁ డప్డు సత్వరముగా నిలువంబడి యీ భృగుండు గ
ర్వాతిశయుండు యోగమున యందుఁ దపమ్మున నన్నుఁబోలఁ డీ
భూతలి నింక నేరు నను బోలరు వృద్ధుఁడ బ్రహ్మకల్పమే
నే తిలకించినాఁడనని నెట్టనబల్కఁగ రోమశుండ నెౕ **48**

చ॥ ఘనులమటంచు పేరెవరియొ కాఱులు ప్రేలుచునుండి రంతె కా
ని నిజముగా నిటుఁగల మునిప్రకరమ్ము మదీయ శిష్యతన్
గనినది కాదె నా ముసలిగార్గ్యుఁడు పల్కె సమస్త శాస్త్ర వే
త్తను నిగమాలయుండ బుధతల్లజుఁడన్నను బోలరేరిటన్ 49

క॥ అప్పుడు మాండవ్యుండనె, దప్పక కాల్యములఁ దీర్చు ధర్మనిరతుఁడన్
జొప్పగు కీరితి నాకుం, జెప్పదె సభకెల్ల నేన నూపతినంచున్ 50

ఉ॥ అంతట శంతనుండను మహర్షి మహోరుమయోగశాస్త్ర సి
ద్ధాంతముఁ గాంచినాఁడ పరమాత్మ నెఱింగినవాఁడ నా సముం
డింతటి మౌనిసంఘమున నెవ్వఁడుఁ గాఁడనఁగాఁ బులస్త్యుఁ డ
త్యంతము రోషచిత్తుఁడయి యాంభటిన్ వచియించె నీ క్రియన్

క॥ వేదమ్ముల శాస్త్రమ్ముల
వాదింపఁగ నాసముం డెవం డిట బుధు ల
త్యాదరమునఁ బూజింతురు
గాదా నన్నే యన శౌనకమునీంద్రుఁడనెన్ 52

గీ॥ తాపసులచేత సిద్ధసంతతులచేతఁ
బూజితుఁడ నాత్మవేదిని మునులయందు
నగ్రిముఁడ నేన యాట గ్రంథాళిమీర
కనరె "శౌనకాదికమును" లనెడు ఫక్కి 53

వ॥ అను నెడఁ గశ్యపుండు 54

సీ॥ దేవతల రాక్షసులను బక్షినిచయమ్ము
ఫణికులమ్మాదిగా భూతపాళి నేన
కలుగఁజేసితి నాకన్న ఘనుఁడు లేఁడు
మునుల ననఁగ విశ్వామిత్రముని వచించె 55

[illegible] పుట్టు శాస్త్రి యన్నపోలికి వీరికి
బ్ర[illegible]పదమ్ము వడసితి నది
[illegible] నేను ధాతను మించితి
[illegible] నా [illegible] డెవ్వఁడిచట 56

క॥ ఈవిధి నాకలోకాం తరమం
భావంబునఁ బడసి యమితమనఃప్రసిద్ధులై
కావరమున వాగ్వాదముఁ
గావించుచునుండ ముని నికాయములోనన్ 57

సీ॥ కొందఱు మునులు భృగుమహర్షి దరిఁ జేరి
ప్రొద్దు జడల్వీకఁ గొంతమంది
గౌతము మీసముల్ గడ్డముం బెఱుక నా
గౌతముండును ముష్టిఘాతములను
గొందఱ బాధింపఁ గొందఱు మాండవ్య
గార్గ్యవసానుల గిచ్చి గాయపఱుప
వారు కొందఱిమీఁది వస్త్రముల్ చింపంగ
గోడుగులఁ గొందఱు కొట్టుకొనఁగ

గీ॥ బ్రహ్మదండాలఁ గొందఱు బాదికొనఁగఁ
గొందఱు కమండలువులూనికొని పెనంగ
జింకతోళ్ళను గొందఱు చివ్వ సలుపఁ
దుములమై మౌనికలహ మద్భుతమొనర్చె 58

గీ॥ సత్త్వగుణశూన్యులై రాజసమున రేఁగి
తతతమః పరిపూర్ణచిత్తములతోడ
మంచిచెడ్డ లెఱుంగక మౌను లట్లు
చెడ్డమాటల ప్రేటులఁ జివ్వ సలుప 59

ఉ॥ నారదుఁ డంతయుంగని మనమ్మున విస్మయమొంది వారికిన్
బోరు రగుల్కొనం బలికి మోదముఁగాంచి యదృశ్యుఁడై హరిన్
జేరి తపస్వి సంగరవిశేషము విన్నప మాచరించినన్
వారిజపత్రలోచనుఁడు నారదసంయమితోడ నిట్లనెన్ 60

ఉ॥ నైమిశమందుఁ దాపసగణంబున కిప్పుడు సాఁగుచున్న సం
గ్రామవిధమ్ము నెంతటి పగల్భుఁడు నాప నశక్తుఁ డుక్తులన్

దామరసోద్భవాత్మభవ నాప్రియభక్తులఁ బంపి యుక్తిచేఁ
బాములఁ బట్టువారిఁగని పాములు నక్కినఫక్కి సల్పెదర్ 61

గీ॥ అటకు నీవేగి కను మదియంచుఁ బలికి
దగ్గఱగనుండిన మృకండుతనయు సనక
ముఖుల నల్వురఁ బిలిచి యమ్మునుల పోరు
నేరుపునఁ దీర్చిరండన్న వార లపుడె 62

వ॥ హరికి నమస్కరించి యచట జఱుపవలయు తెఱఁగు నిర్ణయించు
కొని ముందుగా మృకండునందనుండు తపసిపిండు తుందుడుకుఁదనం
బున సందడికయ్యం బొనర్చు తావునకు వచ్చిన వార లమ్మునింగని
రమ్ము రమ్ము చిరకాలజీవివి సకల శ్రుతిస్మృతి శాస్త్రార్థవేత్తవు
నైన నీవు తగు సమయమ్మున కిందు వచ్చితివి. మాలో నిమ్మహాసభ
కధ్యక్షుండుగా నుండఁదగిన శక్తియుక్తుం డెవ్వండో నిర్ణయింపుమని
యొక్కొక్కఁడు తనకుఁగల విద్యాతపోయోగబలంబు లెక్కు
డుగాఁ జెప్పికొనుచు నితరుల లోటుపాటు లుద్ఘాటించుచుండ
మార్కండేయుం డిట్లనియె. 63

చ॥ శ్రుతులఁ జతుర్ముఖుం దమము రూఢత స్థాణుని యోగశక్తి శ్రీ
పతిని నెదుర్పఁగాఁ దగినవారలు మీరలు నేను వృద్ధతన్
మతి చెడియున్న వాఁడ నణుమాత్రము మీదగు శక్తిసంపదల్
చతురుఁడనై విమర్శనముసల్పి సమర్థుని దేల్పనేర్తునే? 64

వ॥ సత్త్వగుణ పరిపూర్ణ బ్రహ్మర్షి మండలమండితంబగు నీ సమితి
స్థలంబు తమోగుణాక్రాంతకాపురుషకృత ఘోరసమితి రంగంబుం
బలె వితరేతర ముష్టిఘాత నిర్భిన్న కపాలశకలంబులనందగిన కమం
డలు ఖండంబులవలనను నన్యోన్య కాండఖండిత కేతుదండంబుల
కెవయై విఱిగిపడియున్న బ్రహ్మదండంబులవలనను దెగిపడిపోయిన
[illegible]మ్ముల కుద్దియై లాగుకొనుటచేఁ జినిగి చేజారి పడిపోయిన
[illegible]ంబులవలనను నికృత్తవీరపురుష శ్వేతచ్ఛత్రసమంబులై
[illegible]యిన [illegible]వలనను నేలంగూలిన హత్తి

గవిసెన పుట్టంబులకై పరస్పరాకర్షణమ్యతంబై ధరంబెరయు
శాటీచ్ఛటలవలనను భయంకర సింహనాదసదృశంబులైన యొక
ళ్ళొకళ్ళ గద్దింపు కేకలవలనను రామభటపీడిత విబుధ విపక్ష సదృ
శంబులగు యుష్మదాకృతులవలనను గనుభీభత్సంబై యుండెఁ బర
మాత్మవేత్తలగు మీరిట్లు కలహింప వృద్ధతఁ బుద్ధిబలంబు క్షీణిం
చిన నాయట్టిఁడు మిమ్ము శాంతినొందింప సమర్థుండగునే యను
చుండ 65

— మునులు పోరు నెడల సనకాదులు వచ్చుట —

కం॥ రామహరే! కృష్ణహరే!, సామజరాడ్వినుతపాదజలజాత! హరే!
మామాతుస్త్రాత! హరే!, శ్రీమత్తనుకాంతివిజితజీమూత! హరే!

సీ॥ మానిహృత్పద్మభృంగాయ తేనమోస్తు
దానవతమః పతంగాయ తేనమోస్తు
జ్ఞానదానప్రసంగాయ తేనమోస్తు
వైనతేయ శతాంగాయ తేనమోస్తు 67

భుజంగప్రయాతము॥ హరే రామ! వైదేహికాత్మేశ! జిష్ణో!
హరే కృష్ణ! వైదర్భికాత్మేశ! విష్ణో!
హరే రామ! దివ్యద్దయాదుగ్ధసింధో!
హరే కృష్ణ! దీనవ్రజాత్మీయబంధో! 68

నిరోష్ఠ్యకం॥ నారాయణ! నారాయణ!
నారాయణ! నలినసయన! నాగేశ్శయనా!
నారాయణ! నారాయణ!
నారాయణ! దీనశరణ! నతజనతరణా! 69

వ॥ అనుచు విబుధశ్రవణానందకారి స్వాదుకంఠనాదంబున 70

క॥ సనకుండు సనందనుఁడును
సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు నారా
యణ నామస్మరణంబుఁ
బానరించుచు నటకు వినయమున నేతేరన్ 71

క॥ కొంచెము నవ్వున వారలఁ
గాంచి మృకండసుతుఁ డెదురుగాఁజని కైజో
డించి తదంఘ్రులఁ బ్రక్షా
ళించి పదోదకము శిరస్థలిం జల్లుకొనెన్ 72

సీ॥ చల్లికొని వారి మునిజనాస్థాన మధ్య
మునకుఁ గొనిపోయి తగు పీఠముల వసింపఁ
జేసి యెదురుగ నిలఁబడి దోసిలొగ్గి
పలికె జహ్నుమునీంద్ర! యీభంగి వినుము 73

— మార్కండేయ సనకాదుల ప్రసంగము —

చ॥ ఋషివరులార! తావక హరిస్మరణశ్రుతి వీనుఁదోయి క
ల్మష హరమూర్తిదర్శన సులబ్ధిఁ గనుంగవ పాదసేవనా
కృషిఁ గయిజంట చెంత వసియించుట మేనును ధన్యమయ్యె నీ
రుషులగు సజ్జనుల్ సనెదు త్రోవను బోవుటకైతి నర్హుఁడన్ 74

చ॥ అని వినయంబుతోడఁ దము నాసభఁ బెద్దయు గౌరవించి కీ
ర్తనమొనరించు మౌనిజనతల్లజుఁ గన్గొని సంభ్రమంబునన్
సనకముఖుల్ వచించి రిటు సంయమిమౌళివి చాల వృద్ధు వి
శునికృపఁ గాలపాశముల చుట్లు దొలంచితి వీడ్యవర్తనా! 75

ఆ॥ కల్పసప్తకమ్ముఁ గాంచితివగుట నీ
యెఱుఁగనట్టి ధర్మ మేమి కలదు
పంచవత్సరముల బాలకులము మేము
తావకీన పాదసేవఁ జేసి 76

క॥ జ్ఞానసమార్జన మొనరుపఁ
గా నర్హుల మంతె కాని గౌరవమొందం
గా నెటులతగుదుము బుధమణి
మానక దీవింపు మొదవు మాకు శుభంబుల్ 77

వ॥ అని పల్కు సనకముఖ మునిచతుష్కంబుతో మార్కండేయుం
డిట్లనె 78

గీ॥ సప్తకల్పమ్ములనె కాదు సప్తసప్త
కల్పములఁ గాంచిననుగాని కడకుఁ జావు
తప్పనేరదు ప్రాణికిఁ దపసులార!
యెంతకాలమ్ము బ్రతికిన నేమిఫలము? 79

సీ॥ నిష్ఠతోఁ దపమ్ము నెఱపి యోగముఁబట్టి
నట్టివాఁడే శ్రేష్ఠుఁ డనఁగరాదు
బ్రహ్మకల్పముఁజూచి బహుసమల్ బ్రదికిన
యట్టివాఁడే శ్రేష్ఠుఁ డనఁగరాదు
గొనకొని మునులకు గురువయి వెలఁగిన
యట్టివాఁడే శ్రేష్ఠుఁ డనఁగరాదు
శాస్త్రవేత్తయు వేదపఠనుండు వృద్ధుఁడై
నట్టివాఁడే శ్రేష్ఠుఁ డనఁగరాదు

గీ॥ ధర్మనిరతుండు కాలతత్త్వరుఁడు నైన
యట్టి యాతండె శ్రేష్ఠుఁ డంచనఁగరాదు
యోగమునఁ బెద్దయై యాత్మ నొగి నెఱిఁగితి
ననెడు నాతండు శ్రేష్ఠుఁ డంచనఁగరాదు 80

గీ॥ వాదములఁ బండితులఁ గెల్చి వారివలనఁ
బూజఁబడసిన శ్రేష్ఠతఁ బొందఁబోఁడు
మునులలో మునుముందుఁ జేకొన్నఁగ్గఁబడిన
యాతఁడైనను శ్రేష్ఠత్వ మందఁబోఁడు 81

గీ॥ దేవ రాక్షస పన్నగాదిక సమస్త
భూతనిర్మాత శ్రేష్ఠతఁ బొందలేడు
స్రష్ట సృష్టికిఁ బ్రతిసృష్టి సల్పినట్టి
యాతఁడేనియు శ్రేష్ఠత్వ మందఁబోఁడు 82

సీ॥ నిండి సర్వమునందు నివసించు భార్గవి
హృదయేశుమూర్తిపై దృష్టి నిలిపి

సంగాజనకపాద కంజాతసేవకుఁ
డెదోయి నెప్పుడుఁ జెందఁజేసి
సంతతంబు సత్కథాధ్యానతత్పరమయి
తలఁగకుండంగఁ జిత్తము నమర్చి
హరికథాశ్రవణసక్త సన్యనినాదమ్ము
వీనుదోయికిఁ జేదుగా నొనర్చి

గీ॥ నోటఁ బెఱమాట రానీక కైటభారి
నామముల నుచ్చరించు చనరతముగఁ
జిటికెనేపైనఁ బోనీని చిన్నిబాల
కుండె యెల్లరయందు శ్రేష్ఠుండుసుండు 83

ఉ॥ ఈడునఁ బెద్దనైన ఫల మెయ్యది జ్ఞానము నంతయేని చే
కూడమి నింద్రియావళులకున్ హరిలోలత నేర్పలేక యీ
కేవు జగమ్ములందు నొకఁడేనియు నాకెనగాఁడటన్న ప
ల్కాడఁగ సాహసించుటెకదా! మహితాత్మకులార! యారయన్

క॥ ఎపు డింద్రియముల కెడఁదకు
నపమార్గము సూపఁబోక హరిసేవాలో
లుపత న్నెరిపి మెలఁగెడు
ప్రపన్నులకు మీకుఁ దగును బ్రహ్మరథమిడన్ 85

గీ॥ సుర లమృతపానమునను నిర్జరు లమర్త్యు
లైనతీరున విష్ణు నామామృతమ్ముఁ
బాన మొనరించి మీరలు పంచసమల
యీడుతో జ్ఞానులై చరియింతు రెపుడు 86

మ॥ హరిగాథామృత పాన నేరని మదీయాయుష్యమల్పిష్ఠముల్
బోయియుల్లలిన కుండనీరు వగిదిన్ బోకాదు నానాఁటి క
పెర మిథ్యా సేవాపటం బెఱుంగమి వృథా దేహాభిమానంబుతోఁ
నొరులన్ దూషించుచు దుర్గతిం గనెద మయ్యో! మోక్షమెట్లబ్బెడిన్

సీ॥ పాపమో పుణ్యమో వసుధపైఁ గావించి
నరకమో నాకమో యరిగి యచటఁ
గష్టమో సౌఖ్యమో గాంచి జీవుఁడు వెండి
జన్మమ్ము నెత్తుచుఁ జచ్చుచుండుఁ
గాని వానిని బాసి కైవల్యమొంద మా
ధవు భక్తికన్న సాధనము సున్న
యట్టి మాధవభక్తి నభ్యసింపఁగలేక
తామసాక్రాంత చిత్తములతోడ

గీ॥ మంచిచెడ్డ లెఱుంగక మసలు మేము
ప్రాయమున వృద్ధులమెయైనఁ బనికిరాము
సజ్జనుల గోష్ఠి నుత్తమస్థానమొంది
పూజఁగొనుటకు హరిభక్తి పూర్ణులార! 88

ఆ॥ విష్ణుభక్తిలేని వృద్ధునికంటెను
బాలకుండు మేలు బాలు నెల్ల
రెత్తి ముద్దుఁగొందు రెపుడైన వృద్ధుని
చెంత కొరులు రోఁతచేతఁ జనరు 89

క॥ హరిభక్తిగలుగు బాలుఁడు, హరిభక్తివిహీన వృద్ధుకన్న నధికుఁడై
సురపూజితుఁడై సన్మాని,పరిమత్తున నగ్రపూజఁ బడయఁగఁజాలున్

గీ॥ జ్ఞానవృద్ధుఁ దపోవృద్ధుఁ జక్రి సత్క-
థానురక్తహృదయుఁడు వయోధికుండు
నాత్మవేదియు గురుసమాఖ్యార్హులగుదు
రందు హరిభక్తుఁ డెల్లర కాదిగురువు 91

శా॥ పంచాబ్దంబుల ఱేఁడ మీకయిన నబ్జాతాక్షు నామామృత
ప్రాంచన్మాధురి మీవలెన్నడిరె యెవ్వారైన మీ తేజ రా
జించున్ బమ్మను మించి దుగ్ధజలముల్ నేర్పొప్ప భేదించు రా
యంచల్ పిన్నగనున్న సద్విజసమిత్యగ్రత్వముం జెందవో! 92

క॥ హరిభక్తిపూర్ణహృదయులు
చిఱుతలలోఁ జిఱుతలైన శ్రేష్ఠులు మఱి శ్రీ
హరిభక్తిరహితచిత్తులు
పసినముస సువృద్ధులైన బాలకులె సుఁడీ! 93

క॥ పరిపరి తెఱఁగుల నరసిన, శరీరధారులకు గురుత స్వల్పత నెఱుఁగం
బఱచునది విష్ణుభక్తియె, పరవిషయములెల్ల విష్ణుభక్తికి లొంగున్

గీ॥ ఇటు మృకండుజు చేఁ గను నెన్నఁబడిన
సనకముఖ దేవమానులఖిలింతిఁ బోరు
సల్పు మునులెల్ల విన శేషశయను దివ్య
మహిమఁ గొనియాడఁదొడఁగి కీర్మాడ్కి జహ్నున! 95

ఉ॥ ఎవ్వరు దివ్యసేవిత రమేశకథామృతపానశీలురో
యెవ్వరు భీష్మ మాతృజనయిత్రిమలాంఘ్రిజలాభిషిక్తులో
యెవ్వ రనుక్షణంబు సకలేశ! దయాబ్ధి! ముకుంద! యంచు నా
కవ్వపుగట్టుదారిఁ గడఁకన్ స్మరియింతురొ వారె సజ్జనుల్ 96

మ॥ హరి పాదోద్గతవారి మార్జన పవిత్రాంగుం డెవండో రమా
వర నామస్మరణాధికామలిన జిహ్వారంగుఁ డెవ్వాఁడో మం
దరభూభృద్వహభక్తియోగ దృఢచేతస్కుం డెవండో గదా
ధర పూజా కృతకృత్యహస్తుఁ డెవఁడో ధన్యుండు వాఁ డెల్లరన్ 97

క॥ యతియైనఁగాని సురఋషి
పతియైనం గాని విష్ణుపదయుగ భజనా
రతుఁడే పూజ్యుఁడు తద్విర
హితు తపము వయోధికతయు నెనయవు పూజన్ 98

సీ॥ హరికథల్ వినవట్టి వ్యక్తికిఁ గల చెవుల్
[illegible] చెవులౌనె రాటంవుఁ జెవులె గాని
విష్ణు [illegible] చూచువాతని కనుల్
కనులౌనె పులులీను గనులె కాని

విధుఁ బూజసేయని వెఱ్ఱికరములు క
రములౌనె దర్వీకరములె కాని
భవహితు నుతి నొనర్పనివాని నోరు నో
రౌనె పెనగప్పనోరౌనె కాని

గీ॥ యద్రిధరుఁ వలగొననట్టి యతని యడుగు
లడుగు లౌనె కంపతొడుగు లవునె కాని
మాధవుని భక్తి లేనట్టి మత్తచిత్తు
భవము భవమౌనె మహిషమై భవమె కాని 99

వ॥ అని యిట్లు మార్కండేయ సనకప్రముఖ సంయములకు జరిగిన సంభాషణమ్ము విని కలహించుచున్న మునులెల్లను నిర్విణ్ణమతులై సిగ్గొంది స్వాతిశయంబులు మాని వినయమ్మున నయ్యీవురిపాదమ్ము లౌదలలు సోఁక మ్రొక్కి లేచి నిలిచి 100

గీ॥ పరమగుణులార! శ్రీహరి భక్తులార!
మీ యుపన్యాసమును వింట మిమ్ముఁ గంట
మా యహంకారభరము తామసము నడఁగె
గురుకరుణఁ దీర్పుఁడీ మాదు కోర్కె నిపుడు 101

ఉ॥ జ్ఞానము మోక్షలక్ష్మి నిడఁజాలిన శ్రీ వనమాలి సత్కథల్
వీనులవిందుగాఁగ వినిపింపుఁడన న్విని వారు వల్కి రో
మౌనివరేణ్యులార! మధుమర్దను దివ్యకథావిశేషముల్
మానుగ మీకుఁ దెల్ప వశమా మముఁబోంట్లకుఁ గ్రించు బంట్లకున్

క॥ నారాయణుండె మీఁదగు,కోరికఁ దీర్చెడిని ముందుకొన్నాళ్ళరుగన్
మీరలు శాంతింగనుఁడని, వారల యనుమతిని జనిరి వైకుంఠంబున్

క॥ అనఘులు మృకండునందన
సనకాదులు నారదుండు సని యట చక్రిన్
గని నైమిశవనమున న
మునిసభ జరిగినది సరఁము నీఁనుచుటయున్ 104

క॥ శౌరి విని మునుల కోరికఁ
దీరుపఁగా వ్యాసుఁడై శ్రుతివిహిత సర్వా
ధార హరికథామహిమా
పూరకములు బహుపురాణములుచేసి తగన్ 105

క॥ సూతునకు బోధఁ జేసిన
సూతుఁడు శౌనక ముఖర్షి సూరులకు ఘనే
ప్సితన కథలం దెలిపిన
నా తపసులు గాంచి రంచితానందమ్మున్ 106

సీ॥ జహ్నుకన్యానీంద్ర! విను రహస్యం బొకండు
సద్గురుని దయఁ బడయని జనము లెపుడు
పొందలేరు జ్ఞానము నది పొసఁగకున్నఁ
గుదుర నేరదు హరిభక్తి కొంచెమైన 107

వ॥ మునీంద్రా! దేహధారులు స్వకృతకర్మానుగుణమ్ముగ స్వర్గ నర
కమ్ముల కేగుచు సుఖదుఃఖము లనుభవించుచుఁ దెంపులేని జనన
మరణంబుల నొందుచుందు రట్లుగాకుండఁ గైవల్యంబు నొందవలయు
నన్న నిశ్చల హరిభక్తి కలుగవలయు నది పొసఁగవలయునన్న
నిర్మలజ్ఞానంబుఁ జెందవలయుఁ గావున 108

ఉ॥ సన్నుతమైన శీలగుణసంపద నెందము బమ్మతేజునన్
గన్నుల వేదవాగ్గరిమఁ గర్ణములం దరియింపఁ జేయు నా
జ్ఞ స్నెఱిఁ గొల్చి తత్కరుణ జ్ఞానరమం గనువాఁడు దానిచే
నెన్నిట ధన్యుఁడై తుదకు నందు ముకుందు ననూనరూపమున్ 109

గీ॥ అప్రయోజకమైన శాస్త్రప్రతాన
కలహ నిర్మూలకరము మృకండుతనయ
[illegible] ఘటిత ప్రసంగ మేత
[illegible] విన్నవార లందెదరు ముక్తి 110

## 15 అధ్యాయము

ఉ॥ నైమిశనామ కాననమునన్ మునిరాజకి నాజమైన య
ట్లా మదనారికిన్ మదనుసన్నకు నారని ఖోళకప్రు కా
గా మఘవైరి యచ్చెరువుఁ గల్గఁగఁజేసెను హాప్రుఁ బాడి
త్తామసజాతచిత్తజడతం దొలఁగించుట కీవెఱుంగుదే? 111

వ॥ అని గృత్సమదుండు వల్కిన విని జహ్నుండు 112

క॥ తాతకు మృకండుతనయు, భ్రాతకుఁ బోకేటి కొడవెఁ బిడ్డకలహాం
బేతీరునఁ దీరిచెఁ గం,జాతహితాహితకృతాంకగర్వముఁ జెపుమా!

వ॥ అనిన గృత్సమదుం డిట్లనియె 114

గీ॥ పూర్వముక్తమౌ రజస్తమోగుణాను
బద్ధులైనట్టి పంకజభవ భవులకు
సూచనకులైన మునులు ప్రేరేచుకతనఁ
గలహమయ్యె నన్యోన్యాధికతనుగూర్చి 115

— బ్రహ్మేశ్వరుల కలహము —

వ॥ అప్పుడు పంకేజభవుండు 116

ఉ॥ స్థావరజంగమాకృతుల సర్వజగత్తులఁ దాల్ల శశిన్
వే వెలుఁగున్ సృజించి కనువిందొనరించిన నన్నుఁ బోలు దే
నీవన నెట్లొ చచ్చి చెడి నీవొనరించిన మెల్లసృష్టి మెం
తే వడిఁగూల్చు నాకు సరి యెవ్వఁడు దే యని రుద్రుఁడాడినన్ 117

మ॥ ఎదియైనం బొనరించుశే ఘనతగా క్లేంచు టిచ్చానె సూఁ
కుడియు న్నాశమొనర్చునంచు జలరుద్మాత్రుండనన్ నీకు న
య్యాదియుఁ శక్యముగాదుగా యనుచు ఫాలాక్షుండువల్కెన్ సుమా
త్త్రద! భస్మమును నేమి చేసితని భాషానేత హాసించినన్ 118

మ॥ అప్పు డా స్థాణుఁడువల్కె వేదజడ! నీ వ్యాహారముల్ వ్యర్థముల్
కపటస్ఫూర్తిని సర్వలోకముల దుఃఖక్లిష్టిం ధిన్నుంచు నా
త్రిపురాధీశవలాశ రాజిఁ ద్రుటిఁ దగ్ధభూతులం జేయనే
యప్పు డీ వాడనెయుండి చూచితివిగాదా! బ్రీడలేకాడుదే! 119

వ॥ ఆ మాటలు విని వనజభవుఁ డెల్లిదంబుగా నిట్లనియె 120

శా॥ నెన్నుం దెమ్మను గొండసింగిణియు నా వేదంబు లశ్వంబులున్
మన్నుం గొమ్మ రథాంగమై యమరనాథప్రాభవంబిచ్చి యె
న్నన్నో మెత్తులు వేల్పు మొత్తమిడ నీకెచ్చైన నేసాది గా
నున్నం గాకె త్రిపూర్జయంబొదవె నోహో! యద్ది నీ చేవయే 121

గీ॥ ఆ నుడులకల్గి ఫాలాక్షుఁ డనె సముద్ర
మథన సమయజమగుచు సమస్తభయద
మైన హాలాహలము మ్రింగినట్టి నన్ను
నెల్లరను మిన్న యని మీర లెన్నలేదె? 122

గీ॥ అనెడు హరుతోడ వచియించె నబ్జభవుఁడు
మా పితృష్వస యగు సర్వమంగళాస
తీత్వమే కాలకూటమ్ముఁ దిన్న నిన్నుఁ
గండనీదయ్యె నద్ది నీ కడిమి గాదు 123

వ॥ అనుచుఁ జతురానన పంచానను లొనరించు కలహమ్ము వర్షసహ
స్రమ్ము గతించినను నుడుగక మిటిమీటు లెటిఁగి పతంగపుంగవ
తురంగుండు తత్సంగరంబుం గడముట్టింపఁదలంచి విరాడ్రూపంబున
వారికిం దోఁచిన 124

— బ్రహ్మేశానులకు హరి విరాడ్రూపముఁ జూపుట —

గీ॥ బహుళ ఖరకరసంకాశు బహుసహస్ర
వదనలోచన బాహూరుపదవిరాజ
మాను నపరిమితాకారు మహితభూషు
దివ్యగంధానులేపను దివ్యవసను 125

గీ॥ అన్నిటిని మిగిలి దశాంగుళాధికముగ
మున్న తన్మూర్తిఁ గని యబ్రమొంది వార
లిద్దఱు మూర్తి యాద్యంతమెఱిఁగి సరగ
నేవఁ జెప్పెనా మవలోన హెచ్చువాఁడె 126

వైన యితఁడె సర్వాధికుఁ డరసిచూడఁ
గాము మనమని గతరజస్తామసులయి 134

వ॥ తద్విశ్వరూపవిషయ తర్కంబువలన నిర్మలజ్ఞానంబు వడసి యిది యంతయు నఘటనాఘటనసమర్థుండును విశ్వాత్మకుండు నగు శ్రీ మహావిష్ణు ప్రభావంబ యని యమ్మహాత్ము లిట్లని నుతించిరి

— విశ్వరూప స్తవము —

శా॥ దేవా! సర్వమయా! సమస్తగురుమూర్తీ! యాద్యమై సత్యమై
దేవేశంబయి కోటిసూర్యమహిత భృగ్దీప్తంబునై భక్తచి
త్తావాసంబయి పద్మనేత్రమయి యవ్యక్తంబునై మీఱు నీ
యీ విశ్వాకృతిఁ జక్కఁజూపవె మదీయేశా సమస్తంబునన్ 136

శా॥ ఓ విశ్వాత్మక! సర్వదేవవర! వేదోక్తిస్తుతాంచాంఘ్రిరా
జీవా! నీకు నమస్కరింతుము మనుశ్శ్రేష్ఠంబులన్ భక్తిమై
కైవల్యప్రదు నిన్నెపుం డనిశ ముత్కంఠ న్మతిన్ సల్పునో
యా విజ్ఞుండు భవత్స్వరూపధరుఁడై యానందపూర్ణుండగున్ 137

గీ॥ లోకకర్తవు భర్త వనేక తేజుఁ
డవు మహారూపకుఁడవు గురువులకు గురుఁ
డవును వరదులకు వరదుఁడవును సర్వ
మునకు నాధారుఁడవు నీవ భుజగశయన! 138

క॥ వైకుంఠవాస! శిష్టానీకేష్టప్రద! త్రిమూర్తి! నిర్జరవరసే
వ్యా! కరుణాంభోధీ! నీ, వేకద బ్రహ్మాండ నికరవిభుఁడవు తలఁపన్

క॥ సలువవుఁ బంచముఖుండవుఁ
జలాచలేశుఁడవు నీవ సర్వమనోబ్జ
సలవాసి నీవ మాధవ!
జలశయనా! నీకు నతులు సలిపెద మెపుడున్ 140

సీ॥ విస్తృతంబైన సృష్టిఁ గావింతు వీవ
నీవ యైశ్వర్యవంతుఁడ వీవె సర్వ

సుగణరాశివి కాలత్రయగణనీయ
విభవుఁడవు విష్టపాధారవిభుఁడ వీవ        141

క॥ సురనాథాధిక దిక్పతు
లరుణాంశు సుధాంశు లీవ యజముఖలోకే
శ్వరు లీవ మత్కృత నమః
పరంపరలఁ గొనుము నీవు భగవానుండా!        142

సీ॥ వేదమయుఁడవుఁ బరమపవిత్రుఁడవుఁ బు
రాణపూరుషుఁడవును బరాత్పరుఁడ వ
నంతవాసివి నీవె యటంచుఁ గవివ
తంను లెంతురు నిన్నుఁ బన్నగశయాన!        143

క॥ వేదమ్ములుఁ వేద్యం బమ్ము,లావస్థానమ్ము లుమష్టయజ్ఞఫలసమా
పాదక కర్మమ్ములు బుక్,స్వాదువచోనిచయ మీవ సర్వాధారా!

క॥ మృగములలో సింహము ప
న్నగములలో శేషుఁడవని ధరముల హిమన
గ మబ్జంబుల శశి యా
పగలం గంగవలె నీవె సర్వుండ వెందున్

క॥ ప్రభుఁడను నేనే నేనే
ప్రభుఁడ ననుచు స్పర్ధవలన బహుసమ లోకటన్
శభసముసఁ బోరుమా మా
యభిమాన స్మయములజ మహాపాపమునన్        146

సీ॥ కానుపించిన నీయంతుఁ గనఁగనెంచి
తిరిగి త్వదనంతమూర్తిని దెలియలేమిఁ
బాగ రుడిగా జ్ఞాన మొక్కింత పొడమె నింకఁ
జూపు నీ సౌమ్యమూర్తిఁ గృపాపయోధి!        147

వ॥ అనుచు శుద్ధబుద్ధులై బద్ధాంజలులై ప్రార్థించుచున్న చతుర్వదన
పంచవదనులకు        148

సీ॥ స్వయశః ప్రతాపముల్ మెయిఁ గనంబడఁజేయు
 నతుల ఖగేంద్రవాహనముతోడ
నఖిల పాపఘ్న గంగాపగా జననస
 ద్మములైన పాదపద్మములతోడ
శ్రీవత్సకౌస్తుభ శ్రీ వనమాలికా
 చారువిశాల వక్షంబుతోడ
శత్రుభీకర శంఖచక్రాదికోద్యదా
 జానుబాహా చతుష్కంబుతోడఁ
గీ॥ గరుణఁ బొల్చు నేత్రయుగ్మంబుతోడఁ
బూర్ణచంద్రుని నగునగు మొగముతోడ
ఫణిశి భృత్ఫణాతపత్త్రంబుతోడ
సర్వవిభుఁడు విష్ణుండు సాక్షాత్కరించె 149

గీ॥ అటులు ప్రత్యక్షమై తన కవని సాఁగి
నిలిచి దోసిలి యిడి కరుణింపుమనెడి
లోకపాలుర ధాతృత్రిలోచనులను
గాంచి వచియించె స్వాదువాగ్గరిమ శౌరి 150

వ॥ లోకపాలకులైన మీ రనన్యాధికోద్దేశంబులతో నలువు పోరు మేరమీఱ నేను విరాట్టునై మీకు గోచరించి మీ తలఁపులు మెలపుననాస్మర్చి మీ కోరినతీరున నా సౌమ్యమూర్తిం జూపితి. మీ కొదవినట్టి కలహం బెట్టివారికైన నొక్కొక్కప్పుడు దుర్నివార్యంబై కలుగుచుండు. దానికిం గారణం బెఱింగించెద వినుండు 150

గీ॥ మాయయందు జనించెఁ దామసము రాజ
సమ్ము సత్త్వమ్మనను త్రిగుణమ్ము లట్టి
వానిచే బద్ధచిత్తుఁడౌ వాని కెపుడు
మంచిబుద్ధి జనింప దొక్కించుకైన 151

సీ॥ [illegible] సాత్త్విక వృత్తిస్వచ్ఛమైన
దనటచే ప్రకాశకమై నిరామయమయి

దేహధరు జ్ఞానసుఖసంగ దృఢసువర్ణ
రజ్జువులఁ గట్టివేయు ధీ రమ్యులార! 152

గీ॥ రాగరూపకమైనట్టి రాజసమ్ము
జననమొందుఁ దృష్ణాసంగమున శరీరి
నద్ది భూస్వర్గ సుఖదమైనట్టి కర్మ
సంగరజిత రజ్జులఁ గట్టు సడలకుండ 153

గీ॥ మోహమున సర్వదేహుల ముంచు నలత
మ మ్మవిజ్ఞానజమయి ప్రమాద సుప్తి
జడతలను నిద్రగొలుసుల శక్తిగొలఁది
దేహధారిని బంధించు ధీరులార! 154

వ॥ అట్టి గుణత్రయమ్మునందు 155

సీ॥ ఇపుడు కొంత ధనమ్ము నేను గడించితి
నింక నార్జించెద నెంతో ధనము
బలియు నీ శత్రుసంహారణఁగఁ జేసితి నింక
నితరాహితుల నెల్ల నే దళింతు
నెందు లోకమ్ములో దేవ యీశ్వరుఁడ నా
ఢ్యుండ భోగిని బలిష్ఠుండ సుఖిని
సంకల్పసిద్ధుఁడ సర్వవిద్యావేత్త
నాభిజాత్యానూనుఁడైనవాఁడ

గీ॥ నట్టి నా కుద్ది త్రిజగమ్ములందు నెందు
గలుగునే యను గర్వసంకలితు నల్పు
రాజసముఁ దామసమ్ముఁ బూర్ణమ్ములగుచుఁ
నెవనిఁ బట్టునో వాని సుధీంద్రులార! 156

క॥ మీ రా రాజస తామస
పూరమ్మునఁ గాలు నిలక మునుఁగుటవలనన్
దీరని పోరేర్పడి మితి
మీఱెను లోకేశులైన మీకు నయితమున్ 157

వ॥ అంతియు కాని విచారించిన మీకట్టి భేదభావం బుండఁదగ దేల యంటి రేని 158

సీ॥ మొదలఁ బంచభూతమ్ముల పొడ యొలేక
సర్వమంధతమసమున సంవృతమగు
నపుడు సర్గమ్మొనర్చెడు నాస్థ నాత్మ
శక్తి స్వర్ణపిండమ్మునై స్తవ్యభంగి 159

గీ॥ మూఁడు మూర్తులఁ గైకొన్న వాఁడె నందు
మీర లిద్దరుఁ బుట్టింప మిత్తిఁగూర్పఁ
గర్త లేఁ బ్రోవఁ గర్త నొక్కఁడె వెల్గు
వారలకు భేద మెట్లు చేకూరుఁ జెపుఁడ! 160

క॥ మీరెల్లపుడు సమానులు
పోరఁగ రాదనుచుఁ బల్కి పుష్కరభవునిఁ
జేరి నచించెను శ్రీహరి
ధారుణి సురవర్య! జహ్ను! తాపసమాళీ! 161

సీ॥ వేద సద్మంబవు విశ్వప్రపంచ క
ర్తవు సర్వదేవతా ప్రకరపతివి
సవనవిభుండవు సాధుశరణ్యుఁడ
వఖిలలోకేశ కామ్యప్రదాత
వైశ్వర్యనిధివి సత్యాధినేతవు నిజ
శక్తియోగమునఁ బ్రశస్తిఁ గాంచి
మామక నాభిపద్మమున నిల్చి యనేక
శతసమల్ నిష్ఠతో సల్పి తపము

గీ॥ మహిమ గడియించి బాలార్కుమాడ్కి నొప్పి
సురలచేతను బ్రహ్మర్షి వరులచేతఁ
బూజితుండవైతివి విరించి పోరు నీకు
వసుమతీతమ్మునని రుద్రుతో నని యొఁ జక్రి 162

## 16 అధ్యాయము

— కృష్ణుఁడు శివుని ప్రస్తుతించుట —

ఉ॥ శంకర! నీవు సర్వసురసంయమి పూజిత పావనాంఘ్రివై
పంకజమిత్ర శీతకర పావక నేత్రుఁడ వాసురాద్రి కా
ట్యాంకణమండితుండవు జగత్త్రయకర్తవు మృత్యుజేతవు
శూలాంకవిరాజితుండవు మహాత్ముఁడ వక్షయమూర్తి వెప్పుడున్ 163

శా॥ నీకున్నాకును భేదమున్న లవమేని న్నివనే నేవనీ
వో కామార్దన! వేదవేత్తలు మహాయోగుల్ యతుల్ నిత్యని
వే కైవల్యనిదానమం చెలమిమై ధ్యానించుచున్ వేఁడుచున్
నీ కారుణ్యముఁ జెంది కాంతురుగదా నిర్వాణకల్యాణమున్ 164

గీ॥ సర్వభేదాశ్రయుండవు సర్వభేద
ముక్తుఁడ వధిష్ఠితాఖిలభువన సంచ
యుండ వీవ మహాదేవ! యోగ్యభావ!
యో మహేశ్వర! గిరిజేశ! వ్యోమకేశ! 165

గీ॥ అక్షరుఁడవు పరుఁడవు నిరంజనుండ
వభయదాతవు శంభుండ వఖిలగతుఁడ
వీశ్వరుఁడ వణుమూర్తివి వృజిననికర
నాశకుఁడ వీవ దేవ! యానందభావ! 166

సీ॥ బ్రహ్మవిద్యలలోపల బ్రహ్మ వఖిలదే
వతలలోపల జంభవైరి వీవ
శ్రుతివేదితతి సత్యవతి కుమారుండవు
ఋషులలోన వసిష్ఠఋషివి నీవ
సాంఖ్యపంక్తిఁ గపిలసంయమీశ్వరుఁడవు
రుద్రులలో శంకరుండ వీవ
వసువులలోనఁ బావకుఁడవు వదితి తే
నూజరాజిని నుపేంద్రుండ వీవ

గీ॥ విద్యలం దాత్మవిద్యయు వేదములను
సామవేదమ్ము గాయత్రి ఛందములను
గతుల సుగతియు శక్తిసంఘమ్ములందు
మాయయును వర్ణములను బ్రాహ్మ్యమ్ము గుహ్య
ములను నోంకార మీవ త్రిపురాద్రిదావ! 167

సీ॥ ఆశ్రమమ్ములను గార్హస్థ్యమ్ము గలయ న్ని
వహమునఁ గాలరూపకుఁడు నీవ
ఉపనిషత్తులను గుహ్యోపనిషత్తు నీ
శ్వరులలోపల మహేశ్వరుఁడు నీవ
కల్పమ్ములను మహాకల్పమ్ము యుగచతు
ష్కమ్ములోనఁ గృతయుగమ్ము నీవ
వాక్కులలోన సర్వనితామతల్లిక
గ్రహములలోన భాస్కరుఁడు నీవ

గీ॥ అందగత్తెల లక్ష్మి మాయాపురలందుఁ
జక్రి సతుల నరుంధతి సర్పవైరి
ఖగవితానమ్ములోన సూక్తములఁ బురుష
సూక్త మీవ భక్తులపాలి సురలగోవ! 168

గీ॥ పురుషులను భూతహృదయస్థ పూరుషుండు
జోగుల ననంతుఁ డఖిలయజుస్సుల శత
రుద్ర మద్రుల హేమధారుణిధరమ్ము
మంత్రములను గాయత్రీసుమంత్ర మీవ 169

గీ॥ అఖిలమునకుఁ బరబ్రహ్మ వఖిలమును భ
వన్మయంబు సమస్తప్రపంచములను
గావలెన నీవు ముఖ్యుండ వో వృషార్వ!
పూర్వదేవతాగర్వ వనార్వ! శర్వ! 170

[illegible]రా! మనకిర్వురకు భేదం బణుమాత్రంబును లేదని వేదాంత వేత్తలందురు. పూర్వమొకపరి నీ మాహాత్మ్యమ్ము నారద

మహర్షి నావలన నెఱింగి భవద్దర్శనాపేక్షుండై నిశ్చలచిత్తుండునై
పెద్దకాలంబు తపంబొనర్ప సంతుష్టస్వాంతుండవై ప్రత్యక్షంబైన
నిన్ను దర్శించి మహానందంబున నీవిధంబున స్తోత్రంబు గావించె

— శంకర స్తవము —

చ॥ అమలిన మేకరూపము ననంత మశేష కథాభియుక్త మా
ద్యము సహజప్రకాశక మనాది యమర్త్య మనగ్ర మత్యదృ
ష్టమును దమోగ్రతిష్ఠము నసాధుదవిష్ఠమునైన నీ స్వరూ
పమునకు మ్రొక్కువాఁడ భవబంధవిమోచన! ఫాలలోచనా! 172

ఆ॥ నిఖిలభువన సృష్టి నిర్మాతగా నిన్ను
జూతు రాత్మవిదులు శ్రుతినిచయ ర
హస్యవేత్త లల త్వదానందయుక్ప్రాణ
వాఖ్యమూర్తి శరణమందుదు శివ! 173

గీ॥ సకలభూతాంతరస్థమ్ము జనన మరణ
హీన మఖిలయోగ వియోగహేతుపరము
ప్రాణనామము తేజోమయమ్మునైన
త్వత్స్వరూపమ్మునకు నతుల్ పరమపురుష! 174

మ॥ పురుషాఖ్యంబు విభిన్నసంస్థము సుదీప్తాద్యంబు కారుణ్యమం
దిర మాద్యంతవిహీనముఁ బ్రకృతికిన్ భిన్నంబు కూటస్థ మా
సుర భీమంబు సుఖప్రదంబు సురసంస్తుత్యంబు నవ్యక్త మ
క్షర మైనట్టి భవత్స్వరూపమునకుం గైమోడ్పు ఘోరేశ్వరా! 175

మ॥ సకలాధార మలుప్తభేద మతిసూక్ష్మం బద్రిరాట్పుత్రికా
త్మకముఁ జిత్రము సుప్రసన్నము గుణాస్తోకంబు సర్వాంగదీ
పకముఁ సర్వజగద్విధానము నిశాప్రాణేశసంయుక్తచా
రుకపర్దమ్మగు నీ స్వరూపమునకుఁ బ్రొక్కు ల్నిటాలేక్షణా!

మ॥ అమలాంగమ్ము ప్రకృత్యవస్థము సమస్తాద్యమ్ము దివ్యాన్నమా
త్మమహోద్యత్పురుషాత్మరూపము గుణాంతర్నేత్రబీజమ్ము శా

స్యము విజ్ఞానవిరాగ భోగమహితైశ్వర్యాన్వితం బాదితే
య మహాస్తుతమౌ త్వదాకృతికి జోహారుల్ గిరిజాందిరా! 177

మ॥ పృషద్భిఃకేశము చిత్రభేద మమలాంబుస్థమ్ము భూత ప్రజాం
తరసంవాస మజాండమండిత మనంతప్రాభవోపేత మం
బరకేశమ్ము ద్విస్తలోకమయ సమ్యగ్గర్భ మంబా మనో
హరమైనట్టి త్వదీయమూర్తి కివె జోహారుల్ భుజంగాంగదా!

మ॥ పరమార్కాకృతియున్ సమస్తవిబుధవ్రాతాత్మకం బాద్య మీ
శ్వర మేకంబు త్రికాలహేతువు స్వతేజస్సృష్టలోకంబు భా
స్కరబింబస్థము సంయమిప్రవరపూజ్యంబైన నీమూర్తి కే
గరముల్ మోడ్చెద భక్తరక్షణ! సదా కారుణ్యపూర్ణేక్షణా! 179

మ॥ భుజసాహస్రకమున్ సహస్రశిరమున్ భూతేశమున్ దేవతా
భజనీయంబుం బురాణ మత్యధికసత్త్వస్ఫార మశ్రాంత దీ
నజనాధారము శంబరాంతకరశైయానందంబు నారాయణా
ఖ్య జగద్గణ్యమునౌ త్వదాకృతికి జోహారుల్ వృషేశధ్వజా! 180

మ॥ అతితీక్ష్ణాక్షికరాళవక్త్రము సమస్తాజాండ నిర్మూలనో
ద్ధత శూలాయుధదీప్తహస్తము యుగాంతజ్వాలి కల్పాంతసూ
ర్యతినూజాధిక తేజ మింద్రముఖ దివ్యస్తవ్యమాశీవిషా
న్వితకాలాఖ్యమునౌ త్వదాకృతికిం గావింతునన్నతుల్ త్ర్యంబకా!

క॥ ఫణిరాజపూజితమ్మును, ఫణాసహస్రప్రకాశమానము నారా
యణ సంప్రీతిదమగు నీ, ప్రణుతానందాకృతి కివె వందనము లజా!

శా॥ అచ్ఛిన్నాష్టవిభూతి సంయుతము బ్రహ్మానందపూర్ణంబు యా
తచ్ఛాపాయుధనాథ సద్వినుత మద్వంద్వాక్షి పంచాస్యమా
స్యేచ్ఛాపూరకమిష్ట నృత్యఘటనా హేరాళవా యుష్మదీ
యాచ్ఛిద్రైక మహానటాకృతికి జోహారుల్ ధునీభృజ్జటా! 181

[illegible] ర్వబిరోధిపూజిత పవిత్రాంఘ్ర్యంబుజాతద్వయం
[illegible]భ్రమ్మదు దేవాళి జక్షయానందనా

ద్రము దూరీకృతశోకమై యొందవకళారాజత్కపర్దమ్ముఁ భ
వ్యమహాదేవసమాఖ్యమైన భవదీయాకారముఁ గ్రొక్కెదన్ 184

మ॥ కరుణాపూర్ణ విశాలనేత్రము ఫణీంద్రశ్రీవేయమై న్యాణభా
స్వరశూలాజగవేద్ధహస్తము మహోత్కృష్యందనమ్మాశ్రితా
మరభూజమ్ముఁ సమస్తనాథము హిమక్ష్మాభృత్కుమారీ విభా
సుర వామాంగము నా త్వదాకృతి కివే జోతల్ కుబేరప్రియా!

ఉ॥ మార్తికనిర్మలాంగ! ఫణిమండన! ఖండనభీమ! సోమ! య
వ్యక్త వచస్క మంబుజభవాత్మజ సంస్తవ మిద్ది యెప్డు నీ
భక్తవతంసులైన మునివర్యు లనేకులు సంఘటించి ని
ర్ముక్తమహాఘులై యమృతముం గనినారుగదా సదాశివా! 186

క॥ ఆ కారణమున నిను నను, లోకేశువిధాత మనములో వేఱుగ నా
లోకించువారు చంద్రవి,భాకరులుండువఱకు యమబాధలు పడరే?

గీ॥ మీకు రాజస తామసోద్రేకమునను
బొడమినట్టి వివాదము విడిచిపెట్టి
సుఖముగ మెలంగుఁడని చెప్పి ఖగతురంగుఁ
డప్పుడె యదృశ్యుఁడయ్యె మున్యధిప! జహ్నూ! 188

క॥ మాయావిద్యైన విష్ణు ను
పాయమునన్ బహుసహస్రహాయనములు వా
గాయుధములఁ బోరు త్రిశూ
లాయుధవిధు లాజి మాని యందిరి సుఖముఁ 189

క॥ కావున నాత్మవిదురు లా, శ్రీవల్లభు శరణమొంది వ్రాతపాతకులై
కైవల్య సౌఖ్యమొనసిరి, కావ్యవిబుధదయావతంస! గళితరిరంసా!

ఆ॥ ఆర్తుఁడైన సాధువైనఁ బూజా వంద
నానులాపములను హరి భజించె
నేని వ్రాఁ డిహమున నానందుఁడై మీఁద
హరికిఁ బార్శ్వవర్తియై చరించు 191

గీ॥ రాజసమ్మునను గర్వమ్ముఁ ద్రపయు వీడి
ధ్యాన సేవార్చనా సంస్తవాది విధుల
శేషభోగీంద్రశాయను భజింపవలయు
సంతతము దేహధారి వాచంయమీంద్ర! 192

సీ॥ గర్వకలితున కొదవు దుఃఖములు పెక్కు-
జ్ఞానము నశించు నపకీర్తి సంభవించుఁ
బ్రేమముండదు బాంధవస్తోమము నెడఁ
గాన విడనాడవలె నాము మానవుండు 193

క॥ మనుజుఁడు మాఘవ్రతముం
బొనరించి రమాధినాథుఁ బూజించి తదీ
యు నిరుపమాన సుగాథల
వినవలయుఁ జేయునేల ? విశ్రుతశీలా! 194

వ॥ అని గృత్సమదుండు జహ్నువున కెఱింగించిన తెఱంగున శివుం డుమకుం దెల్పెనని సూతపౌరాణికుండు శౌనకాది మహామును లకుం జెప్పె. 195

— ఆ శ్వా సాం త ము —

శా॥ సల్లాపామృత సారతోషిత సమజ్యాపూజ్య ధీజ్యాధిపా!
మల్లీకుందసితారవింద రజతక్ష్మాభృత్ఫణాభృత్ సుధా
కల్లోలిన్యధిభూస్వభూచ్ఛవితిరస్కార్యచ్ఛకీర్త్యుజ్జ్వలా!
వుల్లాంబా జఠరాబ్ధిముక్తరమణా! పూతాత్మ! రామేశ్వరా! 196

— గ ద్య ము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభూషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబునఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘ పురాణము

## షష్ఠాశ్వాసము

క॥ శ్రీశాయనకవ్యనుజా!, ఆశాసంవ్యాప్తదాత్మ తారుణతనుజా!
కాశీ ప్రముఖక్షేత్రని, వేశా! త్రుటితాశ! రామవిద్వదధీశా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యాశరణ్యులగు శౌనకాది మానివరే ణ్యుల కఖిలపురాణ కథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె నవ్విధంబునఁ గైలాసంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబు నుడువుచున్న మహాదేవుం డిట్లనె దేవీ! వినుము. గంగాతీరంబున మాఘవ్రతం బొనర్చుచు గృత్స్నమదుండు మాఘమహిమాదిక కథావిశేషంబులు తెల్పుచుండ వినుచున్న జహ్నుండు గృత్స్న మదమునీంద్రుం జూచి కరుణించి కర్మగ్రంధి విడఁజేసి మోక్షమ్ము సంఘటించు పరతత్త్వమ్మును బోధింపుము. మఱియును 2

### 17 అధ్యాయము

గీ॥ మాఘధర్మమ్ము కతమున మానవులకు
జ్ఞాన మేరీతి లభియించు జ్ఞాని లక్ష
ణంబు లెట్టివి జ్ఞానవస్మాలి వీవు
తెలియఁగోరెడి నాకు బోధింపవయ్య! 3

వ॥ అని వేఁడిన జహ్నువునకు గృత్స్నమదుం డిట్లనియె. 4

క॥ శ్రీనాయక మహిమాన్విత,మై నెగడిన మాఘధర్మ మమరించెడి సు
జ్ఞాన శ్రేయస్సుల వినఁ,గా నెంచిన నీ మనీష కడుధన్య బుధా! 5

క॥ యోగివరుండవు నీవే, నాగశయానుని కథ ల్వినందలఁచుట మా
నీ! గతజనురార్జిత వృష,పూగముచే నిట్టి బుద్ధి పొడము నరువకున్

మ॥ బహుజన్మాచరితేజ్యలం దపములం బ్రఖ్యాతదానంబులన్
రహిఁ జేకూరిన పుణ్యమూలమున మర్త్యశ్రేణికిం గల్గు శ్రీ

మహిశేశప్రియ మాఘసద్వ్రతము సంస్తవ్యమ్ముగా సల్పఁ ద
ద్విహగేంద్ర ధ్వజగాథలన్వినఁగ భక్తిశ్రద్ధలున్ బుద్ధియున్ 7

సీ॥ విప్ర! నీయందుఁ గల్గిన ప్రేమచేత
వినుతు మాఘవ్రతమ్ముఁ గావించుకతనఁ
గల్గినట్టి తత్త్వజ్ఞాన కథను కలుష
హరను సావధానుండవై యాలకింపు 8

— వేదనిధి యను బ్రాహ్మణుని చరిత్రము —

వ॥ పూర్వకాలమ్మున వేదనిధి యను బ్రాహ్మణోత్తముం డుత్తమ
గుణపూర్ణ యగు తన ధర్మపత్ని శారదాంబంగూడి పుణ్యతీర్థంబుల
సేవించుచు 9

గీ॥ అన్నపూర్ణా విశాలాక్షు లధికభక్తిఁ
సేవఁజేయ భాగీరథీ శీర్షసీమ
నిలిచి యలరింపఁ గాశికా నేత యగుచు
శ్రితులఁ బ్రోచు విశ్వేశు దర్శించి మ్రొక్కి 10

క॥ పృథివిఁ గల నదుల భాగీ
రథి తన నీటన్మునుంగు ప్రజ కొసఁగు ఫలా
త్యధికతఁ దెలియఁగ లేమని
బుధు లొకటం బల్కు వాక్యములు చెవి నాటన్ 11

ఉ॥ వేలుపు వాక చెంగటఁ బవిత్రధరిత్రిని బర్ణశాలినా
నాలయమందు నిల్చి విబుధాపగఁ దోఁగుచు సత్యనిష్ఠుఁడై
కాలిమిఁబూని వేదసముదాయ విశేషములన్ గ్రహించి స
చ్ఛీలము జ్ఞానమున్ దయయు శ్రీహరిభక్తియుఁ గల్గి మానియై 12

ఆ॥ గృహపతి ధర్మంబులతోఁ
[illegible] గడవ ముద్దుపట్టి కొదవ త
న్మనస్సు [illegible]
వహింపఁగరాని చింత సమకూర్చుటయున్ 13

వ॥ ఒకానొక దివసంబున భోజనంబొనర్చి శయనించిన పతిపాదంబు
లొత్తుచు శారదాంబ తన భర్తతో సకరుణంబుగా నిట్లనియె 14

ఉ॥ సౌహృదలక్షణంబులను దాల్చిన నన్నని తల్లిదండ్రులున్
స్నేహితులాండ్రు వేడుకలఁ జిత్తమెలర్ప నొనర్పఁగా జగ
న్మోహనమూర్తియై యెసఁగు పుత్రకుఁ గని ముద్దులాడ నా
కీహ చిరంబుగాఁ గలద యింతకు నయ్యది తీరదాయెఁగా 15

చ॥ అతుల తపఃప్రభూత మహిమాన్వితులై హరిభక్తులైన మీ
పతినగు నేనె పుత్రభవ సమ్మదపాత్రను గాకయున్న నీ
క్షితి నిఁక నేను కోరుకులఁ జెంది సుఖంపడ నేర్తు రారయన్
సుత సహితంబుగాని యెడ శోభిలునొక్కొ గృహస్థధర్మమున్ 16

క॥ అను చటులు దన కళత్రము
వినయమ్మునఁ జెంతఁ జేరి విని చెడి పల్కుల్
దన మనమును బుత్రోద్భవ
మున నగు నానందమొందఁ బురికొల్పుటయున్ 17

వ॥ మనంబున విచారించి వేదనిధి భార్యతోడ నిట్లనె 18

మ॥ సకియా! పుత్రఫలంబులేని మన సంసారద్రుమప్రాగ్రార్తి ప
క్షికులావాసక మూర్ఘ్వలంఘనవిధాచ్ఛేదైక దుష్కామకం
టకభూయిష్ఠ మిదిట్టులుండఁగఁ బితౄణం బీగు భారంబు మా
మకశీర్షంబున నిల్చియున్న యదిసుమ్మా వేడ్కలెట్లుండఁగన్ 19

గీ॥ పితృఋణముఁ దీర్పలేనట్టి పెత యొకండుఁ
దుదకు దుర్గతి తప్పదన్ దుఃఖమొందుఁ
బుత్రసత్ఫలసంప్రాప్తిఁ బొరయుని నను
వేఁచుచుండె నేనేమి కావించువాఁడ 20

క॥ అని చింతదోఁపఁ బలికెడు
తన విభునిం గాంచి శారదాంబ వచించెన్

మనము గతి జన్మమున స
జనునిం బరేయంగఁ దగిన దాన మొకండుగా 21

గీ॥ యోగ్యుఁడగు విప్రునకు నిచ్చియుండ లేము
కావునం బుత్రఫల మెట్లు గలుగు మనకుఁ
జింతిలిన నేమిఫల మను నింతితోడ
వేదనిధి వల్కె నిట్టు లుర్వీసురేంద్ర! 22

గీ॥ దుష్కరంబైన కర్మముల్ తొడరి చేసి
యో సమాధిసమంచిత యోగమూని
యో తపమ్మున హరికృప నొందియో త్వ
దీయ గర్భమ్మునందు నందెదను సుతుని 23

వ॥ ఎట్టులేని నీయందు సుపుత్రుంబడసి మృకండుమహామునివలె నేనుం గృతార్థుండనగుదునని ప్రియురాలికి ముదంబుగాఁ బలికి శుభసమయంబున భాగీరథీసమీపవనంబున కేగి నియతుండై 24

ఉ॥ వామపదాంగుళి న్నిలిచి స్వస్వమనోంబురుహాంబుజస్థైర్యగ్రహ
గ్రామణిమీఁదఁ జూడ్కులు దిరంబుగ నిల్పి రమాపతిన్ మన
స్తామరసంబునం దునిచి సంతతముం బ్రణవాదికాష్టవ
ర్ణామలమంత్రరాజజప మద్భుతభంగి నొనర్చె సంయమీ! 25

వ॥ ఆతీరున వేదనిధి విబుధప్రకరస్తోత్రపాత్రంబుగాఁ దపంబు సేయుచుండ రెండు నెలలు నిండినంత 26

సీ॥ శంఖ సుదర్శన శార్ఙ్గ కౌమోదకీ
కలిత బాహాచతుష్కంబువాఁడు
కౌస్తుభ శ్రీవత్స కమనీయ వనమాలి
కా లలితోరు వక్షంబువాఁడు
భానుకోటిప్రభా పరిహాసి బహుమణి
నగిత కిరీట శీర్షంబువాఁడు
పూర్ణసుధాకరోద్దీర్ణప్రసన్నతా
స్థావ మనోహరాస్యంబువాఁడు

గీ॥ చారుకుండలకర్ణుండు జలదమూర్తి
మునులు గొనియాడ నప్సరోవనితలాడ
లచ్చితోఁ బుల్గురాకత్తలాని నెక్కి
వచ్చి హరి వేదనిధిపురో వసుధ నిల్చె 27

క॥ నిలిచి యటు ఘోరతపముఁ
సలిపెడు ననఘాత్ము విప్రసత్తముఁగని వ
త్సలతామేదురమతియై
పలికె న్నీ తపము తుష్టిపఱచె న్నన్నున్ 28

క॥ ఎఱుఁగుము వరదుఁడనగు శ్రీ
హరినిగ ననుఁ గోరు మీప్సితార్థము లిత్తున్
వెఱవకు ముదుగుము తపమని
హిరణ్యావసనుఁడన బాహ్య మెడఁదం జొరమిన్ 29

గీ॥ నిశ్చలస్వాంతమున మానినేత తొలుతఁ
జేయు తపమునకన్న విశేష తపము
సలుపఁ దొరకొన్న భక్తవత్సలుఁడు గాన
విష్ణు వతని కోరికి నెఱవేర్ప నెంచి 30

వ॥ ఆ వేదనిధి చిత్తం బాకర్షించిన వివశచిత్తుండగు నతం డున్మీలిత లోచనుండై తనచే ధ్యానింపఁబడుచు నిజహృదయంబున నిలిచి యున్న పుండరీకలోచను ననేక దివ్యాభరణభూషితు సమస్త జగదీశ్వరు భక్తవాంఛాప్రదాయకు వాసుదేవుఁ దన యెట్టయెదుటం గని పరమానందమ్మున సాష్టాంగనమస్కారం బొనరించి లేచి యంజలిపట్టి యిట్లని నుతించె 31

గీ॥ దేవ! దేవేశ! కరుణాబ్ధి దీనశరణ!
భక్తవత్సల! సేవక పాపహరణ!
హరి! యనంతవిక్రమ! నరహరి! ముకుంద!
మధునిషూదన నీకు నమస్కరింతు 32

— నారాయణాష్టోత్తర శతనామ స్తోత్రము —

గీ॥ అచ్యుత! సురేశ! అమలాత్మ! ఆద్య! సాక్షి!
అక్షర! మహాత్మ! లోకస్థ! ఆదిబీజ!
అవ్యయ! హృదిస్థ! మాధవ! యజ్ఞరూప!
అఖిలరూపక! నీకు జోహారొనర్తు 33

గీ॥ వాసుదేవ! సర్వాధ్యక్ష! పద్మనాభ!
యజ్ఞపతి! విష్ణు! జిష్ణు! మురారి! కృష్ణ!
సర్వగ! జలస్థ! విశ్వేశ! శాంత! దాంత!
కేశవ! అనంత! నీకు నేఁ గేలుమోడ్తు 34

గీ॥ సౌమ్య! సర్వాఘనాశన! శర్వ! కాల!
విశ్వవాసి! సురాధ్యక్ష! వేదవేద్య!
విశ్వరూప! నృసింహ! గోవింద! ధీర!
మోక్షదాయక! నీకు నే మ్రొక్కువాఁడ 35

గీ॥ కామితార్థప్రద! శరణ్య! కాంత! ధుర్య!
జ్ఞానదాయి! ధరాధార! జైత్ర! గుహ్య!
గుహ్యపతి! రాక్షసాంతక! గుణపయోధి!
సర్వపీడాపహార! నమస్కారమిడుదు. 36

గీ॥ శ్రీధర! సలస! అఖిలాత్మ! జితవిరోధి!
హరి! విశాల! అగ్రేసర! ఆత్మమూర్తి!
జ్ఞానరూప! ధురంధర! జ్ఞాని! తూల!
సిద్ధ! త్రైలోక్యపావన! జేజె నీకు 37

గీ॥ అమితమూర్తి! హృషీకేశ! అమృత! పుణ్య!
పూరుషోత్తమ! నారాయణా! రమేశ!
భాస్వదంగ! సంరక్షణ! భక్తమిత్ర!
నాగశయన! సచ్చిద్రూప! నతులు నీకు 38

గీ॥ జీవితేశ! జనార్దన! సింధునిలయ!
వేదవంద్య! దామోదర! విబుధవరద!

వామన! ఉపేంద్ర! అనిరుద్ధ! వారిజాక్ష!
నరసఖ! కరుణాపయోధి! వందనము నీకు 39

గీ॥ గురువరేణ్య! నానారూపధర! ఖగాంక!
శంకరాప్త! గంగాతాత! శార్ఙ్గహస్త!
కైటభారి! పరాత్పర! కనకవసన!
అమలమగు భక్తి నీకు జోహారు లిడుదు 40

గీ॥ ధ్రువవినుతపాద! శ్రీద! దానవవిభేద!
సాధుసంగ! కృపాపాంగ! శ్యామలాంగ!
మ్రొక్కెదను నీకు రామ! సంపూర్ణకామ!
పాహిమాం పాహిమాం పాహి పాహి 41

క॥ ఈమాడ్కి నూటయెనిమిది
నామమ్ములఁ గృష్ణ జిష్ణు నగధరు విశ్వ
స్వామిం గొనియాడిన యా
భూమీసురుఁ గాంచి విష్ణువు వచించె నిటుల్ 42

క॥ ఓ విప్రా! నీవిష్టము
కావించిన తపము నుతియుఁ గడు మెప్పొసఁగెన్
గావున నిచ్చెదఁ గోరుము
నీ వాంఛల నని వేదనిధి తుష్టుండై 43

మ॥ అమృతశ్రీదము నీదు దర్శనము నాకబ్బెన్ దయావార్ధి! శ్రీ
రమణా! నాకిఁక లోపమున్నె యిట వాక్ప్రాప్తికై సద్గుణుల్
గొమరున్ మీఁదఁ బరంబునన్ సుఖము చేకూరన్ భవద్దివ్యప
త్త్రమలాచంచలభక్తి నా కొసఁగుమా! కైమోడ్పు లర్పించెదన్

క॥ అని వేఁడు విప్రువాక్కులు, విని నారాయణుఁడు పల్కె వేదనిధీ! నీ
మనమునఁగల కోర్కు లొ,య్యన నెఱవేఱెడిని సందియం బేమిటికిన్

గీ॥ సుమతి! అష్టోత్తరశతనామముల వినుతి
సలిపితివి దీని మిక్కిలి శ్రద్ధతోడఁ

జదువువారల కేను బ్రసన్నుఁడనయి
తీర్తుఁ గోర్కుల నని తా నదృశ్యుఁడయ్యె 46

వ॥ అంత నవ్వేఁదనిషాదియు 47

గీ॥ నిష్ఠ దారిద్ర్యమున నెప్డు నెగులు గుడుచు
నతఁడు సర్వసంపన్నుఁడై హర్షమంది
నట్లు ముదమంది వెసఁ దన యాశ్రమంబుఁ
జేరి సర్వంబు నెఱిఁగించె దారకెలమి 48

ఉ॥ తాపస దాన నెంతయును సంతసముం గని ప్రాణనాథు హృ
త్సారసమాద్రిపానటు లజస్రము సేవలొనర్చి వాని మేల్
పేరిమి పాత్రమై యెనసి వేఁకటి వేడ్కలహెచ్చ పూర్వది
జ్ఞాదికళానిధిం గనినకైవడి నొక్క సుపుత్రకుం గనెన్ 49

క॥ ఆ పావని పుట్టువునన్
దాపసమణి ముదముఁ జెంది తద్బాల్యదశా
వ్యాపారంబులు బంధుజ
నోపేతుండగుచుఁ జూచె నుత్సాహమునన్ 50

వ॥ ఆ బాలకుం డట్లు జననీజనక బంధుజనోపలాలితుండై ధర్మపాలక నామంబునం బిలువంబడుచు ముద్దుముచ్చటలఁ దనవారి కానందంబుఁ గూర్చుచు నై దేఁడులవాఁడగుటయు 51

గీ॥ అతనికిం దండ్రి యక్షరాభ్యాస మొనర
సలిపి బడికంప గురువు వత్సలతఁ గఱపు
చదువులన్నియు నొక రెండు సమలలోనఁ
బూర్తిగా నేర్చెఁ జూప అబ్బురముఁ జెంద 52

గీ॥ ధర్మపాలకుఁ డట్లు విద్యలను నేర్చి
తల్లిదండ్రుల నుడి జవదాఁటకుండ
సంచరించుచునుండ నష్టమ శరత్తు
నను బిత ఘటించె నుపనయనమ్ము విధిగ 53

మత్తకోకిల॥ ధర్మపాలకుఁ డబ్దషట్కంబునఁ దండ్రిచే నుపనీతుఁడై
కర్మకాండము బ్రహ్మచారికిఁ గల్గినట్లాచరించుచున్
నిర్మలుండ్ గురుఁజేరి వేదము నిష్ఠతోఁ బఠియించి త
ద్ధర్మశాస్త్రముల్ గ్రహియించె నొజ్జ సమగ్రసత్కృపఁ జెల్వఁగాన్

ఆ॥ ధర్మపాలకుండు ద్వాదశాబ్దంబుల
ప్రాయమొనసి మెలఁగు పట్టునందు
వేదనిధిని జూడ విచ్చేసె నారద
మౌనివరుఁడు విధికుమారకుండు 55

క॥ ఆ తపసి కర్ఘ్యపాద్యము
లాతత వినయమున నిచ్చి హర్షముఁ దనూ
జాతునిచే మ్రొక్కించిరి
భూతలమున నెనిమిదంగములు సోఁకంగన్ 56

చ॥ తన పదపద్మముల్ శిరముఁ దాఁకఁగ సాఁగిలి మ్రొక్కినట్టి వే
దనిధికుమారకుఁ గనుముదమ్మున లేవఁగఁదీసి నారదుం
డనఘుఁడ కీవు చిన్నతనమందె కళాప్తిని మెప్పుఁగూర్చితై
నను నినుఁ గన్నవారల మనంబునకుం గలిగింతు కష్టముల్ 57

క॥ అని బాలకుఁ బనుపఁగ జను
మన నాతఁడు తనదు పితల యనుమతిఁగొని యే
గిన పిదప వేదనిధియున్
మన మాకులపడఁగ మౌనినందనుతోడన్ 58

చ॥ అనఘ! మదీయపుత్రుఁడు త్వదంఘ్రులకున్ నతిసేయఁ జూచి దీ
వన మొసఁగింప కంపితిరి వానిని గారణమున్నెసంగ మా
మనములు తత్తరంపడెడు మక్కువతో నెఱిఁగింపుఁడన్న న
మ్మునితిలకుండు వల్కెఁ బదుమూఁడవయేఁడు త్వదీయ సూతికిన్

ఉ॥ వచ్చిననాఁడె మిత్తి పెనువాతఁ బడంగల యట్టులుండె నె
ట్లిచ్చెద దీవనంచు వడి నేగె విహాయసవీథి నారదుం

జ చ్చెడుపల్కు పీనుఁగవ నగ్నిని గాల్చిన నూదియట్లులై
చొచ్చిన విప్రకంపతులు శోకముఁగాంచిరి జహ్నుసంయమీ! 60

వ॥ అందు వేదనిధి మనంబున నిట్లని విలపించె 61

సీ॥ జడికి విద్దెకుఁ బోవు పసితనమందైన
నీనాఁడు పో నన వెపుడు నీవు
చదువు సంధ్యలు సెప్పు సద్గురూత్తములచే
నెఱుఁగవుగద దెబ్బ లెపుడు నీవు
ఒక్క సంతకె యెంత యెక్కుడు పనసైనఁ
దప్పు రానీ కొప్పఁజెప్పి తీవు
చెప్పిచెప్పకముందె శిరసావహించి నా
పనిఁ దీర్చి సంతోషపఱచి తీవు
గీ॥ కటకటా! యిట్టి సద్గుణఖనిని నిన్నుఁ
బుత్రుఁడుగఁ గాంచి నీ సేయు పుత్రకృతిని
బొరయ నోచన నేను నా పూర్వజనిని
నెట్టి ఘోరాఘములు ఘటియించితినొకొ? 62

క॥ అనుకొనుచు దైన్యమానన
మునఁ దోఁపఁగనున్న మగనిపోలికఁ గనుగొం
చును గొడుకున కడరెడి వెడఁ
దను దలఁపోయుచును శారద యిటుల్ వగచెన్ 63

సీ॥ అన్నమిడెదునప్పు డది బెట్టు మిది బెట్టు
మా యని మారాముఁ జేయలేదు
తన యీడు బాలురు దాల్చు సింగారముల్
వలయు నా కని గోల సలుపలేదు
చదువు సందెలను నొజ్జల కొక్కనాఁడైన
నేవ పుట్టఁగ జరియింపలేదు
తోడివారలఁ గూడి యాడుచోనైన న
నృతవాక్యమును వచియింపలేదు

క. కారణములేని వెతచే
కారెన్నికిపుడు ముగుద! కొందఱు మనుజుల్
నూరేఁడులు జీవించెద
రారయఁ జచ్చెదరు కొంద ఱల్పాయువులై 70

క॥ తనయుఁడు త్రయోదశాబ్దా
దిని మృతిఁ గాంచెడినటంచు దిగులొందెద వెం
దును మిత్తి కంటఁబడిన
ట్టి వసంతుండునకె సిద్ధుఁడేని మృగాక్షీ! 71

క॥ మన కొమరుఁ డీల్గుననుచున్
వనటం బడె దేను మిత్తివాతంబడువాఁ
డని నీవుఁగూడ మిత్తిన్
గనియెడ నటువంటి విధికిఁగా వగ పేలా? 72

క॥ పుట్టిన సత్త్వమ్ములకున్, గిట్టుట సాజమ్మొయగు గిట్టిన వెంటన్
బుట్టుటయును సాజమగు,నిట్టుల నెడ తెగని విధికి నేలా వగవన్

క॥ తాను మును ఘటించిన క
ర్మానుగుణంబుగను గల్గు హర్ష వ్యథ ల
వ్వానికి నుబ్బును వగపును
బూనఁడు పండితుఁడు నీవుఁ బొరయకు వగపున్ 74

క॥ అనుభావ్యం బొదవక పో,దనుభవనీయంబుగాని యది కల్గద యి
ట్లనివార్యార్థంబున నీ,వెనసెదు వ్యర్థమగు శోక మిది యేమిటికిన్

క॥ భవదీయమైన శోకము
భవితవ్యంబైనదానిఁ బాపఁగలే దిం
కెవియును బాపవు గావున
యువతిరో! శోకింపకుంటె యుక్తము నీకున్ 76

క॥ జంతువు పుట్టువుఁ బెంపును
నంతముఁ గర్మమునఁ గాంచు నగుపడు లోకం

నట్టులగుట విచారించి యాత్మఁ దెలియు
మివ్విధమున బుధు లోనరుత్తమ సుశీల! 84

గీ॥ కుంభమం ట్టశిరమ్ము స్పృగ్గోచరమ్ము
నగుట దేహ మనాత్మయే యగును గాని
యాత్మ గాదు ధ్రువమ్ముగా నట్లె నేత్ర
మాత్మ గాదు దీపమువలె నైనదగుట 85

సీ॥ ఇంతి! త్వగాదిబుద్ధీంద్రియా లైదు వా
గాదిక కర్మేంద్రియమ్ము లైదు
కరణము ల్గావునఁ గా వాత్మ మానస
మాత్మ గాదు ప్రదీప మట్టిదగుట
కతనఁ బ్రాణమ్మును గా దాత్మ యయ్యది
ఛాతిక వాయుసంబంధి గాన
రమణిరో! కృశపీవరత్వముల్ సుఖ దుఃఖ
ములు కొంతి హీనతల్ మొదలుగాఁగఁ

గీ॥ గలుగు ధర్మములున్నట్టి కారణమునఁ
గా దహంకార మాత్మ యేతాదృగఖిల
ధర్మరహితమ్ము శుద్ధబుద్ధస్స్వభావ
మద్వయము సచ్చిదానంద మాత్మసుమ్మ! 86

గీ॥ ఏ శరీరమ్ముకొఱకు నీ విపుడు దుఃఖ
మందెదో యద్ది యన్యమ్మొ యాత్మకంటె
నీ నవస్థ లా లాత్మకు లేవు గాన
మృత్యు వేరీతి నాత్మకు నెనయు సాధ్వి! 87

గీ॥ తనువునకు నాత్మధర్మముల్ పొనరె నేని
నాత్మకును దేహధర్మమ్ము లంటియుండు
నాత్మ కన్యధర్మము లెవ్వి యంటవగుట
నాత్మధర్మముల్ మేనికి నబ్బవెపుడు 88

క॥ క్షణభంగురమగు మెయికి మ
రణమ్మె సిద్ధమ్మె వందురంబని యేమీ
గణియించి యాత్మ తిరమని
తృణీకరించి వెత స్వస్థహృదయవు గమ్మా! 89

గీ॥ అస్థిరశరీరమున దృఢమైన బుద్ధి
కలిగినది నీకు నియ్యది వలలశల్య
పూతిగంధియు దుర్మలమూత్రయుతము
గనుక దీన నెప్పుడుఁ బ్రేమ నునుపఁబోకు 90

క॥ శైశవ ముఖ్యావస్థల
కాశ్రయమై ద్వంద్వకలితమై తనర కీ మే
న్నాశన మొందెడునదిగా
నో శారద! నీవు సూడకుం డేమిటికో? 91

ఉ॥ దేహ మొకండె కాదు సుదతీ! విను మాయకు లొంగి దేహి నా
గేహము గేహినీమణి సఖవ్రజ మాత్మజులంచు నెంతయో
మోహముతోడ సాఁక శ్రమఁబొందెదు నీ భవ మస్థిరమ్ము సం
దేహము లేదు గావున మది న్వ్యథఁజెందకు మెట్టిదానికిన్ 92

గీ॥ నిర్మలాత్మ! సంసార మనిత్యమంచుఁ
గని మనీషుల్ గృహస్థులయ్యును విరాగు
లై యొకప్పుడుం దమ మనమంటనీక
సంచరించి కడపట మోక్షమ్ముఁ గాంద్రు 93

గీ॥ అంధులంబడి యరిగెడి యంధులవగ
వలయుకోటికిఁ జనలేక వగచుచుందు
రజ్ఞలగువారు రాగాంధులగుచు సంసృ
తిం బడి భ్రమించెదరు ముక్తి తెలియ నెఱుఁగక 94

గీ॥ అట్టి రాగాంధతమసయుక్తాంతు లెన్న
టికిని సంసారతిమిరముఁ డిందఁజేయ

జ్ఞానదీపమ్ముఁ బడయరా జడులకు శత
కోటి జనువుల న్ముక్తి చేకూరఁబోదు 95

మ॥ పలుబాముల్ గని మోక్షసాధనము దుష్ప్రాపమ్ముఁ జాతుర్య ధీ
బలయుక్తమ్ము నరత్వముంబొరసి కైవల్యమ్ము సాధించు చే
తల నేమాత్రమొనర్ప కివ్విధి ననర్థమ్మందు నీవేలఁ జిం
తిలె దజ్ఞస్థితిఁ దెల్పుమా విను మదుక్తిన్ సంసృతిచ్ఛేదినిన్ 96

సీ॥ విషయచింతనము గావించువారికి దాని
సంగంబు గల్గుఁ దత్సంగమునను
గామంబు గల్గుఁ దత్కామంబువలనను
క్రోధంబు గల్గుఁ దత్క్రోధమునను
మోహంబు గల్గుఁ దన్మోహంబువలనను
స్మృతి నాశనంబగు స్మృతి నశించి
నందువలన బుద్ధి హాననమైపోవును
బుద్ధి నాశనమైనఁ బూరుషార్థ

ఆ॥ దూరులై నశింత్రు వారికి సంసార
బంధమోక్షణమ్ము ప్రాప్తి లేదు
కాన విషయజాలకలితులుగాక త
జ్జయముకై శ్రమింపఁ దను శతమ్ము 97

గీ॥ ఇంద్రియమ్ముల నన్నింటి నీప్సితార్థ
భోగములనుండి తప్పించి మొగి మనస్సు
చేత నింద్రియనియమమ్ము చేసి యోగ
మభ్యసింపంగవలయుఁ బద్మాయతాక్షి! 98

గీ॥ సంగరాహిత్య నిశ్చలస్వాంతమునను
హృదయపద్మస్థమగు నాత్మ నెఱిఁగికొనుమి
యేమఁ బరమాత్మ యోగాష్టకావ నెఱిఁగి
యిచటనె లయమ్ముఁగని యీ మెయిం ద్యజింతు 99

క॥ ఉన్నవి నాలో భూతము,లన్నియు నున్నాఁడ నేను నాభూతములం
దన్నిటిలోఁ గనుఁగొన నా,కన్నన్ వేఱొం డిఁ కేమి కనుపడదు సతీ!

గీ॥ అందువలన నీ సంసారమందుఁగాని
యొడలియెడఁగాని మమతను విడుచుటొప్పు
నట్లహంకారమును వీడి యతులమైన
సుఖముఁ బడయుము గరిత! సంశుద్ధచరిత! 101

వ॥ మఱియు నీవు నీ కొమరునివిషయంబునఁ జేయఁదగుదానిఁ దెల్పెద
వినుము 102

ఉ॥ జీవుఁడు దా శరీరముఁ ద్యజించుచు దేనిని మానసంబునన్
భావనసేయునో యవలిబామున దానినె వాఁడు సెందెడిన్
గావున నీకుఁ బుత్త్రిపయిఁ గల్గిన పేరిమి నేఁడు రూపునన్
బోవఁగనీక విష్ణుమనువుఁ భవనాశము బోధసేయుమా! 103

సీ॥ పసిపాపనికినైన వయసువానికినైన
ముసలివానికినైన నుసురు లంగ
మును వీడి చనునెడ ముసరిన బంధుగు
తేడ్చిన నగు ఫల మేమిలేదు
ప్రేమముండిన యెవ్వరేఁగాని చెవిచెంతఁ
జేరి శ్రీధరు నామసార మొకటఁ
గ్రుమ్మరించినఁ బాతకమ్ముల విడనాడి
కైవల్యమొంది సౌఖ్యమ్ముఁగాంచుఁ
గీ॥ గాన నిమ్మాట మదినిల్పి కలఁతపడక
యెట్టి ప్రాయంబునందైన నిహము వీడి
చనెడి దేహికి నీ మేలు సలుపవలయు
మంజులగుణపవిత్ర! నిర్మలచరిత్ర! 104

వ॥ ఇవ్విధంబున సమయసముచిత కార్యంబు లొనర్చుచుఁ దృష్ణాసంగ
సంభవంబయి యనర్థకారియగు శోకంబు విడువు మింతకు నారద

మహర్షి వచనప్రకారంబుగా నీ నందనుం డల్పాయుష్కుండగునని కదా నీకు భయంబు. నే నీభయం బభయప్రదాతయగు విభవరదు భజించి నివారించెద నీ తనయుతో సుఖంబుండుమని య వ్వేదనిధి వేగంబ భాగీరథికిం జని తత్పావనోదక సుస్నాతుండై ధౌతాంబరంబులు ధరించి బంగరుజేకుపైఁ దీర్చిన రథాంగపాణి యుండర్కమండల మధ్యస్థుండగు నారాయణు నావాహనంబొనర్చి యర్ఘ్యపాద్యాది షోడశోపచారంబులఁ బూజించి తదగ్రంబునం దుపవిష్టుండై యష్టాక్షరీమంత్రం బతినిష్ఠం జపించుచుండఁ గొలఁదికాలం బరిగిన నతని భక్తిప్రపత్తులకు సంతుష్టుండై 105

సీ॥ తోయదాభఘనుండు దుగ్ధవారాశి ని
కేతనుం డహివైరి కేతనుండు
కంజాతనయనుండు కలుషగాఢతమోవి
భాకరుం డతుల శుభాకరుండు
స్మితచారువదనుండు శ్రీ వనమాలికా
కల్పకుం డాశ్రితకల్పకుండు
శేషశయానుండు పోషితాసుర రాట్కు
మారకుం డరివీర మారకుండు

తే॥ అంబుజకరుండు జాంబూనదాంబరుండు
మందరధరుండు స్మరకోటిసుందరుండు
శంకరసఖుండు సజ్జనశంకరుండు
కమలతో విప్రమణికి సాక్షాత్కరించె 106

గీ॥ అవ్విధంబునఁ బ్రత్యక్షమైన హరికి
భక్తమందారునకు దండవత్ప్రణామ
మాచరించి లేచి కరద్వయంబు మోడ్చి
వేదనిధి సంస్తవంబుఁ గావించె నిట్లు 107

— దండకము —

శ్రీమానినీ మానసాంభోరుహవ్రాతకంభోజమిత్రా! పయోవాద ప్రభాహాసినీలద్యుతిస్ఫారగాత్రా! సదాసేవకాపన్నినీ కాంతకాలోజ్జ్వల ద్యుతిహోత్రా! మరుద్భక్షకామిత్రపత్రా! సితాబ్జాతనేత్రా! ప్రపంచంబులెల్లన్ సృజింపంగఁ బెంపంగఁ ద్రుంపంగ శక్తుండవై వేధదా ధాతయున్ శీతజీమూతజానేతయున్ జంభదైతేయ రాడ్జేతయున్ మున్నుగాఁగల్గు దివ్యోత్తముల్ తావకాజ్ఞం దలందాల్చి వర్తింతు రెవ్వారలెన్నంగలేనట్టి బ్రహ్మాండముల్ నీదు కుక్షిస్థలిన్ నెఱిం బంక్తులన్ బఱెన్ వెగ్గఁ నీవన్నిఁటన్నిల్చి పాలింతువాత్మాకృతిం గాననే వాసుదేవాఖ్య నీకే పొసంగెన్ ధ్రువుండున్ నిశాబాంధభూసంభవుండున్ సహస్రస్వయాక్షిత్రవుండున్ చతుర్వక్త్రపుత్రాది మౌనుల్ నినున్ గొల్చి నీ సత్కృపాపాత్రులై శ్రేయమున్గాంచినారల్లదా నీవు కాలానుగుణ్యంబుగా మత్స్యముఖ్యావతారంబులం దాల్చి పాపిష్ఠులన్ ద్రుంచి లోకవ్రజం బోముచున్ సర్వము న్నాశనంబై జలాపూర్ణమైనప్పు డా నీటిపై నొక్క న్యగ్రోధపత్త్రింబుపై ముద్దుబిడ్డండవై యొక్కటిన్ యోగనిద్రన్ సుఖంబొందు యుష్మన్మహత్త్వంబు నెన్నంగ నల్పజ్ఞుఁడ న్నేను శక్తుండనే నీకు భక్తుండనౌటెంచి నా పాపముల్ ద్రుంచి కాపాడు మో దేవదేవా! హృతారాతిజీవా! సదానందభావా! నమస్తే నమస్తే నమః. 108

వ॥ అట్లు వేదనిధి గావించిన స్తోత్రంబున సంతుష్టాంతరంగుండై విహంగ
పుంగవతురంగుం డిట్లనియె 109

## 19 అధ్యాయము

చ॥ అమలమనోంబుజాత! వసుధామరశేఖర! నెంజియున్ మదా
గమనముఁ గోరి దుర్భరముగాఁ దపమున్ ఘటియించి తేల? చి
త్తము మఱి దేనిపైఁ గలిగె దాఁపక తెల్పుమటన్న విప్రస
త్తముఁడు వినమ్రుఁడై పలికెఁ దామరసేక్షణుతోడ నిక్కయున్ 110

గీ. దేవ! మును నా తపమ్మున కీవు మెచ్చి
యిచ్చితివి పుత్రకుఁడు ఘటియిల్ల వరము
దాన నందనుఁ గాంచి సంతసముతోడ
నుండు నెడ నారదమునీశ్వరుండు వచ్చి 111

క॥ నా నందనుఁ గని మృత్యువు
వీనిం బదిరెండు సమలు వెళ్ళినమీఁదన్
లూనాయుష్కుని జేయును
మౌనీ! యని యతఁడు ననిన మత్సతి వెతచేన్ 112

గీ॥ సుతుని మరణంబు కనులారఁ జూడఁజాల
వానికంటెను ముందె నా మేను వదలు
దాన సెలవిండటంచు మత్పాదములను
బట్టి మొఱవెట్ట వారించి వచ్చి యిచట 113

క॥ నినుఁ గూర్చి తపమొనర్చిన
దనుజాంతక! నీవు తిరిగి దర్శనమిడ ము
క్తినిఁ గోరక యైహికసుఖ
మునె కోరెద జ్ఞానహీనుపోలిక నిపుడున్ 114

గీ॥ అనిన వైకుంఠుఁ డిట్లను ననఘ! పూర్వ
జన్మమున యందు నీ భార్య సలిపినట్టి
దోషమునఁ జేసి నీదు పుత్రునకు ద్వాద
శాబ్దములు గతియించిన యంతమీఁద 115

గీ॥ గండ మొకఁ డుండె నది చావుగానె తోఁచు
నెల్లవారికి నద్దానిఁ దెల్లముగను
వినుతు సావధానంబుగా వినుము నీవు
తనయుఁడు గతించునని చింతను దొఱంగి 116

సీ॥ నీ భార్య మును దపోనిష్ఠాఖ్యమునిసుత
యై జ్ఞానశర్మ్మ నిల్లాలునై సు

మాపసద్గుణ కరుణోపేతయై భర్తృ
శుశ్రూషణమ్ముల సుజనవినుతి
గడియించియుండె నాబిడ మగం డరసించి
మగువరో! నక్రయుక్తమాఘమందు
భానూదయంబప్డు స్నానమ్ముఁ గావింప
మందుచేఁ బాపముల్ హానమగును

గీ॥ శుభములు ఘటిల్లునని చెప్ప సుదతి తాన
మొనరిచెంగాని మగఁడు చెప్పినను మాఘ
పూర్ణిమాసిని నుత్తమమ్మును శుభమొప్ప
సంగు పాయసదానమ్ము సలుపదాయె 117

క॥ ఆయమయు నాకెమగఁడా
కాయమ్ములఁ బాసి యిచటఁ గాంచిరి జని వా
రే యీ మీ యిర్వురు నీ
జాయ యసూత యయ్యెఁ బాయసము మున్నిడక 118

[illegible]
[illegible]
[illegible]
[illegible] 119

[illegible]
దానినే మెచ్చి [illegible]
పరిమొసఁగుట నీ భార్య పాయసమ్ము
గతిజనికి దానమీనట్టి కలుషమెడలె 120

క॥ తనయుఁడు పొడమెను గానీ
యనఘా! నీ భార్య నీవు వ్యాహారోల్లం
ఘన మొనరించుటచేఁ జి
త్తనయుం డీరాఱు సమలు దాఁటినమీఁదన్ 121

క॥ చావే యనఁదగు గంధము
తో క్లిష్టింపంగఁబడును ధ్రువముగ దానన్
దేవమునిప్రవైన నారదుఁ
డావిధమున మాకుఁ జెప్పె ననుకంపమెయిన్ 122

ఉ॥ ఆ వచనమ్ముచేత వికలాత్ముఁడ వేమియుఁగాక మాఘమం
దీవు భవత్తనూభవు సమిద్ధగుణున్ రవి తోఁచునప్పుడు
ముత్తోఁపఁగఁబోవు నేటనోగిఁ దోఁగఁగఁజేయుము దాన వానికిన్
చావు తొలంగు నాయువును జాలఁ బొసంగు నెసంగుఁ దేజమున్

వ॥ మఱియు వినుము 124

క॥ నరులకు మాఘస్నానము
చిరాయువు నిరామయమ్ము శేషవిభూతుల్
స్ఫురదాత్మజాత్మజాత్మజ
గురువిభవము కలుగఁజేయుఁ గోవిదతిలకా! 125

సీ॥ మాఘోదయస్నాన మాచరింపని యింతి
యైనఁ బూరుషుఁడైన నాత్మఘ్ను
ముసఁ గల్గు పాతకమునుబొందు మాఘవ్రత
మ్ము మానినవాఁడు ధరణిదేవ
భ్రూణనాశక గురుద్రోహ వీరధ్వంస
పశునాశవృజినముల్ బ్రాహ్మణఘ్న
విశ్వాసఘాతకుల్ జెరయు పాపములొంది
ఘోరనారకవహ్నిఁ గుములుచుండుఁ
గీ॥ పూర్వజన్మశతార్జిత పుణ్యపాక
మున మనుష్యున కొదవు సద్వినుతమాఘ
ధర్మము నొనర్పఁగా బుద్ధి ధారుణీసు
రోత్తమా! సంశయింపకు ముల్లమందు 126

వ॥ ఇంతియొకాక మకరమాఘంబున స్నాన దానంబులు సేయనివాఁ
డును వర్జితకులాచారుండును నీరోగియయ్యు దృఢావయవుండయ్యు

మాఘస్నానంబు సేయనివాఁడును బునరావృత్తిరహిత మహా
నరకయాతన లనుభవించుచుండు. మాఘవ్రతప్రియుండ నగు నేను
దద్వ్రతాచరణులకు సుఖమును నిరాచరణులకు దుఃఖమును దప్పక
నొసంగుచుందు. 127

క॥ మహాఘోరాఘము లడఁచును
మహీసురవరేణ్య! మాఘమజ్జనము జనుఁ
డు మహాభాగ్యుఁడు బాలుఁడు
మహితవిధిన్ వాని ధ్యానమానసులగుచున్ 128

గీ॥ మాఘకల్యమ్ములను స్నానమాచరించి
రేని బాలుఁడు కిశోరయువుఁడౌను జనుఁడు
ప్రౌఢమహారోగయుతుఁడు నీరోగి యౌను
ముదుసలియగుచుఁ గను విష్ణుపదముఁ బడయు 129

క॥ ఎతఁ డేదికోరెనేనియు, నతనికి నది కలుగఁజేయు మాఘస్నానం
బతులితసుఖదో మహాత్మా!, మతి సంశయపడకు తిలమాత్రంబైనన్ 130

సీ॥ మాఘమహిమం బితామహుఁడు శంభుఁడు సర
స్వతియును బ్రాలేయశైలజాత
నారదుండు వసిష్ఠ పారికాంక్షి దిలీప
నృపతి విదేహభూనేత మొదలై
నటు లన్యులెవ్వ రాద్యంతం బెఱుంగరు
కొందఱు దానిలోఁ గొంతభాగ
మెఱుఁగుదు రొకకొంద ఱేమియు నెఱుఁగరు
మొత్తమ్ము మీఁదను మొదలె యెఱుఁగ

గీ॥ నట్టివారలె బహుజను లరసిచూడ
మాఘములఁ జెక్కుబాముల మజ్జనములు
సలిపి నను బూజచేసిన జనుల కొదవుఁ
దప్పకుండఁగ మాఘవ్రతాన బుద్ధి 131

ఉ॥ నిత్యముగాని మేనిపయి నెమ్మి వహించి యెవండు సత్తపః
ప్రత్యూషమందు నీతువెఱ ప్రోదిని నీట మునుంగఁడో యతం
డత్యధికవ్యథాప్రద మహానరకంబున నెప్పుడుండు నో
మత్యమరేంద్ర! విప్రజనమండన! శాత్రవషట్కఖండనా! 132

ఉ॥ మాసములందు ముఖ్యమగు మాఘము సాంతము కల్యవేళలన్
నీ సుతు విష్ణుపాదజ ధునీవిమలోదకమందు స్నానమున్
జేసెడునట్లొనర్ప జననీకృతదోష భవాపమృత్యువుం
బాసి చిరాయురాదిక సమస్తశుభంబుల నాతఁ డొందెడిన్ 133

క॥ శంకయుఁ జింతయు విడి నీ
వింక నిలుం జేయుమని యదృశ్యుండయ్యెన్
శంకరమిత్రుఁడు మిత్రమృ
గాంకేక్షణుఁడు భుజగాశనాంకుం డంతన్ 134

గీ॥ అమితముదమున నతఁడు నిజాశ్రమంబుఁ
జేరి తన దార కదియెల్లఁజెప్పి కొలఁది
నాళ్ళలోపల వచ్చిన నక్రియుక్త
మాఘమాసాదినుండి సమగ్రనియతి 135

క॥ తన భార్యాపుత్త్రులతోఁ
జని వేలువు లేటినీట సవితృపొడుపునన్
మునిఁగె సుతు నకాలమరణ
ము నిరాసమ్మగుచు బ్రదుకు పొడవడరంగన్ 136

గీ॥ మూఁగు రారీతి మాఘమ్ము పూర్తిగాఁగ
స్నానమొనరింపఁ గొమరుని చావు గడువు
నడుమనే యేగె నేమియున్ బెడఁద నిడక
జహ్నుముని! మాఘమజ్జన శక్తి వింటె 137

వ॥ అవ్విధంబున మాఘస్నానాదిక వ్రతం బాచరించిన కారణంబున
వేదనిధికుమారకుండగు ధర్మపాలకుండు విరహితాకాలమరణుం డగు

టమైనాక జ్ఞానసంపన్నుఁడై రాకాసుధాకరుని విధంబునఁ దేజః
పూర్ణుండై పరిణయయోగ్యప్రాయంబున నుండుటఁగని తల్లిదండ్రు
లాతనికిఁ దగిన కన్య న్వివాహంబుఁ జేసి కొంతకాలంబు వారితో
సుఖంబుగా నుండి యోగాభ్యాసులై శరీరత్యాగంబొనర్చి పునరా
వృత్తిరహిత విష్ణుసాయుజ్యంబు నొందిరి. ఇంటివిగదా వేదనిధి
పూర్వజన్మంబునం దొనర్చిన మాఘవ్రత ప్రభావంబున జ్ఞానియై
నిజభార్యకు తత్త్వబోధఁ గావించెఁ గావున 138

బహుముఖాదిక సత్కర్మఫలద మఖిల
కలుషహరము హరి ప్రీతికరము నైన
మాఘమాసవ్రతముతో సమానమైన
వ్రతము మఱి లేదు సందియపడఁగరాదు 139

జ్ఞాన ధనమ్ముల నీయం
గా నిర్వాణమ్ము నీయఁగా నిల మాఘ
స్నానవ్రతమే మొదటిది
దీనిలయా! తక్కినయవి దీనికి లొచ్చుల్ 140

నీ వేగాథను సన్నుఁగోరితివా దానిన్ మోక్షదాయిన్ ధరా
దేవశ్రేష్ఠ! యెఱుంగఁజెల్పితిని భక్తిన్ దీనిఁ బాఠింప శ్ర
ద్ధావంతుండయి యాలకింప నతఁ డుద్యద్జ్ఞానసంపూర్ణుఁడై
కైవల్యంబును జెందు నిత్యకృత మాఘస్నాన చందంబునన్ 141

ఈ వేదనిధి చరిత్రం
బే వర్ణమువారలైన నింతులు నైనన్
భావమ్మున నాద్యంతము
గా విన్నఁ బరమ్ముఁ గాంత్రు కలుషరహితులై 142

అనుచు గృత్స్నమదుండు జహ్నువునకుం జెప్పినవిధంబున బర
మేశ్వరుం డుమ కెఱింగించెనని సూతపౌరాణికుండు శౌనకాది
మహామునులకుం జెప్పె. 143

— ఆ శ్వా సాం త ము —

మ॥ గరుడాంకోత్సవరాంకతోషక మహాగ్రంథానుసంధాన! బం
ధురకారుణ్యనదీన! దీనజనసంస్తోత్రార్థదానా! గుణా
భరణా! సత్పథశిష్యపూగశరణా! స్వాంతద్విషద్దారణా!
నరసాంబా హృదయాంబుసంభవదినేంద్రా! రామ ధీమద్వరా!

— గ ద్య ము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభాషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున షష్ఠాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః

# మాఘ పురాణము

## సప్తమాశ్వాసము

క॥ శ్రీవత్సగోత్రజాతా!, శ్రీవత్స సదృక్తసూచిప్రస్ఫీతా!
శ్రీవత్సదత్తకవితా, శ్రీవత్సల రామ శేముషీమన్నేతా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యాశరణ్యులగు శౌనకాది మానివరే ణ్యుల కఖిలపురాణ కథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె నవ్విధంబునఁ గైలాసంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబు నుడువుచున్న మహాదేవుండు పార్వతిం గని దేవీ! వినుము. గంగా తీరంబున మాఘవ్రతం బొనర్చుచు గృత్స్నమదుండు మాఘ మహిమాది కథావిశేషంబులు దెల్పుచు జహ్నువున కిట్లనియె. 2

## 20 అధ్యాయము

గీ॥ అనఘ! తురగమేధాధ్వర మాచరించు
నట్టిఁ డేకాదశీవ్రత మాచరించు
నట్టివాఁడు మాఘవ్రత మాచరించు.
నాతఁడు సమానఫలము నె యందుఁ జుమ్మి 3

క॥ అతులమగు మాఘమున శ్రీ
హితునకుఁ బ్రీతికరమైన యేకాదశి స
ద్వ్రత మెవ్వఁ డాచరించునొ
యతఁడు సహస్రాశ్వమేధికగు ఫలమొందుర్ 4

క॥ ఏకాదశ్యుపవాసము, శ్రీకరమాఘమున విధిగఁ జేసిన నరుఁ డా
నాకపతియగును బారణ,యేకాదశి మఱుదినము మహీసురతతితోఁ

క॥ గావించి యన్నదానముఁ
గావించినవారి కృప మఖండ మనంతం

జేహాఁడ నెన్నఁ జేఁయ సు
శ్రీవర! యని గృత్స్నమదుఁడు తెల్పిన యంతన్

వ|| జహ్నుఁ డిట్లనియె

సీ|| పదునైదు తిథులు శుక్లపక్ష మట్టివి రెండు
నెల యగు నెలలు పండ్రెండు గల్గు
వాన మాఘమునందు వచ్చు నేకాదశుల్
మాత్రమే పదినూర్ల మాపుజన్న
ములనగు ఫల మీయఁగలవి యెట్లయ్యెను
బూర్వ మెవ్వరిచేతఁ బుడమి నెట్లు
వెలయింపఁబడె నది వినఁ గోర్కి గల నాకు
నెల్లఁ దెల్పుమటన్న గృత్స్నమదుఁడు

గీ|| వినుము జహ్నుమునీ! సర్వవృజినహరము
నాయురారోగ్య పుత్రపౌత్రాది విభవ
దాయకమ్ముఁ గైవల్యసంధాయకమ్ము
నైన కథ దీని నున్న దద్దాని వినుతు

— సముద్ర మథనము —

సీ|| మును చాక్షుషుఁ డను మను వాజవయతండు
జగతిఁ బాలించెడి సమయమునను
దైత్యు లాదిత్యులుఁ దమ యభీష్టప్రాప్తి
కై దుగ్ధవారాశియందు మంద
రాద్రి కవ్వంబుగా నహిపతి వాసుకిఁ
ద్రాడుగాఁ జేసి మంథన మొనర్ప
మునుమున్న గరళంబు పుట్టి కల్పాంతకా
లానలుభంగిగా భూనభోంత

గీ|| రాళములు గ్రమ్మె సకలభూతాళి నేచఁ
దాళలేక భయంపడి త్రచ్చు టుడిగి

దనుజు లనిమిషు లజుని బోధనమువలన
నపుడు రక్షింప శక్తుఁ డయ్యాభవుఁడనుచు 9

వ॥ తెలిసికొని యాశ్రిత విపన్నాశంకరుండగు శంకరు నిట్లని స్తుతించిరి

క॥ ఉర్వీభృద్వరకార్ముక!, సర్వసుఖప్రద! సమస్త జగదాధారా!
శర్వ! భవ! రుద్ర! గౌరీ,దర్వ! వచోతీత! మ్రొక్కు లభవా నీకున్

క॥ మ్రొక్కెదము శాంత! నిర్మల!
మ్రొక్కెదము శివా! గుణాత్మ! మ్రొక్కెద మీశా!
మ్రొక్కెదము నిత్యమూర్తీ!
మ్రొక్కెదము వృషాంక! నీకు మ్రొక్కెద మభవా! 12

క॥ త్రిగుణాత్మక! త్రిపురాంతక!
జగతీత్రయనాథ! రజతశైలనుసౌధా!
తెగకంటివేల్ప! యీ పెను
సెగ గెంటన్ నతులు నీకుఁ జేసెద మభవా! 13

క॥ రూపత్రిక! గుణరూపక!, రూపరహిత! సూక్ష్మరూప! రూపానేకా!
గోపాంకా! శ్రుతిసాధ్య! దయాపూర్ణాపాంగవీక్ష! యంజలు లభవా!

క॥ జోతలు భీతివినాశక!, జోతలు హరిమిత్ర! యీశ! జోతలు హంసా!
జోతలు శివ! మృత్యుంజయ!, జోతలు కారుణ్యశాలి! జోతలు శూలీ!

క॥ ఈరీతి సురలు నసురల,పారవిషజ్వాలి కడలి ప్రార్థింపంగా
మారుతభుగలంకారుఁడు, గౌరీరమణుండు భక్తకల్పక మొయ్యన్

— దేవదానవులకు శివుఁడు ప్రత్యక్షమగుట —

చ॥ శిరమున దేవనిర్ఝరిణి శీతకరుండు వెలుంగ నెమ్మొయిన్
మరుదశనాంగదంబు లసమానవిలాసము దోఁపఁజేయ భా
స్వరమహిమాఢ్య హైమవతి వామశరీరమునందెసంగ గో
వరతురగాధిరూఢుఁడయి వచ్చి కనంబడె స్వాశ్రితాళికిన్ 17

వ॥ అవ్విధంబున సాక్షాత్కరించిన పరమేశ్వరునకు సురాసుర విసరం
బులు సాష్టాంగప్రణామంబులొనర్చి లేచి కరంబులు మోడ్చి 18

**సీ॥** అణిమాది సిద్ధుల కాశ్రయుండవు గానఁ
        బరమేశ్వరాభిఖ్యఁ బడసితీవ
యఖిల దేవార్చనీయాంఘ్రివి గాన మ
        హాదేవ విఖ్యాతి నందితీవ
భూతజాతముఁ గృపఁ బ్రోచుచుందువు గాన
        శంకర ఖ్యాతి నెసంగితీవ
బ్రహ్మకల్పము లెన్నొ పరికించితివి గాన
        మృత్యుంజయ సమాఖ్య నెనసితీవ

**గీ॥** అఘ మహాకీలికీలల నార్చు మొగులు
దారి యేటిని నౌదలఁ దాల్చితీవ
సార్థకాభిధాన యయిన సర్వమంగ
ళాంబుజాక్షికి నాథుఁడవైతి వీవ 19

**గీ॥** అనుచు వినుతించు కశ్యపు నాత్మజులను
గాంచి పశుపతి వచియించెఁ గనికరమున
నేల దలఁచితిరో నను నేమి వలయు
నడుగుఁడీ! యది యెట్టిదియైన నిత్తు 20

**సీ॥** శివుఁ డట్టు లానతీ దివిజులు దనుజులు
        స్వామి! పయస్సుచే నామరూప
రహితమౌ వహ్ని క్షీరపయోధి జనియించి
        సకలదిశల్ గ్రమ్మి భూతములనెల్ల
దహియింపఁ జొచ్చె నిద్దాని నార్పి సమస్త
        వనజజాండము లోము భారమెల్ల
నీవుగాక వహింప నేర రెవ్వరటన్న
        నస్మదాశ్రయులు మీ కబ్బు బాధఁ

**గీ॥** బాపెదను గాని యియ్యది వహ్నిగాదు
మథనజాయాసి సర్వాస్త్రమూ డనేక

వదననిర్గత కాకోలవహ్ని నుండి
దీని జలమార్పలేదు నుంతైనఁగూడ 21

క॥ మీఁకొఁజకే నెటులైనం
భీకరమగు నివ్విషాగ్ని మ్రింగెదనని ప
ర్యాకరపలయుఁడు కరముల
గైకొని మీఁగడటు మ్రింగి గళమున నిల్పెన్ 22

సీ॥ గరళమునకు కంఠమున నిల్పి గర్భగోళ
మందుఁ గల లోకములకు నపాయ మించు
కంత రానీని శివునిఁ గొండాడి రెల్ల
రభవ! కజకంఠ! నీలకంఠా! యటంచు 23

క॥ విషమాక్షుఁ డట్లు గళమున
విషమున్వహియించి యేఁగ విషువక వారల్
కృషి సేయఁ గ్రమక్రమమున
విషనిధిజనిఁ గన్నవాని వినుము మునీంద్రా! 24

— కామధేన్వాదుల జననము —

వ॥ వెలిమొకవును నిక్కుపీనుల జక్కియు నైరావతంబును కల్ప
వృక్షంబును నప్సరఃకాంతలును గళానిధియు లక్ష్మీదేవియు వారుణి
యను మదవతియు నారాయణాంశంబున నమృతకలశహస్తుండై
వైద్యశాస్త్రనిపుణుండగు ధన్వంతరియుఁ గలిగిన నందు 25

ఆ॥ మానులెల్ల హోమధేనువై మాకిది
యుపకరించుననఁ బ్రయోజనయనుఁ
దల్ల వెల్లగిడ్డి నా సంయములకిచ్చి
యడిగినట్టి బలికి హయము నిచ్చె 26

క॥ దేవపతి దృష్టిఁగని మై
రావణ మాతని కొసంగి రజనీపతిఁ గా

జై వాత్సకు నొసరిచి మీ
మీ వాంఛలఁ దెల్పుఁడనుచు మెలఁతలఁ గనినన్ 27

వ॥ అం దచ్చరమచ్చెకంటులు 28

గీ॥ ఒకని కిల్లాండ్రముగనుండ నొల్లదు మది
స్వైరిణులమై వసింతుము స్వర్గమం ద
నంగ నంగీకరించి రంభయును బిదపఁ
గోరె వారుణి తొలివేల్పుఁ గోడెకాండ్ర 29

వ॥ అంతట లక్ష్మి హరిం జూచి కై మోడ్చి 30

మ॥ కమలాక్షుండవుఁ బూరుషోత్తముఁడవున్ గారుణ్యపాథోధివిన్
గమలోద్యత్కరు చెల్మికాఁడవు జగత్కాండాధినాథుండవున్
గమలాస్థానుఁ డవార్యచిత్తకమలారూఢస్వామివౌ నిన్నె। నేఁ
గమలాఖ్యం గమలాలయన్ వలచితిం గైకొమ్ము పీతాంబరా! 31

క॥ అని పూలదండఁ గైకొని, వనమాలిగళంబునందు వైచి మనోజ్ఞం
బును సువిశాలమువగు నాతని వక్షఃపీఠి జగముతల్లి వసించెన్ 32

వ॥ పిమ్మట రక్కసిమొక్కలీం ద్రొక్కమొగిం బయింబడి ధన్వంతరి కరస్థోదీర్ణ సుధాపూర్ణ స్వర్ణకలశంబు లాగికొని యాదిత్యుల స్వాదూక్తు లాదరింపక పరువులిడుచున్న వేల్పులు సేయునదిలేక కేశవా! భక్తప్రియా! దయాళూ! దీనసంరక్షణా! రాక్షస దౌష్ట్యం బుడిపి మా కోరుకులం దీరుప నీవుకాక సమర్థు లొకరు లేరని ప్రార్థించి నమస్కరించిన హరియును దత్సమయ సముచితోపాయుండై 33

సీ॥ నడల కుదింపునఁ దొడలసొంపున వాలు
జడజంపునం బాపపడుచుల నగి
హావంబున గభీరభావంబున మనోజ్ఞ
రావంబున మనుష్యరమణుల నగి
చెక్కుల తళుకున దృక్కుల బెళుకునఁ
జొక్కింపు టనిమిషనుదతుల నగి

మాటల యింపునఁ బాటల పెంపున
గంధర్వనీరజేక్షణాల నవ్వి
గీ॥ కనకకలశంబులంబోని గబ్బిగుబ్బ
చన్నుఁగవనుండి యొక్కింతజారు పయఁట
కొంగు డాచేత సవరించుకొనుచు నటకు
వచ్చె శ్రీహరి మోహినీభామ యగుచు  34

క॥ ఆ వచ్చు జగన్మోహన, రూపముఁగని దేవతావిరోధులు శీర్ష
ద్వీపాటవృత్తై నిలఁబడి, కై పెత్తినవారిమాడ్కిఁగాఁ గనుఁగొనుచున్

గీ॥ అమృతకలశంబుఁ దెచ్చి యయ్యబ్జవదన
ముంగటం బెట్టి యిద్ది మాకందఱకును
సమముగాఁ బంచియిమ్మన్న సకియ వారి
వాలుఁజూపులఁ జూచుచుఁ బలికె నిట్లు  36

వ॥ మీరీ సుధాకలశంబు నెత్తికొని తత్తరంబునఁ బరువెత్తుటం జూడ నొకల కేమియుం జిక్కకుండ నీ యమృతంబంతయు నెవరికివారె త్రావం గమకించుచున్న చందంబుఁ దోఁచె నిట్టియెడ నేనిందఱకుఁ బంచియీఁబూనుట మహాభారంబైన కార్యంబు. ఐనను గౌరవార్హులగు మీ మాట జవదాటరానిదౌట నబలనయ్యు నే నీ పని నొనర్పంబూనితిఁ గాని ముందు నేఁ జెప్పినచొప్పున మీ యిరుతెగలవారు నెవరికివారు బారుగాఁ గూరుచుండుండని పల్కుచుఁ దన పయ్యెదచెఱఁగు సోఁకున సోఁకుకన్యాకులనెల్ల మైమఱచునట్లు సల్పుచు బంతులుగాఁ గూర్చుండఁజేసి సుధాకలశంబు చేఁబూని 37

ఆ॥ అల్పులైనయట్టి వేల్పుల కమృతమ్ము
మొదల నించుకంత పోసి పిదప
నధికులైన మీకు నంతయు నొసఁగెద
హితవె యనిన నొప్పి రెల్లవారు  38

క॥ అవల జగన్మోహిని తా
దివిజుల పంక్తికిని వచ్చి దేవతలారా!

యవిలంబితముగ మీ కేల్
గవ సొంపుడు తడవొనర్పఁ గడఁగితిరేనిన్ 39

క॥ ఆ మా రక్కసిబావల
కాముకొనుం గినుక యంచు నసురులు విన స్వ
ర్గాముల గదుముచు నందొకఁ
డేమియు నాచేతఁ బడఁగనీ వేమన్నన్ 40

సీ॥ మాటువల్కక యొడువుగా మాత్ర మమృత
మదితికొడుకుల కిడుచు భా నసురసమితి
రాహుకేతువు లిద్ద ఱాత్రింబుఁజెంది
దేవతారూపులై చేరి త్రావిరి సుధ 41

గీ॥ సురల కమృతమ్ము వోసెడి చూడ్కి తోడ
నుంట హరి దాని గమనింపకున్న సూర్య
చంద్రు లెఱిఁగించి రాత్రిరుఁ జక్రి చక్ర
మునుఁ దలంచిన నది వారిఁ దునిమె నపుడె 42

వ॥ అవ్విధంబున జగన్మోహినీరూపంబున గరుడధ్వజుం డమృతం బదితి సుతులకందఱకుం జెందఁజేసి తద్బృందంబున బందారకరూపంబునం దూరిన రాక్షసద్వయంబు కంఠంబులఁ దునుముట నవలోకించి రాత్రించరు లాశ్చర్య సంభ్రమస్వాంతులై యీ కుటిలాలక నటనంబు సకుటిలంబెుకఁ దడయుందగ దమృతంపుఁ గడవ నొడిచికొనుఁడు లెండు లెండని కేకలిడుచు రాక్షసులెల్ల లేచి తనచుట్టు ముసరికొన సుధాభాండంబుతో మధురాధరీరూప మధుమథనుం డంతర్ధానంబుఁజెంద నంత దైతేయు లాదితేయులపయింబడి ఘోరాహవంబొనర్చి సుధాపానబలాధికులైన బలారిప్రముఖ బర్హిర్ముఖులచేఁ బరాభూతులై తమతమ నివాసంబులకుం జేరిరి. రాహుకేతువుల శిరంబులు చక్రి ఖండితంబులయ్యును సుధాపానవిశేషంబున భువింబడక దివిం జేరి గ్రహరూపంబున నుండి తమ కపటవర్తనం

బసురహర్త కెఱింగించి తమ్ము వికారస్వరూపులం జేయించిన దివా
కరనిశాకరులపై మచ్చరంబూని గ్రహణమిషంబున వారి నప్పు
డప్పుడు పట్టి మ్రింగుచు విడుచుచుండిరి. వేల్పులును శేషతల్పానల్ప
కృపాపాత్రులై సుధం బడసి రక్కసుల యుక్కడంచి తమ యిక్క
లకుం జేరి సుఖంబుగ నుండిరని గృత్స్నమదుండు వెండియు జహ్ను
ప్రతో నిట్లనియె 43

— తులసీ పారిజాత వృక్షోత్పత్తి —

ఉ॥ దైత్యులు మోహినిం గని సుధాకలశం బెల నుంచునప్పు డా
దిత్యుల భక్తబిందువులు ద్రెళ్ళెను రెం డవనీతలాన నం
దత్యఘహాంత్రియగా తులసి యయ్యె నొకండు మఱొండు దేవతా
స్తుత్యము పారిజాత మగుచున్ జనియించె జగంబు లుబ్బఁగన్ 44

చ॥ అనఘ సుధాకణద్వయ భృతావనిఁ బుట్టినవాని సత్యజి
త్తను నొక శూద్రవర్ణమణి యారసి నీరముఁబోసి పెంచుచున్
మనమున వానిపై నెదుగు మక్కువచే మఱికొన్ని పూలచె
ట్లను గొని తెచ్చి వాని నికటమ్మున నాటెను మేటితోఁటగన్ 45

క॥ ఆ సత్యజిత్తు తద్వ్యాపి,నాసన్నగ్రామవాసి యగుటను జుట్టున్
దా సంఘటించికంచె స,దా సూనఫలమ్ములమ్మి దానన్ బ్రదుకున్

క॥ ఆ వనజంబులె వానికి, జీవనదాయకములగుటచేతన్ సతతం
బా వృక్షమ్ముల కాతఁడు, జీవనదుండగుచు వృద్ధిఁ జెందం జేసెన్

ఆ॥ అట్టి వృక్షసమితియం దతికోమల
దళసమేత యగుచుఁ దులసి నిఖిల
భక్తతతుల కెపుడు బహుహర్షదాత్రియై
ధాత్రి నొప్పె జహ్ను! తాపసేంద్ర! 48

సీ॥ బహురత్నములవలె భాసిల్లు దళములు
కోరకమ్ములు గల్గి హారిగంధ
బంధురంబులునైన ప్రసవముల్ మధురస
పరిపూరితములైన ఫలవితాన

మెల్లకొమ్మలయందున నెడములే కెసఁగంగఁ
బారిజాతంబు పొల్పెఁ బ్రజలకెల్ల
హర్షప్రదంబయి యాత్రోవ నొక్కనాఁ
డసురల దండింప నరిగి తిరిగి

గీ॥ వచ్చు వాసవుఁ డద్దాని వైభవంబు
గాంచి హర్షించి పూలు గోయించి తీసి
కొని త్రివిష్టపమున కేగి కూర్మిఁ జెలుల
కీయ వారలు ధరియించి హృష్టలగుచు 49

క॥ పౌలోమీయుతలై దం,బోళిధరుం జేరి వినయమున మ్రొక్కి దిశా
పాలకవర! నిరతం బీ పూలం దెప్పించి యిమ్ము ముదమగు మాకున్

ఉ॥ నా విని వాసవుండు లలనామణులార! సరే యటంచు మేల్
సేవకు నొక్క గుహ్యకుని జీరి సతంబు పయోధిసన్నిధిన్
బూవులచెట్లలో మిగులఁ బొల్పుగ నొప్పెడు పారిజాతపుం
బూవులఁ దెచ్చి మాకిడుము పొమ్మన వాఁడు సురేశు నానతిన్ 51

ఆ॥ సత్యజిత్తు లేనిసమయమ్ములం దోటఁ
జేరి పారిజాత భూరుహమున
సుమము లపహరించి సురపతి కిడుచుండెఁ
బారిజాతమునను ప్రతిదినమ్ము 52

సీ॥ పూలు లేకుంటచేఁ బొగిలి యా శూద్రుండు
కడు శ్రద్ధఁ బగలెల్లఁ గాపు గావ
గుహ్యకుండు నిశలఁ గుసుమముల్ హరియించి
పోవుటచే నెప్డు పుష్పశూన్య
మౌ పారిజాతమ్ము నరసి చింతిలి యంత
క్షణదయందును గూడ సత్యజిత్తు
పొదలోనఁ గూర్చుండి పొంచి చూచుచునుండి
యపరరాత్రంబున నరుగుదెంచి

గీ॥ కుసుమములు గోయుచుండిన గుహ్యకుఁ గని
చేరఁగాఁబోయి యొ దొంగ చిక్కె నింక
నెందుఁ బోనేర్తువని పట్టఁ గ్రిందఁ దిగక
పట్టుఁ దప్పించుకొని దివిఁ బ్రాకిపోయె 53

ఉ॥ అట్టులు నన్ను గుహ్యకుఁడు నాకపతిం గని పూలొసంగి యో
గట్టులగొంగ! దొంగనయి కావలికాని మొఱంగి పూవు లే
నెట్టులొ తెచ్చి మీకిడెద నిన్నిదినంబులనుండి నేఁడు నా
గుట్టు నెఱింగెఁ బాలకుఁడు కొంపమునింగెడు నింకఁ బోయినన్

వ॥ అని పుష్పవనంబున జరిగిన కథ గుహ్యకుం డెఱింగించిన విని వేల్పు
దొర నవ్వి గగనచరుండవగు నిన్ను భూచరుండగు నవ్వనపాలకుం
డేలీలఁ బట్టనేర్చు? నీవేమియు భయంపడక నెప్పటిచొప్పున
నప్పువ్వులు దెచ్చియిచ్చుచుండుమన వాఁడు మంచిచెష్ట లెఱుంగని
దొరలకొల్వు తుదకు మిత్తినైనఁ గూర్చునని చింతిలుచు నేలిక
యానతి మీఱనేరక యెప్పటిమాడ్కిఁ బారిజాతంబుమీఁదికి విను
వీధినుండి దిగియె సంతతమున్న. 55

ఆ॥ సత్యజిత్తు పారిజాతపుష్పంబుల
దొంగ చిక్కకుండ నింగి కెగసి
చనిన దాన నెడఁద వనట కడుం జెంది
యేమిసేయువాఁడ నేది తెరవు? 56

శా॥ సూనస్తేనుఁడు నాకసంచరుఁడు నే క్షోణీచరుండన్ గటా
యే నా తస్కరుఁ బట్టఁజాల నిఁక స్వామీ! పక్షిలోకేంద్రగా
మీ! నారాయణ! నీవ దిక్కనుచు నెమ్మిన్వేఁడి తద్వారిక
న్యానాథోరుకృపాప్రసాదజనిత ప్రారంభసంరంభుఁడై 57

మ॥ మఱునాఁ డంబుజపత్రలోచనుని నిర్మాల్యంబుఁ గొంపోయి త
త్తరుమూలంబున శాఖల న్నికటగోత్రాభాగమందెల్లెడన్
బఱచెం గావున గుహ్యకుం డటుల నా తన్మూలజాతశాఖాళిపైఁ
జరణద్వంద్వము మోపుచుం దిరిగి పుష్పచ్ఛేదముం జేయుచోన్

క॥ హా! నిర్మాల్యోల్లంఘన
చరణస్పర్శ భవకల్మషంబుల విబుధే
శ్వర! మాత గగనచరతం
బోజన్ పంగుత్వ దోషదూషితుఁ డయ్యెన్ 59

ఆ॥ పూలఁ గోసుచుఁ దైకిఁ బోవఁగా నేరక
భ్రమను జిగురుఁ గుంటి నైనకతన
వలనుపడక పెట్టె యొలుఁగుబంటిని బోలి
నేలఁ గూలి కదలఁజాలఁ డయ్యె 60

గీ॥ పారిజాతమ్ము లనుచుఁ దేవపతిదూత
పుడమిఁ బడు నెడ నైన చప్పుడునుబట్టి
మోసగానిఁ బట్టఁ దివిరి పొంచియున్న
సత్యజిత్తు వేవేగ నచ్చటకుఁ జేరి 61

క॥ నలఁబడిన లేడి కైవడి
బలమఱి పడియున్న దొంగవాని కరమ్ముల్
బలిమిమెయిఁ బట్టి చిక్కితి
తులువా! కదలినను నిన్ను దొరింతుఁజుమీ! 62

— సత్యజిత్తు పూలదొంగ నడవడరయుట —

ఉ॥ ఎవ్వఁడ వీవు వాసమెది యెయ్యది నామము నిత్య మివ్విధిన్
బువ్వులు చోరవృత్తిఁ గొనిపోయెదు శ్రీహరి పూజ కేనియున్
బువ్వోకఁ బైన నుంచక యె పోయితి వద్దిర యింక నేని నీ
క్రొవ్వరి సేఁత మాని కల రూపెఱిఁగింపుము తస్కరాగ్రణీ! 63

చ॥ అన విని గుహ్యకుం డనియె నక్కట! చేసిన తప్పు చాలకే
నన్నృతముఁ గూడ నాడవలెనా విను మేఘచరుండ గుహ్యకుం
డను సురనేతదూత నల నాకధవాజ్ఞ భవత్ప్రసూనముల్
దినమును దొంగిలించి చని దిక్పతికిత్తును బుద్ధిమద్వరా! 64

వ॥ ఇదియు నా నిజవృత్తాంతంబని గుహ్యకుండు వినిచిన విని సత్యజిత్తు
మిగుల నచ్చెరువొంది న్యాయమార్గంబున ముజ్జగంబు నేలుటకై

నియమింపఁబడిన దేవేంద్రుండె తన సేవకుఁ జోరవృత్తిం బర ద్రవ్యంబుఁ గొని తేఁ బంప మఱి మాబోఁటు లేమిసేయవలయు నిఁక నీవరిగి మీ యేలిక కిట్టి నైచ్యంబు తగదని సామాన్య మర్త్యుండ నగు నేఁ దెల్పినట్లు చెప్పి యిదిమొదలిఁక నీ పనికిరాకు మరుగుమని వాని చేయి విడిచి తన గృహంబునకుం జనియె. గుహ్యకుండును బంధితుని వడువునఁ బుడమిపయింబడి వగలం బొగులుచుండె నట స్వర్గంబున 65

## 21 అధ్యాయము

— దేవేంద్రాదులు కుంటివారగుట —

సీ॥ ప్రతి వాసరమ్మునఁ బారిజాతసుమాళిఁ
గొనివచ్చుతఱి సన్న గుహ్యకుండు
నాఁడు రాకుంట నెంతయు చింతఁగని వజ్రి
చెంగటనున్న జేజేలఁ బిలిచి
నా యాజ్ఞ సుమములకై యేగి తడసిన
గుహ్యకు జాడఁ గన్గొనుట కేను
జనుచుంటి మీరలుఁ జయ్యన రండని
యైరావతము నెక్కి యప్డు తనను
గీ॥ గలసికొని వచ్చుచున్న వేల్పులను గూడి
బహురయమ్మున వారిధిప్రాంత పారి
జాతవృక్షస్ఫురద్ధరణీతలంబుఁ
జేరి హత్తిని డిగ్గి జేజేలుఁ దాను 66

వ॥ ఆ తరువులయుఁ బ్రసవంబులయు సొబగుఁ గాంచి మెచ్చి సేవకు నరయు పని వీటెఁబుచ్చి 67

మ॥ సురుచిన్మించి పరీమళాన్వితములౌ సూనమ్ములం గోసికొం చరుసమ్మొందుచుఁ బారిజాతమును డాయంబోవు నీలోపలన్ హరినిర్మాల్యముఁ ద్రొక్కి దాఁటెనగుటన్ హర్యశ్వుఁ డచ్చోటనే చరణం బూనఁగలేక కూలఁబడె నస్వప్నవ్రజోపేతుఁడై 68

క॥ అప్పరుసున కూలంబడి
యుప్పరమున కెగయ నెడఁద నూహించి యటుల్
చొప్పడమి లేచి కాల్నడ
నప్పాలమున్ దాఁటఁబూని యా పనియందున్ 69

సీ॥ అవశులై కూలఁబడి లేవనైనలేక
ఖచరతన్మించు మన కిట్టి కదలలేని
గతి ఘటిల్లెఁ బరార్థతస్కరత నుబ్బు
నట్టివా రెట్టిరే నిట్టి చెట్టఁ గంద్రు 70

గీ॥ నాకమున సర్వభోగమ్ములందు మనము
క్షితిని గదలను మెదలను జేతఁగాక
కుడువఁ ద్రావఁగ నేమిచొప్పడక యుండె
నవసి యుండఁగాదు గతి గంటిమపుర నేఁడు 71

క॥ అనుకొనుచు నే యుపాయము
మనమునకున్ దోఁప కమితమన్యువున సుధా
శనులును శతమన్యుండును
వనమున నొదలలు వంచి పడియుండంగన్ 72

వ॥ ఆ రేయి గడచి మఱునాఁడు కొంత ప్రొద్దెక్కిన పిమ్మట 73

చ॥ అనిశము వృక్షజాతముల నారయుచుండెడు సత్యజిత్తు వ
చ్చి నతశిరస్కులై వనటఁజెందెడు వారల వేషభూషలన్
గని యమృతాశనవ్రజముగాఁగ నెఱింగి నమస్కరించి యే
మనఁదగు మిమ్ము వేల్పుదొరలయ్యు నిటైతిరి నీచబుద్ధిచేన్ 74

మ॥ మునిముఖ్యా యిటు పారిజాతకుసుమమ్ముల్నిత్యముంగొంచుఁబో
వునతం డభ్రచరుండు గాన నతనిన్ భూచారినౌ నేను ప
ట్టు నుపాయం బెది గాననేర కెటు లెట్లో విష్ణునిర్మాల్య మి
త్త్వద్భూమిం దరుపాళినుంచి తది మీ పాదంబులన్ సోఁకుటన్ 75

గీ॥ కంటివా తాము విచారించె కూలఁబడితి
కెటులు మీకిప్పు డొదవిన వృజినమడఁగు

గగనచారిత్వ మేరీతిఁ గలుగు నాకు
సత్యజిత్తు హింసకుఁ డను సడియె కడకు 76

క॥ అని వినయముఁ బరితాపముఁ
దొనుకఁ బలుకు సత్యజిత్తుతో నింద్రాదుల్
ఘనలజ్జాభర నమితా
ననులై వచియించి రిట్లు జ్ఞానివరేణ్యా! 77

మ॥ రసనాదోషమునన్ ఖగాళి పలలాశం బెంతయో వేడ్కతో
రసకున్ డిగ్గుచు జాలబద్ధమగుమేకన్ మేము మా ప్రేయసీ
విసరాజ్ఞ మతిమాలి ఖేటులము నిర్వీర్యంపుఁ జౌర్యక్రియన్
గుసుమమ్ముల్ గొనిపోవ వచ్చి యిటు లెగ్గుల్గంటి మిమ్మంటిపై 78

గీ॥ లేచి నిలఁబడఁదగు శక్తి లేకయున్న
మేము మా యిండ్ల కేగెడు మేర యెట్లు
దీని కేదే నుపాయం బనూనకరుణ
మాకు నెఱిఁగింపగదవయ్య మనుజవర్య! 79

వ॥ నావుడు సత్యజిత్తు వారలం జూచి యింద్రియచాపల్యంబునం జేసి
మీరొనర్చిన నీచకృత్యంబుకతంబున 80

సీ॥ మందాకినీతీర మహిత సైకతముల
నడయాడు మీ కిట్టి బెడఁద గలిగె
నందనవన హరిచందనాది తరులఁ
గ్రీడించు మీ కిట్టి కీడు గలిగె
నిరుపమ చింతామణీ కామధేనువు
లెనఁగెడి మీ కిట్టి యెగ్గు గలిగె
నప్సరః కామినీహారి గానరసమ్ముఁ
జెవిఁ జుఱ్ఱు మీ కిట్టి చేటు గలిగె
గీ॥ మేలిమి పసిండితో రతనాలతోడ
మేలుగాఁ గట్టఁబడిన బల్ మేడలందు

విరులపాన్పులఁ బవళించు వేలుపులకు
మీకు గొగ్గిరానేలల మిసుకవలసె 81

క॥ ఏనేమిసేయఁజాలుదు
నైనను మీ బాధఁ బాప నష్టుఁడు భర్తా
ధీనుండగు హరి వేఁడెద
మానసమున చింత లుడిగి మఱవక మీరల్ 82

క॥ ఆర్తశరణ్యుని రాక్షస,హార్తను భజియింపుఁడనుచు నక్కట యేయే
ధూర్తులు వీరలకైవడి, నార్తింబడువారో యనెడు ననుతాపమునన్

క॥ హరి నిర్మాల్యము నెటనెట
వెరవున మున్నిడెనో వెదకి వేతీసి గుణా
భరణుం డాతఁడు గృహమున
కరిగె నిజార్థాంగితో నిరశనవ్రతుఁడై 84

సీ॥ హరిని పూజించుచు ధ్యానించుచుండెను
వనమున దేవతావారమట్లు
కుంటివారై నీరు వంటకమ్మెఱుఁగక
నవయుచుఁ బడియుండ నాకమందుఁ
దక్కిన వేల్పులుఁ దమవారు రామికిఁ
జింతించి వెదకుచు శీఘ్రగతిని
యింద్రాదులున్నెడ కేతెంచి వారల
పాటు గన్గొని రోషభరితులగుచు
గీ॥ లేవఁదీయంగఁ దలపెట్టి లేవలేక
కొందఱును పారిజాతంపుఁ గుజముఁ బెఱుకఁ
బూని చేఁగాక కొందఱు మూర్ఛనొంది
పడిరి వివశులై యవ్వనీభాగమందు 85

క॥ ఆ తఱి దివమునఁ జనియెడి
ధాతకొడుకు నారదుఁడు సుధాభుగ్గణ సం

జాతార్తిఁ గాంచి వీరల
నేతీరునఁ జక్కఁబెట్ట నేర్పడునంచున్ 86

క॥ భావించి దేవదేవుఁడు, గోవిందుఁడుగాక యిట్టి గొడవలు తీర్పం
గా వేరెవ్వరుఁ గారని, వేవేగం జనియె హరిని వేళమ్మునకున్ 87

వ॥ చని నిజప్రాసాదాంతర శిరోగృహంబున మనోహర శేషతల్పంబునఁ
బయోజనిలయాది ప్రేయసీసరసవాగ్జసిత హాసభాసురవదనారవిందు
గోవిందుఁ గాంచి సాష్టాంగనమస్కారంబొనర్చి లేచి మస్తకన్యస్త
హస్తయుగళుండై యిట్లని స్తోత్రంబు గావించె 88

— విష్ణు స్తోత్రము —

శా॥ స్వామీ! విష్కిరగామి! యార్తజనరక్షాదీక్ష! గోవింద! ప
ద్మామిత్రార్కకృశానుకోటి సమభా! యాత్మాకృతీ! నీరద
శ్యామా! రామ! సురేశ! సర్వజగదీశా! శ్రీశ! నారాయణా!
శ్రీమత్పంకజనేత్ర! మిత్రసుఖదా! కృష్ణా! నమస్కారముల్ 89

మ॥ గరుడాంకా! దళితాశ్రితప్రకరపంకా! యచ్యుతా! యాదిదే
వ! రమాలింగితవిగ్రహా! భుజగతల్పా! విశ్వవిశ్వేశ్వరా!
హరి! దుగ్ధార్ణవవాస! వాసరనిశాధ్యక్షా! రక్షోంతకా!
గిరిధారీ! సుకలా! పురాణపురుషా! కృష్ణా! నమస్కారముల్ 90

గీ॥ సర్వలోకేశ్వరా! విశ్వసాధన! సుర
వల్లభా! నిఖిలాధార! వరద! సర్వ
గత! కృపాబ్ధి! యనంత! రాక్షసకృతాంత!
కేలుమోడ్పు లొనర్చెదఁ గృష్ణ నీకు 91

శా॥ ఈవే సాత్త్వికమూర్తి వీవె జగముల్ సృష్టింపఁ బెంపన్ హృతిన్
గావింపన్ విధివిష్ణుభర్గతనువుల్ గైకొందు వన్నింటిలో
నీవే వెల్గెదు నిర్గుణుండ వరయ న్నీవే పరబ్రహ్మవున్
నీవే కేశవ! కృష్ణ! నీకు సతముం గేల్మోడ్పులొప్పారన్ 92

గీ॥ త్రిగుణుఁడవు గుణాధారుఁడ వగుదు వీవ
మఱి త్రయీమూర్తి వయిన నీ మాయచేత

జంగమస్థావర ప్రపంచమ్ము సర్వ
ముద్భవం బొందుచున్నది యోగనాథ! 93

గీ॥ ప్రళయకాలంబునందుఁ బ్రపంచవితతి
సర్వమేకార్ణవమున నాశనముగాఁగ
శేషతల్పమున న్మేను సేర్చి యోగ
నిద్ర నుండెదు వొకఁడవే నీవు కృష్ణ! 94

గీ॥ శాశ్వతుండవు స్వప్రకాశకుఁడ వీవ
జగములన్నియు నీయందె సంభవించు
భువనములలోన వెలుపలఁ బొదలు దీవ
యీవ ముఖ్యుఁడ వెల్లెడ దేవదేవ! 95

గీ॥ అంతట న్నీవె వ్యాపించి యఖిలభావ
హానముల నెల్లచుండెద వఖిలలోక
ములకుఁ దల్లివి దండ్రివి పోషకుఁడవు
నీవ! యమితప్రభావ! యో దేవదేవ! 96

గీ॥ భూతములకెల్ల గురుఁడవై బుద్ధిబలము
కలుగునట్లు శిక్షించి సుఖమ్ముఁ గూర్తు
వీవ నీచేఁ బ్రతిష్ఠితమ్మై వెలింగె
జంగమస్థావర ప్రపంచమ్ము కృష్ణ! 97

వ॥ దేవా! మహానుభావా! దేవవ్రజానందకరస్వభావా! భవచ్చర ణారవిందమ్ముల కనేక వందనమ్ములొనర్చెద రక్షింపుము రక్షింపు మని పల్కుచు నారదుం డొనర్చిన స్తోత్రంబు విని సర్వవ్యాపకుం డగు తన కెఱుఁగరాని దేదియు లేకున్నను దనకడఁ గలవార లెఱుంగుటకై యమ్మునివలనం బలికింపఁదలంచి విష్ణుండు నారదు నితో నిట్లనియె. 98

గీ॥ భూమిసురవర్య! నారద! సేమమొకద
యేమిపని కీవు వచ్చితి తెలియఁగఁ దెల్పు

మది సురాసుర దుర్లభమైన వడిగఁ
జేసి ముదమొసఁగూర్తు నీ చిత్తమునకు 99

సీ॥ ఆ వాక్కు విని ద్రుహిణాత్మభవుఁడు నమ్ర
కంధరుఁడై దేవ! కదలిపురిని
బారిజాత క్షమాభవ మొకండుండె న
ద్దాని సూనమ్ము లెంతయు మనోహ
రములు వానిని జూచి యమరేంద్రుఁ డరుసించి
కొనిపోయి తన ప్రియవనితల కిడ
వారు వానిని మెచ్చి ప్రతిదినమ్మవి మాకుఁ
జెప్పింపుమని కోర దేవవిభుఁడు

గీ॥ ప్రేయసీప్రీతికై చోరవృత్తి వానిఁ
దేరఁగాఁ జేసి చివరను స్తేనుఁడగుచుఁ
దాను సురలతో నేగి తత్తరువు క్రింద
బంగువై పడె వలఁబడ్డ పక్కి ఫక్కి 100

గీ॥ అట్లిలంబడియున్న యయ్యమరవరుల
కాఁకటికి యజ్ఞభాగము లమృతరసముఁ
జిక్క కుపవాసములతోడఁ బెక్కుదినము
లరిగె దాన మూర్ఛిలిరి గతాసులట్లు 101

క॥ నీ సేవకులగు వేల్పుల, గాసిం బోకార్చి పేర్మిఁ గాపుము తడవుల్
జేసితివేనియు వారు గ, తాసువు లయ్యెదరనుమ్మి యంభోజాక్షా!

క॥ నారదుఁ డటుపల్కిన విని, వారిజలోచనుఁడు భక్తవత్సలుఁడు కృపా
నీరధి భగవానుఁడు స, ర్వాహ్యుఁడు నిఖిలదేవతాధిపుఁ డనియెన్

ఉ॥ ధాతకుమార! నీవు విదితంబుగఁ జెప్పిన పారిజాతభూ
జాత మొకండునున్ దులసిశాఖి యొకండుఁ బయస్సముద్రసం
భూత సుధాకణప్రభవముల్ గనుకన్ మిగులం బవిత్రముల్
ప్రీతికరమ్ములున్ మధుపరీమళపుష్పదళాభిరామముల్ 104

ఆ॥ ఆ తరుస్వాయమ్ము నధికతర దరిద్రుఁ
డస్మదీయ భర్తఁ డనఘుఁడైన
సత్యజిత్తు శ్రద్ధ సాఁకుచు నవ్వానఁ
బత్ని ప్రజయుఁ దాను బ్రదుకుచుండె 105

వ॥ ఆ పూలవిషయంబున నింద్రుని కృత్యంబును సానుచరుండై పొందిన పంగుత్వం బిప్పుడు నీవ నుడివియుంటి వట్లు వారు కుంటివారైన కారణంబు వినుము. నిత్యంబును పారిజాతంబు పుష్పశూన్యం బగుటయు నారీతిఁ జేయుచున్నది వియచ్చరులగుటయు గ్రహించి ఖచరులఁ బట్టుట కిదియె తగు నుపాయంబని తెలిసికొని మద్భర్తండగు సత్యజిత్తు మన్నిర్మాల్యంబుఁ గొనిపోయి పారిజాతాదిక పుష్ప వృక్షంబులమీఁదను గ్రింది భూమియందును నుంచెఁ దన్నిర్మా ల్యోల్లంఘన పాదస్పర్శనంబులు గాని మఱి యొండు గాదు. 106

క॥ అనఘా! నిర్మాల్యంబని
యనఁబడు భగవంతునకు సమర్పించిన పూ
లును దళములు పండులు నీ
రును నవి త్రొక్కినయపుడె నరుఁడు పంగువగున్ 107

గీ॥ అవ్విధంబునఁ బంగువులగుచు ధరణిఁ
బడి నిరన్నులై మృతి కెన వచ్చినట్టి
మూర్ఛ మునిఁగిన సురసత్తములను సత్య
జిత్తు గాంచి యేరికిసేగి సేరకుండ 108

క॥ మన్నిర్మాల్యం బెల్లెడఁ
గ్రన్ననఁ దొలఁగించి యైన కార్యంబునకున్
మిన్నగు పశ్చాత్తాపము
న న్నిజమందిరవరమ్మునకుఁ జని నియతిన్ .09

క॥ అజరుల పెతఁ దలఁగుటకై
నిజభార్యా సహితుండగుచు నిర్భయుఁడై మ

ద్భజనార్చన లనుదివసము
నజనందన! సల్పుచుండె నకలంకముగాఁ　　110

వ॥ దేవేంద్రాదులు పారిజాతపుష్ప చౌర్యంబునంజేసి పంగువులై నిరాహారులై భూమిం బడియుండఁ బదునొకండు దినంబు లరిగె. వారికా యవస్థ ఘటిల్లిననాఁడె పుణ్యప్రదంబగు నాషాఢమాసంబు ప్రవేశించె. నేఁ డాషాఢశుక్లైకాదశి గావున సత్యాజిత్తు యథావిధిగా నన్నుఁ బూజించి మదీయాష్టాక్షరీమంత్రమ్ము జపించుచు రాత్రి యంతయు జాగరణమ్ముతోఁ గడపిన నతని కేను ప్రత్యక్షంబయ్యెద నవ్వేల నంతయుం జక్కంబడఁగలదనిన విని నారదుండు కొండ దాల్పునకు మ్రొక్కి సెలవుఁగైకొని తద్విశేషంబు లవలోకించు వాంఛ నలనుండి వియన్మార్గంబున భూలోకంబుఁ జేరెనని చెప్పి గృత్స్నమదుండు జహ్నువుతో నిట్లనియె.　　111

## 22 అధ్యాయము

సీ॥ సత్యాజిత్తు నిజనిశాంతమున నిలింప
　　బాధానివృత్తికై పరమభక్తి
సత్యనారాయణస్వామికి సుమచంద
　　నాది షోడశపూజ లాచరించు
చేకాదశిని పవలెల్ల వెళ్ళఁగఁ జేసి
　　నిశ వచ్చినదిమొదల్ నిశ్చలాంత
రంగమ్ముతోడ నారాయణమంత్రమ్ము
　　జపముఁ గావింపుచు జాగరింప

గీ॥ నతని పూజకు జపమున కాత్మ నలరి
మహిత వైకుంఠపురిసౌధ మధ్యమందుఁ
జంద్రశాలను బ్రియలతో సరసగోష్ఠిఁ
దేలుచున్న జనార్దనదేవుఁ డపుడు　　112

— నారాయణుండు సత్యజిత్తునకుఁ బ్రత్యక్షమగుట —

సీ॥ నీలజీమూతసన్నిభశరీరముతోడఁ
కమలపత్రాభ నేత్రములతోడ
దిననాథయూథ సద్రుక్కిరీటముతోడ
లలితకుండల కపోలములతోడ
భూరిసాధనయుత భుజచతుష్కముతోడ
సర్వసన్నుత పదాబ్జములతోడఁ
గరుణారసస్యందిసరసవీక్షలతోడ
నంబుజప్రోపమాస్యంబుతోడఁ

తే॥ దటిదనూనప్రభాపీతపటముతోడ
బహువిభూషాన్వితావయవములతోడ
రమణితోఁ బత్రి నెక్కి నారాయణుండు
సత్యజిత్తున కెదుట సాక్షాత్కరించె 113

గీ॥ అట్లు ప్రత్యక్షమైన రమాధినాథుఁ
గూడవచ్చిన మునులు కొండాడుచున్న
రవము వీనులనిండఁ గన్గవను దెఱచి
హరికి సాష్టాంగవందన మాచరించి 114

వ॥ లేచి కరంబులు జోడించి 115

మ॥ కమలాక్షా! శ్రితపక్ష! దుష్టజనశిక్షాదక్ష! కౌమోదకీ
సముదంచత్కర! శత్రుభీకర! మునీశవ్రాతహృన్మత్కరా!
శమితాఘౌఘ! శరీరకాంతిజితవర్షాకాలమేఘా! బుధ
స్థిమిత శ్రీప్రద! యాపదుద్ధరణ! లక్ష్మీనాథ! నారాయణా! 116

మ॥ కమలాలంకృతవత్సదేశ! దళిత క్రవ్యాశనాధీశ! తీ
క్ష్ణమయూఖప్రకరప్రకాశ! శ్రితరక్షాప్రోద్యదావేశ! హ
స్తిమణి క్లేశవినాశ! ప్రస్తుత ధరిత్రీభృద్విశ్వేశా! బుధ
స్థిమిత శ్రీప్రద! యాపదుద్ధరణ! లక్ష్మీనాథ నారాయణా! 117

మ॥ కుముదాప్తాహితనేత్ర! సాధునికరక్షోణీజచైత్రా! మధు
ప్రముఖామర్త్యవిరోధిజైత్ర! భుజగప్రత్యర్థిపత్త్రా! రమా
రమణీమోహనగాత్ర! పాతకమహారణ్యాగ్నిహోత్రా! బుధ
స్థిమితశ్రీప్రద! యాపదుద్ధరణ! లక్ష్మీనాథ నారాయణా! 118

గీ॥ అనుచు నుతిసేయు సత్యజిత్తును కృపార్ద్ర
వీక్షణంబులఁ దిలకించి విష్ణు వనియె
వత్స! త్వత్కృత పూజాజపమ్ముల కెద
మెచ్చితిని కోరు మెదియైన నిచ్చువాఁడ 119

ఆ॥ అనిన సత్యజిత్తు వినమితశీర్షుఁడై
వ్యాళశయన! మత్కృతాపరాధ
మున నిరన్నులగుచు భువి మూర్ఛఁగనియున్న
దేవవరుల వేగఁ బ్రోవవయ్య! 120

వ॥ ఆమాటల కబ్జలోచనుండు దరహాసితవదనుండై కుమార! సర్వర్తు
ఫలపుష్పసమన్విత నానాతరువరశోభిత నందనారామాధిపత్య విల
సితులగు పురుహూతాదికాదితేయులు చౌర్యంబునకుఁ గడంగి
భవదిష్టదైవము నగు మత్పూజకై నొక్కపుష్పంబేని నిల్పక
త్వత్ప్రేషిత పారిజాతాదిక ప్రసవంబు లపహరించుట వారి దోషంబ
కాని నీవలననైన దోసం బిసుమంతయు లే దెవ్వనికర్మఫలంబు వాఁ
డనుభవింపకతీఱునె? దాని కీవు విచారింపవల దల్లదె లోకబాంధవుం
డుదయించుచుండె. మీ దంపతు లిరువురును మత్పాదోదకప్రసా
దంబులంగొని నాతోడఁ బారిజాతంబుకడకు రం డన్నియుఁ జక్కం
బడఁగలవని చెప్పి వారిం దోడ్కొని పారిజాతంబుకడ కేగి యచ్చట
మూర్ఛాక్రాంతులై పడియున్న వేల్పులపై సత్యజిత్తుచే నిజ
పాదోదకంబుఁ జల్లించిన 121

ఉ॥ పంగువులై ధరంబడి శవంబులకైవడి నున్న గట్లరా
గొంగయు వేల్పు లోజమెయిఁ గోల్కొని లేచిన సత్యజిత్తు వా

రిం గని తత్ప్రసాదమున కీణముదంబున నీయ వారు దా
నిం గడుభక్తితో మెసవి నిర్మల బుద్ధిబలానుషంగులై 122

క॥ తమ యెట్టయెదుట మునిబృం
దము సేవింపంగ విహగనాయకుపై శ్రీ
రమణీయుతుండై నిలిచిన
కమలాక్షున కెఱఁగి లేచి గతమోహమునన్ 123

క॥ క్షితిధర! నిను దలఁచుటకున్
మతిమాసినవారి దోషమగ్నుల మమ్మున్
బ్రతికింప నీకు నీ వా
కృతి వచ్చుట మమ్ముఁ గరుణఁ దేర్పనకాదే? 124

వ॥ దేవా! భవత్కరుణావలోకనామృతంబు మాపైఁ బ్రసరించుట
వలన మృతప్రాయులమై పడియున్న మేము తొల్లింటి గగనచర
త్వాదికశక్తులుగలవారమైతిమనిన గరుడతురంగుండు 125

క॥ ఓ దివిజులార! మీ వెతఁ, బోఁ దట్టిన దేనుగాదు పుణ్యాత్మకుఁడౌ
నీ దాసవరుఁడు తా నేకాదశి నుపవాసముండి కడుభక్తిమెయిన్

మ॥ నను పూజించి మదీయపాదజలమున్ నైవేద్యమున్ దెచ్చి పే
ర్మిని మీకిచ్చెను దన్మహత్త్వమున నే మీ పాపముల్ వాసెఁ గ
ల్గెను తొల్లింటి సమస్తశక్తు లెచటన్ లేఁ డారయన్ యోగ్యవ
ర్తనుఁడౌ భక్తునితో సముండితఁడు తీర్పన్ శక్తుఁ డెక్కార్యముల్

క॥ ప్రతి యేకాదశి నాకున్
హితకారిణి గాన దాని నేర్పడఁగా శ్రీ
పతి వాసర మంద్రు విబుధు
లతులం బద్దాని మహిమ మదితిజులారా! 128

సీ॥ శక్రముఖులైన మీర లాషాఢమాస
మాదిగా నేఁటిదాఁక నేకాదశి దివ
సము లనాహారులై ధరాస్థలిని బండి
నా రగుటచేత నిద్ది యీనాఁటినుండి 129

క॥ శయనైకాదశి యను నా
హ్వాయమును వహించి తక్క హరివాసరసం
చయమున నుత్తమమై మ
త్ప్రియమై ఘూతౌఘమై భువిఁ జెలొందుఁ 130

క॥ అసమములగు మత్తీర్థప్రసాదములు మీరు నాదుభక్తునిచే సం
తసమొప్పారఁగఁ గైకొన్న సమయ మిది ద్వాదశీదినమ్మగుకతనన్

వ॥ ఈ ద్వాదశియందు మామకాశ్రితులగు మీరు కష్టంబులఁ బాసి సుఖంబొందినకతమ్మున నేకాదశియట్ల ద్వాదశియు నాకు హర్షప్రదయగు నిట్టి ద్వాదశీదినంబున ద్వాదశీవ్రతమ్ము గావించి యన్నపానాది దానంబుల సద్విజులఁ దృప్తులంజేసినవార లిహంబున సర్వసంపత్సుఖంబు లనుభవించి పరంబున మత్సాయుజ్యంబు నొందెదరనిపల్కిన విని దేవవిభుండు పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనియె

— విష్ణు నేకాదశీవ్రత మింద్రునకుఁ దెల్పుట —

సీ॥ ఏకాదశీవ్రత మేరీతిఁ గావింప
వలయుఁ జేసినయట్టివార లొందు
ఫలమేమి చేయనివారికి ఘటియిల్లు
కష్టంబులెట్టివి కరుణతోడ
నెఱిఁగింపవే యన నిందిరాపతి వల్కె
దశమీదినమ్మ మధ్యాహ్నమందు
భుజియించి రాతిరి భోనమ్ము నంటక
యేకాదశీదినమెల్ల నన్నుఁ

గీ॥ బూజ గావింపు చన్నమ్ము ముట్టఁబోక
జపముతోడను నామసంస్మరణతోడ
రాత్రి జాగారముండి మర్నాఁడు ద్వాద
శీదినము పారణము దగఁ జేయవలయు 133

గీ॥ ద్వాదశిని జాము లైదు నిద్రను త్యజించి
రాత్రి భోనము విడనాడి బ్రహ్మచర్య

మునను మూన్నాళ్ళు పుచ్చుట ప్రథమ పడక
ముఖ్య మేకాదశీవ్రతమునఁ సురేంద్ర! 134

సీ॥ అన్నమును మాని హరిపూజనాదికముల
నిద్ర విడనాడి నెలఁతుక నేస్తముడిగి
యొక్క యేకాదశీదినమొండె పార
ణమ్ము సేత దినను మధ్యమమ్ము శక్ర! 135

క॥ ఆఁకలి కన్న మ్మొకపరి, నేకాదశిఁ గుడిచి పడఁతి నెనయక నియమా
నీకము శక్తిఁ గొలందిని, నేకాదశి జరుపు టధమ మింద్రా! దానన్

వ॥ మధ్యమాధమ విధానంబులు వృద్ధులకు రోగులకు నాచరణీ
యంబులు. 137

ఆ॥ అమితపుణ్యదాయి హరివాసరమునాఁడు
ప్రీతి నుపవసించి విధివిధాన
మున మదీయపూజ నొనరించి జాగార
మాచరించునాతఁ డందు ముక్తి 138

ఆ॥ ఎఱుఁగకైన నెవ్వఁ డేకాదశిని నోరె
మూరగించునాతఁ డనుభవించు
బ్రహ్మహత్య మొదలు పంచమహాపాత
కములు సేయువాని గతులు శక్ర! 139

క॥ ఎన్నరుఁ డేకాదశినాఁ, డన్నముఁ దిను వాని కద్ది యన్నముగా దో
సన్నుతభవశరాబలసం,పన్నా! క్రిమిరాశిగాని పరికింపంగన్ 140

సీ॥ బ్రాహ్మణ క్షత్రియోరుజపాదభవులు
వటుగృహస్థ వానప్రస్థ పరమహంస
లంగనాబాలవృద్ధాదులైన దేహ
ధారు లేకాదశిని దగ దారగింప 141

సీ॥ ఎఱిఁగియేకాని యెఱుఁకగయేనికాని
యెవ్వఁ డేకాదశిని భుజియించు వాని

ఏముఁడు కోపంబుతో రౌరవాది ఘోర
ంరకవ్యథల్ గుడుపు ననారతమ్ము 142

న్న మేకాదశిని దినినట్టివాఁడు
ల్ల సమలు నారకబాధఁ గుడిచి తిరిగి
చజన్మంబులఁ దాల్చి నెగులు మిగుల
ందుచుండును వసుధ జంభాసురారి! 143

దలిపొందు పేడియుము భక్తము నిద్దుర మాని నిష్ఠ నే
దశి నస్మదర్చన మకైతవభక్తి నొనర్చి నాడు పా
దకమున్ బ్రసాదమున నూనముఁ బెంపున స్వీకరించువాఁ
దిని సర్వసౌఖ్యముల నంది యనంతర మొందు మోక్షమున్

చ్ఛ చాంద్రాయణముల సమిద్ధ యజ్ఞ
ల ననేకాన్యసువ్రతముల నొనర్పఁ
లుగునటువంటి ఫలిత మేకాదశి నుప
ాస మున్నంతమాత్రానఁ బడయు నరుఁడు 145

్వాదశమాసాలఁ బక్షద్వయమ్ముల
వచ్చుచుండెడి హరివాసరముల
ర్వవర్ణమ్ముల సర్వాశ్రమమ్ముల
జనులును యోగులు మునులు స్త్రీలు
న్నమ్ముఁ దినఁదగ దట్టుల నుపవాస
మొనరించువారికి నెనయు ముక్తి
ాన నేకాదశితో నెనవచ్చెడి
పుణ్యవాసర మొండు పొసఁగదనుచుఁ

జెంగటంగల మునులు హర్షింపఁ బ్రాన్న
డబ్దరవమున భగవంతుఁడైన చక్రి
చక్రి రిపుమీఁద నిల్చి భుజమ్ము లెత్తి
శక్రముఖులకుఁ జెప్పె నో జహ్నుమౌని! 146

## 23 అధ్యాయము

క॥ ఆకైవడి శ్రీకాంతుం, డేకాదశి మహిమఁ దనకు నెఱిఁగింపంగా
నాకపతి సత్యజిత్తు నవలోకించి మహాత్మ! భక్తలోకవతంసా!

— ఇంద్రుఁడు సత్యజిత్తును బ్రశంసించుట —

క॥ మాఘాఖ్య కన్యోదకముల, నేకాదశిదినము లంట కీవిధమున నీ
వేకాదశీవ్రతమ్ము మ,హాకరుణను జేయు టెన్న నలవియె మాకున్

క॥ నవనీతమ్మునకంటె
న్నవురన్ మృదువగుచు నొప్పె నీమది నీవే
యవుదువు సజ్జనశేఖరుఁ
డవు హరి కారుణ్యపాత్రుఁడవు భక్తుఁడవున్ 149

చ॥ అన విని సత్యజిత్తు వినయంబున మ్రొక్కి సురేంద్ర! యిందు నా
ఘనత యొకింత లేదు త్రిజగత్ప్రభుఁ డీ హరికర్త యంత కీ
వనితము పారిజాతకుసుమార్థము భూమికి వచ్చు టేల? ద్రావఁ
కునె గొనిపొమ్ము నాకమునకున్ గమనాగమనశ్రమంబులున్ 150

శా॥ ఆ మాటల్ విని దేవవల్లభుఁడు మిత్రా! యింకనున్ నీచతా
భూమస్వాంతులఁగామమున్ దలఁతె యంభోజాక్షపాదాబ్జవీ
తామామాహాత్మ్యము చేత నే నొదవదా జ్ఞానంబు నుంతైన ర
మ్మా! మమ్మంపుము! పోయివచ్చెదము మామాధామముల్ సేరఁగన్

వ॥ మాకు నీవిప్పటికొనర్చిన యుపకారంబువలన మేము నీకు పడిన
ఋణమ్ముఁ దీర్చుకొనుటకె నిరుపాయులమై యుండ వెండియు
నీ వొసంగు పారిజాతభూజాతంబుఁ బుచ్చికొనఁజాలుదుమే యన
వాసుదేవుండు బుధప్రవరులతో నిట్లనియె. 152

ఉ॥ వింటిరె సత్యజిత్తు నుడి వృత్రరిపున్ గొనిపొమ్మసం గెదన్
వింటికి పారిజాతమనె వీని యుదారత నేమనన్వలెన్
దింటకుఁ దిండిలేక కయినీటను లెస్సగఁ బెంచి యిష్టు రెం
డింటికి సాధనంబయిన నిస్తులవృక్షము నీ దొరంకొనెన్ 153

వ॥ అని నుడివి పడగదారిపాన్పుసామి సత్యజిత్తుం జూచి 154

ఆ॥ సత్యజిత్తు మీరు జంపతు లిర్వురుఁ
బారిజాతమునకు శ్రీరహింపఁ
బూజసల్పి చెట్టు మొదలంటఁగా లేపి
యింకు వ్రజి కనిన నెలమి వారు 155

— సత్యజిత్తు పారిజాతము నింద్రునకిచ్చుట —

గీ॥ శౌరి యాజ్ఞాప్రకారంబు సంఘటించి
విబుధవల్లభుఁ బూజించి ప్రీతిఁ బారి
జాత మర్పించె నపుడు పుష్పములవాన
గురిసె నా జంటపై మింటఁ దిరిగెడుపజ 156

ఆ॥ అపుడు పారిజాత విపులారుహాము చెంతఁ
జెలువుమీఱుచున్న తొలసిగ్రమాను
మనుజభాషణముల ననె సత్యజిత్తుతో
ననఘ! నాదు వాక్య మాలకింపు 157

గీ॥ పారిజాతమును న్నన్నుఁ గూరిమిమెయిఁ
జాలకాలమ్ము సాఁకి యీ సమయమందు
నా ప్రియుండైన హరి వచనమునఁ జేసి
నీకు జీవనాధారమై నెగడుదాని 158

మత్తకోకిల॥ పారిజాతము నాకనాయకుపాణిఁ జేర్చితి వల్లె న
న్నీరమేశుని పాదదాసిగ నీవు నర్పఁడ వీవె నా
కోరికిన్ నెరవేర్పు మీకొనఁ గుంజరావనుఁ బావనున్
ధారిణీధరధారి శౌరి నెదన్ గదించి నుతించెదన్ 159

క॥ అనఘా యింద్రోపేంద్రులు
ననుజన్ములు పారిజాత మనుతరువును నే
నును దోఁబుట్టువులము నీ
వును మమ్మింతవఱ కెలమిఁ బ్రోఁచితి సరిగన్ 160

వ॥ నాతోఁబుట్టువులేని యిచ్చో నొంటిగ నుంపక నన్ను పేందుకొన కొనంగుమని సత్యజిత్తును వేఁడుకొని శ్రీహరి నుద్దేశించి యిట్లనియె

— తులసి శ్రీహరిం బ్రార్థించుట —

ఉ॥ దేవ! మహానుభావ! జగతీనివహావన! లోకపావనా!
గ్రావధరా! ధరాధర! విఖండితదుర్జన! కోపవర్జనా!
సేవకసేవధీ! సుగుణజీవనధీ! హరి! నీదు పాదరా
జీవసమాశ్రయన్ గరుణఁ జేకొని ప్రోవుము నన్నుఁ జెచ్చెరన్ 162

క॥ అమృతముతోడం బుట్టిన
కమల నెదం జేర్చుకొన్నకైనడిఁ గృపతో
నమృతప్రభవను నను వ
క్షమునం జేరిచికొనంగఁజనును మహాత్మా! 163

గీ॥ శ్రీయుతంబైన నీ యురస్సీమ నేను
మాలికారూపమున నుండుమాత్రమునకు
ననుమతింపంగఁ దగునయ్య యన్య మేమి
కోర నీకన్న గతి వేఱెలేరు నాకు 164

క॥ అని వినుతించెడు తులసిన్
గని గోవిందుఁడు వచించెఁ గాంతా! తులసీ!
నిను నిందిర నొకరీతిగఁ
గనియెద నెద శంక విడిచి కనుము ముదమ్మున్ 165

గీ॥ అవ్విధమ్మునఁ దులసికి హర్ష మొదవఁ
బల్కి సిరితోడ హృత్సమీపమ్ముఁ జేర
సత్యజిత్తు సభార్యుఁడై జలజనయను
రమను బూజించి తులసి కర్చన మొనర్చె 166

క॥ తులసిని చెకలింపంగాఁ,దలఁచిన వారించి ప్రేమ దళుకొత్తఁగ ని
స్తులవామకరాంబుజమున, నెలమిస్పృశించిహరితులసికెమ్మింగూర్చెన్

గీ॥ అప్పుడు తులసి సమస్తావయవములందు
దివ్యభూషణ నివహముల్ తేజరిల్లఁ
జారు నారీస్వరూపంబుతో రమేశు
పాదముల వ్రాలఁ గరములఁబట్టి యెత్తి    168

— తులసీప్రభావం బింద్రాదులకు విష్ణు వెఱిఁగించుట —

చ॥ తులసి! సుధాపయోధిసుతతో సరిగా నెవఁడాల్తు నిన్ను నీ
సలలిత వృక్షరూపము రసాస్థలి మానవదుష్కృతంబులన్
దొలఁచి సుఖంబులిచ్చి తటితో నమృతాలయ మొందఁజేయఁగాఁ
గలుగును గావునన్ నిలువఁగావలె నీవిట నిర్విఘ్నంబునన్    169

మ॥ తులసీ! నాకును లక్ష్మికిం బ్రియవు నిస్తుల్యంబు నీ శక్తి నిన్
దిలకింపంగలవారి కల్మషతతుల్ నీఱై చనున్ వహ్నికిన్
లలఁ దూలంబును బోలె సర్వజనతా లాలిత్యవౌ దీవె నిన్
దులతోఁ దూఁచిన నా సదృశవగు వెందున్ శుద్ధ వీ వారయన్

గీ॥ కోమలములైన దళములఁ గొనబుమీఱు
నిన్నుఁ గనినట్టివాఁడు ఖండితమహాఘుఁ
డై సురాపగఁ దోఁగినయతనిరీతిఁ
దత్క్షణంబున శుద్ధుఁడై తనరుఁ దులసి!    171

క॥ కోమల తావకదళముల
మామకపూజను ఘటించు మనుజుం డపుడే
నా మూర్తిఁ దాల్చు మరలన్
భూమిన్ జననంబు గనఁడు పూర్ణేందుముఖీ!    172

క॥ తులసీ! నీ దళములతోఁ
జెలువుగ మాలికను గూర్చి స్థిరభక్తిని నా
గళమున నిడువాఁడు సుఖం
బులు నాతో సరిగ నెపుడుఁ బొందుచునుండున్    173

గీ॥ గృహమునందేని వనమునందేని నిన్ను
వేసి పరిశుద్ధజలములు వోసి పెంచి

నట్టివానిని పాపంబు లెట్టివైన
నంటనేర వాకానొకప్లైనఁ దులసీ! 174

గీ॥ ఏ దినమ్మున రవి యుదయించునప్పు
డెవఁడు మేల్కొన్న వెంటనే వృజినహరణ
వైన నిన్ను దర్శించునో వాని కదియె
సుదినమా నాతఁ డద్దాన సుఖము నందు 175

క॥ తులసీ! నీ దళములతో
మిళితంబగు నీటఁ దనదు మేనెల్ల నెవం
డలఘువిధిఁ దడిపికొనునో
ఖలుండయిన నతఁడు శుద్ధిఁ గనుఁజుమి యపుడే 176

క॥ తులసీ! నీ మొదలి మనున్
లలాటమునఁ దాల్చునతఁ డిలంగల భూతా
దులవలన సుంతయున్ భయ
మొలయఁడు సర్వత్ర సౌఖ్యమొందుచు నుండున్ 177

క॥ తులసీ! వృత్తాకృతి నీ
వెలసిన భూతలము గదుఁ బవిత్రము నానా
కలుషాపహారకము మం
గళకర మచ్చోటఁ దిరుగఁగాఁగల ప్రజకున్ 178

వ॥ అనుచుం బలికి జలజాక్షుండు మానవతరణార్థంబు తులసీవృక్ష
మూర్తిని భూతలంబున నిల్పి సర్వాంగసుందర యగు నారీమూర్తిని
మాలికారూపంబున నిందిరకుఁగూడ నలంకారంబుగ నుండునట్లు
నిజవక్షంబున ధరించి భక్తవరు సత్యజిత్తుం జీరి వత్సా! నీ కతం
బున దేవవిభుం డీ యాషాఢ శుక్ల ప్రతిపదాదిగఁ బదునొకండు
దివంబు లుపవసించి యేకాదశీ జననకారణుండై తనవలె నుపవ
సించుచు మీ దంపతులొనర్చిన యేకాదశీ వ్రతప్రభావంబున లబ్ధ
మనోరథుండయ్యె. మేమును మత్ప్రియురాలగు తులసింగై కొంటి

మింక నీ యభీష్టంబుఁ దీర్తు మడుగుమన నతండు మ్రొక్కి పక్కిరాజక్కిసామితో నిట్లనియె. 179

శా॥ దేవా! దేవవరుల్ ఋషిప్రవరులే దివ్యాకృతిం జూడఁగా
వేవేలేండ్లు దపించుచుండెదరొ తద్విశ్వప్రమోదప్రదున్
శ్రీవిష్ణు న్నినుఁ జూడఁగంటి నిటఁ దీరెన్ గోరుకుల్ సర్వ మింకేవే! నీ పదసన్నిధానమును సంప్రీ! భక్తకల్పద్రుమా! 180

ఉ॥ నావుడు సర్వజిత్తునకు నందకపాణి యిటుల్ వచించె దేవావళి బాధఁ బాపుటకునై యొనరించిన నీ వ్రతంబు దీ
తావిధి పూర్తియౌటకునుగా నిఁక ద్వాదశివేళఁ బుణ్యభూ
దేవుల కిందు భోజనముఁ దీర్పఁడు పారణకృత్య మీయనున్ 181

క॥ నిరతం బేకాదశివ్రత
మురుభక్తిఁ జలుపుచుండు మొదవు నిహమునన్
గొఱలేని సర్వసుఖములు
పొరసెదు కైవల్యసౌఖ్యములను బరమునన్ 182

క॥ అని యానతిచ్చి కేశవుఁ
డనిమిషులును మునులుఁ జూడ నంతర్హితుఁడై
న నిలింపేశుఁడు మునులును
గొనియాడిరి సత్యజిత్తు గుణసముదయమున్ 183

గీ॥ వారు నల సత్యజిత్తుచే వందనములఁ
బడసి యేగిరి నైజనివాసములకు
సత్యజిత్తు సభార్యుఁడై స్వగృహమునకు
నరిగి విప్రసంతర్పణ మాచరించి 184

గీ॥ ద్వాదశీపారణముఁ జేసి తద్వ్రతంబుఁ
బూర్తిఁ గావించి ధన్యుఁడై పుత్రపౌత్ర
సంపదల నొప్పి చివరకు జాయతోడ
విష్ణుసాయుజ్యమును బొందె విప్రవర్య! 185

గీ॥ కృష్ణ వామకరస్పర్శ మొనసినట్టి
తులసికాభాగమెల్ల శ్యామలతఁ బొరసె
నెసఁగె నద్దానఁ దులసికిఁ గృష్ణతులసి
యనెడు నామము జహ్నుమహామునీశ! 186

క॥ తులసీవృక్షము కెలఁకులఁ
గల పెరమ్రాఁకులు బవిత్రకాయములయ్యెన్
దులసీవృక్షంబులలో
పలఁ గృష్ణాభిఖ్యతులసి ప్రఖ్యాతిఁ గనెన్ 187

క॥ తులసీమహిమముఁ దెలిపితిఁ, దెలిపితి నేకాదశీప్రతిభ నెలనెలయున్
గలిగెడు నేకాదశులీఁ,గల చెప్పుదు నశ్వమేధ ఘనసవ ఫలముల్

సీ॥ మాసమ్ములన్నింట మాఘమ్ము మాధవ
ప్రీతికరమ్మని పెక్కుచోట్లఁ
జెప్పంగఁబడె నట్లె శివుని లింగోద్భవ
మును మహాశివరాత్రి మొదలు గల్గు
శివుని మహోత్సవ దివసమ్ము లల మాఘ
మాసమ్మునందె సంభవములగుట
శివునకు న్మాఘమే చిత్తప్రియంబైన
దయ్యెఁ గావున దానియందు వచ్చు
గీ॥ చుండు నేకాదశులు రెండు నుత్తమములు
దాన నేకాదశీవ్రత మే నరుండు
విధిగఁ జేయునో వానికి వేనవేల
తురగమేధ ఫలంబులు దొరకు విప్ర! 189

గీ॥ మాఘ శుక్లమందు మనుజఁ డేకాదశి
నుపవసించి పండితోక్తభంగిఁ
జక్రి పూజఁ జేసి జాగార మొనరింప
నిహాసుఖములు ముక్తి నెనయు ధ్రువము 190

గీ॥ మాఘమున ఖరాంశుఁడు నక్రమందు నుండ
వచ్చు నేకాదశిని నిట్టుపాస మెవ్వఁ
డుండ కన్నమ్ముఁ దినునో యాతండు బ్రహ్మ
ఘాతకుండయి యుండు నిరంతరమ్ము 191

మ॥ మృగగుండై రవి యుండ మాఘమున శుక్లైకాదశిన్ సక్రమం
బుగ స్నానంబొనరించి శ్రీదయితునిన్ బూజించి యా రాత్రియున్
బగలున్ మాధవ గాధలన్వినిన యవ్వాఁడున్ గృతైనస్కుఁడై
సుఖముల్ పెక్కులు సెంది యంతమునఁగాంచున్ విష్ణుసాయుజ్యమున్

మ॥ భగవానప్రియమైన మాఘమునఁ గృష్ణైకాదశిన్ సక్రమం
బుగ స్నానంబొనరించి ఫాలనయనుం బూజించి యా రాత్రియున్
బగలున్ శంకరసత్కథల్ వినిన యవ్వాఁడున్ గృతైనస్కుఁడై
సుఖముల్ పెక్కులు సెందియంతమునఁగాంచున్ శంభుసాయుజ్యమున్

గీ॥ అఘ వినాశకమైనట్టి మాఘమందు
వచ్చు నేకాదశుల నుపవాసముండి
బ్రాహ్మణులతోడ ద్వాదశీ పారణమ్ము
సేయువాని ఫలమ్మేనుఁ జెప్పలేను 194

సీ॥ శ్రీమత్తపోద్వాదశీదినమ్ముల భగ
వత్కథాసక్తునకుత్కటాచ్ఛ
హృదయున కాచారసదనున కామ్నాయ
వేదికిని గుటుంబి కావృతిమెయి
నావును బుడమిని నపరంజిఁ బట్టముల్
తిలలు సాలగ్రామశిలలుఁ బాలు
దధియును ఘృతమును దాంబూల ముపవీత
మును ఫలం బన్నంబుఁ బూర్ణదక్షి
గీ॥ ణాన్వితంబుగ నొసఁగిన యట్టి సుజనుఁ
డిహమునన్ సార్వభౌముఁడై యెల్లసుఖము

లొంది పరమున విష్ణుసాయుజ్యమొందు
నందియంబు లే దిందుకు జహ్నుమౌని! 195

క॥ ఓ విప్ర! నీ వడిగిన,ట్లే వినిచితి నతిపవిత్ర మేకాదశ్యా
హ్వావిదిత వ్రతమిహపర,భావుకదాయకము మఱియు వ్రతరత్నమ్మున్

క॥ ఈ కథను భక్తియుతుఁడై, యా కఱి వేల్పుకడఁ జదివినాతఁడు నట్లే
యాకర్ణించిన యాతఁడుఁ, జేకొనఁగల రనఘులై విశిష్టేప్సితముల్

వ॥ అనుచు గృత్స్నమదుండు జహ్నువున కెఱింగించిన తెఱంగున ననంగవిరోధి పార్వతికిం దెల్పెనని సూతపౌరాణికుండు శౌనకాది మహామునులకుం జెప్పె. 198

— ఆశ్వాసాంతము —

స్రగ్ధర॥ మంజుస్వాదూక్తిసారా! స్మరితనగధరా! మర్దితాత్మారివీరా!
కంజాతాప్తాభతేజా! కవినివహాగజా! కౌంతికుంతీతనూజా!
సంజీవాంబాహృదీశా! ఛవిశశిసదృశా! సద్గుణాళిప్రకాశా!
రంజచ్చేతోంబుజాతా! ప్రవిమలచరితా! రామయామాత్య నేతా!

— గద్యము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభాషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున సప్తమాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘ పురాణము

## అష్టమాశ్వాసము

క॥ శ్రీనాయక నామామృత,పానాసక్తరసనాశ్రవణ ముఖ్యహృషీ
కా! నరవినుతశ్లోక! పు,రానవకృతి తృప్తలోక! రామసుధీకా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యాశరణ్యులగు శౌనకాది మునివరే
ణ్యుల కఖిలపురాణ కథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె
నవ్విధంబునఁ గైలాసంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబు
నుడువుచున్న మహాదేవుండు పార్వతిం గని దేవీ! వినుము. గంగా
తీరంబున మాఘవ్రతం బొనర్చుచుఁ దన్మహిమాది కథావిశేషం
బులఁ దెల్పుచున్న గృత్స్నమదుండు జహ్నువుం గని 2

గీ॥ జహ్నుమునినాథ! యెవ్వాఁడు శ్రద్ధ వినునో
వాని కెఱిఁగియు మాఘస్నానమహిమఁ
దెలుపకుండిన వాఁ డఘకలితుఁడగును
గాన మఱియును వినుతు నీకేను వినుము 3

## 24 అధ్యాయము

క॥ ఏతఁడు మాఘవ్రత మ
త్యాతతమగు శ్రద్ధ సల్పు నాతండు మహా
పాతకములనుండియు నుప
పాతకములనుండియు విడువంగఁబడు వడిన్ 4

క॥ ఈ మాఘవ్రత మొనరుపఁ
గా మర్త్యుఁడు పొగరుచేత ఘటియించిన యం
హోమండలి దుస్తరమై
భీమంబైనను నశించు వెంటనె విప్రా! 5

గీ॥ అజ్ఞులు నహంయువులుఁ గళింగాధివాను
లైన కొందఱు మును మహాఘాళి సల్పి

మాఘుసువ్రతమున మోక్షమందినట్టి
కథ గలదు విను మద్భుతకరము కరము 6

— కిరాతాదుల కథ —

చ॥ కలదు కళింగదేశము జగమ్మున నెన్నికఁగన్న దందులోఁ
గలఁడు కిరాతుఁ డొక్కఁ డతికల్మషకారుల కీర్చుఁడై శరం
బులు ధనువున్ గరద్వయిని బూని వనంబుల వేఁటలాడుచున్
గలిమి గడించె దొంగ తలకట్టయి హింసలొనర్చు చెట్టయై 7

ఉ॥ అమ్మెయి భృత్యయుక్తముగ నా ఖలుఁ డెన్నొవిధాలఁ గానలన్
గ్రుమ్మరు పుల్గులన్ మెకముకూటువులం దునుమాడి వాని మాం
సమ్ముల మెక్కుచున్ గరుణమాని ధనమ్మునకై సతమ్ముఁ జౌ
ర్యమ్మొనరించుచుండు విను మంతట వేసవి వచ్చె నుచ్చమై 8

సీ॥ అడుగువెట్టినమాత్ర నఱకాళ్ళ బొబ్బలు
గలుగఁజేయుచు నేల గాలుచుండ
మస్తకరోమముల్ మాడిపోయెడునట్లు
దండిరెండల మిన్ను మండుచుండ
నొడలెల్లఁ జఱచుఱ నుడికిపోవఁగ గాడ
గొని వడమటి గొట్టు గొట్టుచుండఁ
దగకు నీరెచ్చోట నగుపడమిని నాల్క
మూరెఁడు లోఁతుకుఁ బోవుచుండఁ

గీ॥ దారు దప్పిన ముదుసలివాఁడుఁ డొకఁడు
త్రోవ నేగుచు దగదొట్టి దూప దీఱ
నీరు నర్మదఁ ద్రావఁగాఁగోరి నడిగ
నడచునెడ వడ దాఁకఁగా నడిమిబాట 9

ఆ॥ సొమ్మసిల్లి లేచి సోమజ డాయక
తాను వోవు నడవిదారియందు
తపుదు నీడ నిల్చుతనుధారి సమితికి
శ్రమముఁ బాపు వృక్షసమితిలోన 10

సీ॥ ఎద్దాని ఫలములు ముద్దుగుమ్మల కాలి
చీలమండల గేలిచేసి మించె
నెద్దాని యూడలు కృషికులౌవారికిఁ
గాఁడిమ్రానులు నౌచుఁ గల్మి నించె
నెద్దాని మూలమ్ము మృతపితలకు నిడు
పిండాలతోఁ గయఁ బేరుఁ గాంచె
నెద్దాని పత్ర మయ్యిందిరాపతికిఁ గ
ల్పాంత వేళను దల్పమై రహించె

గీ॥ నెద్ది నీడలఁ బ్రాణుల నెలమిఁ బెంచె
నెద్ది ద్విజతతి కాశ్రయమిచ్చి మించె
నెద్ది పెంపునఁ బెఱచెట్ల నీసడించె
నట్టి యొక మఱ్ఱిచెట్టుఛాయకును జేరి 11

చ॥ అలసటఁదీరఁ గొంతతడ వందు వసించియు స్నానపానముల్
జలిపెడు కోర్కెసాఁగ జన సాధ్వసదాత కిరాతనేత భృ
త్యులు వెనువెంటరా ద్విజునకున్న పటంబులుఁ బానపాత్రవే
ల్పులుగల సంచి లాఁగికొని భూసుర! దవ్వుల నున్న మమ్ములఁ

క॥ కని నీకడఁ గల్గిన ధన
మును దాఁచితి వెందొ వేగముగ నద్దానిన్
గొని తెచ్చి యిమ్ము లేకు
న్నను బ్రాణము దక్కదనుచు నలియన్ మోదన్ 13

క॥ వ్యాధోత్తమ! నాకున్న వి
వే ధనము లిఁకేవి లేవు వృథగా నన్నున్
బాధించి చంపి బహు నిర
యాధిక కష్టమ్ము లేటికందెదు చెపుమా! 14

ఉ॥ రెక్కలురాని బిడ్డలు దరిద్రత గూరిన కాఁపురంబు నే
దిక్కును మొక్కలుంగనిది దేవుడుగొట్టు కళత్రమయ్యో వీఁ

రిక్కడ నన్నుఁ జంపిన నీ కేగతి కాంచునో నా కుటుంబ మా
ఘక్కని నీ వాకింతరసి ప్రాణముఁ దీయుము బోయరాయఁడా! 15

క॥ అని బ్రతిమాలుచు వ్యాధుని
ఘనకర పదతాడనములఁ గడునొచ్చి నను
దునిమినను గాసు దొరకదు
కనికరమున వదలి మేలుఁ గనుమనుచుండన్ 16

సీ॥ కఠినచిత్తుండు వ్యాఘుండు కరుణ వీడి
కఱకుఁ గరవాలుఁ గైకొని నఱుక వలవ
దనుచు నడ్డంబుగా నిడ్డ యంజలిపుటిఁ
దోలుతఁ దునిమి తునిమె విప్రుగళము వెనుక 17

ఆ॥ అట్లు చంపి వాని యవయవమ్ములయందుఁ
జుట్టుపట్ల మఱుగుచోటులందు
వెదకి యేమిలేమి విసువొంది యా బోయ
పోయె సహితుఁడై స్వపురమునకును 18

క॥ క్రూరుఁడగు నా కిరాతుఁడు
చోరతకును పాపమునకు స్రుక్కక నిత్యం
బూరూరన్ వని వని హిం
సారతుఁడై బహుధనమ్ము సంపాదించెన్ 19

క॥ అటు లార్జించిన ధనమును
విటవృత్తిన్ మద్యపానవృత్తిన్ సతము
త్కటముగ వ్యయముం జేయుచుఁ
గటికితసమ్మున నతండు కాలముఁ గడపెన్ 20

వ॥ అట్టి కిరాతున కొక్క స్వర్ణకారుండు మిత్రుండయ్యె నిఁక వాని
కత వినుము. 21

క॥ సొమ్ములు సేయఁగ బంగా
రమ్మిచ్చిన వారిదిఁ గొంత గ్రసియించి యుపా

యమ్మున నే లోహమె దా
నమ్మెశన మాచరించి నమ్మక యెసఁగన్　22

గీ॥ తూకమున నించుకయు లోటు దోఁపకుండ
మెప్పుగా వస్తువులు చేసి యొప్పగించి
వస్తువులఁ గొనువారిచే బహుధనము మ
జూరిగాఁ దీసికొనుఁ దన నేరుపొప్ప　23

క॥ అతఁడును వ్యాధుఁడుఁ దమతమ
మతులకు నమ్మకము గల్గుమాడ్కిని నెన్నేఁ
బ్రతినలు చేసికొని యనా
రత మర్థార్జనమునందు రాక్షసులగుచున్　24

వ॥ మెలంగుచు నయ్యాతతాయులు సముచ్చయంబు చూచి ధనవంతుల గృహంబుల ననలంబిడి తద్గృహస్థు లయ్యాపత్తువలనఁ బరిభ్రాంతులై యుండ వారి ధనాదుల హరించియు గృహంబులలో జనులు నిద్రాసక్తులై యుండఁ దస్కరించియు బాటలు గాచి బాటసారుల ప్రాణంబులందీసి హరించియుఁ గూర్చికొనిన నానావిధ రత్న స్వర్ణ భూషణంబుల నేనాఁటివానాఁడ కిరాతుండు స్వర్ణకారునకు విక్రయార్థంబీయ నాతండు గొనిపోయి విక్రయించి వచ్చిన మూల్యంబు నం దర్ధం బపహరించి తక్కిన సగంబుతోఁ గిరాతుం జేరి వానికిఁ దూకంబునఁ గొంతయుఁ గ్రయంబునఁ గొంతయుఁ దగ్గించి చెప్పి వాని కా ద్రవ్యంబు సమర్పించి వానివలనఁ దన కష్టంబునకుఁగా నాల్గవవంతు రొక్కంబుఁ బుచ్చికొనుచుండు నన బహ్న వచ్చారు వృగాఁ జూచుచుండ గృత్స్నమదుం డిట్లనియె.　25

గీ॥ అకట! స్వార్థపరాయణులందు మేటి
స్వర్ణకారుండు సత్యంబు జారవిడచి
యాచరించె మిత్రద్రోహమన్న నీకు
నబ్బురం బేటికయ్యె భరామ రేంద్ర!　26

మ॥ ధనవే యున్నంట మిన్నగాఁ దలఁచు స్వార్థవ్యగ్రుఁ డేవేళఁ దా
జనయిత్రిన్ జనకున్ సహోదరుఁ దనూజాతున్ గురు న్మిత్రు వి
ప్రుని వింతుం జెడఁదిట్టియేని శపథమ్ముల్ జేసియేఁ బాదతా
డనమున్ సల్పియునేని దీర్చికొను స్వేష్టంబుల్ వినష్టాత్ముఁడై 27

గీ॥ అల కిరాతక స్వర్ణకారులకు వారి
గ్రామమునఁ గాఁపురంబుండు కాఁపు కొడుకొ
కండు బసవన్న యను పేరు గల్గువాఁడు
స్నేహితుండయ్యెఁ దత్కథ న్వినుతు వినుము 28

— చంద్రవదన చరిత్రము —

వ॥ బసవన జనకుండగు ధర్మయ్య 29

ఉ॥ తాతలనాఁటనుండి కులధర్మము దప్పక సేద్య మెంతయున్
బ్రీతిగఁ జేసి దానఁ గడు విత్తము గూడఁగఁ బెట్టి భూసుర
వ్రాతముఁ దన్పి దేవగురుభక్తి నెసంగిరి కాఁపు లందులో
నాతత సద్గుణవ్రజసుధాంబుధి ధర్మయ నిర్మలాత్ముఁడై 30

క॥ పెద్దల సేవించుచుఁ దన, పెద్దలవలె బుద్ధి గలిగి పేదపజలకున్
విద్దెలఁ జదివెడివారికిఁ, దద్ద ధనంబిడుచు నీతిఁదప్పక మెలఁగెన్ 31

గీ॥ వానికిం బూర్వభవకృత పాతకమున
భార్యగా నయ్యె నతుల సౌందర్యసదన
చంచలమనస్క పరపురుష ప్రసక్త
చంద్రవదనాభిధాన గజేంద్రయాన 32

వ॥ ఆ చంద్రవదనయు 33

సీ॥ మెఱుఁగుఁదీవియవోని మేనిపైఁ గఱిమబ్బు
సొరు గేరెడు నీలిచీరఁ గట్టి
నీలాలగని మించు నెఱిగొప్పుపైఁ గమ్మ
తావు లీనెడు పూలదండఁ జుట్టి
పున్నమచందురుఁ బోలు నెమ్మోముపైఁ
బొలుపుగాఁ గుంకుముబొట్టుఁ బెట్టి

వలపలిచే లిక్కి వామకరమ్మున
గడ్డిగుడ్డను జెల్వుగాఁగఁ బట్టి

గీ॥ విడెముకతమున దానిమ్మవిత్తులట్టు
దంతములు గ్రాలఁ గంతుని దంతిలీల
వాలుఁజూపులఁ జూపఱు డీలుపడఁగఁ
బొలము వోవుచునుండు నక్కులుకులాఁడి 34

సీ॥ ఈనాఁడు తూరుపుచేనికే నేఁబోదు
నీవు రా తోడుగా నెలఁత యనుచు
నీనాఁడు గీమున నేనొకర్తునె పని
చాల యున్నది పోదుఁ జాన యనుచు
నీనాఁడు కట్టెల కిప్పుడే చొప్పదో
డ్డికిఁ బోవవలయు నే సకియ యనుచు
నీనాఁడు మామారి కేఁ బువ్వఁగొని పడ
మటి చేనికేగెద మగువ యనుచు

గీ॥ బావినీటికిఁ బోయినపట్ల ఱోటి
చెంతకేగినయెడ నొద్దఁ జేరియున్న
పడఁతితో ముచ్చటించినపగిదిఁ దనదు
విటుఁడు వినఁ బల్కుచుండు నక్కుటిలశీల 35

గీ॥ చెడిపెద్దైన చంద్రవదనకడుపునందుఁ
బుట్టె బసవయ్య యనుపేరి బుడుత యతఁడు
చిన్నవాఁడుగ నున్నపై కన్నతండ్రి
ధర్మయూఖ్యుండు చేరె స్వర్ధామమునకు 36

చ॥ బసవయ కన్నతండ్రి త్రిదివంబునకేగుటయుఁ సదా విట
వ్యసము గల్గు తల్లి యదపాజ్ఞలఁ బెట్టకయుంట నిచ్చమై
మెసవుచు విద్దెలం గనక మేగలిఁ గూళలచెల్మి సేయుచుఁ
విసువక చెడ్డచెయ్దములనే పొనరింపఁగఁ బూనె నిచ్చలుఁ 37

గీ॥ యౌవనారంభమగుటయు నాతఁ డర్థ
వంతుఁడును దుష్టసాంగత్యవంతుఁడగుట
జారుఁడగుటకుఁ దడవున్నె సంయమీంద్ర!
చెడి పెత్తల్లికి నితవయ్యెఁ గొడుకు నడత 38

ఉ॥ అమ్మ బోజుంగుకాఁడె బసవయ్యయుఁ గుంటెనకాఁడునై యుపా
యమ్మున వారి విత్తము నహర్నిశమున్ హరియించుచున్ స్వగే
హమ్మున యందె యిద్దఱ కనంగసుఖమ్ములు గూర్చి దాఁ గళ
త్రమ్మును సంతు సచ్చుట దురభ్యసనమ్ముల కిచ్చి సొచ్చుటన్ 39

మ॥ ఒకనాఁ డా బసవన్న తల్లి మదనానూనాశుగవ్రాతబా
ధకు సైరింపఁగలేక జారుఁగవయన్ దద్ధామముం జేరె న
ద్ది కడుం జీఁకటికల్గు రేయగుట సుంతేఁ గొంకులేకుండ నా
డకు నక్కామిని చేరునప్పటికె మిండం డేడక్కో పోవుటన్ 40

గీ॥ వాని రాకఁ గోరి వగలాఁడి యా యింట
నొక్క గదిని వేచియుండె నంత
నామె కొడుకు బసవయాఖ్యుండు నిత్య మా
స్థలమునందె జారఁ గలయుఁగాన 41

క॥ వడివడి వచ్చెడి బసవన
యడుగుల యులి వాలకించి యాతఁడు తన మిం
డఁడుగాఁ దలంచి తా న
య్యెడ నున్న తెఱంగు నాతఁ డెఱుఁగుటకొఱకై 42

క॥ చిఱుదగ్గు దగ్గ బసవన, బిరబిర నచ్చోటకేగి బిగికౌఁగిట న
త్తరళాక్షిఁ జేర్చ నామెయు, స్మరశక్తిన్ మేనుమఱచి సంశ్లేషించెన్

క॥ ఆ తల్లికొడుకు లటు స్మర
భూతావేశమున నొడలి పొగరునఁ దమ దు
ష్కృతకముల మెలఁగిన తరు
వాత నాతి ప్రియుకరముఁ బట్టుకొని యనెన్ 44

గీ॥ ఎంతసేపయ్యెఁ జెలికాఁడ యిచటి కేను
వచ్చి నీ వెందుఁబోతి మా బసవన నెటు
నమ్మఁబల్కెదు నంచను నమ్మ పల్కె
లాలకించి రుషం దల్లి నవలనెట్టి 45

వ॥ బసవన్న యిట్లనియె. 46

క॥ ఓసీ! యెంతటి పాపము, సేసితివే కండక్రొవ్వుచే నీ గొంతున్
గోసినను గోయఁదగుఁ బురిఁ, బాసి చనుము నేఁడు నేను బసవననైతిన్

క॥ నీవిట్టి చెడిపెవైతివి, కావున నా చెనఁటిసేఁత గర్హింపక నన్
బోవిడిచితి వాఁబోతటు, పో వేగమ తగదు నీదు మోమింకఁ గనన్

గీ॥ అనుచుఁ జెడఁదిట్టి బసవన యచోటు వీడి
నిజగృహమ్మునకుం జేరె నెలఁత లేచి
దుఃఖమొందుచు నేమియుఁ దోఁచ కూరి
వెలుపలకు నేగి తనమదిఁ దలఁచె నిట్లు 49

ఉ॥ పతి నుడి ధిక్కరించి యుపభర్తలఁజేరి సుఖించి భ్రష్టనై
గతపతి నయ్యెఁగూడ కనుగానక రాఁగల యట్టి దుర్గతుల్
మతిని దలంపలేక స్మరమార్గణపీడకు నోడి భ్రాంతినై
సుతుఁ గవఁగూడితిన్ బ్రతుకఁజూచుట మేలె జనమ్ము దిట్టఁగన్

ఉ॥ పుట్టితిఁ బెద్దకాఁపునకుఁ బున్నెపుటెంకికిఁ బట్టినై కయిం
బట్టితిఁ జాగియున్ సుజనమాన్యుఁడు ధర్మయు కాలినై చెడ
న్గొట్టితి రెండువంశములనున్ బజరోసిన అంకులాఁడినై
కట్టితి నిల్లు ఘోరనరకంబునఁ బెన్వేత లొందుచుంటకై 51

క॥ జారిణినై పరపూరుష,వారముతోఁ గలసి భ్రాంతివశత సుతునితో
మారసుఖంబులనొందితి,లేరెట ననుఁబోలు చెడిపెలేమలు పుడమిన్

క॥ నా పాపమయ శరీరము
నోపఁడు కాల్పంగ నగ్నియు సమస్త మహా

పాపములవలనఁ బాపఁగ
నోపినయది జహ్నుతనయ యొక తెయె యగుటన్ 53

వ॥ నేనా విష్ణుపాదోద్భవయు భవజటాజూటాలంకారయుఁ బతితపావనయు నగు భాగీరథీజలంబులం దుమికి ప్రాణంబుల వదలుటదక్క నిఁక చేయఁదగు కార్యంబులేదని నిశ్చయించికొని తద్గాఢాంధకారపూరితార్ధరాత్రంబున నిటనుండిబయలుదేరి తెరువరయక పురుగుంబుట్టలకుఁ బెనుమెకంబులకు వెఱవక మిట్టపల్లంబు లెక్కచు దిగుచుఁ బడుచు లేచుచుఁ దగిలెడు దెబ్బలనెంచక తానొనర్చిన ఘోరపాతకంబులఁ దలంచి పశ్చాత్తాపంబు నొందుచు రెం డహోరాత్రంబులు తెంపులేని నడక నడచి యెట్టకేలకు గంగాతీరంబు నకుఁజేరి కరపదవదన ప్రక్షాళనంబు లాచరించికొని తదభిముఖయై యంజలి ఘటించి 54

గీ॥ తల్లి! నా పాతకమ్ముల కెల్ల లేదు
దూరముననుండి నీ పేరుఁ బేసుకొనిన
వారి దోసమ్ములడఁపఁగా వలఁతి వీవ
టంచు విజ్ఞులు పలుక నాలించియుంటి 55

గీ॥ అమిత పంకాన్వితము మామకాంగ మిపుడు
నీ జలాహతి విమలమై నిర్జరాల
యమున కేగఁగ నర్హమా ననుచు నెంచి
దూఁకుచుంటిని నీలోన వాఁకమిన్న 56

క॥ అని పైఁటచెంగు నడుమున
కును బిగువుగఁ జుట్టి కృష్ణ! గోవింద! హరీ!
వనజేక్షణ! నారాయణ!
యనుచుం గుప్పించి గంగయందున్ దుమికెన్ 57

వ॥ అట్లు దూఁకిన యా చంద్రవదన సాహసంబున కఖిలభూతంబులు వచ్చెరువందె నంత 58

క॥ ఆ దినము మాఘ కృష్ణైకాదశి యగు కతమున నల కంజేక్షణ నా
నాదురిత పరిచ్యుతయై, దేదీప్యాకృతి వహించి దివమున కేగెన్ 59

గీ॥ ఎంత పాపిష్ఠయైన నా యింతి మాఘ
మాసమునఁ గృష్ణమున హరివాసరమునఁ
గల్యమున జాహ్నవిం బడి కాలధర్మ
మొందుటం బుణ్యలోకంబుఁ బొందె విప్ర! 60

ఉ॥ ఇంతటి దుష్టమానసలు పృథ్విని గొండఱు కల్గియుంట నే
కాంతముగాఁ గుమారుకడనైనను సోదరుచెంతనైనఁ బి
త్రంతికమందునైనఁ జపలాక్షులు నిల్చుట కర్గనేని ద
త్స్వాంతము సంచలించునని జ్ఞానులు పల్కిరి మున్ను సంయమీ!

చ॥ బసవనయట్లు తల్లికడఁ బాసి స్వగేహముఁ జేరి రాత్రిఁ దాఁ
బసరమురీతి సల్పిన యపారమహాఘముఁ జూడ నేరికిన్
బొసఁగదటంచు నెంచి పెఱవాల్తులఁ గూడుచు జూదమాడుచున్
విసువక త్రావుచుం దనదు విత్తము మొత్తము పాడుసేసెఁబో

ఉ॥ మానిసి పాపపుణ్యములు మర్త్యులు గాననిరీతిఁ జేసినన్
భాను శశాంకులుం బవనపావకు లుర్వి నభో జలంబులున్
వాని మనమ్మరేలును బవళ్ళును సందెలు ధర్మముణ్ జమ్ముం
డూనినశ్రద్ధఁ జూచుచునెయుందురు గావున దాఁగ దేదియున్ 63

గీ॥ అట్లు బసవన్న దుర్వృత్తులందు మెలఁగి
నిలువ నీడయుఁ దినఁగఁ దిండియును లేని
యట్టిఁడై తుద బ్రహ్మఘ్నుఁడైన వ్యాధుఁ
జేరి జీవించుచుండెఁ దత్కూరవృత్తి 64

గీ॥ బ్రహ్మహత్యా సురాపాన పాటవుండు
వ్యాధుఁడున్ సువర్ణస్తేయి యైన స్వర్ణ
కారుఁడున్ జననీద్రోహి కాఁపుకోడె
కాఁడు మువ్వురు సంగడికాండ్రు వింటె 65

క॥ ఎంతటి పాతకమైనను
స్వాంతమ్మున జంకులేక జరుపుచుఁ గడు దు
శ్చింతాపరులయి మెలఁగఁ ద
దంతికముం జేరె నొక్క యధమద్విజుఁడున్ 66

వ॥ అతండు 67

— విశృంఖలుఁ చరిత్రము —

చ॥ తన పిననాఁటనుండి తలిదండ్రులు చెప్పినరీతిఁ జోక వి
ద్దెను గ్రహియింప కెప్డు చెడుతెన్నులఁ గ్రుమ్మరువారిఁ జేరి చెం
తనుగల గేస్తులన్ వెతలఁ దార్కొనఁజేయుచు బ్రహ్మచారి య
య్యును గులశీలముల్ వదలి యోగ్యుఁడుగామి విశృంఖలున్ సుతుల్

గీ॥ మానసంబున రోసి యవ్వానిఁ దల్లి
దండ్రు లిద్దరు వీడి కాంతారమునకుఁ
జనిరి తపమునఁ గడతేరు మనముతోడ
నంతట విశృంఖలుం డశనార్థి యగుచు 69

క॥ ఎవ్వరియింటికి నేగిన, నెవ్వరుఁ దన పొట్ట కన్నమిడకుండుటచే
నవ్వసుధామరపుత్త్రికుఁ,డవ్వీటన్ బ్రదుకుమార్గమరసి దొరకమిన్

గీ॥ ధర్మతస్కర మాతృతల్పగులభంగి.
బ్రాహ్మణధ్వంసి యగా వ్యాధు పజ్జఁ జేరి
స్నానసంధ్యాదికము లనాచారములను
వదలి వాఁడిచ్చు ధనముతో బ్రతుకుచుండి 71

గీ॥ బోయ చెప్పినచోటికి నాయవార
మనెడు మిష నేగి యచ్చటి యానుపాను
లెఱిఁగి యేం తెంచి సర్వమ్ము నెఱుఁగఁ జెప్ప
వ్యాధునకుఁ జౌర్యవిధి సులభముగ జరుగ 72

సీ॥ వ్యాధుండు తన మిత్రవర్యులతోఁ గూడి
యార్జించు పెద్దద్రవ్యమ్మునందుఁ

గీ॥ జాహ్నవీ స్నానపరుఁడైన జనుని రీతిఁ
కృచ్ఛ్ర చాంద్రాయణమ్ములనెల్లఁ జేసి
వ్రతము లుపవాసములు సల్పి పాయు నెఱుక
లేమిఁ జేసిన పాపమ్ము లా మనుజుఁడు 79

గీ॥ అటు మహాపాతకి వ్రజ మమితమైత్రి
నుండు కాలమ్మునం గిరాతుండు పనుప
నాయవారంపు మిషను గ్రామాంతరమున
కేగుచుండిన యట్టి విశృంఖలుండు 80

— విశృంఖల వీరవ్రతుల సమావేశము —

సీ॥ కరిరాజసంరక్ష! కమలాక్ష! గోవింద!
భవహర! యను చెప్పుఁ బలుకువానిఁ
దీర్ఘ సేవకుఁడొటఁ దెలిపెడు కాశికా
కావటి మూఁపునఁ గ్రాలువాని
శంకరాభేదంబు సమకూరిన విధాన
భూతి పూర్ణత మేను బొదలువానిఁ
గుశలు హస్తంబులఁ గుత్తుక రుదురక్క—
దండలు దండిగాఁ దాల్చువానిఁ
ఆ॥ గప్పు మెకముతోలుఁ గప్పిన మైవానిఁ
బాగ యడఁగిన మంటఁ బోలువాని
విప్రతిలకుఁడగుచు వీరవ్రతాఖ్యచే
నమరువాని సదయుఁడైనవాని 81

ఆ॥ కాంచి మ్రొక్కి యెదురుగా నిల్వఁబడి యంజ
లించియున్న యాయకించను గత
పుణ్యు ఘోరకలుషపూరితు వీరవ్ర
తుండు చూచి పలికె నిండుకరుణ 82

క॥ జన్నిద మొక్కటి బుజమున
నున్నది బ్రాహ్మ్యమ్ము నంతయును గానఁగరా

కున్నది మోమున నెవ్వఁడ
వన్నా! యిటు జోలెఁ దాల్చి తతి దీనుఁడవా? 83

క॥ ఎచ్చటికి కేగెదవని తను
నచ్చెరువుగఁ జూచి యడుగు నా ద్విజవరుతో
సచ్చరితునితో ధిషణా
వచ్చంద్రునితో వచించె వాఁ డీ రీతిన్ 84

వ॥ మహాత్మా! నేను బ్రాహ్మణవంశంబునఁ బుట్టియు 85

చ॥ చదువక యెప్డుఁ గాపురుషసంగతినై తమ మాట మీఱునన్
వదలి మదంబయుం బితయు వందురుచున్ వని కేగఁ దింట కే
మొదవమి నాఁకటం గుమిలి మొక్క కిరాతుని జేరి వాని పం
పు దలధరించి చేయుచును బుచ్చెదఁ గాలము భూసురాగ్రణీ! 86

వ॥ ఈ వేసంబున పోకడయు నక్కిరాతుని పనుపున నే యనుచు 87

క॥ మీ మోముఁ జూచినంతన
నా మనమున నేదొ వెఱ ఘనంబుగఁ దోఁచెన్
స్వామీ! మహామతీ! నా
కేమైనను మంచి మార్గ మెఱిఁగింపుఁడనన్ 88

క॥ వీరవ్రతుండుఁ గుండీ, సారావగ నీటఁ గంటిజంటఁ దుడిచికొం
చోరిమి ఘటికాద్వయి ధ్యా,నారూఢుండై యెఱింగె నాతని గాథన్

వ॥ అట్లు తెలిసికొని వీరవ్రతుండు 90

## 25 అధ్యాయము

క॥ ఓయి విశృంఖల! వినుము త్వ
దీయంబైనట్టి బ్రహ్మతేజంబెల్లన్
బోయినదిగాక కడుపునఁ
దోయజభవ కల్పకోటిఁ దొలఁగని యఘముల్ 91

— వీరవ్రతుండు విశృంఖలునకు వాని పాపములు చెప్పుట —

వ॥ నిన్నలమికొని యున్నందులకుఁ గారణంబు లెఱింగించెద సావధా
నుండవై వినుము. నీవు బ్రాహ్మణవర్ణంబున సాధుదంపతులకుఁ

వనయుండవై పుట్టియుఁ గులాచారంబున వేదాధ్యయనంబు సేయక బ్రహ్మచారివయ్యు నాశ్రమధర్మంబు నడపక తలిదండ్రుల మాట వినక వారి హృదయంబుల కధికకష్టంబుఁ గలిగించి వనంబున కేగు సట్లొనర్చి పితృబాధకుండవైతి వద్దాననే పుణ్యలోకంబులకరుగ నసర్హుండవైతి వంతియకాక భిక్షకేగియు సజ్జనులవలనఁ బొట్టకుఁ బట్టెడు కూడునుం బుట్టించుకొననేరవైతి విప్రుడు పొట్టకూటికై నీ చేరిన కిరాతుం డెట్టివాఁడైనది యెఱుంగవేమొ తెల్పెద వినుము

సీ॥ వేఁటల నెప్పుడు విహగమ్ముల మృగమ్ము
లను జంపి వాని పలలముఁ దినుచుఁ
గ్రూరత విత్తమ్ముకొఱకు బ్రాహ్మణ హింస
సేయుచుఁ ద్రావుచు స్తేయి యగుచుఁ
జరియించు నతనికి స్వర్ణకారుఁడగు భ
ర్మ స్తేయి యొకఁడును మాతృరతుఁడు
జూదరి జారుఁడు సురఁ ద్రావుచుండెడు
కాఁపువాఁ డొకఁడును దాఁపురించి

గీ॥ రెంతయేనియు నమ్మిన యితవరులయి
వారు మువ్వురు సేయని పాతకమ్ము
లింక నెచ్చట లే వట్టి హేయగుణుల
నాశ్రయించితి వీ వశనార్థివగుచు 93

గీ॥ అమ్మహాపాపిజనుల స్నేహమ్మువలనఁ
దావక బ్రహ్మవర్చస్సు త్వన్ముఖమున
నావగింజంత లేకుండ నడఁగిపోయె
నంతియేకాక నీకు మహాఘ మబ్బె 94

ఉ॥ జాతినిబట్టి నీవును ద్విజత్వముఁ గల్గినవాఁడవౌట సం
ప్రీతిఁ బురోహితుండుగ వరించి దురాశకతమ్మునన్ మహా
పాతకులైన యా ముగురు పల్మరు దానములీయఁ బట్టుటన్
నీతను వెల్లఁ దత్కలుష నిర్వ్యధితంబయిపోయెఁ జూచితే 95

సీ॥ వినవోయి! యెవ్వఁడు ధనలాభమునకయి
సహజబుద్ధినినైన స్వామివశత
నైన బలాత్కృతినైన మహాపాత
కోపపాతకులతో నొక్క క్షణము
తాఁకుచుఁ బల్కుచు దర్శించుచుండునో
వాఁడు దత్పాపముల్ వడసి యంత
వాఁడౌను దత్పాపపరులతో మాటాడఁ
దప్పునిసరియైనఁ దన కరమున

గీ॥ దర్భ ధరియింపవలయు నెందాఁక వారి
దర్శనాదులు తప్ప వందాఁక నట్లు
తాల్పకుండినవాఁ డెంత ధన్యుఁడైన
నడ్డలేఁ డకొ్కలం దను నంటకుండ 96

గీ॥ తన్మహాపాత కోపపాతకులఁ గలసి
భోజనాలాపసంగతిఁ బొదలువాని
పాప మిట్టిది యని చెప్ప పటిమ నలువ
కైన వేనోళ్ల పెంజిల్వకైన లేదు 97

క॥ కావున నేండ్లకొలందిగ, నీ వా పాతకుల మైత్రి నెఱపితివగుటన్
నీ వదనమ్మును గనుచున్, వావిచ్చి వచింపఁదగదు నాబోటులకున్

గీ॥ బ్రహ్మహంత సురాపుఁడు భర్మహరుఁడు
గురుకళత్రరతుఁడను నల్గురును జూడఁ
గా మహాపాతకులు వారిఁ గలసియుండు
నతఁడు పంచమపాతకి యనఁగఁబరఁగు 99

క॥ పంచమహాపాపులటం, చంచితముగ నెఱిఁగి మైత్రి యవ్వారలతోఁ
గొంచింపక సలుపునతనిఁ,బంచమునట్టులఁ ద్యజింపవలె దూరమునన్

వ॥ అట్లు పలికి వీరవ్రతుండు తూష్ణీంభావంబున నుండుటకు బ్రాహ్మ

సాధముండైన విశృంఖలుండు భయకంపితగాత్రుండై పశ్చాత్తాప
తప్తుండగుచు సాఁగిలి మ్రొక్కి లేచి నిలచి యంజలిబద్ధుండై 101

క॥ అక్షీణమ్మగు మత్పాపక్షయకృతి నిపుణమైన ప్రాయశ్చిత్తం
బీక్షణము తెలిపి సత్కృప, రక్షింపవె నన్ను భూసురవ్రజమాళీ!

క॥ దీనుఁడయి యట్లు మొఱ యిడు
వానిం గని భూతసమితిపైఁ గనికర మెం
తేనిం గల వీరవ్రత
భూనిర్జరవరుఁడు చెప్ప మొదలిడె నిట్టుల్ 103

— వీరవ్రతుండు విశృంఖలునకుఁ బ్రాయశ్చిత్తంబుఁ జెప్పుట —

గీ॥ ఓ విశృంఖల! నీ కిప్పు డోదవినట్టి
పంచమమహాఘమునకు మున్ ప్రథితభంగి
స్మృతుల మన్వాదికోక్తమై యెల్ల రాచ
రించుచున్న ప్రాయశ్చిత్త రీతి వినుము 104

మ॥ ఒకచో నిల్వక తీర్థసేవకుఁడవై యూరూర నింటింట నో
పికతో మాధుకరమ్ముఁ దెచ్చి తినుచుం బెక్కండ్రతో నాత్మపా
తకముల్ బల్కరుఁ జెప్పుకొంచు ద్వాదశాబ్దంబుల్ వ్రతం బిట్లు పూ
నికమై నిర్వహణంబొనర్పవలయుః నిష్ఠాగరిష్ఠుండవై 105

గీ॥ ద్వాదశాబ్దవ్రతుండవై ప్రతి శరత్తు
నందు మృగగతుఁడై రవిమాఘమునను
వెల్గఁగఁ బ్రయాగలోనఁ ద్రివేణికా సు
సంగమునఁ దోఁగి హరిని గాంచంగవలయు 106

క॥ గంగా కాళిందీ భవ
భంగమ్ములు చామరలుగ వట మెల్లిగ నీ
లాంగుఁడు మాధవుఁ డొడయం
డుంగాఁ బ్రయాగ మొప్పెడుం దీర్థపమై 107

గీ॥ పుష్కరయుతమ్ములు విధూత దుష్కృతమ్ము
లైన గంగా సరస్వతీ యమున లను మ
హానదులు మూఁడు కెలఁకుల ననుసరింప
గణుతిఁగన్న ప్రయాగకుఁ గలదె సాటి 108

క॥ మోక్షాపేక్షుల కమృతము, పక్షిధ్వజువలన సంభవమగునని బుధా
ధ్యక్షుల నెదరలనందక, కాక్షేయకయు క్ప్రియాగ ఘనమన్నింటన్

గీ॥ కాశికా మరణము ప్రయాగ స్మరణము
మనుజునకు ముక్తి నిడునంద్రు మహితధిషణు
లంతటి ప్రయాగమున స్నానమాచరింపఁ
గలిగెడు ఫలమ్ము తెలిసికోఁగలఁ డెవండు 110

క॥ మృగయుతమగు మాఘమ్మున
ఖగుఁడుండంగాఁ ద్రివేణికా సంగమెునన్
దగు తజ్జలమజ్జనమున
నగు శుద్ధుం డెట్టి పాపియైనఁ గుమారా! 111

ఉ॥ దీనను శంకలేదగుటఁ దేఁకువతోడ సమస్త తీర్థసే
వానిరతుండవై యుదరబాధను మాధుకరానఁ బాపు చెం
దైనను స్థాయిగా నిలక హాయనముల్ పదిరెండు పుచ్చు మ
హైన నశించుఁ దావకమహాఘము పంచమ మో ద్విజాత్మజా! 112

సీ॥ పంద్రెండు సమ లిట్లు వ్రతముఁ గావించుచుఁ
బ్రతి సమ రవిమకరమున నిలువ
మాఘమ్మునఁ బ్రయాగ మజ్జనమ్మొనరింపు
మది యసాధ్యంబైన నర్ధమేని
సలుపు మయ్యదియును సాఁగని-చో మూఁడు
సమలైనఁ జేయు మా చాయఁగూడ
నమరనియట్లైన నాదిమధ్యాంతమ్ము
లం దొక్కయేఁడైన నాచరింపు

గీ॥ మట్లు గావించి కడపటి హాయనమునఁ
జివర మాసంబు ధేను భక్షితములైన
కొలుచుఁ బక్వమ్ము గావించికొని భుజించి
తేనిఁ బారిశుద్ధ్యమ్ముఁ జెందెదవు వత్స! 113

గీ॥ అనుచు వీరవ్రతుఁడు దెల్ప నాలకించి
యా విశృంఖలుఁ డేఁ దప్పు కాచరింతు
ననుచు నతుఁడయి యెంతేని వినయ మెసఁగఁ
బలికె నీ రీతి గద్గద భాషణములు 114

గీ॥ శాంతభావులు మీరు నా జల్పములకుఁ
గోపపడరంచు నెంచి సంకోచ ముడిగి
విన్నపం బింక నొండు గావింపనుంటి
బుధులకుఁ బరోపకారమ్మె ముఖ్యముగద 115

గీ॥ తాఁ దరించి పిమ్మటఁ బరతరణమునకుఁ
బూనవలెనని తమవంటి బుధులు వలుక
వింటిఁ గావున నా మిత్రబృందమును ద
రింపఁజేయంగ నెడఁదఁ గోరికి జనించె 116

క॥ ఆ లుబ్ధకముఖమద్ధితు,లేలాగున, దన్మహోగ్రవృజినచ్యుతులై
మేలుంగనెదరు? నే న,య్యాలుదినినధాన్య మెట్టు లయ్యా! తినుటల్

వ॥ ఇవ్విషయములు తేటపడ బోధింపవే యని కేల్మోడ్చిన వీర
వ్రతుండు చిఱునగవుతో నిట్లనె. అయ్యా! గోవులు ధాన్యము దిని
పేడ వెట్టినచో నందు ధాన్యముండును. వానిని గడిగికొని పక్వము
చేసికొని భుజింపవలయునని నేనింతకుమున్న నుడివితి. తెలిసినదా?
ఇఁక నీ మఱొక ప్రశ్నము నందుకొనెద. విశృంఖలా! నీ మైత్రి
మిపులఁ బ్రశస్యముసుమీ! 117

— వీరవ్రతుండు మైత్రిఁ బ్రశంస సేయుట —

మ॥ తన మిత్రుం డెటువంటి నీచుఁడయినన్ ధర్మచ్యుతుండైన దు
ర్జనతాపూరకుఁడైన మందుఁడయినన్ రాగాన్వితుండైన రో

గనిధానుండయినన్ దరిద్రుఁడయినం గ్రౌర్యప్రియుండైన నా
తని వర్జింపక యోగ్యుఁ జేయుటయె కర్తవ్యంబు ధీశాలికిన్ 118

క॥ చుట్టలు లెస్సగ నున్నెడఁ
జుట్టుక్ ముసరెదరు చెడినచో నవ్వానిన్
ముట్టరు చూడరు మిత్రుం
డెట్టి దశ న్విడక మంచియే ఘటియించున్ 119

క॥ సుతులును భార్యయు బంధు
ప్రతతియుఁ ద్యజియించినట్టి భాగ్యరహిత దు
ర్గతికున కెయ్యెడలను స
ద్ధితుఁడే దరినున్న కల్పవృక్షం బరయన్ 120

ఉ॥ కర్ణుఁడు పాండవుల్ దనకుఁ గాదిలితమ్ము లటన్నమాట సం
పూర్ణముగా నెఱింగి యయ బోధమొనర్చెడు కృష్ణు మాటలం
గర్ణములీక మిత్త్రుఁడగు కౌరవనాథు నెగూడి సంప్రహా
రార్ణవమందు మున్గి తన ప్రాణములిచ్చెను దజ్జయార్థియై 121

గీ॥ కొలువవచ్చిన దొరల నట్టులనె నిలిపి
చదువునెడఁ దాము చేసిన సఖతవలనఁ
గడు దరిద్రుఁ గుచేలుని గౌరవించి
యిడె నమృతలక్ష్మి హరి మైత్రి కేది సాటి 122

మ॥ తన భార్యాగ్రహపాత్రుఁడై నయనబాధం గన్న యక్షేశ్వరున్
ధననాథుండుగ రాజరాజుగ దిగధ్యక్షుండుగాఁ జేసి చెం
తనె వాసంబు నొసంగి ప్రోచె హిమవద్ధాత్రీధరవ్రాతరా
ట్తనయావల్లభుఁడైన శంకరుఁడు మిత్రత్వ ప్రభావంబునన్ 123

గీ॥ ఎదిరి నెదిరించి పోరెడు నింద్రతనయు
వాలి రణధర్మవిముఖుఁడై కూలనేసెఁ
బొంచి రాఘవరాముండు భువననుతుఁడు
హితున కుపకృతి సేయుటె హెచ్చటంచు 124

క॥ క్షితి నెట్టికృతఘ్నుఁడును నిజహితునకుఁ దనమర్మమెల్ల నెఱిఁగించును న
కృతమున మిత్రద్రోహము, మితిలేనియఘాళి దాన మేకొనుఁదిరమై

క॥ కలగుట్టు మట్టులెల్లను
దెలిసినవాఁడౌట నపకృతిన్ మిత్రునకున్
సలుపుట సులభమయగు న
కృలుష మడఁగ దెట్టు లెన్నికల్పములైనన్ 126

వ॥ కావున నెవ్వండేనియు నెక్కృతమ్మైనను మిత్రునకు ద్రోహంబు తలపెట్టక వలసెనేనిఁ దన ప్రాణంబులొడ్డియైన సాయమ్మొసేయుట న్యాయమ్ము. 127

గీ॥ కాన నీ మిత్తృలం జేరి నేను నీకు
వినిచినట్టి ప్రాయశ్చిత్తవిధిని దెల్పు
మద్ది గా కొంచులేదన్న నా విశృంఖ
లుండు విని వినయమ్మున దండములిడి 128

వ॥ మహాత్మా! మీ రానతిచ్చినవిధంబున ద్వాదశాబ్దంబులు జఱిపిన పిమ్మట నాకిం కెట్టి ప్రాయశ్చిత్తంబు గలదో సెలవిండని ప్రార్థింప నతం డతికష్టసాధ్యంబగు దీని నాచరించి పూతుండవై నాకడకు రమ్మెప్పుడు నీకుఁ దెలుపవలసిన విశేషవిధానంబు లెఱింగించెదఁ బొమ్మన విశృంఖలుండు పీరవ్రతునకు మ్రొక్కి తదనుజ్ఞం బడసి రయంబున వ్యాధునికడకుం జని నిర్భయుండై యిట్లనియె 129

ఉ॥ ఓరి కిరాత! మీ చెలిమినుండి తొలంగితి విందు వట్టె త
త్కారణ మీవు నన్ను నుపఁగాఁ బొరుగూరికిఁ బోవు నేను నా
దారిని గంటి జంటతలదంటను మించిన తేజువానినిన్
మాటట శంకరుం డనెడిమాడ్కి నెసంగినవాని జ్ఞానినిన్ 130

వ॥ కని కనులు మిఱుమిట్లుగొలుపు వాని తేజున కచ్చెరువొందుచు మ్రొక్కి నిలచిన నమ్మహనీయుండు మచ్చరిత్రంబంతయు నంత ర్దృష్టి నెఱింగి నాకుం దెల్పె నందు మీ చరిత్రంబెల్ల నిమిడియున్నదని

వీరవ్రతుండు దనకుం జెప్పినట్టిల్ల వృత్తాంతంబును వారికిం జెప్పి
తదుక్తరీతి మత్స్యాపప్రాయశ్చిత్తార్థం బిదె తీర్థసేవ కరుగనుంటినను
విశృంఖలు వచనంబులు విని దానం దమ పూర్వకృత్యంబులు
స్మరణకు రా భయకంపితగాత్రులై పశ్చాత్తాపంబొంది వ్యాధా
దులు మువ్వురు విశృంఖలుం గని 131

క॥ ఎవ రెటులాడినఁగానీ, యవనీసురపుత్ర! నమ్మినట్టి జనములన్
దివిరి కృప నుద్ధరింపఁగఁ, దవుదక్షులు భూసుపర్వతల్లజులె సుమీ

క॥ ఓ మిత్రమ! నీ సుకువుల
మా మనములు మాఱి నీదు మార్గమె పట్టన్
గా మొనసెం గావున నీ
కా మహనీయుండు దెల్పినట్టి విధంబున్ 133

గీ॥ తెలుపుమని వేఁడికొని విశృంఖలునివలన
మహిత వీరవ్రతోక్త ధర్మములు పాప
నిష్కృతి విధానములు వ్రతనియమములు నె
ఱింగి వెనుకటి నడతఁ దొఱంగి యపుడ 134

చ॥ తమకుఁ గలట్టి ద్రవ్యమును ధాన్యములుం గనకాదికంబు లు
త్తమ ధరణీసుపర్వులకు దైవము గుళ్ళకు నన్నవస్త్ర లో
పములు గలట్టివారలకుఁ బంగుల కంధుల కామ యార్తబృం
దముల కనాథపాళికి జనంబులు మెచ్చఁగ నిచ్చి రెచ్చుగన్ 135

గీ॥ అటులు తమకున్నదెల్ల వ్యయమ్మొనర్చి
వారు నల్వురు స్నేహానుబంధములను
ద్రెంచుకొని యెవ్వరికి వారె తీర్థసేవ
నాధిగతచిత్తులై యేగి రమలచరిత! 136

గీ॥ ఆ క్రితుం జన్నవారలయందు లుబ్ధ
కుండుఁ గమసాలియును బాదజుండుఁ దమకుఁ
బేరిమి విశృంఖలుండు దెల్పినవిధానఁ
జేసి గతపాపులై శుద్ధిఁజెంది యవల 137

క॥ తమతమ గృహములకుం జని
తమవారలం గూడి ధర్మతత్పరమతులై
కొమరులతో మనుమలతో
నమరి సుఖంబంది దివికి నరిగిరి చివరన్ 138

క॥ వ్యాధాకులవిడి యప్పుడ, మాధుకరాన్నాశియై కుమారసురసుతుం డే
బాధల లెక్కింపక బుధ, బోధవలనం బూనెం దీర్థములు సేవింపన్

— విశృంఖలుని తీర్థాటనము —

సీ॥ మొదల దక్షిణతీర్థముల కేగి బ్రహ్మఘ్న
దురిత విధ్వంసి సేతువును జూచి
రామప్రతిష్ఠిత రామనాథుని గాంచి
యిద్ధ ధనుష్కోటి నిసుకం బట్టి
దర్భశాయిని రాము దర్శించి దక్షిణ
వార్ధులం దోంగి శ్రీ పద్మనాభ
పాదనమ్రు నసంతశయనమ్ముం గన్యాకు
మారికాదుల కేగి మధురం జేరి

ఆ॥ వేగవతిని మునింగి వీక్షించి మీనాక్షి
జంబుకేశు సలిలసదనుం గొలిచి
కార్తికమ్మునందుం గావేరిం గ్రుంకి శ్రీ
రంగపురిని రంగనిం గనుంగొని 140

సీ॥ దళిత ఘోరాఘుం జిదంబరేశుని మ్రొక్కి
కంచి వరదరాజుం గాంచి మఱి త్రి
విక్రమస్వామిని వీక్షించి యేకామ్ర
పతికిం గామాక్షికి నతులొనర్చి
కాళహస్తీశ్వరుం గని సువర్ణముఖిని
మునింగి వేంకటనాయకునకు వినతి
సలిపి పినాకినీ స్నానంబు రంగనా
యక దర్శనము నెల్లూరందుం జేసి

గీ॥ మంగళాచల నరసింహు మహిమ నెఱిఁగి
కృష్ణవేణి మునిఁగి యమరేశుఁ గొల్చి
దేశదేశప్రశస్తుఁ గోటీశుఁ జూచి
మల్లికార్జును శ్రీశైలమందిరుఁ గని 141

వ॥ విధూతపాతక యగు పాతాళగంగాజలంబుల నవగాహనంబొనర్చి యటనుండి మహాపాపంబులఁ బాపు నను తమిన్ గౌతమిం జేరి తజ్జలంబుల మజ్జనంబొనర్చి సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న పరివేష్టితుండగు భద్రాద్రి రామభద్రుం దర్శించి ద్వారవతీక్షేత్రావాసంబు గావించి వింధ్యాదిక మహాశైలంబుల రేవాదిక వేగవతుల నధిగమించుచు నిజజల స్నాతకజనశర్మద యగు నర్మదం గ్రుంకి క్రమంబున నవంతీపురిం జేరి శిప్రానదీస్నానం బాచరించి సందర్శనమాత్రన ముక్తినొసంగు మహాకాళేశ్వరుఁ బూజించి మఱియు నందందుఁగల పుణ్యక్షేత్రంబుల నేత్రపర్వంబుగాఁ దిలకించుచు సకలమహాపాపనాశిని యగు కాశిని జేరి 142

సీ॥ దక్షిణోత్తరముల దర్శనీయములైన
యసి వరణా నదు లనుసరింప
వింట నారివితాన వినువాక ప్రాగ్దిశ
నుత్తరగమనయై హాయలు నింప
నంతస్థలైదాఱు నాఱు నొక్కటి గల్గు
సౌధంబు లెల్లెడ సౌరుఁ బెంపఁ
బుణ్యభూమి యటన్న పొగడికకును దగ
సాధుత గోవులు సంచరింప

గీ॥ విసుక చల్లిన రాలన బెలుక మెఱఁగి
ప్రజలు భాగీరథిం దోఁగి బహుళభక్తి
విశ్వనాథున కభిషేకవిధిని దీర్ప
గణుతిఁ జెందిన యక్కాశిఁ గాంచె ద్విజుఁడు 143

సీ॥ కని దినమ్ము నొక ఘట్టమ్మునం దోఁగి
విశ్వేశు జాహ్నవీ విమలవారి
నభిషేక మొనరించి యన్నపూర్ణా విశా
లాక్షులఁ బూజించి యధికభక్తి
బిందుమాధవుఁ గొల్చి వినయమ్మునన్ డుంఠి
గణపతి సేవించి కాలభైర
వుని గుహున్ దండపాణిని నాదిగంగను
మణికర్ణికన్ దుర్గ గణుతిఁజేసి

గీ॥ గాడిబాయికి గవ్వల కాన్క యిచ్చి
బికిరవుం బువ్వ మొసవుచు వేఱు వేఱు
తావులం బవ్వళించుచు దర్శనీయ
ములను జూచుచుఁ గొన్నాళ్ళు పుచ్చెఁ గాశి 144

ఉ॥ అంతట నక్రగార్కుమగు మాఘము వచ్చుటెఱింగి పాతకా
త్యంత భయప్రకంపితహృదంతరుఁడైన విశృంఖలుండు ర
వ్వంతయు జాగుసేయక ప్రయాణములం బొనరించి చేరె న
క్రాంతబుధామరాగమజసంధిత యాగము శ్రీ ప్రయాగమున్ 145

వ॥ అట్లు చేరి వీరవ్రతసువ్రతుండు దన కెఱింగించినంతకన్న విశేష మహిమాభిరామంబై సంవృత తైర్థిక స్తోమంబై కృపాకూపార వేణీ మాధవధామంబై యింబుమీఱు ప్రయాగక్షేత్రోత్తమంబుఁ దిలకించి వార్షించి యానీతసేతుసైకతంబు విధిగా లింగాకృతిం బ్రతిష్ఠించి సముచితంబుగ గంగాజలంబులఁజేర్చి దినదినంబును దినమణి యర్ధోదితుండగు సమయంబునఁ ద్రివేణీ సంగమస్థానంబున యథా విధి స్నానంబొనరించుచు వేణీమాధవ దర్శన పూజా నమస్కారాదులొనర్చుచు భిక్షాశియై మాఘమాసంబంతయు నంద కడపి యనంతరం బయోధ్యన్ దర్శించి సరయూ స్నానంబొనర్చి క్షీర వారాన్నిధినిమగ్న మందరోద్ధరణ దృఢఘుల కులీనంబు లనందగిన పారవ కమఠకఠోర కర్పరస్పర్శల కులికి తత్సాకేతని కేత దైవత

వతంసమ్ములగు సీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నముఖ దేవతా బృంద సందర్శన వందనాదులు గావించి నైమిశారణ్యంబున కేగి పతితపావన గోమతి యగు గోమతిం దోఁగి యందలి తపోధనకృపా పాత్రుండై 146

క॥ పోవుచు బృందావనముఁ, దేవకి పట్టి గల మధుర దినమణిసుతల న్గా వీక్షించి వినతుల, న్గావించి మునింగి వినశనంబునకరిగెన్ 147

గీ॥ అటు కురుక్షేత్రమున కేగి యఘనిబర్హ
ణము శమంతక పంచక స్నానమాడి
మంచుమలను మాయా దేవతాంచితమయి
శ్రీ హరిద్వారమనఁగఁ బ్రసిద్ధిఁ గనిన 148

క॥ మాయాపురిఁ గని గంగా
తోయమ్ముల బ్రహ్మకుండతోయమ్ముల నా
ప్యాయనముగా మునిఁగి నా
రాయణముఖ దేవపాళి నర్చించి తగన్ 149

క॥ కనఖల యన నొప్పిన ద
క్షుని యజ్ఞాలయముఁ గాంచి కోవిదమునిప
ర్గనివాసి హృషీకేశముఁ
గని లక్ష్మణఝులను జూచి కడక యెసంగన్ 150

క॥ బదరీనారాయణమున
సదమలమతిఁ దిరిగి మానిసమితిం గనుచున్
గాదకొని బ్రహ్మకపాల
మ్మదితోత్కంఠుఁడయి చూచి యుత్తరనియతిన్ 151

గీ॥ తిరిగి భూప్రదక్షిణ సద్విధిన్ గయాది
పుణ్యతీర్థ సేవలుసల్పి మొగి వరాహ
నారసింహు జగన్నాథుఁ జేరి కొల్చి
యేఁ దొకఁడు వెళ్ళఁదీసె విశృంఖలుండు 152

సీ॥ ఇవ్విధంబున నాతఁ డేఁటేట భూప్రద
క్షిణముగ బహుతీర్థసేవఁ జేయు
చును మాఘమాసమ్ము చనుదెంచుసరికిఁ బ్ర
యాగకుఁ జేరి మువ్వాఁగు లెనయుఁ
చోట మునుంగుచుఁ గైటభారికి మ్రొక్కి
మాఘమాహాత్మ్య మేమఱక వినుచు
ద్వాదశహాయనాంతమున గోగర్భవి
ముక్త తండులములు మూఁడు గుప్పి
గీ॥ ళలు గడనసేసి కడిగి వండుకొని కుడుపు
సేయుచుఁ దపోవ్రతముఁ దుదఁ జెందఁజేసి
హతమహాఘుఁడై శుద్ధుఁడై యవలఁ జేరె
గణ్యమైనట్టి నైమిశారణ్యమునకు 153

క॥ ఆ నైమిశకానన పృథ్వీనిలయుని సుగుణఖనిని వీరవ్రతస
న్మౌనిని జేరంజని యవ్వానిని వలగొని పదాలపైఁబడి మ్రొక్కెన్

గీ॥ అట్లు సాష్టాంగపడిన ద్విజాత్మభవు వి
శృంఖలుని లేవఁదీసి యాశీర్వదించి
కుశలమడుగ వినయమున గురువరా! భ
వత్కృపం గుశలిని కృతవ్రతుఁడనైతి 155

వ॥ అని పలికి భక్తివినయంబు లెసంగ బద్ధాంజలియై నిలువంబడిన
విశృంఖలుని కరుణావలోకనంబులం గనుచుఁ గించిత్కాలం బంత
ర్హితుండై మహాత్ముండైన వీరవ్రతుం డిట్లనియె 156

## 26 అధ్యాయము

ఉ॥ చెప్పినరీతిగా వ్రతముఁ జేసితి పూర్తిగ దాన శుద్ధయై
త్రుప్పలఁ దోమినట్టి యసి తోల్యుఁడనైతి ప్రయాగ మజ్జనం
బప్పటి తానుషంగమున నబ్బిన దుర్భర దుష్కృతాళి పె
ల్లప్పుడె తొలంగెఁ బొంగెనిదె సత్ప్రతిపత్తి విశుద్ధ తేజముల్ 157

గీ॥ ఏమిటనుబోక ఘటమునం దిటికికొనిన
జిడ్డు కీలికాస్పృష్టి వశించునట్లు
మంత్రపూతోదకముల నీవైని మదిని
వాక్కు నంటిన పాపమ్ముఁ బాపువాఁడ 158

క॥ అనుచున్ గోమతిఁ జేరిచి, దినత్రయము దివ్యమంత్రతీర్థమ్మా వి
ప్రునిపైఁ గుశలం జల్లుచు, నునిచె నిరాహారుగ స్స్మృతి నూక్తిజ్ఞుండై

గీ॥ మంత్రపూతోదకస్నాన మహిమచే వి
శృంఖలుఁడు నిష్కలుషుఁడై యరీణకరుణుఁ
డైన వీరవ్రతుని చరణారవింద
ములకు సాష్టాంగవందనములను సలిపె 160

వ॥ అంత వీరవ్రతతపోధనుం డాదరంబున విశృంఖలు నాలింగనం బొనర్చి తన పర్ణశాలకుం గొనిచని యనసూయ కెనయైన నిజజాయ చేతివంటకంబు తనతోఁ బాటు భుజింపం జేసి కొంత తడవు భుక్తాయాసం బపనయించుకొన్న పిమ్మట విశృంఖలుండు వీరవ్రతున కు వినతుండై 161

చ॥ మునివర! నాఁడు నేను వ్రతముం బరిపూర్ణమొనర్చి వెండి వ
చ్చిన సమయంబునం దెలుపఁజెల్లిన ధర్మములెల్లఁ దెల్పువాఁ
డనని వచించియుంటిరి మృడవ్రతిభిల్ తమరీయకించనున్
గనికరమొప్పఁ జూచి యెఱుఁగందగువానిని బోధసేయుఁడీ! 162

క॥ అని ప్రార్థించు విశృంఖలు
ననుకంపాపూరితమ్ములగు చూపులతోఁ
గని వీరవ్రతుఁ డాదర
మునఁ దెలుపంబూనె ధర్మములు ముఖ్యమ్ముల్ 163

— వీరవ్రతుండు విశృంఖలునకు ధర్మంబులు దెల్పుట —

క॥ ఓయి విశృంఖల! ధరపై
తోయజభవసృష్ట మగుచుఁ దోఁచు నితాంతా

మేయప్రాణితతి న్నర
కాయ మొదవు టమితపుణ్యకలనం జుమ్మీ 164

గీ॥ అట్టి మానవులందు బ్రాహ్మణులు బాహు
భవులు వైశ్యులు శూద్రులన్వారు నాల్గు
వర్ణములవారు ముఖ్యులు వారియందు
స్తుత్యులైరి బ్రాహ్మణు లగ్రజన్ములగుట 165

వ॥ అట్లగ్రజన్ము లనఁబరగువారికి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసంబు లన నాల్గాశ్రమంబులు గల వందు బాల్యంబునుండి సామాన్యవిద్యలు నేర్చుచు బ్రహ్మచర్యంబున సద్గురు శుశ్రూషం జేసి వేదాధ్యయనంబు సేయుచు నాశ్రమధర్మంబులు జరుపుచు సమస్త విద్యాపారంగతుఁడై సకల ధర్మంబు లెఱుంగవలయుం గావున నీ వట్లు కావింపక పూజ్యులగు తల్లిదండ్రులఁ బరాభూతులం జేసి చెడుత్రోవంబట్టి యిట్టులైతి వింక యోగ్యుండగు దేశికుం జేరి తదనుగ్రహంబునఁ బండితుండవై యవ్వల 166

మ॥ కులమున్ గోత్రము శీలమున్ బుధవరుల్ గొండాడ సన్మార్గులౌ
తలిదండ్రుల్ సహజన్ములున్ గలిగి సౌందర్యంబు సల్లక్షణం
బులు శాంతంబును దైవభక్తి వినయంబున్ గల్గు కన్యన్ విశృం
ఖల! పెండ్లాడుము వహ్నిసాక్షికముగా గార్హస్థ్య సంసిద్ధికై 167

గీ॥ అట్లు పెండ్లాడి యర్ధాంగి యనుసరింప
గార్హపత్యవిధమ్మునఁ గాల్యయులను
సరిగ నెరవేర్చుచును సత్య శౌచ దాన
ధర్మతపములఁ దగి భూతదయ వహింపు 168

గీ॥ దానములలోన నభయప్రదాన మన్న
దానమును గడు ముఖ్యమ్ములై నకతన
నెట్టి కష్టమ్ము లొదవిననేని వాని
మానఁగా రాదుమ[illegible]తుమానుపర్వ! 169

క॥ వ్రతములలో హరిదివస,వ్రత మ్మహింసావ్రతమ్ము వర్యములగుటన్
సతతము జగమెన్నఁగ స,న్మతివై కావించుచుండుమా యవ్వానిన్

గీ॥ హింస యనఁ బ్రాణముల హరియించుటొకటె
కాదు నష్టమ్ముఁగూర్చి హృత్కష్ట మన్య
జీవులకు సంభవింపఁగఁ జేయుటెల్ల
హింస యగుఁ గాన నటు ఘటియింపవలదు 171

సీ॥ ఎవఁ డెంత నిష్ఠ నహింసావ్రతముఁ బూని
నను జలకుంభ మార్జనులుఁ బ్రొయ్యి
సన్నికల్లును ఱోలు సమకూర్చు పాపమ్ము
లేను తెఱంగుల మానవులకు
నా కలుషములు వాయఁగ బ్రహ్మయజ్ఞము
దేవతాపితృ మర్త్యజీవనిచయ
యజ్ఞమ్ము లనఁబడు నైదు జన్నంబులు
సేయంగవలయు సచ్చిత్తుఁడగుచు

గీ॥ నైదుఁ గావింపఁజాలని యట్టులైనఁ
గడకు మనుజయజ్ఞం బనఁబడెడుదాని
నతిథి తర్పణరూపమై యమరుదాని
నైన నొనరింపవలయు యథాత్మశక్తి 172

గీ॥ నిన్ను నీవెట్లు చూతువో నిపుణమతిని
నట్లె యర్ధాంగి నెప్పుడు నరసికొనుము
రిత్తతప్పులు తలవైచి చిత్తమెఱియఁ
జేయకుము దానఁ గల్మికిఁ జేటు వచ్చు 173

క॥ సేవింపుము సజ్జనముల, భావింపు మభేదబుద్ధి భవ మాధవులన్
గావింపుము శ్రద్ధను సం,ధ్యావందన ముఖ్య నిత్యమగు కర్మములన్

క॥ పరదోషము లెన్నకుమా
బెరయకుము యసూయ నొరుల పెంపున కెడఁదన్

భారయుతమా సంతాపము
పరికింపుము తల్లులట్లు వరమానినులన్ 175

క॥ శ్రుతులను మఱువకుమా సత
మతిథుల నభ్యాగతుల సమాదృతిఁ గనుమా
పితృ మృతదినముల శ్రాద్ధము
లతులితమగు శ్రద్ధ సల్పుమా విప్రసుతా! 176

క॥ కలయందైనను కొండె
మ్ములు సెప్పకు ధర్మశాస్త్రములు నితిహాస
మ్ములును బురాణమ్ములు దగ
విలోకనమొనర్పు మాత్మవేదివి గమ్మా 177

గీ॥ శ్రీని విడనాడి హరిని కీర్తింపు మెప్పు
డుపనిషత్తున జాబాలికోక్తిఁబట్టి
తాల్పుము త్రిపుండ్ర మభవసూక్తప్రకార
మోలిఁ బూనుము రుద్రాక్షమాల మెడను 178

గీ॥ తులసిపూసలదండఁ గుత్తుక వహింపు
కంసరిపు శంభు దినముఁ ద్రికాలములను
గాని రెండు వేళలఁగాని కడకు నొక్క
సమయమునఁగాని తులసీదళముల బిల్వ
పత్రిములతోడఁ బూజింపవలయు భక్తి 179

గీ॥ వైశ్వదేవమ్ము సల్పుము పావన తుల
సీదళోపేత విష్ణు పాదోదకమ్ము
ద్రావుము రమాధిప నివేదితప్రసాద
మారగింపుము నిర్మలస్వాంతమునను 180

క॥ రోగుల ననాథ వృద్ధుల
యోగుల వటువులను యతుల నుచితమ్ముగ నే
హాగతులగువారలఁ గృప
నోగిరమిడి యతసి తృప్తిఁనొందింపు సుధీ! 181

గీ॥ ప్రణవయుత శివపంచాక్షరమ్మొ యస్లొ
కారిలు నారాయణాష్టాక్షరమ్మొ తత్స
మానమై మీఱు మఱి యేదొ మంత్రిమీవు
జపముచేసి ధ్యానింపు తత్స్వామి భక్తి 182

క॥ అరిషట్కమ్మును గెలువుము
నరకప్రదమాటఁ దరణి నక్రస్థితుఁడై
పరఁగెడు మాఘమ్మునఁ బ్రతి
శరత్తునందుం బొనర్పు స్నానము విధిగన్ 183

గీ॥ మాఘమజ్జన రతులతో మాధవాంఘ్రి
భక్తిపరులతో సజ్జనప్రతతితోడ
సంగ మొనరింపు మాఘమజ్జనము సలుపు
మర్చన మొనర్పు మజ్జాతు ననుదినంబు 184

చ॥ ఎవఁడు తపోనిమజ్జనము నీడ్యవిధిం బొనరించి భార్గవీ
ధవు రథసప్తమీదినము ద్వాదశినాఁడును బూర్ణిమన్ మహో
త్సవముగఁ బూజసల్పెడినొ తత్పురుషుండు గతాఘుఁడై భువిన్
వివిధసుఖంబులం బొరసి పిమ్మట మోక్షరమన్ గ్రహించెడిన్ 185

క॥ పరదుఃఖప్రద జన్మాం
తరకృత ఘోరదురిత సముదాయము మాఘా
చరిత స్నానంబున రూ
పఱు నవలజ్వాలఁ దూలమట్టులు వడిగన్ 186

మ॥ తలిదండ్రుల్ గురువర్యుఁడుం బ్రజకుఁ బ్రత్యక్షామరుల్గాన వా
రల కానందముగా మెలంగినను భద్రప్రాప్తి యౌఁగాక క
ల్లలు దచ్ఛిరములందు మోపి హృదయగ్లానిం బొసంగించినన్
దొలఁగుం గీరితి పాయుఁ గల్మి కలుగున్ దోషంబు లత్యంతమున్

క॥ శ్రుతిమార్గానుచరులకుం, బితృమాతృ గురుపదభక్తివిస్తారులకున్
సతతామలకర్మల కచ్యుతసేవకులకును జిత్తశుద్ధి ఘటిల్లున్ 18౯

క॥ పాపిష్ఠుల యఘమడఁగుం, గాపట్యములేని యెడఁద కల్మిని బశ్చా
త్తాపముఁ జెందినయప్పుడ, దీపిత బహుతీర్థమగ్నచిత సకలాఘా!

క॥ సమచిత్తుల కెప్పుడు ను
త్తమ కర్మము లాచరించు ధన్యులకున్ సా
ధుమనీషులకుండు నిహప
రముల సుఖమ్మొసఁగు బుద్ధిరమ యెక్కుడుగాన్ 190

మ॥ ప్రసవానేకములం బ్రవాళముల సర్వజ్ఞున్ రమాకాంతు సా
రసపత్రాక్షు జనార్దనున్ హరి నఘారణ్యానలున్ విష్ణు నీ
యనువుల్ వోయెడుదాఁక సన్మనముతో నర్చింపు మాఘవ్రత
మ్ము సమస్తవ్రత ముఖ్యమౌ కతన నెప్డున్ సల్పుమా దానినిన్

మ॥ అలువమ్ముల్ దురితమ్ము లూడునన నేలా? బ్రహ్మహత్యాదికా
ఖిలఘోరాఘము లంతరించుఁ దొలఁగుం గ్లేశమ్ము లశ్వాధ్వరం
బులు వేయింటఁ బొసంగునట్టి ఫలమున్ మోక్షంబుఁ జేకూరు ను
జ్వల మాఘవ్రతకర్తకంచు విబుధుల్ వాక్రుత్తు రెప్పట్టునన్ 192

గీ॥ ఎవఁడు మాఘవ్రతము ఘటియింపఁడో య
తండు బ్రహ్మఘ్నుఁడగుఁ గాన తప్ప కీవు
మాఘకల్యమ్ములన్ స్నానమాచరించి
తద్వ్రత మొనర్పు మోక్ష మంతమున నొదవు 193

క॥ స్నానమొనరించి విష్ణుక, థానూనంబగు తపోమహత్త్వము వినుమా
నే నుడివిన వినయమ్ముల, మానక మద్దానవగు సమస్తేప్సితముల్

వ॥ వీరవ్రతుం డా తీరునం దెలుప నాలకించి విశృంఖలుం డతివినయం
బున నమస్కరించి మహాత్మా! తమరెఱింగించిన తెఱంగున సంచ
రించెదఁగాని మూర్ఖుండనగు నాచేయు చేతలకు సైపక దేశాంతర
గాములైన నా జననీజనకు లెందుండిరో సజీవులో కారో మీరెఱిం
గించిన వారివిషయంబున ముందుఁ గావింపఁదగు కృత్యంబు లోన

ర్చెదనని కనుల నీరుగాఱ దైన్యంబునం బలుకు వానిం గరుణించి
యంతర్దృష్టిం జూచి విశ్శృంఖలునితో నిట్లనియె 195

క॥ నీమాతృపితలు కాశిక, స్వామిన్ విశ్వేశు నర్చనలుపుచు నచటన్
క్షేమమున నున్నవారలు, నీమదిఁ జింతింప కేగి నెఱపుము పూజల్

గీ॥ నావుడు విశ్శృంఖలుండు సంతసముఁ జెంది
భక్తిమీఱ వీరవ్రతు పాదములకుఁ
జెక్కు మ్రొక్కులు గావించి వినుతిఁ జేసి
వాని యాశీ రనుజ్ఞలఁ బడసి యేగి 197

క॥ కాశీపత్తనమున వి, శ్వేశ పదాంభోజసక్తహృదయుల విచ్ఛి
న్నాశాపాశుల వార్థక, తాశీర్ణాంగులను దల్లిదండ్రులఁ గాంచెన్

ఉ॥ కాంచి తదంఘ్రులంబడినఁ గైగవఁబట్టి చిరాయువొంద దీ
వించి వచించి రాయుగము విప్రకుమారక! నీ వెవండ వే
మెంచి నమస్కరించితివొ యీ ముదుసళ్ళకు మేము నీకుఁ గా
వించెడు సాయమేమొ వినిపింపుము నీ తలఁ పెట్టిచందమో 199

చ॥ అనిన విశ్శృంఖలుండు కరుణాంచితులార! భవన్మనంబులన్
వనటనుగూర్చి స్వస్థల నివాసవిదూరులఁ జేసినట్టి మీ
తనయుఁడ నే విశ్శృంఖలుఁడ ద్రవ్యముకై బహు పాపకార్యముల్
బొనరిచి యొక్క ధన్యు కృపఁబొంది గతాఘుఁడనైతిఁ బిమ్మటన్

వ॥ సజీవులైన మిమ్మొలోకంబునఁ జూడఁగ్గలనో లేనో యను సందేహ
సంతాపంబులు డెందంబున నలమికొన నమ్మహానీయుని కెఱింగించి
వానివలన భిక్షారిందు కుశలంబున మండుటఁ దెలిసికొని యిచటి
కేతెంచి మిమ్ముంగాంచి కృతార్థుండనైతి నను కుమారు నిరువు
రాలింగనంబొనర్చి శిరంబు మూర్కొని మేమ నిమిరి హర్షపులకి
తాంగులై తండ్రీ! నీవు కౌమారంబు నుండి తల్లిదండ్రులమగు
మా మాట దాఁటి చెడుగులొనర్చుట కోర్వక పుత్త్రసన్నిధి మర
ణంబున నిరాశులమై క్షేత్రోదాయకంబైన కాశీ మరణాపేక్ష

నింద యుంటిమి. విశ్వనాథానుగ్రహంబున నేఁటికి సత్పథగామివగు నిన్నుం జూడఁగంటిమి. మా జన్మంబులు కడ తేఱెనని పల్కుచు వారు తన్ను వదలినదిమొదలప్పటివఱకు జరిగిన తన కథను వారిచేఁ బృష్టుండై సవిస్తారంబుగాఁ దెల్పి వారితో గంగా స్నాన విశ్వేశ్వర దర్శనాభిషేకంబుల నొనర్చుచుఁ గొన్ని దినంబు లవ్వారణాసిం బుచ్చి యవ్వల బయలుదేరి కళింగదేశంబునకు స్వస్థలంబునకు వచ్చి సద్వర్తనంబున జీవయాత్ర సేయుచుండె నంత జనస్తవనీయుండగు విశృంఖలు వృత్తాంతం బాలించి 201

ఉ॥ మాతులుఁ డేగుదెంచి సుకుమారిఁ గుమారి సమస్త సద్గుణో
పేత నొసంగి బ్రాహ్మవిధిఁ బెండిలిచేసిన నాకెఁగూడి ని
ర్జిత గృహస్థధర్మములు నిత్యము శ్రద్ధగఁ జేయుచుం దనూ
జాతులఁ గూఁతులం గని యశమ్మునఁ సెన్ సుకలావతంసుఁడై 202

గీ॥ ఎప్పు డేరీతిఁజేసిన మెప్పుఁ గనెద
రో యటుల్ భోజనముల శుశ్రూషలను ఘ
టించి తల్లిదండ్రులను మెప్పించె నాత్మ
జనిని గనిన ధర్మవ్యాధుఁడనఁగ జనులు 203

సీ॥ ఆ విశృంఖలుఁడు నిత్యాన్నదానమ్ము వి
ద్యాప్రదానమ్ముఁ గన్యాప్రదాన
మొనరించి యతిథుల ననురక్తిఁ బూజించి
వీరవ్రతుండు దెల్పిన విధాన
మాఘవ్రతమ్ము నేమఱక కావించుచు
భక్తిపూర్ణాత్ముఁడై పద్మనయనుఁ
గొలుచుచుఁ బితృమేధముల శ్రద్ధతో సల్పి
ద్వంద్వంబులకుఁ గలంతపడఁబోక

గీ॥ జ్ఞానియై కర్మలోపంబు జఱుగనీక
సకలపాతకములు గప్పుచు పద్మనయనుఁడుగాక

కామియునుగాక తుదకు మోక్షంబుఁ జెందె
మాఘధర్మమ్ముకతన సంయమివరేణ్య! 204

వ॥ అని జహ్నుమునికి గృత్స్నమదుం డెఱింగించిన తెఱంగున భవాని కథవుంకు దెల్పెనని శౌనకాదిమహామునులకు సూతపౌరాణికుండు చెప్పె. 205

— ఆ శ్వా సాం త ము —

క॥ దూరీకృతాఘవారా!, వారాణశి ముఖరతీర్థవర్య విహారా!
హారాబ్జకీర్తిసారా!, సారసభూసదృశ ధీ సుసంపదగారా! 206

క॥ పండితవినుతాచ్ఛ యశో,మండిత తత చక్రవాళ మహిభృద్గోళా!
దండితనూభవసమశమ,ఖండిత రిపుషట్కా! రామకవి సమ్రాట్కా!

— గ ద్య ము —

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీ వత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభాషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున అష్టమాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘపురాణము

## నవమాశ్వాసము

క॥ శ్రీగణ్య షట్సహస్ర ని,యోగిబ్రాహ్మణ కులీన! మోదనపుషితా
భ్యాగతవితాన! సేవిత, సాగరసంస్థాన! రామసచివేశానా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యాశరణ్యులగు శౌనకాది మునివరే
ణ్యుల కఖిలపురాణ కథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె
నవ్విధంబునఁ గైలాసంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబు
నుడువుచున్న మహాదేవుండు పార్వతిం గని దేవీ! వినుము. గంగా
తీరంబున మాఘవ్రతం బొనర్చుచుఁ దన్మహిమాది కథావిశేషం
బులం దెల్పుచున్న గృత్సమదుండు జహ్నువుం జూచి 2

### 27 అధ్యాయము

సీ॥ జహ్నుమౌని! తపోవ్రతశక్తివలన
సకలసన్నుతుఁడౌ రాజచంద్రు కథను
వినుతు విను మది విన్నట్టి జనుఁడు శ్రేయ
మందు భవమహాబంధ సంత్యక్తుఁడగుచు 3

వ॥ అది యెట్టిదంటివేని 4

### — సులక్షణమహారాజు చరిత్రము —

చ॥ సకలఋతు ప్రసూన ఫలజాతవిరాజిత భూజరాజితోఁ
బ్రకటిత నైజధర్మపరిపాలక మానవపాళితో సుధా
ధిక విమలాంబుసంభృత నదీనదబృందముతో సమస్త స
స్యకలిత మంగదేశము వరాంగమనందగు భూపురంధ్రికిఁ 5

క॥ ఆ యంగదేశమునకు
నాయకుఁడై ద్వాపరమ్మునం బాలించెఁ

దోయజమిత్రాన్వయభవుఁ
డాయతబాహుఁడు సులక్షణాధిపుఁ డెలమిన్ 6

క॥ ఆతని భార్యలు నూర్గురు, పాతివ్రత్యమునఁ గశ్యపసతీతుల్యల్
చేతోమోదకరాకా,రాతిశయమ్మునను వేల్పుటతివల కుద్ధుల్ 7

గీ॥ అట్టి నూర్వురు సుందరు లనుదినంబు
దైవముగ నెంచి తనుగొల్వ ధరణి నేలె
సహితు లాప్తులు ధర్మబలాఢ్యతఁ గని
ధర్మరాజె యితండని తలఁచునట్లు 8

క॥ ఘోరాజులఁ దద్ధతులై
స్వారాజాననలఁ జేరి సౌఖ్యముపడుచున్
దూరాజులె కొనియాడెడ
రారాజసుధాంశు విబుధు లబ్బురమందన్ 9

గీ॥ వాని యేల్బడి భువి సుఖపడుచు నతని
నయ్యఁగాఁ జూచు దేశప్రజాళిగాక
ముద్దుముచ్చటల్ దీరిచి పెద్దల ఋణ
మీఁగలేదయ్యెఁ బ్రజ నూర్గురింతులున్న 10

సీ॥ దేవునిగా నెంచి దేవేరులెల్లరు
సేవ లింపగునట్లు సేయుచున్నఁ
బరరాజులందఱు నఱమర లేకుండఁ
గప్పంబు మునుమున్న కట్టుచున్న
సచివులు సైనికస్వాములు కోశాధి
పులు కనుసన్నల మెలఁగుచున్న
సర్వర్తు ఫలపూర్ణ సస్య వృక్షములతో
వసుమతీసతి మోదమొనఁగుచున్న

గీ॥ దేవతాప్రసాదములు భూదేవతాశు
భంకరాశీర్నినాదముల్ ప్రబలుచున్న

నతని డెంద మానందమ్ము నందదయ్యె
నందనుం డొక్కఁడును బుట్టనందువలన 11

ఉ॥ పుత్రుల నీయఁగాఁదగిన పూజలు దానములున్ వ్రతంబులున్
సత్రము లెన్నియో సలిపి స్వాంతమునం గల కోర్కి తీరమిన్
క్షత్రియమౌళి యొక్కదివసంబున భార్యల బంధులన్ మహా
మాత్రులఁ జేరఁగాఁబిలిచి మానసఖేదము దోఁప నిట్లనెన్ 12

మ॥ పుసుకుం గల్లునలెన్ ముదమ్మొసఁగుచుం బున్నామపున్నారక
మ్మదుగంటం బొనరించి నా వెనుక నీజ్యామండలీభారమున్
గడకం దాల్పఁగలట్టి పుత్త్రఫల మొందన్ జాలకున్నందుచే
నడవిన్ గాసిన వెన్నెలేకద మదీయైశ్వర్య సర్వస్వమున్ 13

సీ॥ చిన్నిబిడ్డని కల్మి సున్నయై తగు నిక్క
యిక్కయే రక్కసి డొక్కగాక
కొడుకుఁ గానుపుఁ బెంపుఁ బడయ నేరని కొమ్మ
కొమ్మయే తిననేర్చు బొమ్మగాక
బుడుత లేబుగ్గల ముద్దెఱుంగని వాయి
వాయియే పలుగుఱా గోయికాక
చిఱుతని తొలిపనుల్ సేయనోచని యయ్య
యయ్యయే నడయాడు కొయ్యగాక
గీ॥ కొలము మానికమై పేరు వెలుఁగఁజేయు
కొమరుఁ డొదవని యేలికకుం గలట్టి
యెల్లసిరులకు టెంకియై చెల్లు రాచ
వీడు వీడౌనె పెను వల్లకాడుగాక 14

వ॥ అంతియెకాక 15

చ॥ తనయుఁడులేనివానికిఁ గృతఘ్నునకున్ శ్రుతిబాహ్యుఁడైన వి
ప్రునకును నిత్యదైన్యపరిపూర్ణునకున్ శఠుఁడైనవాని కె
ట్లును సుగతుల్ సులోకములు లూనములంచని యాత్మవేత్తలా
మునలును వేదముల్ సతతమున్ వినఁబల్కుట లాలకింపమే 16

రన నానామృగవిహిఁ-కౌఘ సుఖదప్రావీణ్యాముఁ యోగిరా
డ్జనసంతానశరణ్యాముఁ బహునగాంచన్నైమిశారణ్యాముఁ 20

గీ॥ కని నృపతి యిచ్చటం దపోధనులు ఘనులు
పెక్కురుండెదరని యెప్డు విందుముగద
యట్టివారలఁజేరి నా యభిలషితముఁ
దీర్చికొనవచ్చునని సుహృద్వితతిఁ బల్కి 21

— సులక్షణుండు శౌనకమునివలన నిష్టసిద్ధిం గాంచుట —

వ॥ అవ్వనంబునం గల్గు వివిధవిశేషంబులవలన జ్ఞానేంద్రియానందం బనుభవించుచుఁ బోవుచు నొక్కచో శ్రద్ధాళువులై వినుచున్న వాచంయములకాత్మజ్ఞానంబు బోధించుచుఁ దారకామండలమధ్య విరాజమాన షోడశకళాపరిపూర్ణ సుధాకరునిచందంబున నొప్పు శౌనకమహామునింగాంచి కించిద్దూరంబునఁ దేరు డిగి పాదచారియై సమీపించి తన్మునికిని సభకును సాష్టాంగనమస్కారంబు లొనర్చి వారివలన శుభాశీస్సులు వడసి బద్ధాంజలియై లేచి నిలుచుటయు

క॥ అప్పుడు శౌనకమునివరుఁ
డప్పుడమిదొరం గృపాళుఁడై కనుఁగొని మీ
రిప్పు డిట వచ్చు కార్యముఁ
జెప్పుఁడన న్నృపవరుండు చిత్తంబలరన్ 23

క॥ ముకుళితకరుఁడై తన కథ
సకలముఁ దెలుపం దపస్విచయ మాశ్చర్యా
త్మకమగుటయు నల రుసిమా
నికము గనెన్ దివ్యదృష్టి నృపు పూర్వకథన్ 24

ఆ॥ అట్లు దివ్యదృష్టి నంతయు నెఱిఁగి తాఁ
బలికె మౌనివరుఁడు ప్రభువుతోడఁ
బార్వజనని నీవు పాడమి సౌరాష్ట్రంబు
నందుఁ దన్నృపుండవైతి వవల 25

సీ॥ సౌరాష్ట్రి భర్తవై సర్వసంపదలతో
రాజరాజునుబోలి ప్రతిభఁగాంచి
ధర్మమ్ములందు నుత్తమధర్మమగు తపో
వ్రతము గావింప నొక్కతడవయును
మకరగతార్కమౌ మాఘమాసమున స్నా
నముసేయ వందు శుక్లమున వచ్చు
సప్తమినాఁడు కూష్మాండ దానమొనర్ప
వక్కారణమున నీ కాంద్రు నూర్జ

గీ॥ మన్న నొక పుత్త్రికుండైన నొదవఁడయ్యె
నీ భవంబున నృపవర! యితర దాన
మెట్టులైనను సప్తమింబట్టి నొసఁగు
నట్టి కూష్మాండదానమ్ము నగు నొనర్ప 26

మ॥ కడుశ్రద్ధన్ రథసప్తమిం దిలలు బంగారంబు నానెయ్యి గు
మ్మడితోఁ జేరిచి బ్రాహ్మణోత్తముల కేను ర్త్యండొసంగండొ యా
తఁడిఁకేపున్నెము లెన్నిచేసినను బుత్త్రిప్రాప్తి నొందండు సు
మ్మొడయండా! సుదతీసహస్రపతి యైయున్నన్ విశంకంబుగన్

క॥ అను మునిపతి వాక్యంబులు
విని ఖిన్నుండై నృపుండు వినతిశతంబుల్
బొనరించి వానితో ననె
ననఘా! యిట మిమ్ముఁ గొలువ నరుదెంచుతఱిన్ 28

వ॥ నేను వనంబులకేగి యచ్చట మునీశ్వరారాధనంబొనర్చి వారల
యనుగ్రహంబునఁ బుత్త్రోదయోపాయం బెఱింగివచ్చెదనని నాదేశ
జనులకు సంతోషజనకంబుగాఁ జెప్పివచ్చి యిట నఘటనఘటనా
సమర్థులును శ్రితజనాభీష్టఫలప్రదులును దపోధనాగ్రణులును భృగు
వంశమణులు నగు మిమ్ముం దర్శించియు విఫలీకృతమనోరథుండనై
నాపురంబున కేగి నావారల నిరాశులం జేసి కాఱియ పెట్టుటకన్న

నిచ్చోటన నిలచి తపంబాచరించుచుఁ గాలంబు గడపుట లెస్సగాదె యని దీనాననుండై చేతులు జోడించి నిలచియున్న సులక్షణు నీక్షించి శౌనకమునిమౌళి దయాళుండై తన చెంగట నున్న మానులవలన నొక్క మనోహర మాతులుంగఫలంబుఁ దెప్పించి దాని నభిమంత్రించి భూపాలునకొసంగి యిట్లనియె 29

ఉ॥ భూవర! యీ ఫలమ్ముఁ గొనిపోయి విభాగము లాచరించి నీ దేవుల కిమ్ము వారి కిన తేజులు నూర్వురు పుత్త్రికల్ ముదం బావహిలన్ జనింతురని యానతినిచ్చిన దోసిలొగ్గి యెం తే వినయమ్ముతో నది గ్రహించి కరమ్ములుమోడ్చి యంతటన్

ఉ॥ తాఁ గొనిచన్న మేలిమిపదార్థములన్ మునులెల్లఁ దృప్తులౌ లాగునఁ గానుకిచ్చి విపులాపతి క్రమ్మఱ ప్రోలు చేరఁగా నేగుచునుండ నయ్యనఘు నిచ్చమెయిన్ బయనించి యెంతయున్ వేగమ యేగి సేవకులు పేటనమాత్యుల కెల్లఁ జెప్పినన్ 31

క॥ వారలు పురమెల్లను శృంగారము సేయించి భద్రకరితో వేశ్యా వారముతో నానా వాద్యారవములతో నరపతి కరిగి రెదురుగన్

గీ॥ అరిగి నృపతికి సంతోష మావహిల్ల గౌరవముసల్పి మాతులుంగంబుతోడ భద్రకరిమీఁద నధివసింపంగఁ జేసి పురము సొచ్చిరి వాద్యముల్ భోరుకొనఁగ 33

క॥ ఆరీతి వచ్చు నృపతికిఁ, బౌర స్త్రీపురుషులెల్ల బహుమోదముతో నీరాజన కుసుమాంజలు, లారూఢి నొసంగి రాత్మ యానందింపన్

గీ॥ నృపతి యామోడ్కిఁ బ్రాసాదనికటమునకుఁ జేరునంతకు నాతని దారశతము సౌరనారులునా నలంకారయుక్త లగుచు నీరాజనము-గాని యలఘుభక్తి 35

వ॥ ఎదురుగా నరిగి పట్టంపు టేనుగుం డిగ్గి మునీశ్వరదత్త మాతులుంగ ఫలంబుతోడ డగ్గరిన సులక్షణుకు మాధ్యలు పాదపద్మంబులు గడిగి

తజ్జలంబు లాత్మశీర్షంబులఁ జల్లుకొని చుట్టుంజేరి వానిం దోడ్కొని
పోవ నతండు తన యిలువేల్పుగేహమునకుం జని యచ్చోటు శుద్ధిఁ
జేయించి సుందరంబగు రత్నఖచితపీఠంబు వేయించి దానిపై నొక్క
పసిండిపళ్లెరంబు వెట్టించి తత్ఫలం బందిడి భార్యాలంగాంచి మీ
రెల్లరుఁ గృతశిరస్స్నాతలై నియతలై భక్తిభావంబుల మన కుల
దేవతాధ్యానంబుసేయుచు నీరాఁడు గడపుఁడు. రేపు ప్రథమయా
మానంతరంబున మీకీ దివ్యఫలంబు విభాగించి యిచ్చెదఁ దత్క్ష
ణంబున మీ కొక్కొక్కరి కొక్కొక్క కుమారుం డుదయించునని చెప్పి
యమ్మందిరద్వారమ్ము మూయించి తాను మజ్జనభోజనంబులకై
చనియె నట్లా పగలు గడచె రాత్రికాలంబున నందఱు నిద్రా
వశులై యున్నసమయంబున 36

గీ॥ ఆ సులక్షణ కడరాణి యాత్మవిభుని
మాటచొప్పున నుండక మాతులుంగ
ఫలము మెల్లనఁ గొనిపోయి పరుల కేరి
కెఱుకపడకుండఁ దా భుజియించె నెల్ల 37

చ॥ నరవరమౌళి వేడ్క మఱునాఁ డుదయంబునఁ గాలకృత్యముల్
నెఱపి ఫలార్థమేగి తను నిల్పినచో నది లేకయుంట క
చ్చెరువు భయమ్ముఁ జింతయును జిత్తము నేఁపఁగ నాడ నుండు కా
పరులను బిల్చి యిందిడిన పండెటుపోయెను దెల్పుఁడీ యనన్ 38

ఉ॥ వారు భయంబుతోడ నరవర్యుని పాదములందు వ్రాలి యో
భూరమణేంద్ర! తత్ఫలము పోబడి యేమి యెఱుంగమన్నఁ బ
ల్మాఱులు వేఱువేఱుగను లాలనచేసియు నాస వెట్టియున్
గాఱులు వల్కియుం దెలియఁగానఁడ పంటి యగోచరస్థితిన్ 39

ఉ॥ అంత నిరాశుఁడై నృపతి యాత్మజలాభము నొందఁగోరి నే
నెంతయుఁ గష్టమోర్చి గడియించిన పండెటు మాయమయ్యె నీ
జంతల మాటలన్నియు నసత్యములే యని పల్కి యప్డె దు
ర్దాంత రుషాత్ముఁడై మరణదండనమిచ్చెను రక్షకాళికిన్ 40

సీ॥ ఆ నృపు కఠినాజ్ఞ నాలించి తత్ఫల
మారగించిన యింతి యధిపుఁ జేరి
ప్రాణేశ! రక్షకపాళిఁ జంపింపకు
మీరిచ్చు పజకుఁ దాల్మిఁ గనలేక
చిత్తచాంచల్యంబుచే వేగిరించి యా
పండెల్ల నే దింటి దండనార్హ
నేఁ గాన నా శిక్ష నిండు నా కని తన
యంఘ్రి వ్రాలిన కడయాలియందు

గీ॥ నైపరాని దోసంబు పొసంగియున్నఁ
బుత్రికం డొక్కఁడై నను బుట్టుననుచు
దండన విధింప నొల్లక తగినరీతి
నరయుచుండుట కెల్లర కాజ్ఞ నిచ్చె 41

వ॥ అంత నయ్యానంతాకాంతుండు తన కనిష్ఠకాంత యంతర్వత్ని యగుట నెఱింగి సంతసించి తానును జాగరూకుండై కాపాడుచుండఁ గొన్ని మాసంబులు సనినపిమ్మటఁ దక్కిన యష్టానవతిసంఖ్యా సపత్నులు పట్టమహిషీ సమీపంబునఁ జేరి మ్రొక్కి 42

సీ॥ అక్కరో! మనకెల్ల నగు పుత్రలాభంబుఁ
జెడఁగొట్టె కడరాణి పడసెఁ జూలు
మాకు నెవ్వరికిని లేక నీ కొక్కతె
కే సుతుఁ బొడవినఁ గీడు లేదు
పట్టంపురాణివై వజలు నీవెట్టున్నఁ
ద్వత్సేవఁ గావింపఁ దగవె మాకు
మనకండఱకు సేవ నొనరింపఁదగు కడ
గొట్టు రాణికిఁ బుత్రకుండు గలుగు

గీ॥ నేనిఁ బుత్త్రిక ప్రేమచే నింక నాకె
యాజ్ఞ దలఁదాల్చు నేగద ప్రాణవిభుఁడు

దాన నందఱమును దాని దాస్య మెప్పు
డాచరింపంగవలెఁగదా యడఁగి మడఁగి ‌ ‌ 43

ఉ॥ కావున నాకెగర్భమునఁ గ్రాలెడు పిండము వేగ నష్టమై
పోవుట కౌషధంబిడుటె ముఖ్యముగాఁగఁ దలంచి మా మనో
భావముఁ బెద్దదానవును బట్టపురాణివి నాటఁ దెల్పి నీ
దౌ వచనంబుఁ దీసికొని యవ్వలఁ జేయఁగనుంటి మప్పనిన్ ‌ ‌ 44

గీ॥ నావుడుం బెద్దరాణి మనమ్మునందు
యోజనమొనర్చి పల్కె నో యువిదలార!
మన పురాకృతపాపంబునను నృపాజ
లబ్ధి చెడె నొండ్లఁ జెలఁచిన లాభమున్నె? ‌ ‌ 45

గీ॥ అద్దియునుగాక మన నాథుఁ డందినట్టి
కష్టఫలితంబుగాఁగ నొక్క సుతుఁడైనఁ
గలుగుటయె చాలు రాసిరి తొలఁగకుండుఁ
బెట్టకున్నను గతులైనఁ బుట్టఁజేయు ‌ ‌ 46

ఉ॥ కావున మీర లట్టి చెడుకార్యము సేయకుఁడంచుఁ బల్కఁగా
నా వెలఁదుల్ సరే యనుచు నాయమతో నపు డాడి పోయి యీ
దేవి కృతాభిషేకనను దీమసమూని వచించు మాట లే
లా విననంచు గోప్యముగ నౌషధమిచ్చిరి చిన్నరాణికిన్ ‌ ‌ 47

క॥ ఆ యౌషధ మా నరపతి
జాయన్ బాధించెఁ గాని జఠరగ పిండా
పాయ మొనర్పంజాలక
పోయె మునీశ్వరుని మంత్రము వృథా చనునే? ‌ ‌ 48

వ॥ దుష్టస్వాంతలగు నా రాజకాంత లంతటితోఁ దమ ప్రయత్నంబు విరమింపక తెంపరులై మఱియొక దురౌషధప్రయోగం బొనర్చిన నద్దానివలన సులక్షణనృపాలక కనిష్ఠభార్యకు గర్భహానిగాకున్నను మతిభ్రంశంబు గల్గి మంచిచెడ్డ లెఱుంగక లజ్జావిరహితయై జుగుప్సా

కృత్తికలలో నచ్చుచు నొకనాఁటి నిశాసమయంబున రక్షకు లేమఱి యుండఁ బౌరులు నిద్రించుచుండ నొంటరిగ నిజనివాసంబు వీడి పురంబు నిర్గమించి మహాగహనంబు ప్రవేశించి చని చని యొక కాసారసమీప చలదళవృక్షంబుఁ జేరుసరికిఁ బ్రసవవేదన పొసంగి మగనిసుంగు పొడమిన యంత నయ్యింతి కర్కాంతారసంచారసమయమ్మునందైన యోషధీవిశేషస్పర్శనంబునను దైవయోగంబునను జిత్తభ్రంశంబు దొలంగి తెలివిగలిగినఁ దన తాత్కాలిక పరిస్థితిం దలంచి 49

— ప్రసవించిన సులక్షణుని భార్య చింతించుట —

ఉ॥ కట్టా! సులక్షణాధిపుని గాదిలిపైదలినై సతంబు నా
చుట్టు విధేయలై యితర సుందరులెందఱొ కొల్వ నెట్టి యి
క్కట్టు లెఱుంగకుందు నదిగాక సగర్భ నటంచు భర్త నా
పట్టును బాయఁ డెప్డు డెటువచ్చితి నొంటిగ నిట్టి కానకున్ 50

చ॥ తనదు పితృఋణముం దొలఁచి ధాత్రిభరంబు సమస్తమూనఁగ
ల్గిన తనయుండు నాకొదవి కీర్తియు సౌఖ్యముఁ బుణ్యలోకముల్
పొనరఁగఁ జేయునంచు మదిఁ బొంగుచు నా విభుఁడా సులక్షణుం
డనయముఁ గాచుచుండ నకటా! యెటువచ్చితి నిట్టి కానకున్ 51

వ॥ అని చింతించుచుఁ దనకుఁ బుట్టిన చిట్టిపట్టిం దిలకించుచు 52

ఉ॥ బాలసుధాంశుఁబోలి రుచిభాసిలు నీ వల రాచమేడలో
నేలికకుం దదాప్తులకు నింపు జనింప జనింప కిట్టి యా
భీలమృగాకులంపుటడవిం బొడమం దగునయ్య యస్మదీ
యాలఘుపాతకంబె కతమయ్యెనొ నీవిట నిట్లు పుట్టఁగన్ 53

శా॥ ప్రాసాదంబున నీవు పుట్టినను భూపాలుండు తా నెంత సం
తోషంబొందునొ యెట్టి యుత్సవము లన్నానంబుగా సల్పునో
నా సోదర్యుల కెంత హర్షమగునో నా తండ్రి! నీకీడ నా
హా! [illegible] మంత్రసానియును బొడ్డైనం దెగంగోయఁగన్

గీ॥ ఎట్లు సేయుదు వేఁడినీ రీడ నెట్లు
పోసఁగుఁ బోయుఁగఁ దైలంబు పోత్తిగుడ్డ
లెటులఁ జేకూరు రాపట్టి నిట్టికీతిఁ
గలుగఁజేయుదె దైవమా! కరుణఁ దొలఁగి 55

చ॥ అని విలపించుచుండ నొక వ్యాఘ్రము వార్షికమేఘ ఘోరగ
ర్జనములమీఱు బొబ్బలనుసల్పుచు శైలగుహామహాముఖం
బును విడనాడి దూఁకుచు నమోఘరయంబున నల్పజంతు ఖా
దనమతి వచ్చి మానిసులతావి పసం బసివట్టి చయ్యనన్ 56

వ॥ ఆ శార్దూలం బాభీలగతిఁ దమదెస కరుదెంచు విధం బరసి
పచ్చిబాలెంత యగు నా రానెలంత నెత్తురారని తన చిన్నిముద్దు
బిడ్డని కపాయంబు గలుగకుండఁ గాపాడు నుపాయం బొందు దోఁపక
కరంబులు మోడ్చి 57

సీ॥ కొలము వేలుపులార! యొలమితో మీ దాసుఁ
బులి కెఱగానీక ప్రోవరయ్య
పితృదైవతములార! ప్రేమ మీ మనుమనిఁ
బులిబారిఁ బడనీక ప్రోవరయ్య
అఖిల దేవతలార! యంగ దేశాధారుఁ
బులినోటఁ బడనీక ప్రోవరయ్య
తాపసులార! త్వద్దత్తఫలోద్భూతుఁ
బులికంటఁ బడనీక ప్రోవరయ్య

గీ॥ ఎన్ని కష్టంబులో పడి ఋషుల కరుణ
నీవు వడసిన ఫలశక్తి నీకు సుతుఁడు
కలుగఁ దినఁబూని యిదియె వ్యాఘ్రంబు వచ్చెఁ
గావ వే రమ్మహో సులక్షణనృపాల! 58

ఆ॥ అట్టు లా నెలంత యాత్మజు రక్షింప
దక్షులయినవారిఁ దలఁచి వేఁడి

క్రొమ్ముక్కుచుండి దరికిఁ బులి వచ్చుటం జూచి
పతిని మతిని నిలిపి నతులు సలిపి 59

సీ॥ నా విభుఁడు సులక్షణ నరనాయకుండు
ధర్మమార్గంబుఁ దప్పని ధన్యుఁడేని
నే సతినయేని యీ చిన్న నా సుతుండు
వ్యాఘ్ర మృతిలేక బహుసమల్ బ్రదుకుఁగాక 60

మ॥ అకటా! మత్పతిక్పత్యతోషిత మునీశానూనకారుణ్యాల
బ్ధకు వంశాభరణుక్ సమస్త ధరణీభారాస్పదుం జారురూ
పకునాత్మోద్భవునొక్క వ్యాఘ్రముభుజింపం బ్రాణముల్ దాల్చియుం
డి కనన్ జాలుదునే గతాంబికుని వీనిక్ సాఁకరే యెవ్వరేక్ 61

వ॥ అని పలుకుచు భయంకర గర్జలిడుచు దూఁకులు వెట్టుచు మిక్కిలి దాపునకుఁ గదిసిన యా పులిం గాంచి పుత్త్రిప్రేమకతంబున సాహసించి 62

క॥ నాకలుపమున్న నన్నే, పోకార్చుంగాక యనుచుఁ బుత్త్రికు మైపైఁ
గోకవలె బోరగిలఁబడి, ప్రాకటధైర్యమున నుండె బాలకు మనుపక్

వ॥ అప్పుడు 64

ఉ॥ ఓలినిసుంగులం బొదిగియుండిన కోడినిఁ జేరి దుష్టమా
ర్జాలము పట్టికొం చరుగుచాడ్పున బిడ్డనిమీఁది తల్లి శా
ర్దూలము గావుబట్టికొని తూర్ణముగాఁ దన యిక్కకీడ్చి ప్రా
ణాలను బాపి యిచ్చమెయి నల్లను గ్రోలుచు నంజె సంజదుక్

ఉ॥ అంతటఁ గొంతసేపటికి నాఁకటిపెల్లువ కోర్వ కా నిసుం
గెంతయుఁ గావుకావు మను చేడువఁగా విని చెంగటక్ సరో
భ్యంతరసీమఁ గ్రుమ్మరెడు హంస దయామతి బంధురాజితోక్
జెంతకుఁ జేరి చెల్వొలయు నెత్తురుకందును జూచె నొక్కనిక్ 66

వ॥ కాంచి యా బొట్టికుఁ బుట్టువుతోడఁ బట్టిన యేకాకితకుఁ గొంత వగచి తన గఱులతోఁ జఱుకరువలిబెరయ విసరుచుఁ దనవారిచే

మధువును మధురఫలరసంబులును దెప్పించి కుడిపి యాఁకలి నుడిపి
దుష్టఖగమృగంబులవలన బెడద పొడమనీకుండఁ గని పెట్టియుండి
సూర్యోదయంబై కొంత యెండపడినపిదప సమీపాశ్రమవాసియగు
నొక్క మునివరుండు భార్యాద్వయంబుతో స్నానార్థంబు వచ్చు
చుండుటం గని తొలంగి నిజపరివారంబుతోఁ జేరువ భూరుహాం
బుపైఁ జేరియున్నంత 67

ఉ॥ మానివరుండు పోవుచును మార్గము వెంబడి రావిక్రిందటన్
భానుసమానతేజమున భాసిలు బాలుని రక్తయుక్తునిన్
మానితరూపుఁ జూచి తన మానినులన్ వడిఁ బిల్చి చూడుఁడీ
వీనిని గన్నతల్లి కనుపింపదు వీఁడెవఁడో? కొలమ్మెదో? 68

గీ॥ వీని తలిదండ్రులెవ్వరో వీని నిచటఁ
గని విడిచిపోవఁ గతమేమొ కనికరించి
కాచినది యేరొ యీ ఘోరకాననమున
నచ్చెరువొనర్చె నిదియెల్ల నరసిచూడ 69

వ॥ అని పల్కుచు భగవత్ప్రతిభం దలంచి యిట్లనియె 70

గీ॥ కట్టెలోఁ బుర్వు రాతిలోఁ గప్పఁ దల్లి
పొట్టలో బిడ్డ నడవిలోఁ జెట్టు నెవఁడు
మనుచు నల విష్ణుఁ డా తండ్రి కనికరమునఁ
జూచిన న్మను నెవఁ డెట్టిచోటనైన 71

క॥ శౌరి కృపాపాత్రుండగు
కారణమున నెత్రుకండు కాననమందున్
ఘోరమృగాబాధితుఁడై
యారోగ్యముతో సనాథునటు లలరారెన్ 72

గీ॥ బాలు తేజమ్ముఁ గన ద్విజవంశభవుఁడు
గాఁగఁదోఁచె నన్యకులుఁడు గాఁడు శౌరి
పుత్త్రసంప్రాప్తి లేకెడ్డఁ బొగులు మనకుఁ
గరుణ నీ కాన నీ కూన దొరకఁజేసె 73

వ॥ అని యప్పిన్నపాపనిం గైకొని సరోవరంబుఁ జేరి తన పైయుత్తరీ
యంబునఁ బరుండఁబెట్టి సభార్యుండై స్నానాదిక నిత్యకృత్యంబు
లాచరించి పసినిసుంగుతో నిజాశ్రమంబుఁ జేరి వానికి నీరు పోయిం
చుచు గోక్షీరంబులు ద్రావించుచు జాతకర్మాదిక విధాయక
కృత్యంబు లాచరించుచుఁ బెంచుకొనుచుండె నచ్చట నంగభూపాల
కుండగు సులక్షణుండు 74

గీ॥ నిండుచూలాలు తనదు కనిష్ఠభార్య
మనసు చెడిపోవుటెఱిఁగి యేమఱని కాపు
వెట్టినన్ గీము గ్రామమున్ విధివశమున
వదలిపోయిన మది చాల వగచి వగచి 75

క॥ వెదకించి తా స్వయముగ
న్వెదకి ముదిత జాడ నెఱుఁగ నేరక కట్టా!
యదయమతి దైవ మస్మ
ద్హృదయాశాలత సమూల మిటు తెగఁగోసెన్ 76

గీ॥ ఏది యెటులైనఁగాని మునీశ కరుణ
వలనఁ బడసిన ఫలము నిష్ఫలము గాద
టంచు నమ్మిన నా యాశ యడఁగె నెందు
దైవసంకల్పమున కసాధ్యంబు గలదె? 77

క॥ అనుచు సలక్షణభూపతి
వనరి తుదకుఁ గడు విరక్తభావుండై త
ప్పనిసరి యాటను భూపా
లన మొనరుచుచుండె నిష్కళంకమనముతోన్ 78

చ॥ అటు వనమం దనాథుఁడగు నర్భకుఁ గైకొని చన్న పాఱుఁ డ
క్కటికముమీఱఁ గావలయు కార్యములం దఱితప్పకుండ మి
క్కుటమగు శ్రద్ధతో జరుపుకొంచును బంచమవత్సరంబు వ
చ్చుట గమనించి భవ్యగుణశోభితమౌ శుభవాసరమ్మునన్ 79

మ॥ శాస్త్రసమ్మతమ్ముగా నక్షరాభ్యాసమ్ముఁ జేయించి యబ్బాలునకు

గీ॥ కేశవ! ముకుంద! గోవింద! కృష్ణ! చక్రి!
నృహరి! నగధారి! మధువైరి! నిగమవినుత!
నరసఖ! రమేశ! పరమేశ! నరకనాశ!
శౌరి! శ్రితరక్ష! శ్రీవత్స! శార్ఙ్గి! విష్ణు! 81

గీ॥ నాగశయన! కంసాంతక! నలిననయన!
గరుడతురగ! నారాయణ! కందగాత్ర!
భవనివారణ! వారణవరద! శ్రీద!
మ్రొక్కెదను నన్ను నీ భక్తుఁ బ్రోవవయ్య! 82

గీ॥ నీవె తల్లివి తండ్రివి నీవె నీవె
తోడఁబుట్టువ నీవె మిత్రుండ నీవె
గురుగురుండవు సాఁకెడు దొరవు నీవె
యెల్ల సమకూర్చు దైవము నీవె కృష్ణ! 83

వ॥ అను శ్రీమన్నారాయణనామవిరాజిత పద్యంబులు కంఠస్థంబుగాఁ జెప్పి దేవతార్చనాసమయంబుల నా బాలుని చేఁ బూజాద్రవ్యంబులు దెప్పించుకొనుచు నతఁడు చూడ దేవపూజసేయుచు నివేదిత క్షీరప్రసాదంబు లిడుచుండు నయ్యార్యవర్యు భార్యలిర్వురు బాలుని దమతమ మాటయే వినునట్లు చేసికొనవలయు నను తలంపుతో వీఁడు నా బాలుఁడు నేనె పెంచెదనని యొకరితోనొకరు జగడంబులాడుచుండి పెట్టిపోఁతలంగాక బెదరింపులతోఁ దనయుఁదన యాజ్ఞలో నడపించుకొనఁ బెదతల్లి ప్రయత్నించుచుండు 84

గీ॥ కసరికొన కడిగినయట్టి కాయ గరప
మోదకంబులు దనకు నామోదకముగఁ
బెట్టుచుండుటఁ బినతల్లి పిలిచినంతఁ
జెంతకుం జేరుచుండు నా చిన్నవాఁడు 85

క॥ అది గని యీర్ష్యాన్వితయై
పెదమ్మ యీ బాలుఁ డిచటఁ బెరిగిన నాకు

ముదుసలితనమునఁ గష్టము
లొదవక పోనని తలంచి యొక దివసమునన్ 86

చ॥ సవతియుఁ బ్రాణవల్లభుఁడు సద్మములోపల లేనియప్డు కై
రవరిపుఁ డస్తశైలశిఖరమ్మున కేగెడువేళ నా నిసుం
గు విపిన మధ్యభాగమునకుం గొనిపోయె ఫలాశఁగొల్పి దా
నవ లనిస్త్రీలనంట మునినాథ! దురాత్ములు కొందఱుంటనే 87

సీ॥ ఆరీతి ఘోరకాంతారమ్ములోఁ జేర్చి
పం డొకఁడిడి తినుచుండు మిద్ది
దీనికన్నను మంచి తియ్యనిపండ్లు నీ
పొట్ట నిండఁగఁ దెచ్చిపెట్టుదాన
నందాఁక గదల కీ వింటె యుండుమటంచుఁ
జెప్పి మోసమొనర్చి చేరెఁ గొంప
మగఁడును సవతి సద్మమ్మున కేతెంచి
బాలుఁడేడీ యటన్నఁ బ్రౌఢ గాన

గీ॥ వచ్చె మీతోడ ననుకొంటి వాఁడు నాకుఁ
గనుపడనెలేదు మీ రటు చనినదిమొద
లనుచు నేమి యెఱుంగనియట్లు పలికి
మగఁడు దన కిష్టుఁడౌట నమ్మంగఁజేసె 88

వ॥ అవ్విధంబునఁ బల్కిన సపత్ని కపటవచనంబులు విని యవ్విప్రుని
రెండవభార్య శత్తఱమ్మున నబ్బాలుఁ దా వెదకఁదగినంతవట్టును
వెదకి కానక కనులనీరేఱులై పారుచుండ 89

మ॥ విపులం బ్రేమఁ గుమారకుం బెనుచు భూమీదేవతామాళి రెం
డవయిల్లాలు ముఖమ్ము వక్షమొకటన్ హస్తద్వయిన్ మోదుకొం
చు విలాపమ్మొనరించె నో తనయ! యిచ్చో నొంటి నిన్నుంచి నే
నవలం బోవుటకల్గి డాగితివొ యెందైనన్ రహస్యస్థలిన్ 90

ఆ॥ అలుక యేలర తండ్రి! నీకై యనంటి
పండ్లు మామిడిపండ్లు జాంబవములాది
గాగ ఫలములు ఖండశర్కర మిఠాయి
తెచ్చితిని వచ్చి తినవయ్య యిచ్చకొలఁది　　91

స॥ నిముసంబైనను నన్ను వీడి నిలువన్లేదెన్నఁ డీవిట్లు పే
రెముతో వచ్చి పెనంగులాడి జనయిత్రీ! యింట క్షేమైనఁ బె
ట్టుమటంచాడెద వగ్గె దేస్తు విపుడెట్టుల్ పోతి నన్నాసి దా
ష్ట్యమున న్నిగ్గిరించి పెద్దమయిఁ బొట్టం బెట్టుకోలేదుగా　　92

ఉ॥ బాలక! నిన్ను మాకు భగవంతుఁడు భీకరకాననమ్ములో
నేల లభింపఁజేసె లభియింపఁగఁజేసిన సామి మా హృద
జ్వాలఁ గలట్టి కోరుకులు పారమునేరకమున్నె కన్నులన్
బోలెడు దుమ్ముఁగొట్టి కొనిపోవఁగ నేల నినున్ గ్రుధామతిన్　　93

మ॥ మా పూర్వజన్మకృత పాపంబిట్టిదని బిట్టు వాపోవుచుండ నోదార్చి
యామె మగండు దామునకు నాశ్రమమ్ము చుట్టుప్రక్కలఁ జాల
దవ్వరయఁదగు నిరవుల నరసి యెందును గానుజాడఁ బొడఁగానక
నిరాశుండై కుందుచు నిజమందిరంబుఁ జేరె నచ్చట బాలకుండు

గీ॥ తనకుం బెద్దమ్మ యొసం
గిన తియ్యనిపండు నారగించుచుఁ దొలి చె
ప్పిన చొప్పున ఫలములఁ గై
కొని యా యమ వచ్చునని కుతుకముతోడన్　　95

గీ॥ కొంతసేపుండి యా యమ్మ యెంతయేనిఁ
దడవునకుఁగూడ రాకున్న నెడఁదయందు
భయము నొందుచుఁ జీకటిపడఁగఁజొచ్చె
రావె పెద్దమ్మ! పెద్దమ్మ రావె యనుచు　　96

ఆ॥ పిలిచి పిలిచి యెట్లు పిలిచిన రాకున్న
వగచి వగచి కొంతవడికి నామె

కొంతపు వెదకి వెదకి తెరువేది తోఁపక
పోయి పోయి తొలసి పొంతఁజేరి 97

చ॥ శ్రమ కడుఁ గన్నవాఁడగుట రాకొడు కా తులసీ పవిత్రవృ
క్షము మొదలం బరుండి నిశసాంతము నిద్దురవోయి లేచి గే
హమటు మనోజ్ఞమై యది మహాసుఖమిచ్చుచునున్న నాత్మనే
త్రములకు మత్స్యు లేరుఁ గన రామిని నేడిచె గోడుగోడునన్ 98

శా॥ ఆ దుఃఖ మ్మపుడాలకించిన యరణ్యావాస భూతాళి వ్యా
పాదస్వాంతకమయ్యు బిట్టుగ విలాపం బాచరించెన్ జుమీ
స్వాదుస్వోజఫలంబులన్ జలములన్ బాల క్షుధాతృష్ణ లెం
తే దవ్వౌనటుసల్పి పత్రములఁ బత్రిశ్రేణి సౌఖ్యంబిడెన్ 99

వ॥ ఆరీతి ఖగమృగ పూగంబుచే నాదరింపఁబడుచున్న పిన్నపాపండు తులసీ దర్శన స్పర్శనాశ్రయంబులచే గతశ్రముండును నిరపాయుండును బ్రభూత హరినామస్మరణుండు నయ్యెఁ గావున మునివరుండ వగు జహ్నూ! తులసీ దర్శన స్పర్శన ప్రాప్తిగలవానికి సమస్త పాపంబులు నశించు జ్ఞానోదయమ్మగు గృహగమనమ్మల నెచ్చట నెట్టి భయమ్మును గలుగకుండు వినుమని యా రాకొమరుని తెరువాతి కతఁ జెప్పందొడంగె. 100

## 28 అధ్యాయము

శా॥ ఆ కాంతారమున న్నృపాత్మజుఁడు తిర్యగ్జంతుసంరక్షుఁడై
శోకం బెట్టిదియో యెఱుంగక మనస్తోషంబుగా నుండె నా
శ్రీకాంతప్రియమూర్తియైన తులసీవృక్షమ్ముక్రిందన్ మునీ!
చేకూరెన్ హరిపూజకున్ సమయమం జిత్తమ్ము రాపట్టికిన్

### — సులక్షణకుమారుఁడు హరిని బూజించుట —

సీ॥ ఆ కుమారుఁడు తన్ను సాఁకిన తల్లులు
తులసిచెట్టుకుఁ బూజ సలుపుతీరుఁ

బురుషుండు విగ్రహపూజ సేయువిధమ్ముఁ
గాంచుచుండినవాఁడు గానఁ నపుడు
జలములతోడ నా తులసిమూల మలికి
శిల యొండు గొని తెచ్చి శ్రీహరి యని
తత్పవిత్ర వసుధాస్థలి నిల్పి శ్రద్ధతో
నమలాంబుసేచన మాచరించి

గీ॥ దాపునం గల్గు పూలుఁ బత్రములుఁ దులసి
దళము లత్యంత పరిమళమిళితములు వి
భాయుతమ్ములు సమకూర్చి పాలకపిత
తనకుఁ జెప్పిన యట్టి పద్యములు భక్తి 102

గీ॥ కేశవ! ముకుంద! గోవింద! కృష్ణ! చక్రి!
నృహరి! నగధారి! మధువైరి! నిగమవినుత!
నరసఖ! రమేశ! పరమేశ! నరకనాశ!
శౌరి! శ్రితరక్ష! శ్రీవక్ష! శార్ఙ్గి! విష్ణు! 103

గీ॥ నాగశయన! కంసాంతక! నలిననయన!
గరుడతురగ నారాయణ! కందగాత్ర!
భవనివారణ! వారణవరద! శ్రీద!
మ్రొక్కెదను నన్ను నీ భక్తుఁ బ్రోవవయ్య 104

గీ॥ నీవె తల్లివి తండ్రివి నీవె నీవె
తోడఁబుట్టువ వీవె మిత్రుండ వీవె
గురువరుండవు సాఁకెడు దొరవు నీవె
యెల్ల సమకూర్చు దైవమ వీవె కృష్ణ! 105

వ॥ అను పద్యంబుల 106

క॥ చదువుచుఁ దులసీదళముల
మృదు నానాపుష్పముల నమేయుని లక్ష్మీ

హృదయాధీశునిఁ గేశవు
గదాధరుని బూజసల్పి ఖగములు మృగముల్ 107

మ॥ తనకై తెచ్చిన తేనియల్ ఫలము లాద్దైత్యారికిం దా నివే
దనముం జేసి యనంతరంబ క్షుధ డిందం ద్రావుచున్ మెక్కుచున్
మన మన్యంబులఁ జేర్ప కొక్కమొగి షణ్మాసంబులం బుచ్చినన్
వనజాతాక్షుఁడు దర్శనం బిడమికిన్ స్వాంతంబునం గుందుచున్

వ॥ దీనాననుండై యున్న నబ్బాలకునకు గగనవాణి వాని పాలకపిత కంఠస్వరంబునఁ గుమారా! చింతింపకుము. తేపటినుండియు మకర మాఘంబు గావున సూర్యుం డర్ధోదితుండగు వేళ నిచ్చటకు సమీపంబునఁగల సరోవరోదకంబుల స్నానమొనర్చి యథాప్రకారం బున నంబుజాక్షుం బూజింపుము. దాన దానవారి నీకు శీఘ్రంబ దర్శనంబిచ్చునని వినిచిన విని యప్పటినుండియు నక్కాసారంబున మాఘస్నానం బొనర్చుచుఁ దజ్జలంబులతోడను దులసీదళంబుల తోడను బహువిధ ప్రసూనంబులతోడను దులసీమాలసిత వన మాలి కభిషేకార్చనాదికంబు లచంచలభక్తిఁ గావించుచుండ మాఘ శుద్ధ చతుర్దశీదినంబున 109

సీ॥ శతకోటిభాను భాస్వరకిరీటముతోడ
రమణీయ రత్నహారములతోడ
గురుకళావిస్ఫుర త్కుండలమ్ములతోడఁ
బురు డెఱుంగని బాహుపురులతోడ
మహితరవోపేత మంజీరములతోడ
రాణించు పీతాంబరములతోడ
శంఖచక్రాదిక సాధనమ్ములతోడ
దరహాసలసిత వక్త్రమ్ముతోడ

గీ॥ వక్షమున లక్ష్మి భాసిల్ల ఫణివిభుండు
ఛత్రమై యొప్పఁ బక్కిరా జక్కి నెక్కి
సేవకులు సునందాదులు సేరి కొల్వ
శౌరి కృపమీఱ నిల్చెఁ గుమారు నెదుట 110

క॥ నిలచిన హరిరూపముఁ గ
న్నుల తమి దీరంగఁ గనుచు నోటను నెదియున్
బలుక న్నేరక కేల్గవ
లలాటమున నిడికొనిన సులక్షణసుతునిన్ 111

క॥ మారాకాంతుఁడు జిష్ణుఁడు
మాతని వాత్సల్యమునఁ గ్రమంబున జ్ఞానాం
కురమ్మొదవఁగఁ గుడికై
తోఁ దాఁకించి తల నిమిరి తొలఁకెడు ప్రేమన్ 112

గీ॥ బాలకా! నీవు చేసిన ప్రార్థనముల
నర్చనములఁ దృప్తుండనై యరుగుదెంచి
నాఁడుఁ గోరిన వరమిత్తు వేఁడు మింక
సంశయింపకుమన్న రాజన్యసుతుఁడు 113

వ॥ పరమేశ్వర జ్ఞానముద్రికామండిత హస్తమస్తక సంయోగంబున జ్ఞానంబొదవి యా దేవదేవు పాదరాజీవంబులకు సాష్టాంగప్రణామంబు లాచరించి లేచి కరంబులు ముకుళించి 114

— సులక్షణసుతుండు విష్ణువును స్తుతించుట —

* మత్తేభ కందగర్భిత సీసము ॥

త్రిపురభిత్స్నిహిత! దివ్యసన్నుత పదాం
భోజాత! వేధఃపితా! జయిష్ణు!
క్షుధరధీరా! స్మరకోటిసుందర! మునీం
ద్ర స్వాంతసంచారణా! దయాబ్ధి!
అసురరాజానుజ హస్తిరాడ్వినుత! తే
జోభగ్నభానుప్రభా! భవఘ్న!
నృహరిపీతాంబర! నిర్జితాసురగణా
ధ్యతా! శ్రితానందదా! మహాత్మ!

---

* ప్రతి పెద్ద పాదములలో మొదటి యక్షరమును దుది మూఁడక్షరముల వదలిన మత్తేభమగును. గీతమం దారంభమునుండియుఁ గందమేర్పడును. చివర 6 అక్షరాలు తొలఁగును.

గీ॥ కమలదళచారులోచన! శమితకలుష!
పూర్ణచంద్రసామ్యాసన! భోగ్యమరప
తల్ప! పురుషసత్తమ! విబుధవిపదనల
జలద! కితవభీదాయక! చక్రహస్త!

* కంద గీత గర్భితోత్పలమాల ॥
శ్రీమహితాకృతీ! సురపసేవ్య! హరప్రియ! సూరిజాలవం
ద్యా! మురదానవాహిత! గుణాకర! భాసురహేమచేల! కృ
ష్ణా! మహిభృద్ధరా! కలుషనాగహరీశ్వర! గానలోల! కం
దామితభాస్వరా! జగదనర్గళఖేలన! సాధుపాలనా! 116

సీ॥ నీ నామసుధ నెప్డు ద్రానుచుంటనుగదా
విసము మ్రింగియును జీవించు శూలి
నీ మూర్తిఁ దనలోన నిల్పికొంటనుగదా
బడబాగ్ని కింకకఁ బ్రబలు కడలి
నీ పాద మూదల మోపుకొంటనుగదా
బలి గతవ్యసనుఁడై బ్రతుకు నెపుడు
నీ దృష్టిఁ దనపైని నెఱపుకొంటనుగదా
నింగి సుస్థిరదీప్తి నిలుచు ధ్రువుఁడు
గీ॥ అహహా! నీ నామరూపపదావలోక
నములు శ్రితులకు నీని శ్రేయములు గలవె?
తామరసనేత్ర! కలుషలతాలవిత్ర!
మేచకాబ్దాభగాత్ర! లక్ష్మీకళత్ర! 117

సీ॥ ఎవ్వని మాహాత్మ్య మెఱుఁగ నేరక మౌని
బృందమెల్లపుడు తపించుచుండు
నెవ్వని సంకల్ప మెఱుఁగ నేరక చతు
ర్ముఖుఁడు కర్జముఁ దలపోయుచుండు

* ప్రతి పాదమున మొదటి 6 అక్షరాలను, చివరి యక్షరమును విడచిన నడుమ గీతమగును. 1, 3 పాదాలలో మొదటి అక్షరమును, 2, 4 పాదాలలో చివరి 16 అక్షరాలను వదలిన కందమగు.

జన్మ్యోగదా యని దురంత చింతాక్రాంతస్వాంతుండై యున్న
వాఁడు. నీవు సుధర్మాభిధానుండవై నీ తండ్రికడ కేగి వాని ముద్దు
ముచ్చటలు దీర్చుచుఁ గ్రమంబున సమస్త కళాపారంగతుఁడవును
గృహపతియునవునై జనకభృత భూభారంబు వహించి యజ్ఞ
యాగాదు లొనర్చుచు మాఘవ్రతం బాచరించుచు నేనిడిన నీ
సుధర్మాభిధానంబు సార్థకంబుగాఁ బ్రజాపాలనంబుఁ గావింపు
చున్నాలఁ దగు సమయంబున నిన్ను మత్పదంబునకు రప్పించుకొని
మత్సాయుజ్యంబు నొసంగెద. నా భృత్యుండగు సునందు నీకుఁ
దోడుగాఁ బుచ్చెద నరుగుమని సునందునికిఁ గనుసన్న యొనర్చి
సపరివారుండై యంతర్థానంబు నొందుటయు 123

— సునందుఁడు సుధర్ముని దండ్రి కొప్పగించుట —

ఉ॥ నందకపాణి యానతి సునందుఁడు మౌళి వహించి భూమిభృ
న్నందను వెంటఁబెట్టుకొని తజ్జనకుండు వసించు వీటి కా
నందముతోడఁ బోవు తరుణమ్మునఁ బౌరగణమ్ము పిల్లవా
నిం దిలకించి తేజనకు నెమ్మయి సౌరున కబ్రమొందుచున్ 124

గీ॥ ఆ సునందుని జేరి మహానుభావ!
మీర లెవ్వరో యీ సుకుమారుఁ డెవరో
యిటకు రాఁ గారణం బేమొ యెఱుఁగఁ జెప్పఁ
డనిన వారలతో నిట్టులనియె నతఁడు 125

క॥ మీ విభుని సమ్ముఖమ్మున
నే వివరించెద సమస్త మే తెం డెఱుఁగం
గా వాంఛ సేయువారని
పోవఁగఁ దోఁ జనిరి భూపుమొలకుఁ బౌరుల్ 126

వ॥ అప్పు డా సులక్షణకుమాధ్యక్షుండు నిండుకొలువున నుండి బాల
భాస్కరుం బోలు బాలునితో వచ్చుచున్న సునందున కభ్యుత్థాన
వందనంబులొనర్చి యర్ఘ్యపాద్యంబులొసంగి సుఖాసనోపవిష్టుం జేసి
నిజవృత్తాంతం బడిగిన నతండు 127

సీ॥ అవనీశ! యితఁడు నీ యాఁడుసుం డీతని
జనని సపత్నులిడిన దురాప
ధమున మతి చెడి కాంతారమ్మునకు నేగి
వీనిని బ్రసవించి వీనిఁ దినఁగఁ
జేరినపులికిఁ దా నోరైమై యీ బాలు
బ్రదికించె నంత నవ్వనచరములు
ఖగములు మృగములు గాపాడునెడ నొక్క
పాఱుండు గొనిపోయి కూరిమిమెయి

గీ॥ సాఁకుచో వాని పెదరాణి సవతి కితఁడు
చనవుగా నుంట కోర్వక సమయమరసి
యడవిలో డించిపోయె నేమనఁగవచ్చుఁ
గ్రూరచిత్తల చెయిదముల్ ధారుణీశ! 128

ఉ॥ అచ్చట నీతఁ డొంటరిగ నార్తినిజెందుచుఁ దిక్కి తిక్కి రే
వచ్చెడువేళకుం దొలసిపజ్జకుఁ బోయి పరుండి సుప్తుఁడై
వెచ్చని వేల్పురా నిదురవీడి వనేచరవర్గ మెంతయుఁ
మచ్చికఁ బ్రోచుచుండఁగ దినమ్ములు గొన్నిటిఁ బుచ్చె భూవరా!

వ॥ అట్లుండ నీతనికిఁ దులసీవృక్షమూలస్థలనివాసంబువలనను దదీయ
దర్శన స్పర్శనంబులవలనను భగవద్భక్తి జనించి సర్వాధారుండును
సర్వేశ్వరుండును నగు శ్రీమన్నారాయణుం బూజింప నక్కరుణా
భరణుండుఁ బ్రత్యక్షుండై వరంబులిచ్చి వీనిని నీ కొప్పగించిరమ్మని
పార్శ్వచరుండనగు నన్నుం బుచ్చినఁ దీసికొనివచ్చితి నిది వీని
వృత్తాంతం బనిచెప్పి బాలకుం జూచి కుమారా! సుధర్మా!
యీతండె నీ జనకుండనుటయు 130

ఉ॥ బాలుఁడు భక్తిమీఱఁ బితృపాదముల న్గనలుంచి మ్రొక్కె భూ
పాలుఁడు కంట నీరొలుక వానిని గౌఁగిటఁజేర్చి పట్టి త
న్మౌళిని మూరుకొంచుఁ బలుమాఱులు ముద్దిడికొంచుఁ బెద్ద యి
ల్లాలికి వార్తనంప నపు డాయమ చెచ్చెరవచ్చి యచ్చటన్ 131

గీ॥ తల్లి ముఖలక్షణంబులు దండ్రి కళలు
కలిగి ముద్దుల మూటయై కన్నతండ్రి
యంకమున నున్న బాలకు నందుకొని శి
రమ్ము మూర్కొని ముద్దాడి రార ! తండ్రి ! 132

గీ॥ రార! మా పున్నెములపంట రార! యనుచుఁ
గనుల నానందబాష్పముల్ గారుచుండఁ
జంక నిడుకొనె నంతట జనవిభుండు
పిలువఁగాఁబంపెఁ దక్కిన పెండ్లములను 133

ఉ॥ వారలు వచ్చి భూవరుని బాలకునిం దిలకించి భీతిచే
నోరు మెదల్పఁజాలమిఁ గనుంగొని రోషవిఘూర్ణమానుఁడై
భూరమణుండు మీ దురితముల్ వివరించి నితండు దాఁప కిం
దే రటుచేసిరో తెలుపుఁ డిందఱు నొక్కట చాకచయ్యనన్ 134

శా॥ ఔరా! యెంతటి జంతలే యని నృపుం డల్కన్ ఖరాసింగొనం
గారామామణి పెద్దరాణి పతి పత్కంజాతముల్ తట్టి దే
వా! రక్షింపుము వీరి నా మనవి సర్వంబుం జెవింబెట్టి యా
పై రాడ్ధర్మము నిర్వహింపుఁడని చెప్పంబూనె నీరీతిగన్ 135

సీ॥ భూప! యీతనితల్లి మొదట మా యందఱ
పంటను జెఱచి తాఁ బడసెఁ జూలు
దానిచే వీరెల్లఁ దాలిమి విడనాఁడి
కడతాణి గర్భంబు చెడఁగ మందు
నిడఁబూని వచ్చి నా కెఱిఁగింప నెన్నియో
విషయముల్ బోధించి వీరి పూన్కి
మాన్పి పంపితిఁ గాని మానకుండుటెఱుంగ
న ట్లెనెఱింగిన యద్ది యపుడె
గీ॥ తమకుఁ దెలుపక దాఁచిన తప్పుగలుగు
దానఁ గావున నేననూ దండనార్హ

నన్ను దండింపుఁడనఁగ సునందుఁ డెల్ల
సభికు లాలింప నిటువల్కెఁ స్వాదుఫణితి 136

సీ॥ పాపుల పాపముల్ పరికించి దండించు
టధిపతి ధర్మమే యైనఁగాని
నరపతి నూతనానంద మేర్పడినప్డు
పూర్వశిక్షితులకు ముదముఁగూర్ప
వారల కారల వదలఁజేయునుగదా
యట్టిచోఁ దన దేశమందు నుండు
జనులెల్ల సంతోషమునఁ దేలఁదగువేళఁ
గొందఱు దుఃఖింపఁగూడునొక్కొ

ఆ॥ అదియుఁగాక వీని యవ్వ వల్లభు నాజ్ఞ
మీఱి పంచుఁ దానె మోసవినట్టి
దోసమునను జేసి దుర్మరణమ్మొందె
నేరి కర్మఫలము వారిదెకద 137

వ॥ కావున నీ సులక్షణమహీనాథుం డీ మహానందసమయంబున నెల్లర దోషంబులు క్షమించి యనుగ్రహించుట ముఖ్యంబని మఱియు నిట్లనియె 138

ఉ॥ బాలకు పూర్వజన్మకృత పాపముఁ బుణ్య మెఱింగి చెప్పఁగాఁ
జాలమ యేఁడు లైదయిన సాంతమునిండని యీమలోన నే
బోలెడు కష్టముల్వడియెఁ బొందె ముకుందుని సత్కృపను జగ
త్పాలురకైన నబ్బని శుభంబు లనంతర మోక్షసంపదన్ 139

వ॥ ఈ బాలకుం గనుటవలన జననీజనకులేకాక దేశప్రజలును గృతార్థులైరే నింక నా స్వామి సాన్నిధ్యంబునకరిగెదనని యెల్లరుఁ జూచుచుండ సునందుం డంతర్ధానంబు నొందె నంత సులక్షణక్షమారమణుండు దన పట్టమహిషితో నిట్లనియె 140

ఉ॥ తల్లి నెఱుంగఁ డీ శిశువు తల్లివె నీవని నీకొసంగితిన్
బల్లవితాంతరంగవయి బాలుని వీని నిజాత్మజన్ముగా
నెల్లపు డోమఁగావలెసుమీ! యితఁ డేయెడరైనఁగన్న ని
న్నొల్లను నాదు ప్రాణముల నొల్లను సర్వము భ్రష్టమై చనన్

గీ॥ అన్వయంబున కాధారమైనవాఁడు
ధరణి భరమెల్లఁ దాల్పఁగాఁ దగినవాఁడు
మనకుఁ బుణ్యలోకము లీయ మనినవాఁడు
వీఁడు గావున శ్రద్ధఁ గాపాడవలయు 142

ఉ॥ వీనికి నన్నపానముల వేఱొకతె న్నియమింపఁబోక నీ
వే నిరతమ్ము శ్రద్ధమెయి నీయవలెన్ నిశ వచ్చుటాదిగా
నీ నిలయమ్ము నందె శయనించెడునట్లు లొనర్పఁగావలెన్
గాని మఱొండురీతి జరుగం దగ దెత్తఱిఁ బ్రాణనాయికా! 143

వ॥ అని యాజ్ఞాపించి తక్కిన భార్యలంగని మీరిదివఱకుఁ జేసిన దోసం బత్యంతంబైనఁ బెద్దల యాజ్ఞవలనఁ ద్రోసిపుచ్చితిఁ జుండీ యని రూక్షేక్షణుండై తీవ్రస్వరంబున 144

ఉ॥ బిడ్డఁడు త్వత్కృతాఘమునఁ బిండమురూపము నొందుటాదిగాఁ
బడ్డవెతల్ దలంచికొన బ్రద్దలువారెను గుండె యింక మీ
చెడ్డపనుల్ కుమారునెడఁ జేసితిరేనియు నాంద్రునాక యే
యడ్డులు సైఁప కప్పుడె ఖరాసిని ద్రుంచెద మీ శిరంబులన్ 145

మ॥ అనుచుం బల్కి సులక్షణాహ్వయధరాధ్యక్షుప్రబర్హ్యుండు నం
దన వీక్షాజనితప్రమోదమున గోత్రాదేవతారాజికె
ల్లను నానావిధదానధర్మముల నాహ్లాదంబు సంధించి యి
చ్చె ననర్ఘ్యమ్ములు భూషణమ్ములు శ్రితశ్రేణీమనఃప్రీతిగన్ 146

గీ॥ అవలఁ బురమున దేశమ్మునందు నెల్ల
దేవతల కుత్సవములు భూదేవతలకు
మిష్టమృష్టాన్నములు ఘటియిల్లఁ జేసి
చుట్టములఁగూడి సుఖముండె సుజనవర్య! 147

చ॥ తనయుని యాటపాటలకుఁ దాఁ గడు నుబ్బుచు వానిఁ జూడ నో
వని జనయిత్రిదుర్మ్మృతికి స్వాంతమునన్ బహు చింతఁ జెందుచుఁ
జను లధికారులు న్వినయసంభృతులై తన యాజ్ఞఁ దీర్పఁగా
దినములు కొన్ని పుచ్చి యొక దేశికశేఖరుఁ బిల్చి వానికిన్ 148

శా॥ బాలున్ శిష్యుని జేసి గౌరవమొనర్పన్ మెచ్చి యాసూరి భూ
పాలగ్రామణి సూతికిన్ మురిపెమొప్పన్ నేర్పె విద్యల్ సుధీ
జాలం బెన్న సుధర్ముఁడుం జదివె నిస్తంద్రాత్ముఁడై నిష్ఠ నా
మూలాగ్రంబుగ మున్నె వచ్చినవొ నా భూమీసుపర్వాగ్రణీ!

వ॥ అట్లు సకలశాస్త్ర శ్రుతిస్మృతిముఖ నానావిద్యాపారంగతుండైన సుధర్మునకు క్షత్రియార్హంబులగు శరాసన గదాఖడ్గాదిక సర్వాయుధ యుద్ధనైపుణ్యంబులను మల్లబంధవిశేషంబులను దివ్యాస్త్ర ప్రయోగోపసంహారంబులను రథగజాశ్వారోహణ చాతుర్యంబులను బహువిధ వ్యూహ నిర్మాణ భేదనా కౌశల్యంబులను దండ్రి స్వయంబుగాఁ గఱపె నంతఁ గ్రమక్రమంబున సుధర్ముం డష్టాదశ వర్ష వయస్కుండు సర్వకళాపరిపూర్ణుండునై పూర్ణచంద్రుచందంబున నొప్పుచుండ సులక్షణుండు చూచి హర్షించి మంత్రులతో నాలోచించి 150

క॥ యువరాజుగాఁ గ నొనరిచి, వివిధవిధానముల నతని విజ్ఞతఁ జక్షు
శ్శ్రవణానూనాహ్లాదక,మవుటకు నెంతేని నుబ్బు చధిపతి యుండెన్

వ॥ అట్టు లా సుధర్ముండు యువరాజపదంబునొంది సర్వజనరంజకుండై మెలంగుచుఁ దనకుఁ దల్లులు పెక్కండ్రుండుట నెఱింగి తన్నుఁ బెంచుచున్న పట్టమహిషితో నొకదినంబున నిట్లనియె 152

శా॥ అమ్మా! నన్ననినట్టి తల్లి చనియెన్ నాకంబటంచు న్వీపుగా
కమ్మల్ పెక్కురటంచు వింటి నొకనాఁడైనన్ ననుం బిల్వరే
మమ్మా వారలు వారు నన్నుఁ గనరాదా వారికిం బుత్త్రర
త్నమ్ముల్లేరఁటకాద నాపయిని క్రోధంబే మొకో వారికిన్ 153

క॥ ఆ యమ్మలఁ జూచుటకై
నాయెడ త్వరపడెదు గాన నాపై ననుకం
పాయుతమతివై యనుమతి
నీయవె చూడంగ నన్న నృపుసతి యనియెన్ 154

గీ॥ తండ్రి! నీ కోర్కి నేఁడు నీ తండ్రిగారి
కెఱుకపఱచి వారల యిచ్చ నెఱిఁగి పిదపఁ
జేయఁదగుదాని నీకు నేఁ జెప్పుదాన
మనకు మనమయి యేపనిఁ జనదు సేయ 155

వ॥ అని పల్కి యద్దేవి తగుసమయంబున నాత్మేశున కాత్మజు నభి మతంబుఁ దెల్పిన విని సులక్షణుండు దుష్టస్వభావలగు నీ సపత్నులు బాలకుం జూడ నసర్హలయ్యెనఁ గుమారు కోరిక దీఱుచుట ఘనకు ముఖ్యంబు గావునఁ దగినవిధానంబున నీ పుత్త్రివాంఛ నెఱవేర్చు మనుటయు నా సాధ్వి మఱునాఁడు తన సవతులనెల్లర నిజగృహం బునకు రావించి నందనుం బిలిచి కుమారా! వీరె నీ జననులని చూపిన 156

సీ॥ ఆ సుధర్ముఁడు వినయమ్మున నెల్లర
యడుగుల కెఱఁగి యో యమ్మలార!
నాయెడ మీర లన్యాయము చేసితి
మని నసుఁగన సంశయమ్ము పడకుఁ
డెద్దాని కేనియు నీశ్వరుఁడే కర్త
నరుల కర్తృత యొకింతయును లేదు
ప్రత్యేక మొక్కొక్క పట్టి మీ కీఁదగు
ముని ఫలమ్మున నేను బొడమియుంట

గీ॥ మీర లెవరికివారు కుమారుఁగాఁగ
నమ్ముఁ జూడుఁడు నేను నవ్వన్న తల్లి
[illegible] మిమ్మ నొక్కొక్కర్తుఁ జూతు నెప్పు
[illegible] 157

వ॥ అవ్విధంబునఁ దన సపత్నీమాతలకెల్ల నిజనందనున ట్లానందసంధా
యకుండై మెలంగుచున్న సులక్షణనృపతనూభవునకు దిగ్విజయం
బొనర్ప నిచ్చవొడమిన 158

సీ॥ అల సుధర్మనరేంద్రుఁ డాహవోత్సాహియై
చతురంగబలముతో జైత్రయాత్ర
కవనీసురులయుఁ గన్యలయు దీవెనల్
పడసి తగినవేళ బయలుదేరి
యెదిరిన నృపుల జయించుచు నానతు
లైన భూమీశుల సర్వభంగి
నాదరించుచు వార లతిభక్తి నొసఁగెడు
నుపహారములు గొంచు నుదుటెసంగ

గీ॥ నరుగు చాత్మీయసందేశహరుని బట్టి
యక్రమంబుగఁ జెఱఁబెట్టి యాహవమున
కమితసైన్యంబుతోడ వంగాధిపుండు
రాఁగ సాఁగెను బోరు నిరువాగులకును 159

వ॥ అట్లుభయపక్షంబులవారు యుద్ధంబున కారంభించి ద్వంద్వంబుగాఁ
గొంతకాలమ్మును సంకులంబుగాఁ గొంతకాలంబును నానావిధ
శస్త్రాస్త్రంబుల ఘోరాతిఘోరంబుగా సంగ్రామంబు జరుపుట
వలన నిరువాగులయందు ప్రేలిన తేరులును గూలిన గారులును
రాలిన హయులును సోలిన కాలరులును గలిగియు రాక్షసాధ్యక్ష
మహానసశాలావిధంబున ఖండీభూత సర్వావయవంబుల ప్రోవులు
గల్గియుఁ బతితబహువిధకళేబరమాంసఖాదనసంతృప్త భూతప్రేత
పిశాచ ఢాకిన్యాదిక దాహసివారకాపారశోణితవేణికాశ్రేణులుగలి
గియు రణరంగం బతిభీభత్సంబుగా నుండె నందొకొక్కచోఁ
గొన్ని వ్యక్తు లరాతిశాతశరపాతంబున భూతలంబునం బడియు
వెంటన ప్రాణంబులు వోవమిఁ దన్నుకొనుచుండుటయు నొకొ
క్కెడఁ బ్రాణంబులువోని దేహులు తమ దేహంబులపైఁ జేరి ఖగ

మృగంబులు ముక్కులఁ గోఱల గోరుల వ్రక్కలింప వానిం బాయఁ
జోపఁ గాలుసేతులాడమి మిక్కిలి పొక్కుచుండుటయుం గని విని
సుధర్ముండు జాలిగొని నిజస్యందనంబున నిలువంబడి 160

గీ॥ ఉభయపక్షంబులం గల యోధులార!
కొలఁదిసే పనిమాని నా పలుకులు వినుఁ
డిట్లు పోరి గెల్పోటము లెఱుఁగుకైన
నుభయులకు నష్టమెంతయో యొదవుఁ గాన 161

క॥ మీలోన బలిష్ఠుండొకఁ, డాలమ్మొద్దానఁ దనకు నభిమతమో నే
నాలాగున నాతనితో, నాలమ్మొనరింతు నట్టి యాహవమందున్

గీ॥ ఆ ప్రతిద్వంద్వి నన్నోర్చినట్టులైన
నిపుడు నాకున్న కల్మితో నేను వాని
సేవకుఁడ నౌదు నతఁడోడెనా విడిముడి
కొంత కానుకగా నీయఁ గొని చనియెద 163

చ॥ అనిన సుధర్మవాక్యముల కా యిరుప్రక్కల నున్న మానిసు
ల్మనముల సంతసంపడి సులక్షణనందన! నీయెడంద మేల్
కనికరపుం బయోధి జయలక్ష్మిని గోరుచుఁగూడ హింసకుఁ
వెనుకకుఁబోవుచుంటివి మనీషివి నీ తలఁపొప్పు గణ్యమై 164

వ॥ అని యెల్లజనంబులు సుధర్ముం గొనియాడుచుండ వంగేశ్వరుండు

గీ॥ పసరు కన్నులకెక్కినవాఁడవగుట
నెదిరి బలిమి నెఱుంగక వదరు నిన్నుఁ
గనినఁ బిట్ట కొంచెము కూఁత ఘన మటన్న
సామెత స్ఫురించె నంగదేశపతి కుఱ్ఱ! 166

గీ॥ మల్లయుద్ధాన నాకు సమగ్రమైన
కౌశలంబుండె నస్మదంగమునఁ గల్గు
బలముఁ గని నీకు ధైర్యంబు కలదయేని
యోచించుటేమొ యింక కాలహరణమేల! 167

ఉ॥ నాఁగ సులక్షణాధిపతినందనుఁ డో వసుధేశ! రిత్తగా
వాగఁగఁబూన నే నదనువచ్చినచోఁ గల శక్తిఁ జూపుచే
ధీ గలవారికిం దగిన తెన్నని యెంచెదనంచుఁ బల్కి వే
వేగ నియుద్ధయోద్ధయయి పృథ్వికిఁ దేరుననుండి డిగ్గినన్ 168

వ॥ ఆ క్షణంబ వంగనృపపుంగవుండును శతాంగావరోహణం బొనర్చి మల్లయుద్ధసన్నద్ధుండై కొదమసింగంబుపైఁ గవియు మదగజంబుడం బున సుధర్మ్మం గదిసి బాహాస్ఫాలనంబొనర్చుటయు నతండు నట్ల యొనర్చి చేయిగదిపె నప్పు డిరుతెగలవారును దమతమ మెక్కి రింతల దిగి యెడగలిగి చూచుచుండిరి. వారిరువురు మల్లసంగరం బునఁ దమకుఁగల నైపుణ్యంబుఁ జూపుచు నెక్కువ తక్కువలు లేక చాలతడవు పెనంగి రందు సుధర్మ్మండు మేలుచేయియై వంగేశుం బుడమిం బడవైచి లేచి యెడగలిగి నిలిచిన నతండును వెంటనే లేచి వ్రేటువడిన శార్దూలంబులీలం బొబ్బలిడుచుఁ బైకిదూఁక సులక్షణ సుతుం డా తాకోర్చి పేర్చి యెదిర్చిన నిర్వ్యాకులుం గొంతసేపు చూపరగ్గింపఁదగిన కయ్యంబయ్యె నంత సుధర్మ్మండు విజృంభించి వంగపతిం బడవైచుటయు నతం డలసటం జెంది లేవఁజాలకున్నఁ గని సుధర్మ్మండు డగ్గరి లేవఁదీసి యొడలిమట్టి డులిపి కరంబుఁ బట్టి కొని యిట్లనియె 169

చ॥ తరుణుఁడ బ్రహ్మచారిని నెదం జెదరించెడి భారమేదియున్
బొరయనివాఁడ నట్టి ననుఁ బోర నెదిర్చితి రింతసేపు భూ
భరము వహించి పల్వురగు భార్యలు చేకుఱి వార్ధకంబునన్
జరణమునిడ్డ మీరిది ప్రశస్తము విస్మయకారి భూవరా! 170

క॥ మీరిది యోటమిగాఁగ వి
చారింపకుఁడను సుధర్మ్మసౌజన్యమ్మా
ధారుణిపతి మెచ్చి యనెన్
శూరవరా! నీ గుణములు స్తుత్యము లనుచున్ 171

వ॥ మఱియు వర్తమానకాలంబునం గల రాజపుంగవులనెల్ల జయించి పేరొందిన నన్ను నీ విక్రమంబున మల్లయుద్ధంబునందె జయించితివి నీవు సామాన్య క్షత్రియపుత్త్రుండవే? హరికరుణాపాత్రుండవు గావున నీకసాధ్యకార్యంబేదియు లేదని యగ్గించుచుండ 172

శా॥ వంగాధీశుని మేలుఁగోరు సచివాప్తశ్రేణి యోజించి సం ధిం గావింపుము కూఁతునిచ్చి యని సూక్తింజెప్పి యాపై సుధ ర్మాంగీకారము వారెఱింగి తెలుపన్ హర్షించి యిచ్చెన్ సుతన్ గాంగేయాంబరధారిణిన్ సుగుణిని న్కన్యామణిన్ హారిణిన్ 173

వ॥ ఇట్లు వంగపతి యంగేశు ననుంగుంగుమారునకుఁ దన కూఁతు నిచ్చి పెక్కరణంబులొసంగి సంతసింప సుధర్ముండు నాతని తనయం బట్టమహిషింగా గ్రహించి మామయగు వంగపతికి నమస్కరించి వాని యాశీరనుజ్ఞలం బడసి తిరిగి స్వదేశాభిముఖుండై 174

క॥ సౌలక్షణి యవ్వీధి భూ
పాలుర నాలమున నోడిచి పడసిన బహుర
త్నాలను వంగాధీశుని
బాలను గొనివచ్చి జనకుపదముల కెఱఁగెన్ 175

ఆ॥ ఆ సుధర్మతండ్రి యాహవ జయలక్ష్మి
తోడ లచ్చిఁబోలు చేడెతోడ
వచ్చి మ్రొక్కినట్టివానిఁ గుమారుని
నక్కుసేర్చి యిచ్చె నాశిషములు 176

ఉ॥ పిమ్మట మంచిమూర్తమున విప్రశిరోమణు లగ్నిసన్నిధా
నమ్మున వేదమంత్రపఠనమ్ములు సత్క్రియ లాచరింప వా
ద్యమ్ము లనేకము ల్మ్రోలఁగ నాప్తులు బంధులు పౌరులెల్ల మో
దమ్మునఁ దేల సల్పెను సుధర్ముని పెండ్లి సులక్షణుం డొగిన్ 177

గీ॥ అత్తెఱంగునఁ బరిణయమ్మై సుధర్ముఁ
డాత్మపత్నిని గూడి మహోన్నత[illegible]క్తి

గాము సౌఖ్యంబులను గొంతకాలమొంది
కనియె సుతులను సుతలఁ బెక్కండ్ర విప్ర! 178

వ॥ అప్పుడు సమస్తభార్యాన్వితుండై సులక్షణాధీశ్వరుండు 179

క॥ తనయుండును దత్పత్నియు
వినయమ్మున సేవఁజేయఁ బిన్నతనంపుం
గొనముల నాటల మాటల
మనమలునున్ మనుమరాండ్రు మది కరుసమిడన్ 180

మ॥ బహుకాలం బిల నేలి పుత్త్రికునకుం బట్టాభిషేకంబు స
ర్వహితంబౌనటుసల్పి వల్కలములం బైఁగట్టి భార్యాళితో
గహనావాసమొనర్చి లోని పగలన్ ఖండించి నిష్ఠం దప
మ్మొనరించి కృతిగఁజేసి పాసె తనువున్ భూపష్టి యోగమ్మునన్

గీ॥ అవల నా సులక్షణుని యర్ధాంగులెల్ల
సహగమన మాచరించి మోక్షమ్ముఁ గనిరి
తల్లిదండ్రుల మృతిని సుధర్ముఁడు విని
పారలౌకికములు శాస్త్రభంగి సలిపె 182

చ॥ అనఘుఁడు దత్సుధర్మవసుధాధిపుఁ డక్కటికంపుఁ బెంపుతో
జనములఁ గన్నబిడ్డలటు సాఁకుచు ధర్మపథంబునన్ దనుం
గనిన సులక్షణాధిపునికన్న మహాత్ముఁ డితండటన్న కీ
ర్తిని గడియించె ధర్మనిరతిన్ జనువానికి లోపముండునే? 183

సీ॥ వైకుంఠవల్లభాస్తోక నిశ్చలభక్తి
నభినవ ప్రహ్లాదుఁడనఁగ నొప్పె
సర్వాధికంబైన సత్యభాషారూఢి
నల హరిశ్చంద్ర సామ్యము వహించె
నర్థి సమున్మాదక త్యాగగుణంబున
శిబిచక్రవర్తిప్రసిద్ధి నెనసెఁ

బరిపంథి భయదదోర్బలశౌర్యమున జామ
దగ్న్యనిఁబోలి ప్రఖ్యాతిఁ గాంచె
గీ॥ ధర్మలోపంబు లేకుండ ధరణిప్రజకు
సర్వసౌఖ్యంబులొదవ రాజ్యంబొనర్చు
గరిమ శ్రీరామచంద్రు శ్లోకంబుఁ బొరసెఁ
బ్రథితగుణుఁడు సుధర్మభూపాలవరుఁడు 184

క॥ క్రతువులు జగన్నుతమ్ముగ
శతమున కెక్కుడుగఁ జేసె సమసమ మాఘ
వ్రత మతినియతిని లక్ష్మీ
సతీపతికిఁ బ్రీతిగాఁగ సంఘటియించెన్ 185

శా॥ ఆరీతిం జిరకాల మెల్లరకు సౌఖ్యంబబ్బ భూచక్రమున్
స్వారాట్టుంబలె నేలి కన్నకొడుకున్ సర్వంసహాధీశుఁగా
నారూఢిం బొనరించి పూర్వనృపుల శ్లాఘ్యాపుఁ డర్ధాంగితోఁ
జేరెం గానకు సత్తపంబునను గాంచెన్ శ్రీశు సాయుజ్యమున్

క॥ పతగపకేతన పదగత
మతులకు సత్కర్మలగ్నమతులకు మాఘ
వ్రతరతమతులకు నెపు డెట
క్షితిసురవర! భయములేదు కించిత్తైనన్ 187

వ॥ అక్కతమ్మునఁ దక్కిన కర్మములన్నియుఁ దగ్గించుకొనియేని మాధవ
ప్రీతికరమైన మాఘవ్రతం బాచరించుటయె శ్రేయస్కరంబు 188

చ॥ మిహిరకులాబ్ధిసోముఁడు సమిద్ధయశస్కుఁడు విద్విషద్వనీ
దహనుఁడు విష్ణుభక్తుఁడు సుధర్ముఁడు గావునఁ దత్కథాశ్రుతిన్
నిహత సమస్త పాపులయి నీరజనేత్రుని ప్రేమపాత్రులై
యిహపరసౌఖ్యముల్ గని రమేశపదంబును గాంత్రు మానవుల్

వ॥ అని కృత్స్నమదుండు జహ్నువున కెఱింగించిన తెఱంగున గంగా
తరంగరంగదుత్తమాంగుఁ డంబికకుఁ దెల్పినట్లు సూతపౌరాణి
కుండు శౌనకాదిమహామునులకుం జెప్పె. 190

— ఆశ్వాసాంతము —

క॥ ధీమద్గణ్య కవిత్రయ,సోమ శ్రీనాథ పోతసుకవి ప్రముఖో
ద్దామాచ్ఛయశఃకామా!, కామకృతివిరామ! రామకవిసుత్రామా!

నాగబంధము ॥

చ॥ వరదయమ_న్త్రిపు_త్రి జనవర్ణ్య వచోంగద యర్థివర్గ వా
త్సరసిజభాను వేదమహితా హిమధామపురారి నాగరాట్
సురవర గోతురగ్గ శుచిశుభ్రయశా నుతమ_న్త్రిధామ జ
న్మరిపుయమా సుధీనమననా వ్యాతగోరుజ న్యాయజీవనా! 192

చక్రబంధము ॥

*శా॥ _స్తవ్య[1] శ్రీ యుత పో[7]॥తరాట్కుల నదీట్సా[10]ర జ్ఞపాం[4]క ప్రభా
దివ్యా[2]రా మత ల[8]॥ద్రుకీ_ర్త్యలఘుదీ_ప్తి[11] చి_త్తభా[5] వి గ్రహా
నవ్యా[3] మ_త్తమ న[9]॥స్క బంధులలితా నా తం[12]డ్రి నీ కై[6] విభా
భూవ్యా_ప్త_స్తవ మే దినమ్మొనరుతుఙ్ భూపాస్పృహా ధీ స్వభా!

– గద్యము –

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీ వత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభాషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున నవమాశ్వాసము.

---

* ఇందలి యంకెలున్న యక్షరములను వరుసగాఁ జదువుకొనునది.

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః

# మాఘపురాణము

## దశమాశ్వాసము

క॥ శ్రీపతి పాదాంభోజ,స్థాపిత చేతస్క! సోమసదృశ యశస్కా!
కాపట్యరహిత సత్యా,లాప హరిశ్చంద్ర! రామలాక్షణికేంద్రా! 1

వ॥ అవధరింపు మట్లు నైమిశారణ్యశరణ్యులగు శౌనకాది మునివరే ణ్యుల కఖిలపురాణ కథాకథన ప్రఖ్యాతుండగు సూతుం డిట్లనియె నవ్విధంబునఁ గైలాసంబున శైలసుతకు మాఘమాహాత్మ్యంబు నుడువుచున్న మహాదేవుండు పార్వతిం గని దేవీ! వినుము. గంగా తీరంబున మాఘవ్రతంబు సల్పుచుఁ దన్మహిమాదికానేక కథావిశే షంబులఁ దెల్పుచున్న భృగుకులతిలకుం డగు గృత్స్నమదుండు జహ్నువుం జూచి 2

## 29 అధ్యాయము

గీ॥ మకరమాఘప్రవేశ సమయము మొదలు
గాంగఁ బూర్వోక్తవిధి నవగాహనమ్ముఁ
జేసి లక్ష్మీపతిని బూజసేయువాని
కబ్బు పుణ్యఫలము వినుమా మునీశ! 3

మ॥ ధనధాన్యంబులుఁ బాడిపంటలును సత్సంగంబు సద్భార్య స్వా
జ్ఞను బాలించెడి పుత్త్రపౌత్త్రులుఁ దనూ స్వాస్థ్యంబుఁ జేకూరి మే
దినిపై సర్వసుఖంబులొంది పిదపన్ దివ్యుల్ త్వగం గొల్వ నే
గును స్వర్ధామము దివ్యయానగతుఁడై గోత్రామరగ్రామణీ! 4

వ॥ అట్టివాఁడు తాను దరించుటయేకాక తనసంబంధులఁ గోటికులమ్ముల వారి నుద్ధరింప సమర్థుండగు మిగుల నాశ్చర్యకారిణి యగు మఱి యొక కథఁ జెప్పెద సావధానమనస్కుండవై వినుమని జహ్నుపుత్త్రో గృత్స్నమదుం డిట్లనియె 5

— క్రూరా చరిత్రము —

చ॥ పుడమి విదేహదేశమునఁ బూర్వపు ద్వాపరమందుఁ గాఁపువం
గడమునఁ బుట్టువుం గనియెఁ గర్షకనాముఁడు కోపనుండు మూ
ర్ఖుఁడు కటుభాషి వానికొనఁగూడెను క్రూరసమాఖ్య భార్య తుం
దుడుకు సమాఖ్యకుం దగిన దుర్గుణపూరిత చండి భూసురా! 6

సీ॥ ఎఱుఁగని భిక్షుకుం డెప్పుడైన నిలుసేర
బెదరిపోఁ జీవాట్లు పెట్టు రేఁగి
తన పని చేయించుకొని నిండుకూలి యీ
భృతకుల కొసఁగక యేడిపించు
విభుఁడు కొల్చు మెప్పడు వేళ నద్దాన యీ
కయు రాలు దువ్వయుఁ గలుపు మిగులఁ
బ్రక్క గీములవారు బదులుగైకొన్న ని
బ్బడి పుచ్చుకొనును దబ్బరలు వలికి

గీ॥ కఠినుఁడుం గోపి యైన మగనినిగూడ
వేళకన్నము వెట్టక బీతుఁ గుడిపి
మూకుఁడుగ స్థాణువుగఁ జేయుఁ గేకలనిడి
చండశాసన యా క్రూర సంయమీశ! 7

క॥ ఆ జంపతు లంతకుము, న్నే జన్మమునందుఁ బూజ లీవ్రులు కొలవుం
జేజేలకు మను నవలా, జేజేలకుఁ బ్రీతిగాఁగఁ జేసిరొ దాసర 8

ఉ॥ వారికి ధర్మలాలసుఁడు ప్రాజ్ఞుఁడు నిర్మలమానసుం డహిం
సారుచిరుండు జ్ఞానఖని సాధుహితుండుఁ బరోపకారి దై
త్యారిపదాబ్జచింతనుఁ డుదారుఁడు పుణ్యకరుండు సత్కృపా
స్ఫారుఁ డొకండు పుత్త్రకుఁడు శాంతయనాముఁడు పుట్టె సన్మనీ!

వ॥ ఆతండు పరిణయంబైన సుందరి సకలసుగుణంబుల సతనికి సాటి
యగుటయెకాక 10

గీ॥ భర్తృపాదాబ్జసేవయు శ్వశుర సేవ
సేలువు చవ్వారి బంధుల నెలమిఁ గనుచు

బీదసాదల నరయుచుఁ బేరుఁ గనియె
శాంతయూహ్వాయు నిల్లాలు శాంతమాంబ 11

చ॥ ఒడలిని దాఁచికోక యెపు డోపికతో నిజగేహకృత్యముల్
గడువడిఁజేసి సేవలు సుఖంబొదవం దమ కాచరించినన్
గడుసరియైన క్రూర పులికైవడి బొబ్బలువెట్టు చొక్కటన్
గొడుకును కోడలుం జెలిమిగూరి మెలంగుట కోర్వలేనిదై 12

క॥ నోటికి వచ్చిన తెఱఁగున
మాటికి మాటికిని దిట్టి మగనిని దనతోఁ
బాటుగను రేఁపి కడుఁ జెడు
మాటల ననిపించి శాంతి మది కొదవమిచేఁ 13

— క్రూరాకర్షకులు కొడుకును గోడలిని బాధించుట —

సీ॥ మిపులఁ గుపితయై కోడలిమీఁది కుటికి
వీఁపుపై గ్రుద్ది చెంపలు వ్రీలఁగొట్టి
సిగనుబట్టి విదిల్చినఁ జిత్తమెరియఁ
గాంచు చూరకయుండు నక్కలికిమగఁడు 14

క॥ కడుపారఁ దినక నోగిర,మిడకయుఁ దన యత్త నిత్తె మీరీతి వెతల్
గుడిపిన నోరిచి శాంతమ,యెడపక తాఁజేయు పనులనెల్ల నొనర్చున్

మ॥ తన యాలిన్ గుణవంతురాలి నెపుడున్ దాడించుచుం దిట్టుచుం
డిన వారింగని పుత్త్రికుం డొకతఱి స్త్రీరిర్వ రీరీతి మోఁ
దిన మీ కోడలు చచ్చిపోదె యిఁక శాంతిం జెందుఁడీ యన్న వెం
టనె యాపెన్ విడనాడి తిట్టుచతనిన్ దాడించి రుద్రిక్తులై 16

క॥ అప్పుడు శాంతమ మగనికిఁ,జప్పున నడ్డంబువోయి సదమదమై యే
తప్పెఱుఁగని మీకొమరున,కిప్పట్టులు తగునె? నాకె యిం డీ శిక్షన్

వ॥ అనుచుఁ దన ప్రాణేశ్వరునకు దెబ్బలు తప్పించి యత్తమామలు
చేతులునొచ్చి విసివి విడుచునంతవఱకు మేనప్పగించి తదాఘాతం
బులు పడి పిదప వారిచే విముక్తయై యెప్పటియట్ల గృహకృత్యం

బులఁదీర్చి యారేయి భోజనానంతరంబున శ్వశురశుశ్రూషలు సల్పి వారు నిద్రితులైనపిమ్మట శాంతమ్మ మెల్లఁగా హృదయేశ్వరుం జేరి వాని పాదంబు లూరువుల నిడికొని యొత్తుచు నొడలు నిమిరి కనుల నీరురల నిట్లనియె 18

— శాంత భర్తబాధకు దుఃఖించుట —

గీ॥ ప్రాణనాథ! శిరీషపుష్పమ్ముకన్న
మృదులమైన మీ మేనిపైఁ గదుము లెన్నొ
కట్టె నిది యేమిపాపము కన్నతల్లి
దండ్రు లిట్లు బాధింతురే తనయుఁబట్టి 19

ఉ॥ తాడనముల్ పడంగగిన తప్పది మీయెడ నేమికల్గె? మీ
కోడలు చచ్చిపోయెడిని గొట్టకుఁ డంతగ నంటయేకదా
పాడిఁ దొలంగి మీ పితలు బాదిరి మిమ్ముల నన్నుఁగూర్చి యీ
నాఁ డటులేలపల్కిరి నాయనకమ్మకుఁ దప్పిదమ్ముగాన్ 20

వ॥ అని నుడివెడి ప్రియురాలి కన్నీరు నిజోత్తరీయంబునం దుడిచి కౌఁగిటం జేర్చికొని శోకోపశమన వాక్యంబులు వల్కుచు 21

సీ॥ బాల! నిత్యంబు నీవు పడెడు దెబ్బలుగాక
నాపాలి దెబ్బల న్నడితి వద్దు
వచ్చి నీ బాధఁ బాపఁగ నొక్కపలుకైనఁ
బలుకఁజాలని మహాపాపి నేను
నా మూలమున సౌఖ్యమేమి లేకుండుటె
కాక కష్టము లెన్నొ కల్గె నీకుఁ
గావున నొక కొంతకాలమ్ము పుట్టింట
నుందువుగాని నీ వందుఁ జనుము

గీ॥ పంపెదను నిన్ను రే పను పతినిజూచి
ప్రాణనాథ! నా బాధకై పరితపించు
మృదుహృదయ మిమ్ముఁబాసి నిమేషమైన
మేన నుసురులు నిలుపఁగా లేను నేను 22

— పతివ్రతా ధర్మములు —

గీ॥ కష్టమైన సుఖంబైనఁ గంతమందుఁ
ప్రాణములు నిల్చునంతకు మీ పాదసేవ
సలుపుచును దావకాజ్ఞలో మెలఁగుచుందుఁ
బతిని నెడఁబాసి సుఖపడు పడఁతి సతియె ? 23

క॥ మీరలు తలిదండ్రులచేఁ
గారియపడు చిందు నుండఁగా నా పుట్టిల్
సేరి తలిదండ్రులకడ నిఁ
కేరీతి సుఖమ్మలొంద నిచ్ఛింతుఁ బ్రియా! 24

గీ॥ గరితలకుఁ దోడఁబుట్టులకన్నఁ గన్న
తల్లిదండ్రులకన్న నాత్మజులకన్న
సత్తమామలకన్నఁ బ్రాణాధినాథుఁ
డగ్ర్యుఁడగుఁ గాన విడియుండసగునె సతికి 25

క॥ పతియే ప్రియతమబంధువు
పతియే పూజ్యుండు సతికిఁ బతి మించిన దై
వత మే లేకుండుటచేఁ
బతిని విడిచి వేఱె యుండవచ్చునె సతికిన్ 26

గీ॥ పతికి నెడముగనుండిన పడఁతి యెంత
నీతిగానున్న దుర్జన నిందఁ బొరయుఁ
గానఁ బతికడనే యుండి కష్టము లవి
యెన్ని కల్గిన నోర్చుటయె తగు సతికి 27

వ॥ అదియుంగాక మీ తలిదండ్రులు పరుల బిడ్డనగు నన్ను బాధించి కన్నకుమారు మిమ్ము నాదరించిన మేలె యగు నట్టి భాగ్యమ్మును నాకు లేదాయె 28

ఉ॥ కన్నసుతున్ విధేయు మతి గల్గినవానిని యోగ్యునిన్ సుధీ
సన్నుతుఁ బాదసేవకుని జానుగుల న్వివరాని తిట్టు తె

న్నన్నియు తిట్టి కొట్టి యిటు లెప్పుడు నేఁచెను తల్లిదండ్రి ము
న్నన్నడునేని యే జగతినేని ఘటిల్లిరె నిర్మలాత్మకా! 29

ఉ॥ ఐనను మీరు నా సుఖముకై నిను పుట్టినయింటికిం పెపన్
మానిని పోఁగదే యనినమాటనుబట్టియె సాహసించి యి
ట్లైనొక విన్నపమ్ము ఘటియించెద నయ్యది యాలకించి యిం
పైన నొనర్పుఁడీ యహితమైన నొనర్పక మానివేయుఁడీ! 30

వ॥ అది యేదంటిరేని మీరు భవజ్జననీజనకులతో మేమిసుపురము
మా యత్తవారింటికేగి యచ్చటి బందుగులం జూచివచ్చెదమని
చెప్పి వారి సమ్మతిం గొనిన నిసుపురమేగి కొన్ని దినంబులు గాని
కొన్ని మాసంబులు గాని యందు సుఖంబుగ నుండవచ్చుననిన
నవ్వుచు భార్య కొక ముద్దు కానుకగా నొసంగి యిట్లనియె 31

ఉ॥ ఇంతిరో! తావకోక్తి మన కిర్వురకున్ సుఖహేతువైన నీ
వింతకు ముందుగా నెకద యెన్నికఁగాంచిన ధర్మసూక్ష్మముల్
చింతనచేసి పల్కితివి చేడెలకున్ సురపాళికన్న హృ
త్కాంతుఁడె మిన్నయంచుఁ గడుఁగష్టముల న్వడరాదటంచొగిన్

క॥ మగువకు వేల్పులకన్నను
మగఁ డెట్టుల పూజ్యుఁడో క్షమన్ మహితుండో
మగవానికిఁ దలిదండ్రులె
మిగులం బూజ్యుల్ సుమీ తమిస్రేశముఖీ! 33

— కాంతయ్య భార్యకు జననీజనక ముఖ్యతను జెప్పుట —

సీ॥ పది మాసములు గర్భభారమ్ము సైరించి
కాన్పువేళను గల్గు కష్టమోర్చి
కని బిడ్డ మలమూత్ర కల్మషంబుల మాఁగి
తాను నీరోగయై కూనకొఱకుఁ
గఠినపథ్యమొనర్చి కంటిని జెప్పటుల్
బాల్యమాదిగ భార్య వచ్చువఱకు

దశలకుఁ దగురీతి స్తన్యాదికములైన
యాహారముల నిచ్చి యాదరించి

గీ॥ పెంచినటువంటి తల్లిని మించినట్టి
దైవ మెందైన దొరకునే తలిరుఁబోఁడి
యట్టి తల్లికి సూర్యోదయముల బత్తి
దండమిడుచుండు తనయుండు ధన్యతముఁడు

సీ॥ తాను గర్భస్థుఁడౌ తఱి మొదలొక్కని గర్భ
వతికిని దనకు శుభమ్ముఁగోఱకుఁ
జేయఁగావలసిన చేయువులు సేయుచు
నాధులు వ్యాధులు నబ్బినపుడు
చదువుసంధ్యలఁ గూర్చి సదమదమ్మై విత్త
మెంతయో వెచ్చించి యెల్లకార్య
ములుచేసి యౌవనమున నొప్పు తన విద్య
చేఁ బరాజయము వాంఛించు తండ్రి

గీ॥ సాటి యగు దైవమున్నె యే జగతినేని
జలజలోచన! యటువంటి జనకు పాద
ములకు మ్రొక్కుచు శుశ్రూష సలుపకున్న
కొమరుఁడు తరించునే నరకమునఁబడక

క॥ జననీ జనకుల ఋణమును
దనయుఁడు పరిచర్యచేసి తాఁ దీర్చుట క
న్నను మఱియొకవిధిఁ దీరిచి
కొనఁగ సమర్థుండు గాఁడు కుంజరగమనా!

క॥ జననీ జనకులతోఁ బగఁ
గొని యవ్వారి నెప్పుడేఁచు కొడుకులు తుదకుం
బునరావృత్తి వివర్జిత
ఘనతర నరకములఁ గూలి క్రాఁగెదరెప్పుడుం

క॥ అవలేపమ్మునఁ బితలకు, నవమానమొనర్చునట్టి యాత్మజుఁ డా రౌ
రవనరక భయంకర జా,తవేదుని మహోర్చి రుష్ణతన్ మాఁడు సదా

ఆ॥ తల్లి దండ్రి గురువు దైవమంచనియెడు
సూక్తి నాదిపీఠి నుండువారు
తల్లిదండ్రులగుటఁ దనయులు వారెట్టి
వారలైనఁ గొలువవలయు భక్తి 39

గీ॥ భక్తులకు విష్ణుఁబోలు దైవమ్ము సున్న
తైర్థికులకు గంగకెన తీర్థమ్ము నాస్తి
సతికిఁ బతిసాటియైన దైవతము మిథ్య
పురుషునకుఁ బితలసరి వేల్పులు హుళక్కి 40

క॥ తరుణీ! యీ ధర్మము నీ
వెఱుఁగనిదియె యనుచుఁ బల్కి యిర్వురు నా రా
తిరి సంతోషంబునఁ బు
చ్చి రేపకడ లేచి పనులుచేసిరి విధిగన్ 41

ఆ॥ అవల వేళ కింట నందఱు భుజియించి
తీరికగ నొకయెడఁ గూరుచుండి
నపుడు పితలఁ జూచి యతివినయమ్మునఁ
దనయుఁ డిట్టులనియె మునివరేణ్య! 42

సీ॥ జననీజనకులార! శాంత తల్లియుఁ దండ్రి
పుత్త్రికఁ జూడంగ బుద్ధిపుట్టెఁ
బంపిన రెన్నాళ్ళపాటుంచుకొని తిర్గి
పంపెదమని వార్తఁ బంపినారు
పంపుదునా యన్నఁ బట్టిమోము పెటిలఁ
గ్రూర క్రూరేక్షలఁ బారఁజూచి
యోరోర నీ భార్య నచ్చటికంపిన
నిటఁ జనుల్ తన యబ్బ యేగుదెంచి

సీ॥ సలుపునా యంచుఁ గాళులు వలుకుచున్న
    మ్రొక్కి శాంతించి వినుఁ డొక్క మూర్తకాల
    మేను గావించు విన్నపమ్మిప్పుడనుచుఁ
    దారకొనియెఁ జెప్ప శాంతయ్య సరసనూక్తి 43

క॥ తలిదండ్రులార! మీ కో
    డలి నిటు సంతతము మోఁదుటల్ ధర్మమె? యే
    స్థలమునఁ గులసతి కన్నీ
    రొలుకునొ యచ్చోట లచ్చి యుండదునుండీ! 44

ఉ॥ పాడిదొఱంగి మీ వచనపద్ధతిఁ బోవక యేనుగాని మీ
    కోడలుగాని యెప్డయినఁ గూళతనాన నెదిర్చి నిల్చి మా
    ఱాడిన జాడయున్నదె? కటా! యటువంటి మమున్ సతమ్ము మీ
    రోడక తిట్టి కొట్టుటలు యుక్తమె? పెద్దల కిద్ది యొప్పునే? 45

క॥ కనుపడ దెప్పుడు మీయెడఁ
    గనికరముఁ బ్రసాదగుణముఁ గల్పాన్త మహా
    గ్ని నిభోలు కోపగుణమే
    కనుపట్టుచునుండు మీ మొగమ్మున నురువై 46

ఉ॥ కోపమునన్ యశమ్ము చెడుఁ గోపమునన్ స్వసుఖమ్ము దూరమౌఁ
    గోపమునన్ సిరుల్ దొలఁగుఁ గోపమునన్ ధిషణాబలం బడుం
    గోపమునం బ్రమోదమడఁగున్ సుగుణంబులు భస్మమై చనున్
    గోపమునన్ గురుత్వ మెటకో చను నాయువు సన్నగిల్లెడున్ 47

సీ॥ కానఁ గోపమ్ము వర్జించి క్షమ వహించి
    కడుపునన్ మీరె కన్నట్టి కొడుకునగుట
    నన్ను నసుఁగూర్చి నా సతి నరుణఁజూచి
    తప్పులుండిన సైరింపుఁడు దండమిడెద 48

వ॥ అనుచుఁ దమ తనయుండు వినయమ్మున నయమ్ముదోఁప నుడివెడు నుడువులకుఁ గడుంగనలి పెదవులదరుచుండఁ గ్రూరపండ్లు పటపటఁ గొఱుకుచు 49

ఉ॥ చాతురిసాహసమ్ములఁగల జాయకు లొంగి మహాప్రబుద్ధున
ట్లాతతబుద్ధిమన్నతగుణానుభవమ్మున నొప్పు మాకు నీ
వో తులువా! తెగించి వికటోక్తులు దెల్పుట మొప్పెకుజ్ఞ తాఁ
దాతకు దగ్గ నేర్పినవిధానము గాదఁటరా? నికృష్టుఁడా! 50

ఆ॥ వెడఁగ! గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరిం
చినవిధాన నింత సిగ్గులేక
నిన్నఁగాక మొన్న కన్నులు దెఱచిన
నీవు కఱపెదటర నీతి మాకు 51

ఆ॥ పిన్నపెద్దతనములెన్నక మాకిట్లు
బుద్ధిగఱప నీవు పూనుటరయఁ
గ్రమముగా నృపాలుకైవడి శిక్షించి
కార నిడఁగనున్న కడఁకదోఁచె 52

ఆ॥ కన్నబిడ్డవనుచుఁ గరినమ్ముఁ బూనక
యొక్క నిముస మింక నూరకున్న
బలిమి మిమ్ముఁ బట్టఁ బగ్గమ్ములున్న వే
యనుచు మగనివంక నట్టె చూచి 53

క॥ రా రమ్మ వీని యెమ్ములు
చూరగఁ గావింపు ముందు స్నుషగర్వం బే
నాఱుతునని యయ్యిరువురు
ఘోరముగా మోఁదిరొకటఁ గోడలిఁ గొంకక్ 54

వ॥ అట్లయ్యాలుమగలు కాల్కఁ గేలఁ గోలలఁ గోడలిం గొడుకున్ గంత
గతప్రాణులగువఱకుహింసించి కొడుకునిలువెడలఁగొట్టి కోడలిరెండు
చేతులు నొక్కిపట్టి యింతకువచ్చిన నీమగండు నమ్మేమఱించి
యెప్పుడో నిన్నుఁ బుట్టింటికిఁ బంపకమానఁడు కావున నిన్నిట్లు
స్వేచ్ఛగా నుండనీయఁదగదని బలాత్కారంబున నీడిచికొనిపోయి
తమగృహాంతర్భాగంబున దోమకైనఁ జొఱరాని యొకగది[illegible]

బడ్డవై చి తలుపు బిగించి తాళంబు వేసి సంతసంబున నటనుండి వెడలిపోయిరి. 55

సీ॥ అంత నైదారు దివసమ్ము లరుగఁ గ్రూర
సేయు క్రూరకృత్యమ్ములు సెవులుసోఁక
చుట్టుప్రక్కల జనము లచ్చోటకు వచ్చి
క్రూరఁ గని దూరుచనిరి సంకోచముడిగి 56

ఉ॥ అన్నము నీరమీక నిటు లక్కట! కోడలిఁ గారఁబోని యిం
ట న్నిటు నెట్టియుంచితి పడంతుక కెట్టులనిల్చుఁ బ్రాణముల్
గ్రన్నన వీడుమీ యనిన రక్కసమించిన యా గయాళి వా
రి న్నిరసించి మా గృహపరిస్థితి మీ కదియేల పొండనెన్ 57

వ॥ వారు నా క్రూర న్నరలమరల నిందించియు మందలించియు భయ
పెట్టియుఁ బ్రార్థించియు విఫలులై చేయునదిలేక తమ నిజవాసం
బులకుఁ జని కర్తవ్యమాలోచించుచున్న వారి కిలువాసి యందందుం
దిరుగుచున్న శాంతయ్య యొకనాఁడు కంటంబడ 58

క॥ వానిం జీరి యనిరి శాం,తా! నీ యా లింటఁ గొట్టునం దన్నంబుం
బానీయంబును లేక క,టా! నెగులొందెడి నిదేమి యాగడమయ్యా!

వ॥ పోయి చూచికొమ్మన వాఁ డడలుచు నేమైనం గానిమ్మని హుటా
హుటి నడలనరిగి యిలుసొచ్చి తన భార్యను వెదకుచు నాకెయున్న
గదికడకరిగె. అప్పటి కా గదిం ద్రోయంబడిన శాంతకుఁ బతి
ధ్యానంబుతోడను లక్ష్మీపతి స్మరణంబుతోడను బది దినంబులరిగి
పదునొకండవదినంబు వచ్చె నది తత్సాధ్వి పుణ్యవశంబున హరి
వాసరంబగ్యె నానాఁడు సూర్యోదయంబై కొంత యెండయెక్కిన
పిమ్మట శాంతమ కూర్చుండి హీనస్వరంబున 60

సీ॥ హరిహరీ! పూర్వభవములయందు నెట్టి
పాపములొనరిచితినో నా ప్రాణనాథు
దర్శనము లేక పదినాళ్ళు దాఁటి చనియెఁ
బ్రాణములు మేన నిఁక నిల్చుశక్తి లేదు 61

చ॥ అతిమృదులాంతరంగుఁడు దయాజలరాశి పరోపకారి సం
తత పితృమాతృపాదయుగదాస్యపరాయణుఁ డచ్ఛకీర్తిఖం
డితహృదయారి కంతుకమనీయుఁడు నా హృదయేశుఁ డట్టి మ
త్పతిముఖపద్మముల్ గనెడు భాగ్యము లేదొకొ యింక నీ జనిన్

గీ॥ ప్రాణవాయువు హృదయనీరజము వదలి
పైకి నెగఁ బ్రాకఁ జొచ్చె నిప్పట్ల ప్రాణ
నాథు సన్నిధానము గల్గినం గృతార్థ
నాస్తి యదియొకట నిఁక దిక్కు హరియె యనుచు 63

మ॥ హరి నారాయణ! యిందిరారమణ! ఫుల్లాబ్జాతపత్రేక్షణా!
కరిరాజావన! లోకపావన! ఫణిగ్రైవేయసంభావనా!
నిరయక్లేశనివారణా! బుధమనోనీరేజసంచారణా!
పరమేశా! నను నీ నివాసమునకున్ వైళంబ కొంపోఁగదే 64

వ॥ అని పెక్కుతెఱంగుల నార్తరక్షణపరాయణుండగు శ్రీమన్నారా
యణు వినుతించుచున్న నాయమ కెట్టయెదుట శంఖచక్రాది సాధ
నోపేత చతుర్భుజులును నీలనీరదవర్ణులు నగు కొందఱు విష్ణుకింక
రులు దివ్యవిమానంబుతోఁ బొడసూపినం జూచి నమస్కరించె నప్పు
డా కింకరు లాసతితో నిట్లనిరి 65

గీ॥ తల్లి! నీ పతిభక్తికి దైవభక్తి
కాత్మ సంతోషమంది రమాధినాథుఁ
డనిపె భృత్యుల మము దేవయానమిచ్చి
నిన్నుఁ గొనిరండటంచు నిలువుమీవు 66

క॥ నిను హరిఁ జేర్చెదమన విని
వనితామణి వారితోడఁ బ్రాణేశ్వరునిన్
గను కోర్కె యొకటి యున్నది
ఘనులగు మీ రద్ది తీర్పఁగాఁదగు ననుచోన్ 67

ఉ॥ అంతకుఁ గొంత ముందుగను ద్వారముతీరము చేరియున్న త
త్కాంతుఁడు శాంతయాహ్వయుఁడు దారనచస్సుల నాలకించి స్వ

స్వాంతము నిల్పలేక తన శక్తిఁ గనంబడఁజేసి తాళ మిం
తింతలుగా నొనర్చి తలుపెట్టెలొ త్రోసి చనెం బ్రియుం గనన్ 68

సీ॥ ఆరీతిఁ దనుఁజేర నరుగుదెంచిన మనో
నాథునింగాంచి మ్రొక్కి నే ధన్య నిపుడు
పదినాళ్ళ నాఁడె మీ పదసేవ దవ్వయ్యె
నా ఋణ మింతతోఁ దీరె మీకు
నాకొఱకై మీరు శోకింపకుఁడు సదా
తల్లిదండ్రుల సేవఁ దప్పఁబోకుఁ
డనదల దీనుల నర్మిలిఁ గనుఁడు నా
తప్పిదమ్ముల నెల్ల దయ క్షమించి
గీ॥ చివర కే సల్పు మ్రొక్కును జిత్తగించి
హరిని సేవింప నరుగుట కాజ్ఞ నిండు
ప్రాణనాథ! యటం చల్ల వాలుచున్నఁ
బ్రియను బడకుండఁ బట్టెఁ దద్విభుఁడు వడిగ 69

గీ॥ అట్లు ప్రాణేశు సందిలియందు నుండి
హరి! హరీ! కృష్ణ! గోవింద! యనుచునుండఁ
బ్రౌఢయోగులకటు బ్రహ్మరంధ్రసరణి
వెడలె నొక తేజ శాంతమ్మయొడలు వీడి 70

వ॥ ఆ తేజం బంత నత్యంత దివ్యాకారంబు ధరించి దైత్యారిభృత్యానీత విమానమ్మునం దధివసించి వైకుంఠంబుం జేరి మహానందంబున సేవించుచుండెఁ గావున జహ్నుమునీశ్వరా! పతివ్రతల కలభ్యంబు లెవ్వియు లేవు. విను మంతటఁ దద్వల్లభుండగు శాంతయ్య ప్రియురాలు గత ప్రాణయగుట నెఱింగి నేలం బరుండఁబెట్టి 71

గీ॥ అక్కటా! నన్ను వీడి యిహమ్ము వీడి
పోయితే రమాధవుపురమ్మునకు నీదు
తల్లిదండ్రుల కెట్లు త్వన్మరణవార్తఁ
[illegible] గనేర్తు నిందీవరాక్షి! 72

గీ॥ కోటరమ్మున కీవు మా కొంపలోన
నడుగుపెట్టినదాది మా యమ్మ యయ్య
నిన్నుఁ గావించు హింస మాన్పింపనేర
నైతి సుఖపెట్టఁగా నేరనైతి నాతి! 73

సీ॥ పుట్టినింట సుఖమ్ము పొందనోఁ గొన్నాళ్ళ
పంపెదఁ జనుమన్నఁ బడఁతి నీవు
పతి వీడి సౌఖ్యమ్మునడుట సాధ్వికిఁ జెల్ల
దదిగాక మిముఁ బాసి యటనిమేష
మైనఁ బ్రాణము నిల్పలేనంటి వా మాట
లేమయ్యెఁ బరలోక మేగుతఱిని
తలిదండ్రిసేవలు దప్ప నా కే పని
సేయుట కవకాశమీయ కీవె

గీ॥ సలుపుచుండెదు నాదు కష్టములకింకఁ
బరితపించి సాహాయ్యము జరుపువారు
లేరుగదె యంచుఁ గన్నుల నీరుగార
మిగుల వాపోయె శాంతమ్మమగఁడు తపసి! 74

వ॥ ఆ యాక్రందనధ్వని యిల్లునిండిన నాలించి క్రూర పతియుతయై యచ్చటకువచ్చి గదితలుపు దెఱచియుండుటకు దురాగ్రహయై కేకలువేయుచుఁ దిట్టుచు లోనం బ్రవేశించి పరికించి కోడలు మరణించుట ధ్రువమ్ముగాఁ దెలిసికొని బూటకమ్ముగ నేడ్చుచుండ నిరుగుపొరుగువా రటుగుదెంచి శాంతమ్మ దుర్మరణమున కెంతయుఁ జింతించి క్రూరం జేరి నీ కోరికి తీరెనా కన్నులమంట చల్లారెనా ప్రాణంబులు కుదుటఁజేరెనా యిఁక నిమ్మళమ్ముగా బ్రతుకుమని దూషించిరి. అందుఁ గొందఱు శాంతభర్తకు ధైర్యమ్ముఁ జెప్పి వానిచే నతనిభార్య కపరక్రియలు జరిపించి వెడలిపోయి రటు పిమ్మట 75

ఉ॥ క్రూర తనూభవుండు తనకున్ సుకళత్రమృతిప్రభూత దు
ర్వార దురంతదుఃఖమున స్వాంతము నీరగుచున్నఁ బూర్వపుం
దీపన గేహకృత్యములు దీర్చుచుఁ దల్లికిఁ దండ్రి కెప్డు వే
సారక సేవలన్ సలుపసాఁగఁ జనెన్ సమసైదు సంయమీ! 76

చ॥ పదపడి యిష్టురాలు వశవర్తినియైన కళత్రవృత్తముల్
మదిని స్ఫురించుకాలముల మ్రాన్పడి తిండియు నిత్యకృత్యము
ల్వదలుచునుండఁ గోపమున వస్తయు. మాతయుఁ దిట్టి కొట్టి మూ
ర్ఖ! దురితచిత్త! యిట్లయినఁ గాపుర మేగతి గడ్డలానురా 77

గీ॥ పనులు చక్కఁగఁ జేయనిపట్ల నీకు
తిండి నిడలేము నీ కిడు తిండి నెవరి
కేనియును బెట్టి పనులు చేయించుకొందు
మరుగు మిలు వీడి యెచ్చటికైన ననుచు 78

గీ॥ మాటిమాటికి దురుసుగా మాటలాడ
నాతఁ డిచ్చటనున్న నా స్వాంత మెట్లు
గృహిణిమృతి దుఃఖమును సహియింపలేదు
వీరు తనియఁ బను ల్నెఱవేర్పనీదు 79

ఉ॥ కావున వీరిచే ముదలఁగైకొని కాశికి నేగి శంభునా
పావన జీవనమ్ములను బాపమువోవ మునింగి శ్రీ మహా
దేవుని విశ్వనాయకుని దీనజనావను గాంచి మ్రొక్కి నా
భావ మలీమసంబులను బాచి కనంగలవాఁడ మోక్షమున్ 80

క॥ అని యనుకొని పోదు నె యని
జననీజనకులకు మ్రొక్కఁ జయ్యన వారల్
సెనుమన నరిగెను శాంతయు
ఘనకల్మషతిమిర హారికిఁ గాశీపురికిన్ 81

వ॥ అట్లాతండు మహామాహాత్మ్యరాశికిఁ గాశికిఁ జేరి నిత్యంబును భాగీ
రథీస్నానంబుఁ జేసి విశ్వేశ్వరార్చనంబొనర్చుటయె కాక ప్రతి మకర

మాఘ మాసారంభమునుండియు సక్రమమ్ముగ గంగాస్నానమ్ము
సేయుచు మాధవోమాధవులఁ బూజించుచు మాఘవ్రతంబు
సెలుపుచు దినమ్ములు పుచ్చి తుదకు దేహమ్ము విడిచి వైకుం
ఠంబునకరిగి భార్యం గూడి బ్రహ్మానందంబున రమానేతఁ
సేవించి తత్సాయుజ్యంబందె నట విదేహదేశంబునఁ గ్రూరయు
నాకె మగండును 83

సీ॥ చేతులారఁగ స్నుషజీవమ్ములం దీసి
కొంకుకు గీమునమండి వెడలనెట్టి
కూలి యొసఁగి పనుల్ గొన్నాళ్ళు సేయించు
కొని తుద కేను రామిని దమంతఁ
దామె యన్నింటికిఁ దల్లక్రిందగుచును
కాలమ్ము గడపుచోఁ గలిగె ముదిమి
దానికిఁ దోడుగాఁ దారసిల్లెను రోగ
ములు వానివలనఁ గదలఁగలేక

గీ॥ మంచములఁ బడియుండి సద్మమ్మునందుఁ
బలుకువాఁడును బరిచర్య సలుపువారు
దిండి నిడువారు లేక చింతింపఁ బ్రక్క
యిండ్లవా రెవ్వ రైన నేగుదెంచి 83

వ॥ ఇచ్చు నన్నోదకంబులవలన జీవించుచు మంచమ్ములందె యుగు
మలమూత్రంబులంబడి పొరలాడుటవలన నాపాదమస్తకంబుఁ జెడు
వ్రణంబులొదవి చీమునెత్తురు లెడతెగక కాఱుచుండుటం బురు
గులువడి క్రూరాకర్షకుల శరీరంబులెకాక తద్దేహంబును దుర్గంధ
బంధురంబైనఁ గడకుఁ దమకడ కెవ్వరు రా రోసి యన్నపానంబు
లీకుంటఁ గడుపులఁ బొడమెడు నాఁకటిమంటకును దాహబాధకు
నోర్వలేక తల్లడిల్లుచు గతకాలమ్మునఁ దాము పరుల కేవిధంబైన
యుపకారంబులుగాని పుణ్యకార్యంబులుగాని సేయకపోవుటట్లుండ
నితరులకుఁ జేసిన యుపకారంబులును గొడుకునకుం గోడలికిం

గావించిన ద్రోహంబులుం దలంపులకుం దెచ్చుకొని యొకరితో
నొకరు చెప్పుకొనుచు నక్కతంబున నిప్పుడిట్టి దురవస్థ తమకు
సంభవించినదని నిశ్చయించుకొని యేడ్చి యేడ్చి దగదీఱ నీరైనం
జేకూరమి నోరుటెండి గతప్రాణులైరి. యమకింకరులప్పుడు వారికి
యాతనాశరీరంబు లేర్పఱచి కష్టభూయిష్ఠమ్మగు దుష్టపథమ్మున
నీడ్చికొనిపోయి దండధరుం జేర్చిన నతండు 84

కll వారల పాపములకుఁ దగు, తీరున శిక్షల విధింపఁ దీవ్రక్రుధతో
సౌరిభటులు తన్మిధునము, దారుణనరకములఁ జేర్చి తల్లడపడఁగ

సీll ఎఱ్ఱఁగాఁ గాఁచిన యినుపకఱ్ఱులు నోళ్ళఁ
గాళ్ళఁ జేతుల నుంత్రు కఠినభంగి
బండలఁ బడవైచి పరిఘాదికమ్ముల
మోఁదుదు రెమ్ములు పొడుముగాఁగ
దావాగ్ని కెనయైన దహనకీలలఁ ద్రోతు
రోడక మేనులు మాఁడిపోవఁ
బిడుగు లీనుచునుండు జడివాన నుంతురు
మొనకొని శల్యముల్ మొలకలెత్త

గీll నిట్టి బాధలు నింతకు నెక్కుడైన
బాధ లా కింకరులువెట్టఁ బడుచునున్న
క్రూరకును నాకె ఘగనికి నారకమునఁ
గడచె నఱువదినాల్గు యుగాలు విప్ర! 86

వll అట్లు వారు శిక్షాపరిమితకాలంబు మితిలేని నరకబాధ లనుభవించి
పదంపడి కాలకింకరులచే నటనుండి వెడలఁద్రోయంబడి మర్త్య
లోకంబునకు వచ్చి యయ్యిరువురు మశక మత్కుణ కీటక కాక
ఘూక సూకరాదికానేక నీచయోనులం బెక్కుమాఱులు పుట్టుచుఁ
జచ్చుచుఁ దుదకు భీకరకాకోదరంబులై జనిమించి చంపానదీతీర
కాంతారభూరుహ వారోజ్జ్వలచ్ఛలదళతరు కోటరమ్మున నివాస
మ్మేర్పఱుచుకొని కాలమ్ముఁ గడపుచుండ 87

సీ॥ ధీరోపధీరాఖ్య ధారుణీ సురవరుల్
చంపాభిదాన నిర్ఝరిణిఁ జేరి
మాఘకల్యమ్ముల మజ్జన మ్మొనరించి
తత్సర్వయుత చలదళమహీజ
మూలమ్మున రమేశు పూజ లొనర్చుచు
మాఘమాహాత్మ్యమ్ము భక్తి నుతువు
నవుడెల్ల విని సాక్షి యావ్యాళములు రెండుఁ
గోటరమ్మునుండి కూలె భువిని

గీ॥ పడిన తత్ఫణుల్ దమపైకిఁ బారకుండ
జలము మంత్రించి చల్లిరి సంయమీంద్రు
లందునన్ మాఘమాహాత్మ్య మాలకించి
నందునం బాపకవరు మర్త్యత్వమబ్బె 88

గీ॥ అట్లు స్త్రీపురుషాకృతు లందియున్న
తమ్ము నాశ్చర్యమునఁ జూచు నమ్మునీశు
లకు నమస్కారములు సల్పి ప్రకటముగను
విన్నవించిరి తమ పూర్వవృత్తమెల్ల 89

వ॥ వారును తద్దంపతుల చరిత్రంబునకు సంభ్రమాశ్చర్యంబులు సెంది యిహపరంబులం బడిన బాధలకు మనంబులు కరిగి వానిపైఁ గని కరంబూని మాఘప్రభావంబు బోధించి యమ్మాసంబున శేషించి యున్న దివసకల్యంబులఁ దమతోఁబాటు తత్కా(?)రాకర్షకులను చంపానదీ పవిత్రతోయమ్ముల స్నానమ్ములు సేయించిన గతకల్మషులై యా శరీరంబులు వదలి తద్భార్యాభర్త లిరువురు దివ్యదేహంబులు దాల్చి నాకలోకంబునకుం జనిరి కావున నో జహ్నుమునీ! మాఘస్నాన కథాశ్రవణంబులవలన నెట్టి పాతకంబులైన నశించుఁ బుణ్యలోకంబులు లభించు నింతటి మహత్వమ్ము గల మాఘవ్రతమ్మునకు సాటియగు వేఱొండు వ్రతమ్ము లేదు. మాఘ

ప్రభావమ్మును దెలిసికొన సమర్థుండు మహావిష్ణువుగాక నింకొక్కఁ
డే లోకమ్మున లేఁడు. 90

గీ॥ బాలికుండు గురుద్రోహి బ్రహ్మహంత
పుత్రిహంత కృతఘ్నుండు భ్రూణహంత
యాదిగాఁగల పాతకులైన మాఘ
సువ్రతమ్మున మోక్షమ్ముఁ జూడగాంద్రు 91

30 అధ్యాయము

గీ॥ అఖిల మాసమ్ములందు ధర్మార్జనమున
కుపకరణమైన మాఘ మత్యుత్తమమ్ము
యజ్ఞ యాగాది రచనచే నబ్బు ఫలిత
మబ్బు మాఘవ్రతాననే యనఘచరిత ! 92

గీ॥ దాన ధర్మ తపమ్ములఁ దనరు సార
మీశ లక్ష్మీశ ముక్కోర మింద్ర దహన
సూర్య విధి పదప్రదము నిస్తులసుఖప్ర
దమ్ము మాఘమ్ము సర్వోత్తమమ్ము మాని ! 93

క॥ మును నేఁ గనినది వినినది
యనఘా ! మాఘవ్రత ఫల మనువొందంగా
వినిచితి నిర్మలభక్తిని
ననితరమతి వినఁగఁదలఁచి యడిగితి గానన్ 94

క॥ హరికిఁ బ్రియుఁడైన మనుజుఁడు
పరధర్మవ్రాత మొనరుపన్మానిన భూ
సురవర! మాఘవ్రతమును
జరిపి రమారమణు పూజ సల్పినఁ జాలున్ 95

మ॥ ఎది యాలించిన ప్రాణి తత్క్షణము సర్వైనోవిముక్తిన్మహా
భ్యుదయమ్ముం గనునో మునిప్రవర! జహ్నూ! యట్టిదానిన్ సుఖ
ప్రదమున్ క్షేమము మోక్షదాయకముదివ్యన్మాఘమాహాత్మ్యమున్
[illegible] నెఱింగినది నీకున్ వ్యక్తముం జేసితిన్ 96

వ॥ అని గృత్స్నమదుండు చెప్పిన విని జహ్నువు సంతోషంబునొంది
వారికి నమస్కరించి తదాజ్ఞఁబొంది నిజాశ్రమంబున కేగె 97

గీ॥ ఎల్లధర్మంబు లెఱిఁగిన గృత్స్నమదను
హామునీశునిచే వినినట్టి మాఘ
ధర్మమును మాఘమున సల్పి తపసిమిన్న
జహ్నుఁడు కృతార్థుఁడయ్యె నో శైలతనయ! 98

క॥ మూఁడు జగమ్ములలోపల, నీ డోడవని మాఘధర్మ మేరికిఁ దెలుపం
గూడని రహస్యమైనం, జేడియ! నాప్రియవు గానఁ జెప్పితి నీకున్

శా॥ ఏతన్మాఘమహాత్మ్య మచ్యుతునిముం దెవ్వాఁడు వ్రాయుచున్నో
యేతం డయ్యది భక్తితోడ వినునో యీ యిద్ద రర్థిస్థలిన్
జేతఃప్రీతిగ సౌఖ్యసంపదలతో జీవించి యంత్యమ్మునన్
శీతక్ష్మాధరజాత! పొందెదరు లక్ష్మీనాథ సాయుజ్యమున్ 100

వ॥ అనుచు శంకరుండు కైలాసంబునఁ దన ప్రాణవల్లభ యగు హైమ
వతికిం బ్రేమపూర్వకంబుగా నెఱింగించిన మాఘమాహాత్మ్యం
బును సూతపౌరాణికుండు నైమిశారణ్యంబున శ్రద్ధాళువై వినఁ
గోరిన శౌనకాదిమహామునులకు విశదంబుగాఁ దెల్పి తుదియు
నిట్లనియె 101

సీ॥ మౌనిశేఖరులార! మాఘవ్రతము సమ
స్తాఘమ్ములడఁచి పుణ్యములఁ దార్చు
రోగమ్ములార్చి యారోగ్యము సేకూర్చు
నపకీర్తిఁ బాపి సద్యశము దీర్చు
నాయువుఁ బెంచు మహైశ్వర్య మొదవించు
సత్వమ్ము జ్ఞానమ్ము సంఘటించు
సౌఖ్యము నించు సత్సంతాన మొనయించు
విమలవైరాగ్యము విస్తరించు

గీ॥ దిక్పతులలోకముల నిచ్చుఁ దీక్ష్ణకిరణ
శీతకరలోకముల నిచ్చు ధాతృలోక
మిచ్చు శివలోక మిచ్చు లక్ష్మీశలోక
మిచ్చు నెదిగోర నది యిచ్చు నెవరికైన 102

గీ॥ శ్రద్ధయును సదాచారము శాంతగుణము
నాత్మవేత్తృత గురుభక్తి యబ్బినట్టి
వ్యక్తికే యుపదేశింపవలయు మాఘ
సద్వ్రత మ్మెప్పుడైనను సజ్జనుండు 103

క॥ అని సూతుఁడు శౌనకముఖ
మునులకు మాఘప్రభావమును సాంతముగా
వినిపించి మహాహర్షం
బెనయంగాఁ జేసె నైజ మృదుమధురోక్తిన్ 104

గీ॥ శాలివాహ శకాబ్దముల్ జ్వలన వాని
దంతిశశి సంఖ్య దగ ఖరాబ్దమున భాద్ర
పదమునం గృష్ణపక్షాష్టమి దిననాథ
వాసరమున నీ కృతిఁ బూర్తి సేసినాఁడ 105

గీ॥ తండ్రి యగు రామకవియాజ్ఞఁ దలఁ గదించి
వారికే యంకితముగ నీ ప్రథితమైన
స్కాందగతము మాఘపురాణముం దెలుంగు
సేసినాఁడ లక్ష్మీనరసింహ కవిని 106

— ఆశ్వాసాంతము —

సీ॥ భార్గవ చ్యవనాప్నువానౌర్వ జమదగ్ని
సమభిఖ్య పంచర్షి సహితమైన
శ్రీవత్సగోత్రాన భావితాపస్తంబ
సూత్ర యజుశ్శాఖశోభితులగు

నాఁడు వేల నియోగి ధారుణీసురులలోఁ
　　　　బోతరాజకులాన ఖ్యాతిఁ గనిన
శాయమ్మ గోపన్న సత్పౌత్రకుఁడవయి
　　　　పుల్లమ వరదయ పుత్త్రుఁడవయి

గీ॥ శాయన నృసింహ లక్ష్మణ సహజుఁడవయి
నరసమాంబ సంజీవమ వరసతులయి
యెసఁగ గుంటూరుసీమలో నేరుచూర
సన్నిటం బేసుఁగన్న రామన్న సుకవి　　107

స్రగ్విణీ గర్భిత భుజంగప్రయాతము ॥

గురూ! రామమంత్రీశ! గోరాజమందా
రరాజామ రేశాశ్వరద్యుగ్రణివ్యా
ళరాట్సామజద్విట్కళా సద్మగౌరీ
శ్వరోద్దామ కీర్తిప్రశస్తా! సుభాషా!　　108

గర్భస్థ స్రగ్విణీ వృత్తము ॥

రామమంత్రీశ! గోరాజమందారరా
జామ రేశాశ్వరద్యుగ్రణివ్యాళరా
ట్సామజద్విట్కళా సద్మగౌరీశ్వరో
ద్దామ కీర్తిప్రశస్తా! సుభాషా గురూ!　　109

కంద గీత గర్భిత చంపకమాల ॥

చ॥ జననుత సత్కృతీ కలుజాల తిరస్కృతి కవ్యధీశ లా
లనకర ధీనిధీ వినుతలాక్షణికాగ్రణి భీమకాశచం
దనసితనీరరుట్కుముదతార్క్ష్య తుషార చకోరమిత్రహా
రనిభయశా కృపాబలసురమ్యసమాఖ్యా ప్రభావ్యగోత్రపా　　110

చంపక గర్భస్థ కందము ॥

క॥ నుతసత్కృతీ కలుమజాల తిరస్కృతి కవ్యధీశలాలనకర ధీ
సితనీరరుట్కుముదతార్క్ష్య తుషార చకోరమిత్రహార నిభయశా

గర్భక్షస్త గీతము ॥

గీ॥ కలుషజాల తిరస్కృతి కవ్యధీశ
విసుతలాక్షణికాగ్రణి భీమకాశ
కుముదతార్క్ష్య తుపార చకోరమిత్ర
బలసురమ్యసమాఖ్య ప్రభావ్యగోత్ర 112

మాలిని ॥ అవితథహితభాషా! యాశ్రితవ్రాతపోషా!
ప్రవిమలగుణసాంద్రా! ప్రాజ్యవిద్యాఫణీంద్రా!
కవికువలయసోమా! గణ్యకారుణ్యధామా!
భువనభరితకీర్తీ! పోతరాడ్రామమూర్తీ! 113

– గ ద్య ము –

ఇది శ్రీ మల్లక్ష్మీనృసింహస్వామి కారుణ్యపాత్ర శ్రీవత్స
సగోత్ర వరదయామాత్య పౌత్ర సంజీవాంబా రామకవి
సోమపుత్ర అవధానిభూషణ వినయప్రధానభూషణ
పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహ విరచిత
మాఘపురాణంబున దశమాశ్వాసము
సర్వము సంపూర్ణము.

జనరల్ ప్రింటర్స్, గుంటూరు-2.

## మాఘపురాణములోని తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 6 | 2 | నాయు | దాయు | 99 | 2 | రేందు | రేంపు |
| 8 | 18 | ఖర్మ్మ | ధర్మ్మ | 109 | 16 | మూనుగ | మానుగ |
| 18 | 27 | నేత్రి | నేత్ర | 111 | 25 | మొనర్చె | మొనర్చె |
| 20 | 7 | హెంబ | హేరంబ | | 27 | వేద | వేదన |
| 21 | 11 | సాజ | సాంజ | 117 | 27 | గాంచ | గాంచె |
| 23 | 2 | జాము | బాము | 126 | 2 | పుణ్య | పుణ్య |
| | 18 | డ్రళ | డ్రశ | 137 | 12 | మండెను | కండెను |
| 24 | 15 | సద | సధ | 140 | 25 | ముల్క | ముల్క |
| 26 | 23 | నాహ | సాహ | 144 | 12 | దేహ | దేవ |
| 27 | 21 | తోంపూగం | తో | 146 | 6 | లంజేత | లచేత |
| 32 | 8 | శ | శక్తి | 149 | 17 | పిపక | పిపక |
| | 13 | దగ | దగ్ధ | 150 | 7 | కోవ్వన | కోథవ |
| 38 | 20 | నగ | నఘ | 156 | 16 | క్రోణీసీ | క్రోణీసీ |
| 39 | 1 | శ్వత్ద | శ్వత్థ | 158 | 13 | పర్వ | సర్వ |
| 58 | 15 | గర్భ్యం | దర్భ్యం | 168 | 24 | పారి | పౌరు |
| 65 | 8 | దక | దర | 176 | 18 | స్తుత్యా | స్తుత్యై |
| 66 | 15 | తత్ఫ | సత్ఫ | 178 | 27 | కంకువన | గుదువక |
| | 22 | తతి | తత | 180 | 25 | దోంకు | దోంచు |
| 67 | 18 | నుచుం | నుచుచుం | 182 | 27 | మోగాది | మాగాది |
| 70 | 7 | భ్రాంతుం | భ్రాంతుం | 184 | 7 | విను | విను |
| 76 | 8 | పతం | పాతం | 187 | 26 | పగ | ప్రగ |
| 84 | 12 | సేయు | సేయు | 196 | 19 | దకి | దని |
| 95 | 19 | మాడం | మాదం | 197 | 20 | పుద్యూ | పుష్యూ |
| 97 | 5 | డాలి | దాల్చి | 200 | 11 | చాంఘి | చాంఘి |
| 98 | 27 | వాండు | నాండు | 233 | 15 | హిందు | హిమాంశ |

## ఈ గ్రంథ ముద్రణార్థము ద్రవ్యమొసంగిన దాతల పవిత్రనామములు.

| | | |
|---|---|---|
| శ్రీ పోతరాజు చినలక్ష్మీనారాయణ | ఏల్చూరు | 100-0-0 |
| ,, యం. సూర్యనారాయణరావు | సత్తెనపల్లి | 100-0-0 |
| ,, పోతరాజు రామకోటేశ్వరరావు | ఏల్చూరు | 100-0-0 |

### రు 50/- ఇచ్చినవారు

శ్రీ మిన్నికంటి గురునాథశర్మ — గుంటూరు
,, రేకపల్లి భాస్కరరావు — గుంటూరు
,, పోతరాజు పురుషోత్తమరావు — ఏల్చూరు
,, గోగులపాటి మంగయ్య — గోగులపాడు

### రు 25/- ఇచ్చినవారు

శ్రీ దేశిరాజు హనుమంతరావు B.A. BL. — గుంటూరు
,, మాదిరాజు రఘునాథరావు — ,,
,, హిందూకాలేజీ హైస్కూలు ఉపాధ్యాయసంఘము — గుంటూరు
,, ఏకా ఆంజనేయులు — గుంటూరు
,, సోమరాజు ఆంజనేయులు — బెజవాడ
,, పోతరాజు వెంకటేశ్వరరావు తండ్రి శ్రీ చినలక్ష్మీనారాయణ — ఏల్చూరు
,, గాదె లక్ష్మీనరసమ్మ — ,,
,, కర్నాటి [illegible] రెడ్డి — ,,
,, వెండిదండి కోటమ్మ — ,,
,, మాట్ల వెంకయ్య — ,,
,, అనఘా వేంకటలక్ష్మీ నరసింహారావు కోటేశ్వరరావు — వాడనపాలెం
,, అగ్నిగుండాల వేంకటరంగారావు — అగ్నిగుండాల
,, ఉపద్రష్ట సాంబశివరావు — సత్తెనపల్లి

### రు 15/- ఇచ్చినవారు

శ్రీ పోతరాజు విశ్వనాథశర్మ — ఏల్చూరు
,, చీతిరాల శీతయ్య — ,,
,, పోతరాజు నరసింహారావు — బెజవాడ
,, పోతరాజు రామలింగేశ్వరరావు — ,,
,, పోతరాజు హనుమంతరావు — ,,

శ్రీ జూపూడి యజ్ఞనారాయణ B. A., B. L., గుంటూరు
,, పోతరాజు వెంకటేశ్వరరావు (తండ్రి పుండరీకాక్షయ్య)
,, నల్లపాటి వెంకటరామయ్య B. A., B. L , నర్సరావుపేట

రు 10/ ఇచ్చినవారు

శ్రీ ఏల్చూరి శేషాచలపతిరావు ఏల్చూరు
,, ఓరుగంటి యల్లమందారెడ్డి ,,
,, ఓరుగంటి కోటిరెడ్డి కు॥ వెంకటనరసింహారెడ్డి ,,
,, చాముల వేంకటరెడ్డి చిల్కాల సుబ్బారెడ్డి ,,
,, తుమ్మలపెంట ఆంజనేయులు ,,
,, ముత్యాల కోట్లింగము ,,
,, నారదాసు బాలకోటయ్య కు॥ రామయ్య ,,
,, బండారు వెంకయ్య వగైరా ,,
,, తుమ్మలపెంట వేంకటకోటమ్మ ,,
,, అడకా యల్లమంద వగైరా ,,
,, సామా బాలంకయ్య కు॥ రంగయ్య అనమనమూరు
,, వెన్నపూస కొండారెడ్డి మాగులూరు
,, కుందుర్తి సుందరయ్య కుందుర్తి
,, పోతరాజు వేంకటేశ్వరరావు విజయవాడ
,, పోతరాజు చంద్రమౌళీశ్వరరావు తండ్రి నరసింహారావు ,,
,, సోలస హనుమానులు ,,
,, కామరాజుగడ్డ సుబ్బరామయ్య గుంటూరు
,, దేచిరాజు రామచంద్రరావు ,,
,, కొండూరి వేంకటేశ్వరరావు B.A. B.L. ,,
,, నారదాసు రామచంద్రయ్య ,,
,, బద్దెపూడి రాధాకృష్ణమూర్తి B.A. B.L., ,,
,, వినుకొండ వేంకట రంగాచార్యులు నర్సారావుపేట
,, పమిడిమర్రి రామకృష్ణయ్య B.A. ,,
,, కొంపల్లి రాఘవరావు సత్తెనపల్లి
,, పోచిరాజు హనుమంతరావు
,, ధూళిపాళ్ళ శ్రీరాములు

శ్రీ ముక్తినూతలపాటి వేంకట సుబ్బారావు లింగంగుంట్ల సత్తెనపల్లి తా॥

,, రెంటాల లక్ష్మీనరసింహారావు సంతగుడిపాడు

,, వాకా యల్లమందారెడ్డి ,,

,, కన్నం సైదులురెడ్డి ,,

,, పల్లకి వేంకటేశ్వరరెడ్డి తండ్రి వెంకటరెడ్డి ,,

,, పల్లకి నాగిరెడ్డి ,,

,, కోమూరి రామకృష్ణయ్య ,,

,, గుడె చినరామయ్య తండ్రియల్లమంద ,,

,, చెన్నుపాటి వేంకట సుబ్బయ్య అడివిపాలెము

## రు 5/- ఇచ్చినవారు

శ్రీ పినపాటి లక్ష్మీనరసింహ శాస్త్రి ఏల్చూరు

,, అబ్బరాజు కనకయ్య ,,

,, వంకా వెంకట సుబ్బయ్య ,,

,, ఓరుగంటి రాఘవరెడ్డి ,,

,, దుంపా చినపాపిరెడ్డి ,,

,, నారదాసు పుల్లయ్య ,,

,, విప్పలవెంకటరెడ్డి ,,

,, పచ్చా యంగయ్య ,,

,, పుల్లగూర గురవయ్య ,,

,, ఏల్చూరి వీరాచారి ,,

,, ఓరుగంటి చినపిచ్చిరెడ్డి ,,

,, ఓరుగంటి పెదకోటిరెడ్డి ,,

,, ఓరుగంటి చినకోటిరెడ్డి ,,

,, ఓరుగంటి వెంకట నరసింహారెడ్డి తండ్రి కోటిరెడ్డి

,, ఇల్లూరి సాంబారెడ్డి ఏల్చూరు

,, బొమ్మిరెడ్డి రామకోటిరెడ్డి తండ్రి చినసుబ్బారెడ్డి ,,

,, బల్లువూరి వేంకటప్పారెడ్డి ,,

,, ఆవుల సీతారెడ్డి ,,

,, బొగ్గుల యల్లమందారెడ్డి బాలకోటిరెడ్డి ,,

,, బొగ్గుల వానుమమ్మ ,,

శ్రీ దాసుకుమల్లి యల్లమందారెడ్డి ఏలూర్పురు
,, దాసుకుమల్లి లచ్చిరెడ్డి
,, బుజ్జా వీరారెడ్డి
,, దుంపా వెంకటరెడ్డి
,, నక్కా కోటయ్య తండ్రి కోండయ్య
,, దుగ్గసాని సుబ్బారెడ్డి
,, బొమ్మిరెడ్డి చినఅప్పిరెడ్డి
,, బండ్ల వెంకయ్య
,, నారదాసు కోటయ్య తండ్రి వెంకయ్య
,, నారదాసు అంకాళు
,, నారదాసు సింగరయ్య
,, కొప్పరాపూరి రాములు
,, తుమ్మలపెంట పేరయ్య
,, తుమ్మలపెంట కోటమ్మ
,, తుమ్మలపెంట సీతారాములు
,, గాదె బుచ్చమ్మ
,, కురుగుంట కోటిరెడ్డి
,, పోలెబోయిన వీరయ్య సోదరులు - తండ్రి పిచ్చయ్య - ఏలూర్పురు
,, ఆలపాటి వెంకటేశ్వరరావు ,,
,, వినుకొండ రామాచార్యులు ,,
,, కొప్పరపు హనుమంతరావు కొప్పరము
,, కొప్పరపు వేంకటరత్నము కొప్పరము
,, పొత్తూరి సత్యనారాయణ కొసలూరు
,, రామరాజు మల్లికార్జునరావు కారంపూడి
,, గోపాలుని వెంకట నరసింహము (తండ్రి కోదండరామయ్య ముప్పాళ్ల
,, పాలడుగు వేంకటనరసింహము ,,
,, పాలడుగు అప్పయ్య ,,
,, కావూరి నరసింహము ,,
,, కాకుమాను వెంకటనరసింహము ,,
,, గోపాలుని వేంకటకృష్ణమూర్తి వినుకొండ
,, తుర్లపాటి వాసుదేవరావు ,,

శ్రీ తురిమెళ్ల వేంకటలక్ష్మీనరసింహారావు B. A., L. T., వినుకొండ

,, అన్నాప్రగడ కోటేశ్వరరావు ,,

,, వావిలికొలను లక్ష్మీనరసింహారావు ,,

,, వావిలకొలను మహాలక్ష్మమ్మ ,,

,, ధర్మవరము వెంకట సుబ్బారావు కొచ్చెర్ల

,, అన్నాప్రగడ హనుమయ్య కారుమంచి

,, అన్నాప్రగడ వెంకటసుబ్బారావు ,,

,, అన్నాప్రగడ రామకృష్ణయ్య ,,

,, అన్నాప్రగడ వెంకటనరసింహారావు ,,

,, ఇడపలపాటి హనుమయ్య ,,

,, అప్పలనేని శాంతయ్య ,,

,, చుండూరు వెంకటస్వామి ,,

,, ఊట్ల పద్దయ్య ,,

,, యం. యస్. హనుమంతరావు హైదరాబాదు

,, మాదల పాండురంగ సదాశివరావు విజయవాడ

,, పాపరాజు వీరరాఘవయ్య ,,

,, అచ్యుతుని వెంకటేశ్వరరావు గుంటూరు

,, పాలకోడేటి లక్ష్మీపతి B. A. B. L., L. T., ,,

,, తమ్మవరపు వెంకటరంగయ్య శాస్త్రి పాకయాజి ,,

,, మిత్రాగారు పోష్టల్ సూపరెంటెండెంటు ,,

,, ఏకా రామయ్య ,,

,, మంచెళ్ళ వెంకటప్పయ్య ,,

,, గుండవరపు రామకోటేశ్వరరావు M.A., ,,

,, రామరాజు లక్ష్మీనారాయణ B.A. B.L., ,,

,, గుంటూరు చిదంబరశాస్త్రి ,,

,, మాజేటి హనుమంతరావు ,,

,, ఉప్పుటూరు వెంకట పున్నారావు ,,

,, కస్తల హనుమంతరావు B.A. B.Ed., ,,

,, పోలూరి వెంకటసుబ్బయ్యశాస్త్రి ఉ. ఖా. ప్ర. ,,

,, ముక్కామల రామచంద్రరావు B.A. L.T., ,,

,, దాలిపర్తి దుర్గాప్రసాదరావు M.A. B.L.L.T., ,,

| | | |
|---|---|---|
| శ్రీ | వల్లభజోస్యుల కృష్ణమూర్తి | గుంటూరు |
| ,, | జొన్నలగడ్డ వెంకటసుబ్బయ్య B.A. D. Com. | |
| ,, | రాచపూడి సుబ్బారాయుడు B. A., B. Ed., | ,, |
| ,, | గోవిందరాజుల చంద్రశేఖరరావు M.A. B.Ed., | ,, |
| ,, | కాట్రపాటి నాగకోటేశ్వరరావు B.A. B Ed., | ,, |
| ,, | మండ హనుమచ్ఛాస్త్రి హిందీ విద్వాన్ | ,, |
| ,, | సంకా వెంకటరంగారావు M.A. L.T., | ,, |
| ,, | యామర్తి విశ్వనాధము B.Sc. B.E.D , | ,, |
| ,, | అంబడిపూడి శ్రీరామమూర్తి హిందీవిద్వాన్ | ,, |
| ,, | ఎక్కిరాల తిరుమలాచారి B.A. B.E.D., | ,, |
| ,, | భీమవరపు రామలింగయ్య | ,, |
| ,, | యద్దనపూడి శేషగిరిరావు B.A. B.E.D., | ,, |
| ,, | లింగంగుంట సత్యనారాయణ | ,, |
| ,, | ఎ. యస్. ఆర్. ఆంజనేయులు | ,, |
| ,, | ఇలపాకుల పాండురంగారావు M.A. B.E.D., | ,, |
| ,, | పురాణము పురుషోత్తము | ,, |
| ,, | నడింపల్లి రామకృష్ణారావు B.A. B.E.D., | సంతగుడిపాడు |
| ,, | ఇరుగుల చిన్నపరెడ్డి | ,, |
| ,, | ఇరుగుల కాశీరామయ్య | ,, |
| ,, | పల్లకి వేంకటేశ్వరరెడ్డి (తండ్రి కృష్ణారెడ్డి) | ,, |
| ,, | చింతగుంట హనుమారెడ్డి | ,, |
| ,, | బొల్లు చలమయ్య | ,, |
| ,, | మైలవరపు బసవయ్య | ,, |
| ,, | మైలవరపు చంచయ్య | ,, |
| ,, | మైలవరపు పిచ్చయ్య | ,, |
| ,, | వలివేటి పూర్ణచంద్రరావు B.A., (తండ్రి నాగేశ్వరరావు) | |
| ,, | నలబోతు కోటిలింగము | ,, |
| ,, | చల్లా రామకోటయ్య | ,, |
| ,, | తుమ్మారెడ్డి చెన్నారెడ్డి | ,, |
| ,, | చింతగుంట చెంచిరెడ్డి | ,, |
| ,, | చింతగుంట వెంకయ్య | ,, 6-0-0 |

| | | |
|---|---|---|
| శ్రీ బూదరాజు సుబ్బయ్య | | సంతగుడిపాడు |
| ,, మంచికంటి సుందరరామయ్య (తంత్రి రామయ్య) ,, | | |
| ,, మంచికంటి చలపతయ్య | | ,, |
| ,, మామిళ్ళపల్లి హనుమయ్య | | ,, |
| ,, కొణిదెన వేంకటసుబ్బారావు | | కొణిదెన |
| ,, మారాబత్తుని కోట్లింగము | | బూసవారిపాలెము |
| ,, గుంటుపల్లి వెంకటసుబ్బమ్మ | | ,, |
| ,, కోలవెన్ను రామకోటేశ్వరరావు B.A. B.L., | | నర్సరావుపేట |
| ,, ముత్తవపల్లి వేంకటేశ్వరరావు | ,, | ,, |
| ,, ధర్మవరపు రామనాథము | ,, | ,, |
| ,, నిమ్మరాజు వేంకటేశ్వరరావు | ,, | ,, |
| ,, నడింపల్లి వేంకటహనుమంతరావు | ,, | |
| ,, బందా రామశాస్త్రి | ,, | ,, |
| ,, నాయని సుబ్బారావు B. A. L. T., | | ,, |
| , వింజనంపాటి నారాయణ | | ,, |
| ,, కోనపల్లె రామయ్య | | ,, |
| ,, దెండు రామయ్య | | అడివిపాలెము |
| ,, రాపూరి శేషిరెడ్డి | | ,, |
| ,, గోగినేని వెంకటప్పయ్య | | ,, |
| ,, ఆముదాలపల్లి వేంకటరావు | | పత్తేనపల్లి |
| ,, అత్తలూరి వేంకటేశ్వరరావు | | ,, |
| ,, ఉన్నవ రాధాకృష్ణరావు | | ,, |
| ,, కొండముది వేంకటేశ్వరరావు | | ,, |
| ,, జంధ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి | | ,, |
| ,, అచ్యుతుని వేంకట నాగేశ్వరరావు | | ,, |
| ,, గాజుల నాగేశ్వరరావు | | ,, |
| ,, తోట కోటేశ్వరరావు నాయుడు | | ,, |
| ,, మారికిచ్చి వెంకటప్పయ్య | | ,, |
| ,, పాలడుగు వీరరాఘవయ్య | | ,, |
| ,, చివుకుల సుబ్రహ్మణ్య శాస్త్రి | | ,, |
| ,, చివుకుల వేంకటేశ్వరరావు B. A., L. T., | | ,, |

| | | |
|---|---|---|
| ,, పెద్దిరాజు బసవరాజు | | సత్తెనపల్లి |
| ,, దూపగుంట లక్ష్మయ్య | | ,, |
| ,, రత్నాకరము శ్రీనివాసాచార్యులు | | ,, |
| శ్రీ కాళహస్తి వీరయ్య చౌదరి | | ,, |
| ,, సిరిపురము మాధవరావు | | ,, |
| ,, ఎఱ్ఱగుంట్లపాటి శేషగిరిరావు | | ,, |
| ,, మాదా నాగయ్య | | ,, |
| ,, తురగా వెంకటసుబ్బారావు | | ,, |
| ,, లింగంగుంట్ల లక్ష్మీనరసింహము | సత్తెనపల్లి తాలూకా | లింగంగుంట్ల |
| ,, రాగి లక్ష్మీనారాయణ | ,, | ,, |
| ,, మేదరమెట్ల రోశయ్య | ,, | ,, |
| ,, నూతక్కి పెదబసవయ్య | ,, | ,, |
| ,, దొడ్డాల వేంకటరావు | ,, | ,, |
| ,, అత్తలూరి గోపాలరావు | ,, | ,, |
| ,, మిన్నికంటి సత్యనారాయణమూర్తి | | మిన్నికల్లు |
| ,, మధుర భానుమూర్తి | | కొప్పూరు |
| ,, రామడుగు మల్లికార్జునరావు | | నిడదవోలు |
| ,, అబ్బరాజు వేంకటప్పయ్య | | ముగ్గళ్ల |
| ,, మాచిరాజు శేషగిరిరావు | | పొన్నూరు |
| ,, కురుచేటి వేంకటేశ్వరరావు | | కురుచేడు |
| ,, ధనికొండ లక్ష్మీకాంతదాసు కవి | | దొనకొండ |
| ,, కల్లూరి సుబ్బారావు | | కల్లూరు |